ఓం

శ్రీ విశ్వకర్మణేనమః.

# సటీక నాగరఖండము—మొదటి సంపుటము.

ఇది

తెనాలికాపురస్థులగు

శ్రీమతుకుమల్లి కృష్ణశాస్త్రులుగారిచే

తెనుగింపబడి



మెసెర్సు అడిసన్ అండు కంపెనీవారి ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

బందరు గొడుగుపేట నివాసుడగు

రాయవరపు పూర్ణయ్యాచార్యులచే

ప్రచురింపంబడియె.

మొదటికూర్పు.

ఆన ౧౮౯౧ సంవత్సరము.



దీనివెల రూ. ౧-౪-౦.

# స వ ర ణ.

| పుటసంఖ్య. | పఙ్క్తిసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| iv | ౧౩ | వ్రజ | వ్రజ |
| ౧ | ౭ | శోభిచునట్లుగా | శోభించునట్లుగా |
| ౧ | ౧౫ | శ్రీదేవి | శ్రీలక్ష్మీదేవి |
| ౨ | ౫ | తానుకూనారొమ్మున నే | తానుకూడానారొమ్మున నే |
| ౨ | ౩౪ | బోవుతన్ | బ్రోవుతన్ |
| ౩ | ౧౦ | చంద్రకళమీను | చంద్రకళమీదను |
| ౩ | ౧౭ | ఎందునగా | ఎందుకనగా |
| ౪ | ౩౪ | ప్రాంతంబులం | ప్రాంతంబులంజి |
| ౫ | ౩ | ల్ప | నిల్ప |
| ౬ | ౧ | సకలశ్రీవిర | సకలశ్రీనిర |
| ౬ | ౧౪ | లోనవహాసించు | లోనపహాసించు |
| ౬ | ౩౨ | వ్రజ | వ్రజ |
| ౮ | ౨౯ | స్త్రీ | స్త్రీల |
| ౯ | ౯ | స్కాందమన | స్కాందమున |
| ౧౧ | ౭ | కౌస్తుభమణి | కౌస్తుభమణిని |
| ౧౩ | ౪ | వాతోన్ | వానితోన్ |
| ౧౬ | ౨౫ | మధ్యవహీస్థలుండు | మధ్యమహీస్థలుండు |
| ౧౭ | ౩ | సౌందర్యచే | సౌదర్యముచే |
| ౧౭ | ౫ | సౌదర్యాది | సౌందర్యాది |
| ౨౦ | ౯ | దీ చ్చన | దీర్చిన |
| ౨౦ | ౩౨ | వరాన్వయాంబు | వరాన్వయాంబు |
| ౨౧ | ౧౩ | పాతివత్యా | పాతివ్రత్యాది |
| ౨౧ | ౨౪ | గమన్ | గరిమన్ |
| ౨౧ | ౨౯ | మరా | మఠా |
| ౨౧ | ౩౩ | మరా | మఠా |
| ౨౨ | ౧౩ | ఐరాజదాకి | ఏరాజధానికి |
| ౨౨ | ౩౨ | ధరిత్రీపరాగ్ర | ధరిత్రీవరాగ్ర |
| ౨౩ | ౨౬ | వైభము | వైభవము |
| ౨౬ | ౧ | నిర్భీకృ | నిర్భీకృత |
| ౨౬ | ౯ | పకాశించుచున్న | ప్రకాశించుచున్న |
| ౨౬ | ౨౨ | తాత్మ | తాత్మశివ |
| ౨౭ | ౧ | పూ | పూజక |
| ౨౭ | ౨౫ | మాదేయునకున్ | మాద్రేయునకున్ |

| పుటసంఖ్య. | పఙ్క్తిసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౮ | ౩ | అనే | అనేక |
| ౨౮ | ౧౬ | స్వసము | స్వనము |
| ౨౮ | ౨౮ | స్వసము | స్వనము |
| ౩౦ | ౧౭ | రాజమార | రాజకుమార |
| ౩౦ | ౩౪ | వక్ష | వృక్ష |
| ౩౧ | ౩౦ | ్రకాశించు | ప్రకాశించు |
| ౩౨ | ౧౬ | మైత్రేయునుడు | మైత్రేయుడును |
| ౩౩ | ౨౧ | గండ | గంద |
| ౩౫ | ౫ | నూతనమైన | నూతనమైన |
| ౩౭ | ౨౬ | రతి | రీతి |
| ౩౮ | ౪ | మండటచే | మంకుండుటచే |
| ౪౧ | ౧౧ | పమళ | పరిమళ |
| ౪౧ | ౧౩ | సప్పర్వతంబు | నప్పర్వతంబు |
| ౪౧ | ౧౫ | నిల | నీల |
| ౪౧ | ౨౬ | ఫలనిచ్చు | ఫలమునిచ్చు |
| ౪౧ | ౩౨ | సీ | సీమ |
| ౪౩ | ౭ | వీడుల | వీథుల |
| ౪౩ | ౧౨ | పక్కట | పట్టణ |
| ౪౪ | ౨౪ | కర్ణులు | కర్ణ |
| ౪౬ | ౨౭ | శత్రుజము | శత్రుజనము |
| ౪౭ | ౧౮ | సుఖా | సుఖా |
| ౪౮ | ౨౪ | దేహాంత | దేహాండ |
| ౫౦ | ౨౬ | మహిమసు | మహిమంబు |
| ౫౦ | ౩౩ | వినపలతుం | వినవలతుం |
| ౫౧ | ౨౧ | రతిని | రీతిని |
| ౫౨ | ౩ | పేళ | వేళ |
| ౫౩ | ౧ | ప్రభేదంబులును | ప్రభేదంబులును |
| ౫౩ | ౧౬ | సబ్ద | శబ్ద |
| ౫౩ | ౧౮ | మనసస్సు | మనస్సు |
| ౫౩ | ౨౩ | నామజధాతుజధాతుజ | నామజధాతుజ |
| ౫౩ | ౩౦ | రములను | రసములను |
| ౫౪ | ౨౭ | సభోమణి | నభోమణి |
| ౫౫ | ౨౮ | సరియోత్కర్షము | సర్వోత్కర్షము |
| ౫౬ | ౧౭ | గరిత | చరిత |
| ౫౬ | ౩౧ | బ్రహ్మ | బ్రహ్మ |
| ౫౭ | ౪ | ఏయాశ్వని | ఏయాశ్వరని |
| ౫౭ | ౩౧ | దారాకారరాకార | దారాకార |
| ౫౮ | ౫ | శ్రీమాధుర్య | సీమాధుర్య |
| ౫౯ | ౧౧ | గణి | గ్రణి |

# సవరణ.

| పుటసంఖ్య. | పఙ్త్కిసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫౭ | ౧౩ | నతజ | నతజన |
| ౫౭ | ౨౧ | వంటివాదా | వంటివాడా |
| ౫౭ | ౨౧ | సుభానీనుండై | సుఖాసీనుండై |
| ౫౯ | ౧౪ | చెప్వ | చెప్పుట |
| ౬౦ | ౨౧ | సనాశివుడను | సదాశివుడను |
| ౬౧ | ౨౦ | ఏనుగు | ఏనగు |
| ౬౩ | ౧౦ | దములను | వేదములను |
| ౬౪ | ౩౦ | అంజల | అంజలి |
| ౬౭ | ౨౬ | రజతాద్రి | రజితాద్రి |
| ౬౮ | ౧ | నిట్లువ్చచి | నిట్లువచ్చి |
| ౬౯ | ౧౮ | స్థితిని | స్థితుని |
| ౬౯ | ౩౦ | ఇటువంటిది | అటువంటిది |
| ౯౮ | ౧౨ | ఋగ్వాది | ఋగాది |
| ౯౮ | ౨౩ | వైడూర్య | వైడూర్య |
| ౯౫ | ౧౯ | ముశాంబుజములు | ముఖాంబుజములు |
| ౧౦౪ | ౧౬ | వ్రేదము | వేదము |
| ౧౧౭ | ౮ | నందనువ్వినుత | నందనుల్వినుత |
| ౧౨౬ | ౧౦ | చరు | చతు |
| ౧౩౩ | ౨౨ | భాష్కర | భాస్కర |
| ౧౩౫ | ౧౭ | అగారకుడు | అంగారకుడు |

~~~~~~~~~~~~~~~
~~~~~~~~~~~~~~~

# సూచిక.

# పీఠిక.

—o—

ఈ నాగరఖండమను మహాప్రబంధము సూతునిచే చెప్పబడ్డ పంచాశత్ఖండమండితంబగు శ్రీస్కాందమహాపురాణంబునందు ప్రథమఖండంబై యున్నయది. ఇదియ సంస్కృతంబై యున్న కతంబున ఆన ౧౫౮౦-వ సంవత్సరము మొదలు ౧౬౧౧-సం॥ రం వరకు గొప్ప ప్రభుత్వముచేసిన ఖుదావందెఆలమ్, ఓ ఆలమియాన్, హుజూర్, బందగానెఆలీ, ముతాలీ, మదజిల్లహుల్, ఆలీనూరుల్లాహూ, మర్ ఖదహు, జనాబ్, మహమ్మద్ కులిఖుతుబ్ షాఅను పాదుషాగారిదగ్గిర ముఖ్య ప్రధానిగానుండిన విశ్వబ్రాహ్మణులైన శ్రీమన్మహారాజరాజశ్రీ ధవళేశ్వరపురపు మార్కండేయాచార్యులు గారియిష్టానుసారంబుగ సంస్కృతంబుగనున్న యీ నాగరఖండమును శ్రీ॥ తురగారాజకవియు, అయ్యంకిబాలసరస్వతీయనెడు కవివరేణ్యులచే కలియుగాది శాలివాహన శకవర్షంబులు ౧౫౦౮-వ సం॥న తెనుగించంబడియుండె. ఇది యైదాశ్వాసములుగల గ్రంథంబై యున్నయది. ఇప్పుడిది టీకా తాత్పర్యముతో గూడనుండుటవలన బాహుళ్యమైనదను తలంపుచే రెండు సంపుటములుగ చేయబడినయది. ఇది మూడాశ్వాసములుగల మొదటిసంపుటము.

సాధారణముగ భాగవతము, రామాయణము మొదలగు నితరగ్రంథములే కనుపడునుగాని సృష్టికర్తయైన విశ్వకర్మపురాణము మొదలగు గ్రంథము లెక్కడంగానంబడవు. ఈసంబంధమగు ప్రాచీనములైన ముఖ్యగ్రంథముల నీవర్ణమందెవరుగాని గురువులుగాని అన్యులుగాని యీతీరున వెల్లడికివచ్చులాగున చేసినట్టు కనిపించదు. ఇంతియకాక నిట్టిగ్రంథములున్నవనెడు జ్ఞానముకూడ కొందరికున్నట్టు తోచబడదు. ఉన్న నిట్టి బాహుళ్యమైన కష్టపుపనిని నెరవేర్చుటకు స్వతశ్శక్తిగాని డబ్బునుఖర్చుపెట్టుటకిష్టముగాని యుండునని తోచదు. నాగరఖండము మొదలగు నిట్టి ప్రాచీనగ్రంథముల నిమిత్తము నేను చాలకాలమునుంచి ప్రయత్నముచేసి బహుకష్టముమీద నాగ్రంథములను ఆ౧౮౮౦సం॥లో సంపాదించితిని. అయితే, ఆగ్రంథములకు టీకలేనందున పండితసహాయముచే చూడగ గ్రంథప్రశంసయేమి శైలియేమి బాగుగనున్నందున సర్వజనులకు తెలియులాగున టీక, తాత్పర్యములు చేయించి అచ్చువేయించవలెనను తలంపుచే తాటియాకుల పుస్తకమును కాగితములమీద నేను స్వయముగనెత్తి వ్రాసి శ్రీ॥ మతుకుమల్లి కృష్ణశాస్త్రులుగారి నిందుకు తాత్పర్యసహితముగ టీక నొనరించుండనికోరి సత్కరించగ వారీపనిపూనుకుని నెరివేర్చిరి. అంతట దానినంతయు నేను విరళంబుగవ్రాసి స్వహస్తపరహస్తసహాయంబున బహువ్రయప్రయాసచే అచ్చువేయించడమైనయది. దీనియంశములు ముక్త్యాదిసమస్తశ్రేయస్సాధనభూతంబులై యున్నయవి. ఏతన్మహాప్రబంధంబు సావధానంబుగచూచి యర్థాలోచనంబుచేసినయెడల మానసోల్లాసంబుగల్గుటకు సందియంబుండదని తలంచెద.

ఈగ్రంథమును త్వరలో నచ్చువేయించవలెనను కోరికగలవాడనై చెన్నపట్టణమందుండు నా విహితులైన పిళ్లారిసెట్టివారి ముద్రాక్షరశాలలో కొంత ద్రవ్యముతోకూడ ఆన ౧౮౮౪ సం॥ నం దియ్యగ నాముద్రాక్షరశాలికు లన్నదమ్ములిద్దరట్లుసేయక ౪ సం॥లు కాలముగడిపి ౧౮౮౮ సం॥ అంతమునకు ౮౦ పుటలవరకు అక్కడక్కడ నక్షరములు బాగుగనంటనీయక కాటుకెక్కవేసి నాకు రూ. ౫౦౦-లు నష్టముకలుగచేసియు నింతియకాక నా యనుమతిలేకయే తమస్వలాభనిమిత్తము ౨౫౦-

ప్రతు లెక్కువగా నచ్చువేసికొని చివరకాలాభమననుభవింవకయే వారిరువురు చనిపోయిరి. తరువాత అచ్చుపడ్డవరకు కాగితములనిమిత్తమును అసలునసేనిచ్చిన వ్రాతపుస్తకములనిమిత్తమును బహు ప్రయత్నముసేయగ నొకస్నేహితుని యభిమానమువలన (నాయనుమతిలేకయే యచ్చువేసికొనిన ప్రతులకు) సగముసొమ్ము ముజరాయిచ్చు పద్ధతిమీాదవచ్చినవిచూడగ ౨౦౦ ప్రతులకయే కాగితములు చెదలవలన నష్టమయిపోయినవి. హిందూ ముద్రాక్షరశాలవలన నింత నష్టముకలిగినయది.

పిమ్మట నాకాగితములన్నియు ౧౮౮౯ సం॥ ఆఖరున చెన్నపట్టణమందుండు మెసెర్సు అడిసన్ అండుకంపెనీవారి ముద్రాక్షరశాలయందివ్వగ నిప్పటికితయారైనయది. గాన నీ సటీక నాగరఖండమును, యిదివరకు ప్రచురమైయున్న చిత్తూరుజిల్లా అదాలతుకోర్టు ౧౮౧౮ సం॥ నెం ౨౦౫ రు తీర్పును, ఆశ్లేయ పౌరుషేయ బ్రాహ్మణసంవాదమును, సేలంజిల్లాకోర్టు ౧౮౪౬ సం॥ నెం ౪ రు అప్పీలు తీర్పుఅను నీ పుస్తకములవలన నిజము తేటబడగలదు గావున దయచే నందరీపుస్తకములను చూడకోరుచున్నాడను.

ఈ పుస్తకములువలయువార లీదిగువ దస్కతుదారినియొద్దకు పోస్టేజితోకూడ సొమ్మునంపిన యెడల పుస్తకములంపబడును.

ఖరీదు. ... ... ... ... ... ... రూ. ౧-౪-౦
పోస్టేజి. ... ... ... ... ... ... ౦-౧-౬

బందరు గొడుగుపేట,
౬ అక్టోబరు ౧౮౯౦సం॥

ద॥ రాయవరపు పూర్ణయ్య.

ఓం. శ్రీ విశ్వబ్రహ్మణేనమః.

# సటీక నాగరఖండము—ప్రథమాశ్వాసము.

---

## నాందీపద్యములు.

శా॥ శ్రీశోభిల్లసుధారసంబురుచిచే జెన్నొందికాశప్రతీ। కాశాకాశనదింస్రజంబుకరణింగాంక్షుందలందాల్చుగౌ। రీశుండెప్పుడుటీకకర్తయగుచున్ ప్రీతిన్ బుధశ్లాఘ్యుడై। ప్రాశస్త్యస్థితిమీరు రాయవర పూర్ణాచార్యునింబ్రోవుతన్॥

టీక॥ శ్రీశోభిల్లన్। శ్రీ-సర్వాతిశయ సౌందర్యలక్ష్మి। శోభిల్లన్-ప్రకాశించుచుండ। సుధారసంబు రుచిచేన్। సుధారసంబు-అమృతరసముయొక్క। రుచిచేన్ - కాంతిచేత। చెన్నొంది - ఒప్పి। కాశప్రతీకాశాకాశనదిం। కాశ - రెల్లుపువ్వులతో। ప్రతీకాశ - సదృశమైనకాంతికలిగిన। ఆకాశనదిం- గంగాతరంగిణిని। స్రజంబుకరణిం - పూలదండవలె। కాంక్షుం - ప్రేమాతిశయముచేత। తలందాల్చు- జటాజూటమందు ధరియించిన। గౌరీశుండు - పార్వతీపతి। ఎప్పుడున్ - ఎల్లప్పుడును। టీక - టీకకు। కర్తయగుచున్ - నాయకుడగుచు। ప్రీతిన్ - ప్రేమచేత। బుధశ్లాఘ్యుడై। బుధ - విద్వాంసులచేత। శ్లాఘ్యుడై - కొనియాడదగినవాడై। ప్రాశస్త్యస్థితిమీరు। ప్రాశస్త్య - శ్రేష్ఠతయొక్క। స్థితి - రీతిచేత। మీరు - అతిశయించుచున్న। రాయవరపూర్ణాచార్యునిం-రాయవరపు పూర్ణయాచార్యులను। బ్రోవుతన్। రక్షించుగాత॥

తాత్పర్యము॥ అమృతమువలె తెల్లనైన శరీరముగల్గినట్టియు స్వచ్ఛజలముగలిగిన గంగాతరంగిణిని శిరసావహించిన సాంబమూర్తి టీకానాయకుడై పెద్దలచేత స్తుతించతగిన రాయవరపు పూర్ణయాచార్యులను కృపచే రక్షించుగాత॥ ౧

క॥ శ్రితపరిపాలనలీలాం। చితచారుకటాక్షుడతులశీతాద్రిసుతా। పతిపరమేశ్వరదేవుడు। కృతినాథునిబ్రోచుగాత కేవలమతితోన్॥

టీక॥ శ్రితపరిపాలనలీలాంచితచారుకటాక్షుడు। శ్రిత - ఆశ్రితులయొక్క। పరిపాలనలీలా - రక్షణవిలాసముచేత। అంచిత - ఒప్పుచున్న। చారు - సుందరములైన। కటాక్షుడు - కడకంటి చూపులుగలవాడును। అతులశీతాద్రిసుతాపతి। అతుల - సాటిలేని। శీతాద్రిసుతా - పార్వతీదేవికి। పతి - నాథుడైనట్టియు। పరమేశ్వరదేవుడు - సదాశివుడు। కేవలమతితోన్ - మంచిమనస్సుతో। కృతినాథున్ - కృతిపతిని (టీకాకర్తను)। బ్రోచుగాత - రక్షించుగావుత॥

తా॥ భక్తరక్షకుడైనట్టియు గౌరీమనోహరుడైనట్టియు సదాశివుడీ టీకానాయకమణిని దయాదృష్టిచే వీక్షించుగాత॥ ౨

గీ॥ శ్రీమహేశ్వరుండు శీతాంశుశేఖరుం। డమలకాయుడద్రిజాధిపుండు। నా
గరాఖ్యఖండనవ్యటీకాకృతి। నమరజేయుగాత నాదరమున॥

టీక॥ శీతాంశుశేఖరుండు। శీతాంశు - చంద్రుడు। శేఖరుండు - శిరోభూషణముగా గల్గిన
ట్టియు। అమలకాయుడు। అమల - తెల్లనైన। కాయుడు - శరీరముగల్గినట్టియు। అద్రిజాధిపుండు।
అద్రిజ - పార్వతీదేవికి। అధిపుండు - పెనిమిటైనట్టియు। శ్రీమహేశ్వరుండు - శ్రీసాంబమూర్తి। ఆద
రమునన్ - ప్రేమచేతను। నాగరాఖ్యఖండ నవ్యటీకాకృతిన్। నాగరాఖ్యఖండ - నాగరఖండమను
పేరుగల (స్కాందపురాణములోని) భాగముయొక్క। నవ్య - క్రొత్తదియగు। టీకాకృతిన్ - వ్యా
ఖ్యానగ్రంథమును। అమరన్ - ఒప్పునటుల। చేయుగాతన్ - చేసుగాక॥

తా॥ నిర్మలుడైనట్టియు పార్వతీసహితుడైనట్టియు సదాశివు డీకృతిని నిరంతరాయముగ గొన
సాగించుగాక॥ 3

క॥ గజవదనుడంతరాయ। వ్రజభూభృద్దళనచటులవజ్రసదృక్షుం। డజహరి
వందితపాదాం। బుజుడుగణేశుండువిఘ్నములదొలగించున్॥

టీ॥ గజవదనుడు। గజ - ఏనుగయొక్క। వదనుడు - మోముగలవాడును। అంతరాయవ్రజ
భూభృద్దళనచటుల వజ్రసదృక్షుండు। అంతరాయ - ఆతంకములయొక్క। వ్రజ - గుములనెడు। భూ
భృత్ - కొండలయొక్క। దళన - బద్దలుచేయుటయందు। చటుల - వాడిగల। వజ్ర - పిడుగుతో।
సదృక్షుండు - సమానుడైనట్టియు। అజహరివందితపాదాంబుజుడు। అజ - బ్రహ్మదేవునిచేత। హరి -
దేవేంద్రునిచేత। వందిత - నమస్కరించబడిన। పాదాంబుజుడు - చరణకమలములుగల్గినట్టియు। గణే
శుండు - గణనాధుడు। విఘ్నములన్ - దోసములను। తొలగించున్ - పోగొట్టుగావుత॥

తా॥ గణపతి పర్వతములను వజ్రాయుధమువలె యీగ్రంథవిఘ్నములను హరించుగాత॥

సీసమాలిక॥ కాశ్యపగోత్రవిఖ్యాతులౌ శ్రీరాయ, వరమల్లయార్యసుందరవధూటు।
లను వారికిసుతుండునన నెడియుమామహే, శ్వరునకుచిన్నాంబవలనబుట్టు। నాగలింగా
చార్యునకుసోమమాంబిక, వలనజన్మించినకలితయశుడు। శ్రీచోడవర నాగయాచార్యు
నకునంబి, కాంబకుదౌహిత్రుడలరుచున్న। కోటిలింగాచార్యగురునామునకుభాగి, నే
యుండునిరుపమనియమపరుడు। పుణ్యశీలుండగుపూర్ణయాచార్యుడు, విశ్వకర్మాన్వ
యవిశ్రుతుండు। నిలలోననేసాధ్వికలచోడవరవంశ్య, కోటిలింగార్యుడుబోటులందు।
ధన్యయౌయన్నమ్మతల్లిదండ్రులునుమా, తామహుల్ బలభద్రతతకులాఢ్య। లగుము
క్తిలింగముతగుబసవమ్మయు, బ్రహ్మయ్యయునుమామభవ్యమతియు। వరపితామహు
లును వరుసతో విఠ్ఠప్పబ, సవమ్మయునుమహాభక్తియుతులు। నట్టిసద్గుణసముదయా
యతనిశాంత। వినయనయభాసురస్వాంతవిశదశాంత। కాంతమాకాంతయలరువిఖ్యా
తకాంత। కాంతగాగప్రమోదవికస్వరుడయి। ఘనతగురువిశ్వకర్మసంకలితమైన।
కతమునను నాగరాఖ్యమాఖండమునకు। తెనుగుకృతికినినొనరంగ తెనుగుటీక। జేయు
డనితానుబ్రీతినిజెప్పినపుడె॥

టీ॥ కాశ్యపగోత్రవిఖ్యాతులు। కాశ్యపగోత్ర-కశ్యపఋషిగోత్రమందు। విఖ్యాతులు-ప్రసిద్ధులు। ఔ - అయినట్టి। శ్రీరాయవరమల్లయార్యసుందరవధూటులు। శ్రీ - శోభాయుక్తులైన। రాయవర - రాయవరపు। మల్లయార్య - మల్లయాచార్యులును। సుందరవధూటులు- సుందరమ్మయు। అనువారికి- అనెడు నామధేయములుగలవారలకు। సుతుండు-కొమరుడు। అనెడియుమామహేశ్వరునకున్। అనెడి-అనియెడి। ఉమామహేశ్వరునకున్-ఉమామహేశ్వరాచార్యులకును। చిన్నాంబవలనన్-చిన్నమ్మవలన। పుట్టి - జన్మించిన। నాగలింగాచార్యునకున్-నాగలింగాచార్యులకు। సోమమాంబికవలనన్ - సోమమ్మవలన। జన్మించిన - కలిగిన। కలితయశుడు। కలిత - ఒప్పుచున్న। యశుడు- ఖ్యాతిగన్గినట్టియు। శ్రీచోడవరనాగయాచార్యునకున్। శ్రీ - శోభాయుక్తుడైన। చోడవరనాగయాచార్యునకున్ - చోడవరపు నాగయాచార్యులకును। అంబికాంబకున్ - అంబమ్మకును। దౌహిత్రుడు - కూతురికొమరుడైనట్టియు। అలరుచున్న - ఒప్పుచున్నట్టి। కోటిలింగాచార్య గురునామునకున్। కోటిలింగాచార్య - కోట్లింగాచార్యులనెడి। గురు - ఘనమైన। నామునకున్ - పేరుగలాయనకు। భాగినేయుండు - మేనల్లుడైనట్టియు। నిరుపమనియమపరుడు। నిరుపమ - అసదృశమైన। నియమపరుడు - శిష్టాచారప్రధానుడును। పుణ్యశీలుండు - పవిత్రస్వభావముగలిగినట్టియు। విశ్వకర్మాన్వయ విశ్రుతుండు। విశ్వకర్మ - విశ్వకర్మయొక్క। అన్వయ - వంశమందు। విశ్రుతుండు - ప్రసిద్ధుడు। అగు పూర్ణయాచార్యుడు - అయినట్టి పూర్ణయాచారి। ఇలలోనన్ - పుడమియందు। ఏ సాధ్వికిన్ - ఏ పుణ్యాంగనకు। అలచోడవంశ్యకోటిలింగార్యుడు। అల - ఆ। చోడవరవంశ్య - చోడవరవంశమందుపుట్టిన। కోటిలింగార్యుడు-కోట్లింగశ్రేష్ఠుడును। బోటులందు - స్త్రీలయందు। ధన్యయౌ - శ్రేష్ఠురాలగు। అన్నమ్మ - అన్నమాంబికయు। తల్లిదండ్రులును-జననీజనకులో। బలభద్రతతకులాఢ్యులు। బలభద్ర - బలభద్రయనే। తతకుల - గొప్పవంశమందు। ఆఢ్యులు - సంపన్నులు। అగుముక్తిలింగము - అయినముక్తిలింగమును। తగుబసవమ్మయు। తగు - తగిన। బసవమ్మయు - బసవమాంబికయు। మాతామహుల్ - తల్లియొక్కతలిదండ్రులో। భవ్యమతియు। భవ్య-శ్రేష్ఠమైన। మతియు - బుద్ధిగల। బ్రహ్మయ్యయును - బ్రహ్మయాచార్యులు। మామ - మేనమామో। వరుసతోన్ - క్రమముగా। మహాభక్తియుతులు। మహా - గొప్పదియగు। భక్తి- ఈశ్వరభక్తితో। యుతులు - కూడుకొనునట్టి। విఠప్ప - విఠలేశ్వరుడును। బసవమ్మయును - బసవమాంబికయును। వరపితామహుల్। వర - శ్రేష్ఠులైన। పితామహుల్ - తండ్రియొక్క తలిదండ్రులో। అట్టి - అటువంటి। సద్గుణసముదయాయతనిశాంత। సద్గుణ - సౌశీల్యాదిసుగుణములయొక్క। సముదయ - సమూహమునకు। ఆయత - విస్తారమైన। నిశాంత - గృహమైనట్టిదియు। వినయనయభాసురస్వాంత। వినయ - అణకువచేతను। నయ - నీతిచేతను। భాసుర - ప్రకాశించుచున్న। స్వాంత-మనస్సుకలిగినట్టిదియు। విశదశాంత। విశద-నిర్మలమైన। శాంత-శాంతగుణము గల్గినట్టిదియు। కాంతమాకాంత। కాంత-సుందరమైనట్టి। మాకాంత - లక్ష్మీదేవివలె। అలరువిఖ్యాతకాంత। అలరు - ప్రకాశించుచున్న। విఖ్యాత - ప్రసిద్ధమైన। కాంత - కాంతమ్మ। కాంతగాగ - పత్నియగుచుండగ। ప్రమోదవికస్వరుడయి। ప్రమోద-సంతోషముచేత।వికస్వరుడయి-సంతసించినవాడై। ఘనతన్-గొప్పచేతను। గురువిశ్వకర్మసంకలితమైనకతమునను।గురు-గొప్పవాడగు। విశ్వకర్మ-విశ్వకర్మవృత్తాంతముతో। సంకలితమైనకతమునను-కూడికొనినహేతువవలన। తెనుగుకృతికిని - ఆంధ్రకృతియైనట్టి। నాగరాఖ్యమాఖండమునకున్ - నాగరఖండమను తెనుగుగ్రంథమునకు। ఒనరంగన్-ఒప్పునట్లుగ। తెనుగుటీకన్ - ఆంధ్రవ్యాఖ్యను। చేయుడని - రచియింపుడని। తాను - తాను। ప్రీతిని - ప్రేమచేతను। చెప్పినపుడె - పలికినకాలమందె॥

తా॥ రాయవరపు మల్లయాచార్యులకును సుందరమ్మకును తనయుడైనట్టి, యుమామహేశ్వరాచార్యులకును చిన్నమ్మకును కలిగినటువంటి, నాగలింగాచార్యులకును సోమమ్మకును పుత్రుడైనట్టియు, చోడవరపు నాగయాచార్యులకును అంబమ్మకును దౌహిత్రుడును, యీకోట్లింగాచార్యులకు మేనల్లు

డును, అయిన పూర్ణయాచార్యుడు చోడవరపు కోట్లింగమునకును అన్నమ్మకును కుమారికయు, బలభద్రము త్తిలింగమునకును బసవమ్మకును మనుమరాలును, (కూతురికూతురు) బ్రహ్మయాచార్యులకు మేనకోడలును, విర్థప్పకును బసవమ్మకును పౌత్రియునగు కాంతమ్మను వివాహముచేసికొని సంతోషభరితస్వాంతుడై విశ్వకర్మపురాణమైన నాగరఖండప్రబంధమునకు టీక నొనరించుమండని చెప్పిన నేను చేయబూనితిని ॥ ౫

గీ॥ శ్రీమతుకుమల్లికృష్ణశాస్త్రియను నేను। కీర్తిపౌరుషములుజాలగీలుగొల్ప। పారితోషకమును జెందిబాగుమీర। జేయబూనితిశ్రీనారసింహుదలచి ॥

టీ॥ శ్రీ మతుకుమల్లి కృష్ణశాస్త్రియను - శ్రీయుతమైన మతుకుమల్లి వంశసంభవముగల కృష్ణశాస్త్రియనెడి। నేను-ఏను। కీర్తిపౌరుషములు-యశఃపురుషకారములు। చాలన్-మిగుల। కీలుకొల్పన్-పొసగునటుల। పారితోషికమును-సన్మానమును। పొంది-గ్రహించి। బాగుమీరన్-మిక్కిలిబాగుగ। శ్రీనారసింహున్-శ్రీనృసింహస్వామిని। తలచి-స్మరించి। చేయబూనితిన్-కృతినొనరింపయత్నించితిని ॥

తా॥ మతుకుమల్లి కృష్ణశాస్త్రిలనెడి నేను రాయవరపు పూర్ణాయాచార్యులవలన సత్కృతిని పొంది యీగ్రంథమునకు టీకచేయబూనితిని ॥ ౬

చ॥ పరకృతినిందజేయుటలుబాగగునేగుణమున్నదానిస। త్పరమముదంబునొందుటయుబాడియదోసముగల్గియున్నచో। సరసముగాగజేయుటయు సాధువుగానిచో దెల్పరాదుయీ। కరణినిజేయకున్నతడు గైకొనుగిల్బిషమొందునిందయున్ ॥

టీ॥ పరకృతినిందచేయుటలు - పరకవిత్వమునునిందించుటలు। బాగగునే - మంచిదగునా। గుణమున్నన్ - మంచిగుణముకలిగినయెడల। దానిని - ఆగుణమునుగూర్చి। సత్పరమముదంబునొందుటయు। సత్ - యోగ్యమైన। పరమముదంబు - గొప్పసంతోషమును। ఒందుటయు - చెందుటయు। పాడియ - మంచిదే। దోసముగల్గియున్నచోన్ - కవితాదోషములున్నయెడలను। సరసముగాగజేయుటయు - బాగుగాచెప్పుట। సాధువు - మంచిది। కానిచోన్ - అలాలేనియడల। తెల్పరాదు - ఏమియుననరాదు। ఈకరణిని - ఈవిధముగా। చేయకున్నతడు - ఒనరించనివాడు। కిల్బిషము - పాతకమును। గైకొను - గ్రహించును। నిందయున్ - లోకాపవాదమును। ఒందున్ - పొందును ॥

తా॥ అన్యులకవిత్వమందు మంచిగుణములుండిన సంతోషించి దోషంబులున్నయెడల బాగు పరచవలయు అటులగానిచో స్పష్టీకరించగూడదు. ఇటులచేయని సుకవులు పాతకాఖ్యాతిజాతము నిహపరంబుల నొందుదురు. ౭

క॥ మచిలీబందరుపురవర। రుచిరచ్ఛత్రాగ్రహారరోచిష్ణుడుపూ। ర్ణచతురమతిపూర్ణయార్యుడు। రుచివిశ్వబ్రాహ్మజనవరుండై వెలసెన్ ॥

టీ॥ మచిలీబందరుపురవరరుచిరచ్ఛత్రాగ్రహారరోచిష్ణుడు। మచిలీబందరు - మచిలీబందరనెడు। పురవర - పట్టణశ్రేష్ఠమందలి। రుచిర - సుందరమైన। ఛత్రాగ్రహార - గొడుగుపేటయందు। రోచిష్ణుడు - ప్రకాశమానుడైన। పూర్ణచతురమతిపూర్ణయార్యుడు। పూర్ణచతుర। సంపూర్ణచాతుర్యముగల। మతి - బుద్ధిగల। పూర్ణయార్యుడు - పూర్ణయాచార్యుడు। రుచి - కాంతిచే। విశ్వబ్రహ్మజనవరుండై। విశ్వబ్రహ్మజన-విశ్వబ్రాహ్మణజనులలో। వరుండై - శ్రేష్ఠుడై। వెలసెన్-ప్రకాశించెను ॥

తా॥ ఈగ్రంథమునకు టీకాకర్తయైన రాయవరపు పూర్ణయాచార్యుడు మచిలీబందరు గొడుగుపేటలో కాపురమున్నవాడనియు విశ్వబ్రాహ్మణులలో శ్రేష్ఠుడనియు బుద్ధిమంతుడనియుభావము. ౮

నటీకనాగరఖండము ❈ ప్రథమాశ్వాసము.

## ఇష్టదేవతావర్ణనము.

౧॥ శా॥ శ్రీరామాసహజుండు సోముడను పేరింటన్ జెలంగన్ సుఖశ్రీరంజిల్లగ మౌళి దాల్చినమహాశ్రీదండపాణీశ్వరుం డారూఢిన్ ధవళేశ్వరాన్వయగభీరాంభోధిసోమున్ స్వదీక్షారంగద్రము సోమనాధసుతు మార్కండేయునిం బ్రోవుతన్॥ ❈ టీక॥ శ్రీ) రామాసహజుండు। శ్రీ-శోభాయుక్తమైన। రామా-లక్ష్మీదేవికి। సహజుండు-తోబుట్టువు। సోముడను పేరింటన్। సోముడను-సోముడనెడు। పేరింటన్-నామముచేత (ఉమాసహితుడనుతనపేరుచేత)। జెలంగన్-ఒప్పుచుండగా। సుఖశ్రీరంజిల్లగ। సుఖ-ఆహ్లాదముయొక్క। శ్రీ-సమృద్ధిచేత। రంజిల్లగ-శోభించునట్లుగా। మౌళి దాల్చిన। మౌళిన్-కిరీటమునందు। దాల్చిన-ఉంచుకొనిన। శ్రీ) దండపాణీశ్వరుండు। శ్రీ)-అణిమాద్యష్టైశ్వర్యములుగల। దండపాణీశ్వరుండు-దండపాణీశ్వరస్వామి। ధవళేశ్వరాన్వయగభీరాంభోధిసోమున్। ధవళేశ్వర-ధవళేశ్వరపురమను। అన్వయ-వంశమనెడు। గభీర-నిండైన। అంభోధి-పాలకడలికి। సోమున్-చంద్రుడైనట్టియు। స్వదీక్షారంగద్రము। స్వ-స్వకీయమైన। దీక్షా-శైవనియమమందు। రంగత్-ప్రకాశించుచున్న। రము-బుద్ధిలక్ష్మి గలట్టియు। సోమనాధసుతున్। సోమనాధ-సోమప్రభువనకు। సుతున్-తనయుడైనట్టియు। మార్కండేయునిన్-మార్కండేయమహారాజును। ఆరూఢిన్-నిరూఢిచేత। బ్రోవుతన్-రక్షించుగాత ❦ తాత్పర్యము॥ మున్నిటబుట్టుటచే శ్రీదేవిసోదరుడైనచంద్రుడు ధ్వనిచే భాగ్యవంతుడను శ్లేషచే నుమాసహితుడు నగుటచే నాచంద్రుని చూడామణిగ దాల్చిన దండపాణీశ్వరదేవర మార్కండేయమహీపతిని చిరతరాయుష్యాదులచే పాలించుగావుత॥

౨॥ మ॥ జను లెంచం దనతోటిచంద్రుడు మదిం జన్మించి విఖ్యాతి నం దెనటంచున్ రవి తాను తత్పదమునం దీపించెనా లోకరం జనకాంతిన్ విలసిల్లు కౌస్తుభము వక్షఃపీఠికన్ బూనుచున్ క్రాసిలక్ష్మీపతి గాచు సోమవిభుమార్కండేయునిం సత్కృపన్॥ ❈ టీ॥ జనులు-ప్రజలు। ఎంచన్-ఎన్నగా। తనతోటిచంద్రుడు। తనతోటి-తనతోటిసమానుడగు। చంద్రుడు-సుధాంశుడు। మదిన్-విష్ణుమూర్తిహృదయమునందు। జన్మించి-పుట్టి। విఖ్యాతిన్-విశేషకీర్తిని। అందెనటంచున్-పొందినాడనుచు। రవి-సూర్యుడు। తాను-ఆసూర్యుడే। తత్పదమునన్। తత్-ఆ। పదమునన్-స్థానముననే (హృదయమందే)। తత్-ఆవిష్ణుమూర్తియొక్క। పదమునన్-పాదమైనయాకసమందే యనినిజార్థము। దీపించెనా-ప్రకాశించెనాయేమి అనులాగున। లోకరంజనకాంతిన్। లోక-భువనములను। రంజన-అలంకరించెడి। కాంతిన్-ప్రకాశచే। విలసిల్లు-ప్రకాశించుచున్న। కౌస్తుభము-కౌస్తుభమణిని। వక్షఃపీఠికన్। వక్షః-రొమ్మనె

ను। పీఠికఁ-ఫలకమందు।పూను-తాల్చిన। చక్కని-సొగసైన।లక్ష్మీపతి। లక్ష్మి-లక్ష్మీదేవికి। పతి-పెనిమిటి యగు।శ్రీమహావిష్ణువు।సోమవిభుమార్కండేయునిఁ। సోమవిభు-సోమప్రభునకు కొమరుఁడగు। మార్కండేయునిఁ-మార్కండేయమహారాజును। సత్కృపఁ-మంచిదయచేత। గాచు-రక్షించుఁగావుత॥ తా॥ సూర్యుఁడు తన చెలికాఁడగు చంద్రుఁడు విష్ణుమూర్తి మనస్సువలన బొడమి విశేషకీర్తిని పొందినాఁడు అని తానుకూడను ఆ రొమ్మున నే ప్రకాశించుచున్నాఁడా యేమి అను రీతి కౌస్తుభరత్నమును రొమ్మున ధరించిన శ్రీమహావిష్ణువు మార్కండేయప్రభువును రక్షించుఁగావుత॥

3 ॥మ॥ భుజశాఖల్ పరమాత్మలింగకఫలంబుల్ మున్నుగాఁగల్గు సద్ద్విజవాంఛాఫలదాయిలాంఛనములన్ రాణించఁ గామించునా। త్రిజగత్కల్పకవిశ్వకర్మశుభకీర్తిస్ఫూర్తి ప్రత్యర్థిరా। డ్గజపంచాస్యునకిచ్చు సోమవిభుమార్కండేయభూభర్తకున్॥ ✻టీ॥ భుజశాఖల్।భుజ-బాహువులనెడు। శాఖల్-కొమ్మలు। పరమాత్మలింగకఫలంబుల్।పరమాత్మ-పరబ్రహ్మమనెడు। లింగక-చిహ్నగల।ఫలంబుల్-పండ్లు।మున్నుగాఁగల్గు-మొదలుగాఁగల।సద్ద్విజవాంఛాఫలదాయిలాంఛనములన్।సత్-సజ్జనులయైన ద్విజ-సంఘములకు।వాంఛా-కోరికెలనెడు।ఫల-ఫలములను। దాయి-ఇచ్చెడు।లాంఛనములన్-గురుతులచేత। రాణించఁగామించును। రాణించఁగాన్-ప్రకాశించఁగా।మించును-ఒప్పెడి। ఆ త్రిజగత్కల్పకవిశ్వకర్మ।ఆ-అల।త్రి-మూఁడగు।జగత్-లోకములకు।కల్పక-కల్పవృక్షమువంటి।విశ్వకర్మ-విశ్వకర్మబ్రహ్మము।శుభకీర్తిస్ఫూర్తిన్।శుభ-మంగళకరమైన।కీర్తి-యశస్సుయొక్క।స్ఫూర్తిన్-ప్రకాశమును। ప్రత్యర్థిరాడ్గజపంచాస్యునకున్। ప్రత్యర్థిరాట్-శత్రురాజులనెడు।గజ-ఏనుఁగులకు।పంచాస్యునకు-సింహమువంటి। సోమవిభుమార్కండేయభూభర్తకున్। సోమవిభు-సోమప్రభునకు కొమరుఁడగు।మార్కండేయభూభర్తకున్-మార్కండేయమహీపతికి।ఇచ్చున్-ఒసఁగును॥ తా॥ భుజములను కొమ్మలచేత మోక్షఫలములను సజ్జనులకొసంగెడు విశ్వకర్మయనెడు కల్పవృక్షము శత్రుభయంకరుఁడగు మార్కండేయమహారాజునకు ప్రఖ్యాతిని దయచేయుఁగావుత॥

౪ ॥మ॥ నలుమోముల్ వివిధాత్మధీజనులకున్ ధర్మాదులం గొబ్బునం। బలుకం బూని రహిం వహించెననఁగా బాగైన యాభారతీ। లలనాలాలనలాలసుండజుఁడు లీలావీక్షనీక్షించి నిర్మలరక్షాగుణదక్షు సోమవిభు మార్కండేయునిం బ్రోవుతన్॥ ✻టీ॥ నలుమోముల్-నాలుగుముఖములను।వివిధాత్మధీజనులకున్ ।వివిధ-నానావిధములయిన। ఆత్మ-పరమాత్మజ్ఞానముగల।ధీజనులకున్-విద్వాంసులకు।ధర్మాదులన్-ధర్మార్థకామమోక్షములనెడు చతుర్వర్గమును।గొబ్బునన్-త్వరగా।పలుకన్-చెప్పుటకు।పూని-పూనుకొని।రహిన్-విలాసముగా।వహించెననఁగాన్-ధరించినాఁడనుసటుల। బాగైన-మంచిదైన। ఆభారతీలలనాలాలనలాలసుండు।ఆ-ప్రసిద్ధమైన।భారతీలలన-సరస్వతీదేవియొక్క।లాలన-సన్మానించుటయందు। లాలసుండైన-ఆసక్తుఁడైన।అజుఁడు-బ్రహ్మదేవుఁడు।లీలావీక్షన్-విలాసదృష్టిచేతను।ఈక్షించి చూచి।నిర్మలరక్షాగుణదక్షున్। నిర్మల-స్వచ్ఛమగు। రక్షాగుణ-రక్షించెడిగుణముచేత।ద

త్పుఁ-సమర్థుఁడగు|సోమవిభుమార్కండేయునిన్| సోమవిభు-సోమవిభునియొక్క| మార్కండేయునిన్-మార్కండేయప్రభువును| బ్రోవుతన్-రక్షించుగావుత॥ తా॥ పండితులకుధర్మార్థకామమోక్షములను చెప్పుటకు నాలుగుముఖములను ధరించి నాడనునట్టుగా ఒప్పుచుండినయా సరస్వతీపతియగు బ్రహ్మదేవుడు మార్కండేయప్రభువును రక్షించుగాత॥

౫ ॥మ॥ సుదతీయంతకృతార్థురాలవు నిజేశుండెప్పుడుం మౌళినిం|పొదవం దాల్చినచంద్రరేఖపయిం నీవొక్కింతయుం నిక్కము ల్పదలాక్షాద్యుతి వన్నెవెట్టితని పల్కం నెచ్చెలిం జూచు నర్మదృఢానందభవాని సోమవిభుమార్కండేయునిం బ్రోవుతన్॥ ✻టీ॥ సుదతీ-ఓస్త్రీ|ఎంతకృతార్థురాలవు|ఎంత-ఎంతటి|కృతార్థురాలవు-ధన్యురాలవు|నిజేశుండు|నిజ-స్వకీయుఁడగు|ఈశుండు-పెనిమిటియగుశివుఁడు|ఎప్పుడున్-ఎల్లప్పుడును|మౌళిన్-కిరీటమందు|ఇంపొదవన్|ఇంపు-సొంపు|ఒదవన్-పుట్టునట్లు| తాల్చిన-ధరియించిన|చంద్రరేఖపయిన్-చంద్రకళమీఁదను|ఈవు-నీవు| ఒక్కింతయు-కొంచము|నిక్కములు-సత్యములు|పదలాక్షాద్యుతిన్| పద పాదములయొక్క|లాక్షాద్యుతిన్|లాక్ష-లత్తుకయొక్క|ద్యుతిన్-కాంతిచేత|వన్నెవెట్టితి-రంగుచేసినావు| అని యని|పల్కన్-పలుకఁగా|నెచ్చెలిన్-మంచిచెలికత్తెను|చూచు-చూచుచున్న|నర్మదృఢానందభవాని|నర్మ-ప్రియోక్తులయందు|దృఢ స్థిరమైన|ఆనంద-సంతోషముగల|భవాని-పార్వతీదేవి| సోమవిభుమార్కండేయునిన్-సోమవిభునకుఁ గొడుకగు మార్కండేయమహారాజును|బ్రోవుతన్ - రక్షించుగాత॥ తా॥ఓపార్వతీ నీవెంతధన్యురాలవు ఎందుకనగా నీపెనిమిటియగు శివుడు శిరస్సున ధరించినచంద్రరేఖమీద లత్తుకచే వన్నెపెట్టినావు అనగా పాదములు కలయందు తలదన్ని నావనియు పతిచేత నాస్కరించబడితివనియు సవతియని యిట్టుల జేసినావనియు గూఢముగా పలుకుచున్న చెలిని భావగర్భితముగా చూచిన శాంభవీ మార్కండేయప్రభువును రక్షించుగాత॥

౬ ॥మ॥ స్థిరలావణ్యనిధానమైతనరు మూర్తిం జెందుకన్దోయిని ర్భరవర్థోదయసక్తమైతనర తత్పాద్మాక్షనామంబునా|గరికుల్ మెచ్చ నవార్థకల్పనబొసంగం జేయ రంజిల్లు నీరరుహస్థాయిని పద్మనిర్భరహి మార్కండేయ సౌధంబునన్॥ ✻టీ॥ స్థిరలావణ్యనిధానమై తనరు|స్థిర-శాశ్వతమైన|లావణ్య-సౌందర్యమునకు| నిధానమై-నిధియై|తనరు-ఒప్పుచుండెడు|మూర్తిం జెందు|మూర్తిం-స్వరూపమును|చెందు-పొందిన| కన్దోయి-నేత్రద్వయము|నిర్భరవర్థోదయసక్తమై|నిర్భరము-చులకనగు|అర్థోదయ-అరమోడ్పుయందు|సక్తమై-తగిలినదై|తనరన్-ఒప్పఁగా|తత్పాద్మాక్షనామంబు|తత్-ఆకనుదోయికి|పాద్మాక్షనామంబు-పాద్మాక్షమను(పద్మసంబంధమైనకాంతిగలకన్నులనియు,లక్ష్మీసంబంధమైన నేత్రమనియు) పేరును| నాగరికుల్ మెచ్చన్|నాగరికుల్-సరసులు|మెచ్చన్-మెచ్చునట్లుగా|నవార్థకల్పనన్|నవ-క్రొత్తదియగు|అర్థకల్పన-అర్థరచనను|బొసంగన్ చేయ-పొందుపరచఁగా|రంజిల్లు-ప్రకాశించుచున్న| నీరరుహస్థాయిని|నీరరుహ-పద్మాసనమందు| స్థాయిని-ఆసీనురాలైన| పద్మ-లక్ష్మీదేవి|రహిన్-విలాసముచేత|మార్కండేయసౌధంబునన్ - మార్కండేయప్రభువుయొక్క మేడయందు|నిల్చు-నివసించుగాత॥ తా॥నిబ్బరమైనసొగసుగలక

నుదోయి అరమోడ్పు కలిగియుండగా దానికి పండితులు మెచ్చుకొను రీతిని లక్ష్మీ నేత్రమని పేరేర్పగా ప్రకాశించుచున్న లక్ష్మీదేవి మార్కండేయుని గృహమందుండుగాత॥

౭॥ చ॥ సతులు నివాసవాసులయి సాగుట వాసిగ దానసదా। దృతసని కాంత కాంతముఖధీ ప్రముఖప్రవరాళిలోననా। రతము వసించి మించిన సరస్వతి మెచ్చగనిచ్చుగాతత త్కృతిపతికిన్ సుధీవినుతధీపరిణామవచోవిలాసముల్॥ * టీ॥ సతులు-స్త్రీలు। నివాస-గృహములయందు। వాసులయి-ఉన్నవారలై। సాగుట-వృద్ధిపొందుట। వాసిగ-గొప్పగా। సదా-ఎల్లప్పుడు। సదాదృతసని। సత్-సత్పురుషులచే। ఆదృతను-ఆదరించబడిన। దానస్సని। కాంతకాంతముఖధీప్రముఖప్రవరాళిలోన్। కాంత-సుందరులైన। కాంత-పెనిమిటియగు బ్రహ్మదేవుని యొక్క। ముఖ-మోములయందును। ధీప్రముఖ। ధీ-బుద్ధిచే। ప్రముఖ-ప్రసిద్ధులగు పండితులలో। ప్రవర-శ్రేష్ఠులయొక్క। ఆళిలోన్-బంతిలో। అనారతము-ఎల్లప్పుడును। వసించి-ఉండి। మించిన-ఘనతకెక్కిన। సరస్వతి-శారదాదేవి। మెచ్చగన్-మెచ్చగా। తత్కృతిపతికిన్। తత్-ఆ। కృతిపతికిన్-కృతినాధుడగు మార్కండేయునకు। సుధీవినుతధీపరిణామవచోవిలాసముల్। సుధీ-విద్వాంసులచే। వినుత-స్తుతించబడిన। ధీ-బుద్ధియొక్క। పరిణామ-పరిపాకముగల। వచోవిలాసముల్-వాక్యవైఖరులను। ఇచ్చుగాత-ఒసగుగాక॥ తా॥ లోకములో స్త్రీలు తమయిండ్లలో నుండి బాగుపడుట మంచిదని యెంచి పెనిమిటి మొదలైన పండితమండలిలో నుండిన సరస్వతీదేవి మార్కండేయులకు మంచి వాక్కులనిచ్చుగాత॥

౮॥ శా॥ క్షోణీభృత్తనయామనోహరునకున్ శుభ్రాశ్వమై కేతువై। బాణాదిప్రమథా। గ్రగణ్యుడనగా భాసిల్లు ధన్యుండు క। ళ్యాణశ్రీబసవేశ్వరుండు దయ నిత్యైశ్వర్యు జేయున్ జగ। త్ప్రాణాత్మప్రభవధ్వజుండయిన మార్కండేయ భక్తాగ్రణిన్॥ * టీ॥ క్షోణీభృత్తనయామనోహరునకున్। క్షోణీభృత్-హిమవత్పర్వతముయొక్క। తనయ-కుమార్తెయగు పార్వతీదేవికి। మనోహరునకున్-పెనిమిటియగు శివునకు। శుభ్రాశ్వమై-తెల్లగుర్రమై। కేతువై-ధ్వజమై। బాణాదిప్రమథాగ్రగణ్యుడు। బాణ-బాణాసురుడు। ఆది-మొదలైన। ప్రమథ-ప్రమథగణములకు। అగ్రగణ్యుడు-మొదటలెక్కజేయతగినవాడు। అనగా-అనునట్లు। భాసిల్లు-ప్రకాశించుచున్నట్టియు। ధన్యుండు-కృతార్థుడునగు। కళ్యాణశ్రీబసవేశ్వరుండు। కళ్యాణ-కళ్యాణపట్టణమందుండు। శ్రీబసవేశ్వరుండు-శ్రీవృషభేశ్వరుడు। దయన్-కృపచేత। జగత్ప్రాణాత్మప్రభవధ్వజుండు। జగత్ప్రాణ-వాయుదేవునకు। ఆత్మప్రభవ-కుమారుడగు ఆంజనేయుడు। ధ్వజుండు-టెక్కెమందుగలవాడు। అయిన-అయినట్టి। మార్కండేయభక్తాగ్రణిన్-భక్తవర్యుడగు మార్కండేయుని। నిత్యైశ్వర్యునిన్। నిత్య-స్థిరమైన। ఐశ్వర్యునిన్-ఐశ్వర్యముగలవానిగా। చేయున్-చేసుగాక॥ తా॥ సాంబమూర్తికి గుఱ్ఱమును టెక్కెమునై ప్రమథశ్రేష్ఠుడగు బసవేశ్వరుడు మార్కండేయప్రభునకు నిత్యైశ్వర్యము దయసేయుగాత॥

౯॥ శా॥ శ్రీదాక్షాయణి యంకపీఠమున గూర్మిం నిల్వనుండా తత్ప్రస్వాదుస్తన్యము చాలగ్రోలియు పశిష్టంబాశ్రితశ్రేణికాహ్లాదంబొప్పనొసంగు రీతి నుభయప్రాంతంబులం జిమ్ము నా। స్వేదండాస్యుడొనర్చు బూర్ణకృపనిర్విఘ్నంబుని కావ్యమున్॥ * టీ॥ శ్రీదాక్షాయణి। శ్రీ

శోభాయుక్తురాలైన। దాక్షాయణి-దక్షపుత్రియగు గౌరీదేవి। అంకపీఠమున। అంక-తొడయనెడు। పీఠమున-గద్దెయందు। కూర్మిన్-ప్రేమచే। నిల్పి-ఉంచగా। శుండాతతస్వాదుస్తన్యమున్। శుండ-తొండముచే। ఆతత-విస్తారముగ। స్వాదు-రుచియగు। స్తన్యము-చనుబాలను। చాలన్-మిక్కిలి। క్రోలి-త్రావి। అవశిష్టంబు-మిగిలినపాలను। ఆశ్రిత శ్రేణికిన్। ఆశ్రిత-భక్తులయొక్క। శ్రేణికిన్-పంక్తికి। ఆహ్లాదంబొప్పన్। ఆహ్లాదంబు-ఆనందము। ఒప్పన్-పొందునట్లుగా। ఒసంగురీతిన్-ఇచ్చెడిలాగున। ఉభయప్రాంతంబులన్। ఉభయ-రెండగు। ప్రాంతంబులన్-పార్శ్వములయందు। చిమ్మన్-విదల్చెడి। అవ్వేదండాస్యుడు। అ-ప్రసిద్ధుడగు। వేదండాస్యుడు। ఏనుగమోముగలవిఘ్నేశ్వరుడు। పూర్ణకృపన్-సంపూర్ణదయచే। ఈకావ్యమున్-ఈకృతిని। నిర్విఘ్నంబుగన్-నిరంతరాయముగా। ఒనర్చు-చేయుగాత॥ తా॥ తల్లియగు పార్వతియొక్క తొడమీదనుండి స్తన్యపానము చేసిమిగిలినపాలను ఆశ్రితులకునిచ్చువిధమున రెండువైపులజల్లుచున్న విఘ్ననాధుడు ఈగ్రంధమును నిర్విఘ్నముగ చేయుగాత॥

## పూర్వకవిప్రార్థనము

౧౦॥ సీ॥ ప్రాచేతసుని బారాశర్యు గాళిదాసు మయూరభవభూతిచోరుదండి। బాణు ధనంజయు భారవి జయదేవు। భానుని శ్రీహర్షు బ్రవరసేను। మలహణు బిల్హణు మాఖు మురారి। క్షేమేంద్రు వటమూలు సోమనాధు। శివతత్వశివదేవచిన్మయు భవదూరు। శరభాంకు రాజశేఖరుని వేము। నన్నపార్యు తిక్కన నప్రబంధుని। సాధు నాధర్వణు చంద్రమౌళి। భాస్కరు ననంతు శ్రీనాధు భట్టి భీము। సోము నమరేంద్రు దలతు నుత్సుకత నాత్మ॥ టీ॥ ప్రాచేతసుని-వాల్మీకిని। పారాశర్యున్-వ్యాసులను। కాళిదాసున్-కాళిదాసును। మయూరున్-మయూరుని। భవభూతిన్-భవభూతిని। చోరున్-చోరుని। దండిన్-దండిని। బాణున్-బాణుని। ధనంజయున్-ధనంజయుని। భారవిన్-భారవిభట్టును। జయదేవున్-జయదేవుని। భానునిన్-భానుని। శ్రీహర్షున్-శ్రీహర్షునిని। ప్రవరసేనున్-ప్రవరసేనునిని। మలహణున్-మలహణునిని। బిల్హణున్-బిల్హణునిని। మాఖున్-మాఖుని। మురారిన్-మురారిని। క్షేమేంద్రున్-క్షేమేంద్రునిని। వటమూలున్-వటమూలునిని। సోమనాధున్-సోమనాధునిని। శివతత్వున్-శివతత్వునిని। శివదేవున్-శివదేవునిని। చిన్మయున్-చిన్మయునిని। భవదూరున్-భవదూరునిని। శరభాంకున్-శరభాంకునిని। రాజశేఖరుని-రాజశేఖరునిని। వేమున్-వేమనను। నన్నపార్యుని-నన్నయభట్టును। తిక్కనను-తిక్కనసోమయాజినిని। ప్రబంధుని-ప్రబంధునిని। సాధున్-సాధునిని। ఆధర్వణున్-అధర్వణాచార్యులను। చంద్రమౌళిన్-చంద్రమౌళినిని। భాస్కరున్-భాస్కరునిని। శ్రీనాధున్-శ్రీనాధునిని। భట్టిన్-భట్టినిని। భీమున్-భీమునిని। సోమున్-సోమునిని। అమరేంద్రున్-అమరేంద్రునిని। ఉత్సుకతన్-వేడుకచేత। ఆత్మన్-మనస్సునందు। తలతున్-తలచెదను॥ తా॥ తాము చేయబూనిన కృతిసిద్ధికొరకు ఈయాంధ్రగీర్వాణమహాకవులనుతలంచిరి॥

౧౧॥ మ॥ సకలశ్రీనిరవద్యహృద్యకవితాసామ్రాజ్యసంతుష్టలౌ। సుకవుల్ తన్మొదురింప

ములయొక్క। అంక-గుఱుతులయొక్క। లాభ - మేలుయొక్క। వైభవుడు-విభవముకలిగిన। ధవళేశపురపుమార్కండఘనుడు -ధవళేశ్వరపురపుమార్కండేయప్రభువు॥ తా॥ మార్కండేయమహీపతికి దాడపాణీశ్వరుడు ఇష్టదైవము వహేశ్వరార్చనము నియతవ్రతము దేవబంధుపరిపాలనము స్వభావసిద్ధము ప్రీణవపంచాశరీమంత్రము మెల్లప్పుడు జిహ్వాగ్రమందుండెడిదియు మేఘవాహనము కనకకుండలాభరణముసు శ్రేష్ఠబిరుదములు॥

౧౭॥క॥ అతడుప్రసిద్ధివహించెన్। క్షితివరగజపతులగెలచిచెలగిజయశ్రీసతిజేకొనినమహాంబాళ తుపశహచంద్రునకునుడిభుజమగన్॥ టీ॥ అతడు-ఆమార్కండేయుడు। క్షితిన్-భూమియందు। అరగజపతులన్। అరి-శత్రువులైన। గజపతులన్- గజతిపమహారాజులను। గెలచి-జయించి। చెలగి-ఒప్పి। జయశ్రీసతిన్-విజయలక్ష్మీకాంతను। జేకొనిన-పాణిగ్రహణము జేసికొనిన। మహాంబాళతుపశహచంద్రునకున్- మహమ్మద్ ఖుతబ్ షా అను రాజశ్రేష్ఠునకు। కుడిభుజమునగన్ -దక్షిణహస్తమనగ। ప్రసిద్ధిన్ -ఖ్యాతిని। వహించెన్- తాల్చెను॥ తా॥ విరోధులైనగజపతిమహారాజులను జయించిన మహమ్మద్ ఖుతబ్ షా అనురాజునకు కుడిభుజము(మంత్రి)అయినమార్కండేయమహీపతిఖ్యాతినిపొందెను

౧౮॥సీ॥ రసికపౌరాణికాగ్రణులవాచాప్రపంచ। మొకింతసైపనంజలిఘటించి। వైణికగాయకశ్రేణి తాళధ్వని। కించుకనంచుగావించదలచి। వందిమాగధులకైవారమొక్కింతయొ। యనశేయగనుచాయననునయించి। చామరగ్రాహిణీజనకింకిణీఝుణ। త్కృతియొకించుకనిల్వగేలుసాచి। సకలహరిదంతసామంతసచివనిచయ। మవసరముగాచితమరహస్యములువిన్న। వించగరుణించికాంచనవిమలరత్న। ఖచితపీఠికగొలువయికావ్యగోష్ఠి॥ టీ॥ రసికపౌరాణికాగ్రిణులవాచాప్రపంచమున్। రసిక- రసజ్ఞులైన। పౌరాణికాగ్రణుల - పౌరాణికశ్రేష్ఠులయొక్క। వాచా- వాక్కులయొక్క। ప్రపంచమున్- విస్తృతిని। ఒకింత- కొంచము। సైపను -తాళుటకు। అంజలిఘటించి-దోసిలిబట్టి। వైణికగాయకశ్రేణితాళధ్వనికిన్। వైణిక- వీణాపాఠకులయొక్క। శ్రేణి - వరుసయొక్క। తాళధ్వనికిన్ -తాళములచప్పుడునకు। ఇంచుక- కొంచము। సంచు- విఘాతమును। కావించతలచి-చేయగోరి। వందిమాగధులకైవారము। వందిమాగధుల- స్తుతిపాఠకులయొక్క। కైవారము- పొగడికను। ఒక్కింతయు- కొంచము। ఒయ్యన్- మెల్లగా। చేయన్- చేయుటకు। కనుచాయన్- నేత్రసంజ్ఞచే। అనునయించి- యాపి। చామరగ్రాహిణీజనకింకిణీఝుణత్కృతి। చామరగ్రాహిణీజన-వింజామరలువేయుస్త్రీలయొక్క। కింకిణీ-వడ్డాణపుచిరిగంటలయొక్క। ఝుణత్కృతి-ఝుణత్కారము। ఒకించుక కొంచము సేపు। నిల్వన్-నిల్చునట్లుగా। కేలుసాచి-చెయిజాపియు। సకలహరిదంతసామంతసచివనిచయము। సకల- సమస్తమైన। హరిదంత-దిగంతములయందలి। సామంత-సమానరాజులయొక్కయు। సచివ-మంత్రులయొక్కయు। నిచయము సముదాయము। అవసరమున్-సమయమును। కాచి- కనిపెట్టి। తమరహ...

ఈ రాజు ఆ.౧౫౫౦సం॥ మొదలుకొని ౧౫౮౦సం॥ వరకు గొప్పప్రభుత్వముచేసెను.

స్యములు. తమరహాస్యపుసంగతులను । విన్నవించఁగ-మనవిచేయగా । కరుణించి. దయచేసి । కాంచనవిమలరత్నఖచితపీఠికఁ । కాంచన-సువర్ణవికారమైన । విమలరత్న-నిర్మలరత్నములచే । ఖచిత-చెక్కఁబడిన । పీఠికఁ-సింహాసనమందు । కొలువయి-సభచేసి । కావ్యగోష్ఠి-కబ్బములప్రశంసయందు ॥ తా ॥ యనేకమంత్రులుతమవ్యాపారములుచెప్పుటకై పౌరాణికులగోష్ఠినాపుటకువారికినమస్కరించియు గాయకులతాళరవమునకునాతంకమొనరించియు స్తుతిజేయువారలప్రశంసలనుకనుసైగచేనివారించియువింజామరస్త్రీలయొక్కయొడ్డాణపుచిరిగంటలశబ్దముమ్రోగునటులచేసన్నజేయుచు విన్నవించగావా రలమనవులనుసాదరంబుగవినిమొగసాలయందుగద్దెపైకూర్చుండిప్రశంసముచేయుచుండెడినమయమందు ॥

౯౭ ॥ మ ॥ ననుబిలుపించిచాలబహుమానమొనర్చికవీంద్రులారస్కాం । దమునమహాప్రసిద్ధమగునాగరఖండమఖండవిశ్వకర్మమహితవైభవాకరముమాకుదెనుంగుగనంకితంబుగా । రమణఘటింపగాదగుపురాణవిధుల్మదిరాణమెచ్చఁగన్ ॥ * టీ ॥ మముఁగ-మమ్ములను । బిలుపించి-పిలువనంపి । చాలబహుమానమొనర్చి-గొప్పబహుమానముచేసి । కవీంద్రులారా-ఓకవీశ్వరులారా । స్కాందమునఁ-స్కాందపురాణమందు । మహాప్రసిద్ధమగు-గొప్పవాడుకగల । అఖండవిశ్వకర్మమహితవైభవాకరము । అఖండ-సంపూర్ణమహిమగల । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । మహిత-గొప్పదియగు । వైభవ-విభవమునకు । ఆకరము-గనియగు । నాగరఖండముఁ-నాగరఖండమును । మాకుఁ-మాకు । తెనుంగుగఁ-తెనుగుచే । అంకితంబుగా-చిహ్నితముగా । రమణఁ-సొగసుచే । పురాణవిధుల్-పురాణరీతులు । మదిఁ-మనస్సునందు । రాణము-ప్రకాశము । ఎచ్చఁగఁ-అతిశయించులాగున । ఘటింపగాతగుఁ-ఒనరించనర్హమగును ॥ తా ॥ మార్కండేయప్రభువుమమ్ములనుబిలుపించి చాలబహుమానముచేసిస్కాందపురాణములోనినాగరఖండమునుతెనుగించిమాకుకృతియివ్వమనిచెప్పెను ॥

౯౮ ॥ చ ॥ అనికనకాంబరాభరణహారపటీరసుగంధవీటికా । ద్యనుపమపారితోషికములర్థినొసంగఁబొసంగఁబొంగికై । కొనికృతికంఠమాలికకుఁగొబ్బననాయకరత్నమబ్బెప్రాక్తనసుకృతంబుచేననుచుతత్కథబూనితిమేమొనర్పఁగన్ ॥ * టీ ॥ అని. యీలాగునపలికి । కనకాంబరాభరణహారపటీరసుగంధవీటికాద్యనుపమపారితోషికములు । కనక-బంగరువగు । అంబర-వస్త్రములు । ఆభరణ-నగలు । హార-ముత్తెపుయపుసరులు । పటీర-మంచిగంధము । సుగంధవీటికా-కప్పురంపువిడెము । ఆది-మొదలగు । అనుపమ-సాటిలేని । పారితోషికములు-కట్నములు । అర్థిఁ-ప్రేమచే । ఒసంగఁ-ఇవ్వగ । పొసంగఁ-అనుకూలముగా । పొంగి-ఉబ్బి । కైకొని-పుచ్చుకొని । కృతికంఠమాలికకుఁ । కృతి-యీగ్రంథమనెడు । కంఠమాలికకు-కంఠాభరణమునకు । గొబ్బనఁ-త్వరగా । నాయకరత్నము-నాయమణి । ప్రాక్తనసుకృతంబుచేఁ । ప్రాక్తన-పూర్వజన్మసంబంధమైన । సుకృతంబుచేఁ-పుణ్యముచే । అబ్బెను-దొరికెను । అనుచుఁ-అంచును । తత్కథఁ । తత్-ఆ । కథఁ-వృత్తాంతమును । ఏము-మేము । ఒనర్పఁగఁ-చేయుటకు । పూనితిమి-ఒప్పితిమి ॥ తా ॥ బంగారుసొమ్ములుమొదలైనబహుమానములివ్వగాసంతోషించి యీకృతికినాయకమణిమాపూర్వపుణ్యమునదొరకుటచేమేముఅదిరచించబూనితిమి ॥

## కృతినాయకవంశావళి.

౨౧ వ॥ ఏతత్కథాముఖాలంకారంబగు కృతినాయక వంశావతారం బభివర్ణించెదా॥ ✻టీ॥ ఏతత్కథాముఖాలంకారంబు। ఏతత్-ఈ। కథాముఖ-కథాగ్రమునకు। అలంకారంబు-భూషణము। అగు-అయిన। కృతినాయకవంశావతారంబు। కృతినాయక-కృతికర్త యొక్క। వంశ-వంశము యొక్క। అవతారంబు-వచ్చినరీతిని। అభివర్ణించెదము-ప్రశంసించెదము॥ తా॥ ఈకథకు భూషణమైన కృతినాయకుని వంశావళిని వర్ణించెదము॥

౨౨ శా॥ శ్రీమత్ప్రాభవ విశ్వకర్మముఖ రాజీవోద్భవుం జంద్రికా। రామానేత్రచకోరచంద్రు భువనారంభప్రియుఁ భావుక। స్థేముఁ దానకళాధురీణు నిరతక్షేమాకరుఁ వ్యోమపృథ్వీమధ్యస్థలపూర్ణకీర్తిం దగ దేవిశ్వజ్ఞు వర్ణింపగన్॥ ✻టీ॥ శ్రీమత్ప్రాభవవిశ్వకర్మముఖరాజీవోద్భవుఁ। శ్రీమత్-శోభాయుక్తమైన। ప్రాభవ-ప్రభుత్వము గలట్టి। విశ్వకర్మ-విశ్వకర్మ యొక్క। ముఖరాజీవ-ముఖపద్మములవలన। ఉద్భవుఁ-పుట్టినట్టియు। చంద్రికారామానేత్రచకోరచంద్రుఁ। చంద్రికా-కాంతిచే। రామా-స్త్రీల యొక్క। నేత్ర-కన్నులనెడు। చకోర-చకోరపుపులుగులకు। చంద్రుఁ-చంద్రుడైనట్టియు। భువనారంభప్రియుఁ। భువన-లోకముల యొక్క। ఆరంభ-చేయమొదలు బెట్టుటయందు। ప్రియుఁ-ఇష్టుడైనట్టియు। భావుకస్థేముఁ। భావుక-మంగళకరమైన। స్థేముఁ-స్థితిగలట్టియు। దానకళాధురీణుఁ। దానకళా-వితరణవిద్యకు। ధురీణుఁ-భారవాహకుడైనట్టియు। నిరతక్షేమాకరుఁ। నిరత-ఎల్లప్పుడునుండెడు। క్షేమ-శుభములకు। ఆకరుఁ-గనియైనట్టియు। వ్యోమపృథ్వీమధ్యస్థపూర్ణకీర్తిఁ। వ్యోమ-ఆకసము యొక్క। పృథ్వీ-పుడమి యొక్క। మధ్యస్థ-నడిమిభాగమందు। పూర్ణ-నిండిన। కీర్తి-యశస్సు గలిగినట్టియు। విశ్వజ్ఞుఁ-విశ్వజ్ఞుడను దేవుని। వర్ణింపగన్-వర్ణింపగా। తగదే-అనుకూలముగాదా॥ తా॥ విశ్వకర్మముఖమునవలన పుట్టినట్టియు చక్కనివాడును సృష్టికర్తయు సంపూర్ణకీర్తిగల విశ్వజ్ఞుని బహుగ వర్ణించవలసినది.

౨౩ ఉ॥ ఆత్రిదశేశ్వరాంశధవళాన్వయవార్ధిసుధామయూఖుడై। ధాత్రిజనించిమించె బహుదానకళాపరితోషితాప్తస। త్పాత్రుడు చంద్రజూటపదపంకజభక్తుడు ధీరగేయచా। రిత్రుడు వీరయప్రభువరేణ్యుడశేషసుధీశరణ్యుడై॥ ✻ టీ ॥ ఆత్రిదశేశ్వరాంశధవళాన్వయవార్ధిసుధామయూఖుడై। ఆ-అల। త్రిదశేశ్వర-దేవేంద్రుని యొక్క। అంశ-భాగము గల। ధవళాన్వయ-ధవళేశ్వరపురపువంశమనెడు। వార్ధి-సముద్రమునకు। సుధామయూఖుడై-చంద్రుడై। ధాత్రిన్-పుడమిని। జనించి-పుట్టి। బహుదానకళాపరితోషితాప్తసత్పాత్రుడు। బహు-విస్తారమగు। దానకళా-దాతృత్వవిద్యచే। పరితోషిత-ఆనందింపజేయబడిన। ఆప్త-ఇష్టులనెడు। సత్-యోగ్యములైన। పాత్రుడు-భాజనములు గలిగినట్టియు। చంద్రజూట-పదపంకజభక్తుడు। చంద్రజూట-శివుని యొక్క। పదపంకజ-పాదపద్మములయందు। భక్తుడు-ప్రేమగలవాడైనట్టియు। ధీరగేయచారిత్రుడు। ధీర-విద్వాంసులచే। గేయ-కొనియాడతగిన। చారిత్రుడు-నడతలుగలవాడైన। వీరయప్రభువరేణ్యుడు-వీరయయను ప్రభుశ్రేష్ఠుడు। అశేషసుధీశరణ్యుడై। అశేష-సమస్తమైన। సుధీ-పండితులకు। శరణ్యుడై-రక్షకుడై। మించెన్-వృద్ధిపొందెను.॥ తా ॥ ధవళేశ్వరవంశప్రకాశకుడును బహుదాతయును శి

వభక్తుడును పండితస్తుత్యుడునగు వీరయప్రభువు ఈలోకములో ప్రకాశించెను॥

౫౮॥ శా॥ శ్రీరాంభోనిధి కౌస్తుభంబును సుధన్ చింతామణిశ్రేష్ఠమున్। దారేశున్ సురధేనువున్ గరిపతిన్ దాఁగాంచు చందానఁ గం। గారాజీవదళాయతాక్షివలనన్ గళ్యాణధౌరేయులన్। వీరాచార్యులు గాంచె సూనుల జగద్విఖ్యాతచారిత్రులన్॥ * ॥ టీ॥ శ్రీరాంభోనిధి-పాలసముద్రుడు। కౌస్తుభంబును-కౌస్తుభమణిని। సుధన్-అమృతమును। చింతామణిశ్రేష్ఠమున్-శ్రేష్ఠమైన చింతామణిని। తారేశున్-చంద్రునిని। సురధేనువున్-కామధేనువును। కరిపతిన్-ఐరావతమునను-తాన్-తాను। కాంచు చందాన-కనినరీతిని। వీరాచార్యులు-వీరాచార్యులు అను ఆయన। గంగారాజీవదళాయతాక్షివలనన్। గంగా-గంగమ్మయనెడు। రాజీవదళ-తామరరేకులవలె। ఆయత-పొడవులైన-అక్షి-కన్నులుగల। స్త్రీవలనన్-స్త్రీవల్లను। కళ్యాణధౌరేయులన్। కళ్యాణ-శుభములకు। ధౌరేయులన్-దురంధరులైనట్టి। జగద్విఖ్యాతచారిత్రులన్। జగత్-ఈలోకమందు। విఖ్యాత-ప్రసిద్ధములైన। చారిత్రులన్-చరితలు గలట్టియు। సూనులన్-తనయులను। కాంచెన్-పొందెను॥ తా॥ పాలసముద్రుడు చంద్రుడు మొదలైనవాటిని కనినట్లు వీరాచార్యులు గంగాంబవల్ల మంచికొమాళ్లను కనెను॥ తారలలోనన్-ఆకొమాళ్లలోపలను.॥

౫౯॥ మ॥ రజితాగంబొక రాజమౌళికి వినిర్మాణంబుగావించి యిం। చ్చె జగంబెన్నఁగ విశ్వకర్మ మును దాజిత్రంబుగాదిప్పుడీ। బెజవాడప్రభుడిచ్చె నంతయును గల్పించి ద్దరిత్రిన్ మహా। జితస్వర్ణగృహంబులెల్లనసురవ్రాతంబు మోదింపఁగన్॥ * టీ॥ రజితాగంబున్-వెండికొండను। ఒకరాజమౌళికిన్-చంద్రుడు కిరీటముగాఁగల సాంబమూర్తికి, ఒకమహారాజునను। వినిర్మాణంబు గావించి-చేసి। విశ్వకర్మ-విశ్వకర్మ। మును-పూర్వము। తాన్-తాను। జగంబు-లోకము। ఎన్నఁగన్-మెచ్చుకొనునట్లు। ఇచ్చెన్-ఇచ్చెను। చిత్రంబుగాదు-ఇది వింతకాదు। ఇప్పుడు-ఈకాలములో। బెజవాడప్రభుడు-బెజవాడమహారాజు। ఇద్దరిత్రిన్-ఈపుడమిలో। అంతయును-యావత్తును। మహారజితస్వర్ణగృహంబులన్। మహా-గొప్పవియగు। రజిత-వెండియు। స్వర్ణ-బంగారపువియునైన। గృహంబులన్-ఇండ్లను। నిర్మించి-చేసి। సురవ్రాతంబు-దేవతాసమూహము। ఇప్పుడున్-ఎల్లప్పుడు। మోదింపఁగన్-సంతోషించునట్లు। ఇచ్చెన్-ఇచ్చెను॥ తా॥ పూర్వకాలమందు విశ్వకర్మ సదాశివుడను రాజమౌళికి ఒక వెండికొండను ఇల్లుగా చేసి యిచ్చెను యిప్పుడు బెజవాడమహారాజు అనేక రాజశేఖరులకు అనేకములైన వెండిబంగారపు ఇండ్లను దేవతలు మెచ్చునటుల చేసి యిచ్చినాడు యిది గొప్ప చిత్రముగాని విశ్వకర్మ చేసినది చిత్రముగాదు॥

౬౦॥ పర్వతరాట్సుతారమణపాదపయోరుహబంభరంబు సో। పర్వతరుప్రధానగుణభాసితుఁడంచితసజ్జనప్రశంసః। పర్వతదాత్మ పర్వనుడు భవ్యుఁడు దిక్కులకీర్తిచంద్రికల్। పర్వతనంతధీయుడగు బర్వతధీరుడు మించె ధారుణిన్॥ * టీ॥ పర్వతరాట్సుతారమణపాదపయోరుహబంభరంబు। పర్వతరాట్-హిమవంతునియొక్క। సుతా-కుమార్తెకు। రమణ-పెనిమిటి యగు శివునియొక్క। పాదపయోరుహ-పాదపద్మములకు। బంభరంబు-తుమ్మెదైన

ట్టియును। సౌపర్వతరుప్రధానగుణభాసితుడు।సౌపర్వ- దేవతాసంబంధమైన। తరు-కల్ప వృక్షముయొక్క। ప్రధాన-ముఖ్యమగు।గుణ-దాతృత్వగుణముచే।భాసితుడు-ప్రకాశించు చున్నట్టియు। అంచితసజ్జనశ్రవఃపర్వతదాత్మవర్తనుడు। అంచిత- ఒప్పుచున్న। సజ్జన-స త్పురుషులయొక్క।శ్రవః- కర్ణములకు।పర్వ-పండువుగాయైన।తత్-ఆప్రసిద్ధమైన ।ఆత్మ .తన యొక్క। వర్తనుడు-నడతగలిగినట్టియు।భవ్యుడు-మంగళకరుడును।తనంతధీరుడు।తనంత- తనపేరంతనే। ధీరుడు-ధైర్యముగలవాడు।అగు-అయిన।పర్వతధీరుడు-పర్వతాచార్యులు। దిక్కులన్-దెసలయందు।కీర్తిచంద్రికల్।కీర్తి-కీర్తియొక్క।చంద్రికల్-ప్రకాశలు।పర్వన్- వ్యాపించగా। ధారుణిన్- భూమియందు। మించెన్- ప్రకాశించె॥ తా॥సాం బమూర్తియొక్క సేవాపరుడునువితరణగుణశాలియు సజ్జనులకువినతగిన నడతకలిగినట్టి యు ధీరుడైనపర్వతాచార్యులుతనకీర్తినిదిక్కులవ్యాపింపజేసెను॥

౨౭ ఉ॥ ఐత్తైనరాజశేఖరుడు భావము మెత్తగజేసినర్వదా।నొత్తెనరివ్రజంబును పయోధిపరీతకుభృద్గుహాళికిం। మెత్తైనవాత్మకీర్తిసుధమించుసరోజభవాండముల్। బత్తైన మర్త్యమాత్రుడెకృపారసపూర్ణవిలోకుడౌనసన్ ॥ * టీ॥ బత్తైనరాజశేఖరుడు- బత్తైన ప్రభుశిఖామణి।కృపారసపూర్ణవిలోకుడు।కృపారస-దయారసముచేత। పూర్ణ - నిండి న।విలోకుడు-చూపులుగలవాడు।ఔనసన్-అవునట్లుగా।భావమున్ .అభిప్రాయమును।మె త్తగజేసి-మృదువుగాజేసి।సర్వదా- ఎల్లప్పుడు ।అరివ్రజంబును। అరి-శత్రువులయొక్క।వ్ర జంబున్-సమూహమును।పయోధిపరీత-సముద్రావృతమైన।కుభృద్గుహాళికిన్ ।కుభృత్- ప ర్వతములయొక్క।గుహా-బిలములయొక్క।ఆళికిన్-చాలుకు। ఒత్తెన్ - త్రోసెను(కాపుర ముండజేసెను) ।నవాత్మకీర్తిసుధన్ ।నవా-క్రొత్తదియగు। ఆత్మ-తనయొక్క। కీర్తి-యశ స్సనెడు। సుధ- సున్నముచే।మించు-అతిశయించు। సరోజభవాండభాండముల్। సరోజ భవాండ-బ్రహ్మాండములనెడు।భాండముల్-కుండలను। మెత్తెన్- పూసెను। బత్తైన-బత్తైన ప్రభుడు।కేవలమర్త్యమాత్రుడే- కేవలమనుష్యమాత్రుడా॥ తా॥ బత్తైనరాజుమృదుమ నస్సుగలవాడైశత్రువులనుకొండలగుహలలో కాపురముంచికీర్తినిదిక్కులయందు వ్యాపిం పజేయుటవలన దయగలయీయనమనుష్యునివంటివాడుకాడనిజనులుపొగడనొప్పెను॥

౨౮ ఉ॥ హత్తైనులింగజంగమపదాంబురుహద్వయభక్తిసౌఖ్యమున్। మెత్తైనవా త్మకీర్తిసుధమించుసరోజభవాండముద్రదై। పుత్తడిబొమ్మలంచటులబోతగజేసెనురంగ మందున। రోత్తముడెన్నగాదగునె రోదసిలోపలసాటివానితోన్॥ * టీ॥మరియు,సర్వో త్తముడు।సర్వ అందరిలో। ఉత్తముడు-శ్రేష్ఠుడగుబత్తైనప్రభువు।లింగజంగమపదాంబు రుహద్వయభక్తిసౌఖ్యమున్।లింగ-లింగస్వరూపులగు। జంగమ-జ్ఞానులయొక్క।పదాం బురుహ- పాదపద్మములయొక్క।ద్వయ-దోయియందలి।భక్తి-ప్రేమయొక్క।సౌఖ్యమున్- సుఖమును।హత్తెన్-పొందెను।నవాత్మకీర్తిసుధ।నవ-క్రొత్తదియగు। ఆత్మ-తనయొక్క। కీర్తి-యశమనెడు।సుధన్- తెల్లనిసున్నముచే।సరోజభవాండముద్రదై।సరోజభవాండ-బ్ర హ్మాండగోళములయొక్క। ముద్రదై-చిన్నెగలవాడై।పుత్తడిబొమ్మలంచు-బంగరుబొమ్మల

ని। అటుల-అబొమ్మలయట్లనె। రంగమందు-నాటకశాలయందు। పోలఁ జేసెన్। పోలఁగన్-సమానమగునటుల। చేసెన్-ఒనర్చెను। వానితోన్। ఆ బత్తెనప్రభుఁతో। సాటి-సమానము। రోదసిలోపలన్-పుడమియాకసములనడుమను। ఎన్నఁగన్-ఎంచునట్లుగ (చెప్పుటకు)। తగనె-యొప్పునా॥ తా॥ భక్తులను సేవించునట్టియు బ్రహ్మాండమందు కీర్తి నింపి బంగరుగుండ్లలాగున బ్రహ్మాండములను నాట్యశాలయందు యాడించినట్టియా బత్తెనకెక్కడను సాటిలేర

౨౯॥ చ॥ వినియెను శైవశాస్త్రములు వీనులవిందులుగానభిజ్ఞుడై। మనియెను ధాత్రిలోపలసమస్తజనుల్వినుతింపనిచ్చలుం। గనియెను పుత్రులన్ నిరతకల్పకదానకళాచరిత్రులన్। ఘనుడగు రామయప్రభుశిఖామణిసాటికనెవ్వరెన్నఁగన్॥ టీ॥ ఘనుడగు-గొప్పవాడైన। రామయప్రభుశిఖామణి- రామభూపాలవర్యుడు। అభిజ్ఞుడై-తెలిసినవాడై। వీనులవిందులుగాన్। వీనుల-చెవులకు। విందులుగాన్-ఆహారములుగాను। శైవశాస్త్రములు- శివపురాణములను। వినియెను-ఆకర్ణించెను। సమస్తజనుల్-సర్వమానవులు। నిచ్చలున్-ఎల్లప్పుడు। వినుతింపన్-పొగుడుచుండ। ధాత్రిలోపలన్-భూమిలోన। మనియెన్ -జీవించెను। నిరతకల్పకదానకళాచరిత్రులన్। నిరత-ఎల్లప్పుడు। కల్పక-కల్పవృక్షమువంటి। దానకళా-దాతృత్వవిద్యయొక్క। చరిత్రులన్-కథలుగల। పుత్రులన్-కొమరులను। కనియెను-కనెను। సాటికి-సమానమునకు। ఎన్నఁగన్-లెక్కించగా। ఇకన్-ఇకమీదట। ఎవ్వరు-ఎవరు॥ తా॥ ఆహ్లాదముగా శివగ్రంథములను విన్నట్టియు జనులందరు మెచ్చులాగున ప్రవర్తించినట్టియు మంచికొమాళ్లను కనినట్టియు రామయప్రభువునకు నెవ్వరును సాటిలేరు॥

౩౦॥ తే॥ శేషిణీహనుమధ్వజబిరుదుగనక। కుండలాభరణుడు జగద్గురుడు మేఘ। వాహనుడనంగ పెందోటవరపురీశ్వ। రుండు చినరామఘనుడు నిరూఢిదనరె॥ టీ॥ పెందోటవరపురీశ్వరుండు। పెందోట-పెందోటయను। వర-శ్రేష్ఠమైన। పుర-నగరమునకు। ఈశ్వరుండు-ప్రభువైన। చినరామఘనుడు-చినరామయ్యయనుగొప్పవాడు। శేషిణీహనుమధ్వజబిరుదు। శేషిణీహనుమ-శేషిణీహనుమంతుడు। ధ్వజ-టెక్కెమందు। బిరుదు-చిహ్నగలవాడు। కనకకుండలాభరణుడు। కనక-సువర్ణవికారమైన। కుండల-కుండలములు। ఆభరణుడు-భూషణములుగాగలవాడును। జగద్గురుడు। జగత్-జగములకు। గురుడు-ఆచార్యుడును। మేఘవాహనుడు-జలదాశ్వుడు (దేవేంద్రుడు)। అనంగ-అనునట్లు। నిరూఢిన్-నిక్కముచే। తనరెన్-ఒప్పెను॥ తా॥ శేషిణీహనుమంతాదిబిరుదులుగలచినరామప్రభువు ప్రకాశించెను॥

౩౧॥ సీ॥ పొంగియుండుటె కాని భువనంబులెల్లను। ద్ధతిమించియొకవేల దాటలేదు। చల్లనౌటయె కాని చక్రభూభృత్కూట। సమితిపై పాదంబు చాచలేదు। దివినుండుటయె కాని తివిరి కూర్మము ముట్టి। గురుమూలమున బాధకొనగలేదు। ధరణి మోవనె కాని తన పొట్టలో కాళ్లు। చక్కసాధించి బెంపెక్కలేదు। మేదినిజడాత్మకులుగూడ పాదులైన। వారలేరీతి సాటికి వత్తురెన్న। సరసధవళేశ్వరాన్వయస్వామియైన। రామధీమణిసత్కీర్తి[illegible]నకును॥ టీ॥ పొంగియుండుటె కాని-యుప్పొంగుటయే తప్ప। భువనంబులెల్లన్-లోకములన్నిటిని, ఉదకములన్నిటిని। ఉద్ధతిన్-ఔద్ధత్యముచేత। మించి-అతిశయించి। యొకవేల-ఒక్కచెలియలికట్టను। దాటలేదు-అతిక్రమించలేదు (ఒకకాలమందు దాటలేదు) చల్లనౌటయె కాని-చల్లగావుం

డడమే కాని। చక్రభూభృత్కూటసమితిపైన్। చక్రభూభృత్-చక్రవాళపర్వతముయొక్క-కూట-శిఖరములయొక్క। సమితిపైన్-సమూహముమీదను।(చక్రి-భూచక్రమందలి) భూభృత్-రాజులయొక్క।కూట-గృహములయొక్క।సమితిపైన్-సమూహముమీదను)।పాదంబు-కిరణమును(చరణమును)।చాచలేదు-ఎత్తియుంచలేదు।దివినుండుటయే కాని।దివి-ఆకాశమందు।ఉండుటయే కాని-ఉండడమే కాని।తివిరి-పూని।కూర్మమునుముట్ట-ఆదికూర్మమునుముట్టునట్లు(కూర్మాసనమును పొందునట్లు)।గురుమూలమున।గురు-గొప్పదియగు।మూలమున-మొదటియందు(గురుకీలకమందును)।పాదుకొనగలేదు-స్థిరపడలేదు।ధరణిమోవనే కాని।ధరణిన్-భూమిని।మోవనే కాని-మోచుటే కాక।తనపొట్టలో కాళ్లు। తనపొట్టలో-తనకడుపులోని।కాళ్లు-పాదములను।(తనహృదయపుతలంపులఅంశములను)।చక్కసాధించి-వంకరలేకుండచేసి(బాగుగనెరవేర్చి)। పెంపెక్కలేదు-వృద్ధిపొందనేరదు।మేదినిన్-పుడమిలో।జడాత్మకులు-జలస్వరూపులును।(మూర్ఖులును)।గూఢపాదులు।గూఢ-కనుపించని।పాదులు-పాదములుకలవారలు(ప్రచ్ఛన్నచారులును)అయినట్టివారలు-అయినజనులు।సరసధవళేశ్వరాన్వయస్వామియైన।సరస-యోగ్యమైన ధవళేశ్వర-ధవళేశ్వరపురపు।అన్వయ-వంశమునకు।స్వామియైన-నాయకుడైన।రామధీమణిసత్కీర్తికామునకున్-రామప్రభువనుమంచికీర్తివంతునకు।ఎన్నన్-లెక్కించగా।ఏరీతిన్-ఏవిధమునకు।సాటిగవత్తురు-సరిగావచ్చెదరు॥ తా॥ రామాచార్యులుకీర్తిచే దిగంతములనతిక్రమించినవాడును శత్రువులకోటలను జయించినవాడును అష్టాంగయోగసిద్ధిగలవాడును తనఅభిప్రాయమును ఇతరులకు తెలియనీక కార్యసాధకుడును భూమిని తాల్చినవాడును గనుక శ్లేషచే సముద్రచంద్రమేఘశేషులు జడులును గూఢపాదులును గాన ఈయనకు సాటిరానేరరు॥

౩౨॥ శా॥ రామామానసపద్మభాస్కరుడు తారామారజిత్తారహీ। రామర్త్యద్రుమచంద్రికాతుహినచంద్రాంభోజసత్కీర్తియా। రామోద్యాననిధానసందనముఖప్రఖ్యాతసంతానుడౌ। రామాచార్యుని సాటియేరిధరలో రాజద్గుణప్రక్రియన్॥ టీ॥ రామామానసపద్మభాస్కరుడు। రామా-స్త్రీలయొక్క।మానస-మనస్సులనెడు।పద్మ-పద్మములకు।భాస్కరుడు-సూర్యునివంటివాడును।తారామారజిత్తారహీరామర్త్యద్రుమచంద్రికాతుహినచంద్రాంభోజసత్కీర్తియు। తార-చుక్కలు।మారజిత్-మన్మథునిజయించినసాంబమూర్తియు। తార-ముత్తియములు। హీర-వజ్రాలును। అమర్త్యద్రుమ। అమర్త్య-దేవతలయొక్క।ద్రుమ-చెట్టుఅయినకల్పవృక్షమును। చంద్రికా-వెన్నెలయు।తుహిన-మంచును।చంద్ర-చంద్రుడు।అంభోజ-తెల్లదామరపుష్పములవంటి। సత్కీర్తియు-మంచికీర్తిగలవాడను। ఆరామోద్యాననిధానసందనముఖప్రఖ్యాతసంతానుడు। ఆ రామ-ఇంటిదాపుతోటలు।ఉద్యాన-అందరికిఉపయోగమైనతోపులును।నిధాన-ధననిక్షేపములును। నందన-పుత్రులును।ముఖ-మొదలయిన।ప్రఖ్యాత-ప్రసిద్ధములయిన।సంతానుడు-సప్తసంతానములుగలవాడును।ఆ-అంతట। రామ-సుందరములయిన।ఉత్-గొప్పవైన।యాన-గజాదివిహారములకు।నిధాన-నిధులైన। నందన-తనయులు।ముఖ-మొదలైన।

ప్రఖ్యాత-ప్రసిద్ధులగు। సంతానుడు-సంతతిగలట్టియు। రామాచార్యునిసాటి। రామాచా
ర్యుని-రామాచార్యులకు। సాటి- ఖోలికె। ధరలోన్- మేదినిలో। రాజద్గుణప్రక్రియన్। రా
జత్-ప్రకాశించుచున్న। గుణ-గాంభీర్యాదిగుణములయొక్క। ప్రక్రియన్-రీతిచేత। ఏరి-ఎ
వ్వరు॥ తా॥ సుందరుఁడైనట్టియు స్వచ్ఛమైనకీర్తి గలిగినట్టియు మంచికుమాళ్లు గలిగినట్టి
యు రామాచార్యునకు మంచిగుణములచే ఈలోకములో సాటికొప్పువారు ఎవ్వరును లేరు॥
॥ ౩౩ ॥ ఉ॥ చేపట్టెన్ సకలార్థిసంఘములలక్ష్మీయుక్తులై యుండగా। జూపట్టెన్ విభవం
బుచే విబుధరాజున్మించి దోశ్శక్తిచే। మోపట్టెన్ గుణయుక్తిధర్మ మరివైముఖ్యంబు వారింపు
చో। గోపాచార్యుఁడు సేతుశైలహిమవత్క్షోణీధ్రమధ్యంబునన్॥ టీ॥ గోపాచార్యుడు-
గోపాచార్యప్రభువు। సేతుశైలహిమవత్క్షోణీధ్రమధ్యంబునన్। సేతు-రామేశ్వరముదగ్గి
రనీలునివల్లసృష్టింపబడ్డవారధిదగ్గిరనున్న। శైల-మలయపుకొండయొక్కయు। హిమవ
త్క్షోణీధ్ర-హిమవత్పర్వతముయొక్కయు। మధ్యంబునన్- మధ్యప్రదేశమందు। సకలార్థి
సంఘములన్। సకల-సమస్తమైన। అర్థి-యాచకులయొక్క। సంఘములన్-సమూహముల
ను। లక్ష్మీయుక్తులై। లక్ష్మీ-ఐశ్వర్యముతో। యుక్తులై-కూడుకొనినవారై। యుండగాన్-యుం
డునట్లు। చేపట్టెన్-పరిగ్రహించెను। విభవంబుచేన్-వైభవముచేత। విబుధరాజున్మించి।
విబుధరాజున్-దేవేంద్రునిని। మించి-అతిక్రమించి। చూపట్టెన్-కానుపించెను। అరివైము
ఖ్యంబు। అరి-శత్రువులయొక్క। వైముఖ్యంబు-పెడమోముపెట్టుటను। వారింపుచోన్- ని
వారించునెడల। దోశ్శక్తిచేన్-భుజబలముచేత। గుణయుక్తిన్। గుణ-నారియొక్క। యు
క్తిన్-సంధానముచేత। ధర్మము-విల్లును। మోపట్టెన్-ఎక్కుపెట్టెను॥ తా॥ గోపా
చార్యప్రభువు మలయహిమాలయపర్యంతము సమస్తయాచకులను ధనవంతులనుగాఁ జేసె
ను వైభవముచేత దేవేంద్రునిమించెను శత్రువులతో సంగరము చేయునెడల భుజబలముచేత
ధనస్సునుఎక్కుపెట్టి శత్రువులనొంచి ఖ్యాతిని పొందెను॥
॥ ౩౪ శా॥ రామానూత్నమనోజుఁ డార్యనుతచర్యాశాలి శశ్వద్గృహా। రామక్షేత్రవితీ
ర్ణరక్షితసుపాత్రబ్రాహ్మణోత్తంసుఁడా। రామశ్రీనిధికిం జనించె హరహీరక్షీరతారాసుధా
రామస్వచ్ఛయశుండు సోమవిభుఁ డార్యానాథభక్త్యాఢ్యుఁడై॥ వారలయందు॥ టీ॥ రామా
నూత్నమనోజుడు। రామా-స్త్రీలకు। నూత్నమనోజుడు-క్రొత్తమన్మథుడును। ఆర్యనుతచ
ర్యాశాలి। ఆర్య-పెద్దలచేత। నుత-స్తుతించబడిన। చర్య-నడువడిచేత। శాలి-ఒప్పుచున్నట్టి
యు। శశ్వద్గృహారామక్షేత్రవితీర్ణరక్షితసుపాత్రబ్రాహ్మణోత్తంసుడు। శశ్వత్- మాటి
మాటికి। గృహ-యిండ్లు। ఆరామ-తోటలు। క్షేత్ర-పొలములు మొదలయినవాటిని। వితీర్ణ-
ఇచ్చుటచే। రక్షిత- పోషించబడిన। సుపాత్ర-యెన్నగతగిన। బ్రాహ్మణోత్తంసుడు-బ్రాహ్మ
ణశ్రేష్ఠులుకలిగినట్టియు। హరహీరక్షీరతారాసుధారామస్వచ్ఛయశుండు। హర-శివుని
వలె। హీర- రవల్వలె। క్షీర-పాలవలె। తార-చుక్కలవలె। సుధ-అమృతమువలె। రామ-
బలరామునివలె। స్వచ్ఛ- తెల్లనగు। యశుండు- కీర్తిగలట్టియు। సోమవిభుడు-సోమప్రభు
వు। ఆర్యానాథభక్త్యాఢ్యుడై। ఆర్యానాథ-శివునియొక్క। భక్తి-భక్తులలో। ఆఢ్యుడై- సంప
న్నుడై। రామశ్రీనిధికిన్- రామయసంపన్నునకు। జనించెన్-పుట్టెను॥ తా॥ సౌందర్య

శాలియు మించికీర్తిగలట్టియు శైవభక్తిగల సోమప్రభువు రామమహారాజునకుఁ బుత్రుఁడయ్యె

౩౫॥ శా॥ ఆరూఢోన్నతకీర్తి యత్రియనసూయాదేవియందుం బలెన్ । ధీరోదాత్తుఁ డతండు గాంచె ధరణీదేవీసమక్షాంతియా । వీరాంబామణి యందు బుత్రుల జగద్విఖ్యాతచారిత్రులన్ । గౌరీవల్లభ పాదపంకరుహకైంకర్యాధ్యులన్ మువ్వరన్ ॥ ✱ టీ॥ ఆరూఢోన్నతకీర్తి। అరూఢ -స్థిరమైన। ఉన్నత- గొప్పదియైన। కీర్తి- యశముగల। అత్రి- అత్రిమహాముని। అనసూయాదేవియందుంబలెన్ -అనసూయాదేవియందువలెను। ధీరోదాత్తుడు- ధీరోదాత్తనాయకుఁడైన। అతండు- ఆరామప్రభువు। ధరణీదేవీసమక్షాంతియా। ధరణీదేవి- భూదేవితో। సమ- సమానమైన। క్షాంతియా- ఓర్పుగల। వీరాంబామణియందు- వీరమ్మయందు। జగద్విఖ్యాతచారిత్రులన్। జగత్ - లోకములయందు। విఖ్యాత- ప్రసిద్ధమైన। చారిత్రులన్- చరిత్రలుగలట్టియు। గౌరీవల్లభపాదపంకరుహకైంకర్యాధ్యులన్। గౌరీవల్లభ- ఈశ్వరునియొక్క। పాదపంకరుహ- పాదపద్మములయొక్క। కైంకర్యాధ్యులన్- పూజాసంపత్తిగల। మువ్వరన్- ముగ్గురైన। పుత్రులన్- కొమరులను। కాంచెన్- కనెను॥ తా॥ అత్రిమహాముని అనసూయయందువలె రామప్రభువు వీరమ్మవలన ముగ్గురు ప్రసిద్ధులైన కుమారులను కనెను॥

౩౬॥ ఉ॥ వారలలోన నగ్రజుఁడవార్యయశోభరపూర్ణసేతుకే । దారనగోదయాస్త వసుధాధరమధ్యమహీస్థలుండు కే । దారవిభుండరివ్రజవిదారిభుజాపరితోషితాదిభూ । దారఫణీంద్ర దిక్తటరదావళుఁడై విలసిల్లె నెంతయున్ ॥ ✱ టీ॥ వారలలోన్- ఆముప్పురిలో। అగ్రజుఁడు- జ్యేష్ఠుడు। అవార్యయశోభరపూర్ణసేతుకేదారనగోదయాస్త వసుధాధరమధ్యమహీస్థలుండు। అవార్య- అడ్డములేని। యశోభర- విస్తారమైన కీర్తిచేత। పూర్ణ- నిండిన। సేతు- సేతువుయొక్క। కేదారనగ- కేదారపుకొండయొక్క। ఉదయాస్త వసుధాధర- పొడుపుగ్రుంకుకొండలయొక్క। మధ్యమహీస్థలుండు- నడిమిభూమిగల డునైన। కేదారవిభుండు- కేదారప్రభువు। అరివ్రజవిదారిభుజాపరితోషితాదిభూదారఫణీంద్ర దిక్తటరదావళుఁడై। అరివ్రజ- శత్రుసేనలను। విదారి- బద్దలుచేసెడు। భుజాపరితోషిత। భుజా- బాహువులచే। పరితోషిత -సంతోషపెట్టబడిన। ఫణీంద్ర- అదిశేషుపు। దిక్తటరదావళుడై- దిగ్గజములుగలవాడై। ఎంతయున్- మిక్కిలి। విలసిల్లెన్- ప్రకాశించెను॥ తా॥ కేదారమహారాజు శత్రువుల సంహరించుటచే శేషువ గైరాలకు బరువుదింపి ప్రకాశించెను

౩౭॥ క॥ ఆకేదారప్రభుమణి। రాకేందుముఖీలలామరమణీమణిరే। ఖాకమనీయ్యాం గన్నమాం। గైకొని నలువురను సుతుల గాంచెన్ బ్రేమన్॥ ✱ టీ॥ ఆకేదారప్రభుమణి- ఆకేదారప్రభుశ్రేష్ఠుడు। రాకేందుముఖీలలామన్। రాకేందుముఖీ- నిండుచందురునివంటిమోముగలస్త్రీలలో। లలామన్- బొట్టువంటియు। రమణీమణిన్- స్త్రీరత్నమైనటువంటియు। రేఖాకమనీయన్। రేఖా- సౌందర్యముచే। కమనీయయు- సొగసైనట్టియు। కన్నమన్। కన్నమాంబికను। ప్రేమన్- ప్రీతిచే। గైకొని - పెండ్లియాడి। నలువురనుసుతులన్- నలుగురుపుత్రులను। కనెన్- బడసెను॥ తా॥ కేదారమహారాజు సౌందర్యాదిగుణములుగల కన్నమాదేవిని పాణిగ్రహణము జేసికొని నలుగురుకుమార్లను కనియెను॥

౩౮॥ సీ॥ గంగాధర పదాబ్జభృంగాయమానాంత। రంగాన్వితుఁడు పెదలింగశౌరి। బాలాజనాత్మ పాంచాలాభినవరూప। లీలాధనుఁడు చిన్నలింగఘనుఁడు। హేమావనీధరోద్దామాతిధైర్యాభి। రామానుభావుండు సోమవిభుఁడు। దారుణాహవశత్రువారణవ్యూహవి। దారణసింహంబు వీరసుకృతి। శారదా శారదీశ్వర శారదాభ్ర। తారకా తార కాశ సితారవింద। హీరబృందసుధాహారహరిచందనాదికీర్తుల వెలసిరౌదార్యనిధులు॥ * టీ॥ ఔదార్యనిధులు। ఔదార్య-త్యాగమునకు। నిధులు-గనులైనట్టియు। గంగాధరపదాబ్జభృంగాయమానాంతరంగాన్వితుఁడు। గంగాధర-గంగను ధరించిన శివుని యొక్క। పాదాబ్జ-పాదపద్మములకు। భృంగాయమాన-తుమ్మెదైన। అంతరంగ-మనస్సుతో। అన్వితుఁడు-కూడుకొనినవాఁడైన। పెదలింగశౌరి-పెదలింగప్రభువును। బాలాజనాత్మపాంచాలాభినవరూపలీలాధనుఁడు। బాలాజన-స్త్రీజనుల యొక్క। ఆత్మ-మనస్సులకు। పాంచాల-పాంచాలనాయకుని యొక్క। అభినవ-క్రొత్తదియగు। రూప-స్వరూపము యొక్క। లీలా-విలాసము లే। ధనుఁడు-ధనముగాఁ గలవాఁడైన। చిన్నలింగఘనుఁడు-చినలింగమహాత్ముఁడును। హేమావనీధరోద్దామాతిధైర్యాభిరామానుభావుండు। హేమావనీధర-మహామేరువువలె। ఉద్దామ-ఉత్కటమైన। అతి-గొప్పదియగు। ధైర్య-ధైర్యముచే। అభిరామ-మనోహరమైన। అనుభావుఁడు-ప్రభావము గలవాఁడునగు। సోమవిభుఁడు-సోమభూపతియును। దారుణాహవశత్రువారణవ్యూహవిదారణసింహంబు। దారుణ-భయంకరములైన। ఆహవ-యుద్ధములయందు। శత్రు-విరోధులవైన। వారణ-ఏనుఁగుల యొక్క। వ్యూహ-సమూహమును। విదారణ-భేదించునెడల। సింహంబు-సింహమువంటి। వీరసుకృతి-వీరయప్రభువును। శారదా శారదీశ్వర శారదాభ్ర తారకా తార కాశ సితారవింద హీరబృందసుధాహారహరిచందనాదికీర్తులన్। శారద-సరస్వతి। శారదీశ్వర-సరస్వతీపతియగు బ్రహ్మయు। శారద-శరత్కాలమందైన। అభ్ర-మేఘము। తారక-చుక్కలు। తార-వెండి। కాశ-రెల్లుపువ్వులు। సితారవింద-తెల్లదామరపువ్వులు। హీర-రవ్వల యొక్క। బృంద-సమూహము। సుధా-అమృతము। హార-ముత్యపుసరులు। హరిచందన-మంచిగంధము। ఆది-మొదలయినవాటివంటి। కీర్తులన్-యశస్సులచే। వెలసిరి-ప్రకాశించిరి॥ తా॥ పెదలింగాచార్యప్రభు శివపూజాధురంధరుఁడును చినలింగాచార్యప్రభువు మిక్కిలి చక్కనివాఁడును సోమనాథాచార్యప్రభువు గొప్పధైర్యము గలవాఁడును వీరయాచార్యప్రభువు మిక్కిలి ప్రతాపము గలవాఁడును ఈ నలుగురు దాతృత్వమున సముద్రులు॥

౩౯॥ ఉ॥ మందరగోత్రధీరుఁ డసమానయశోనిధి దండపాణి బాలేందుధరాంఘ్రివారిరుహభృంగవతంసము పెద్దమాంబికా। చందనగంధి పెండ్లియయి సజ్జనవీరయసత్కుమారుఁ గాంచె నంచితకీర్తి గైకొనినయట్టిధురంధరుఁ గాంచె వేడుకన్॥ * టీ॥ మందరగోత్రధీరుఁడు। మందరగోత్ర-మందరపర్వతమువలె। ధీరుఁడు-ధైర్యము గలవాఁడును। అసమానయశోనిధి। అసమాన-సాటిలేని। యశోనిధి-కీర్తికి రాశియును। బాలేందుధరాంఘ్రివారిరుహభృంగవతంసము। బాలేందుధర-మహేశ్వరుని యొక్క। అంఘ్రి-పాదపంకజములకు। భృంగవతంసము-మంచితుమ్మెదయైనట్టియు। దండపాణి-దండపాణ్యాచార్యప్రభువు। పెద్దమాంబికా చందనగంధిన్-పెద్దమాంబికాదేవిని। పెండ్లియయి-వివాహము చేసికొని। సజ్జనున్-మంచివా

లైనట్టియు। చెన్నొందినకీర్తికై కొనినయట్టిధురంధురుఁ। చెన్నొందిన-సొగసైన। కీర్తి - కీర్తిని కైకొనిన-చేకొనినట్టువంటి। ధురంధరుఁ-ధురంధరుఁడైనట్టి। వీరయనత్కుమారుఁ। వీరయ-వీరాచార్యులను। సత్కుమారుఁ-మంచికొమరుని। వేదుకఁ. సంతోషముచే। కాంచెఁ-కనెను. తా। ధైర్యవంతుఁడును శివభక్తిపరుఁడు నగు దండపాణీశ్వరుఁడు పెద్దమాంబికయందు వీరయాచార్యులనుకీర్తివంతుఁడైనపుత్త్రునిబడసెను।

౪౦। క। ఆకేదారియుదండపాణియుశుభవ్యాపారధర్మైకవిద్యాకల్పుల్సహజన్ములైతనరఁబూర్ణానందసౌభాగ్యులై। లోకాలోకమహీధరావృతమహీలోకంబునందుంశర। ద్రాకాచంద్రికవంటికీర్తిగని మార్కండేయుఁడొప్పెసిరిఁ। టీ। మార్కండేయుండు-మార్కండేయ। ప్రభువు। శుభవ్యాపారధర్మైకవిద్యాకల్పుల్। శుభ- మంగళకరములైన। వ్యాపారధర్మ-ఉద్యోగధర్మములచే। ఏక-ముఖ్యమైన। విద్య-నీతివిద్యే। ఆకల్పుల్-భూషణముగాఁగలిగినట్టి। కేదారియు- కేదారప్రభువును। దండపాణియు-దండపాణీశ్వరుఁడును। సహజన్ములై-తమ్ములై। తనరఁ-ఒప్పుగా। పూర్ణానందసౌభాగ్యులై। పూర్ణ-నిండైన। ఆనంద-సంతోషమును। సౌభాగ్యుఁడు-సుభగత్వమును కలవాఁడు। ఐ-అయి। లోకాలోకమహీధరావృతమహీలోకంబునందుఁ। లోకాలోక-చక్రవాళమను। మహీధర-పర్వతముచే। ఆవృత-ఆక్రమించబడిన। మహీలోకంబునందు-భూలోకమందు। శరద్రాకాచంద్రికవంటి। శరత్ -శరత్కాలముయొక్క। రాక-నిండుపున్నమినాటి। చంద్రికవంటి-వెన్నెలవంటి। కీర్తిఁ-ఖ్యాతిని। కని-పొంది। సిరి-సంపదచే। ఒప్పెఁ-ప్రకాశించెను। తా। మార్కండేయప్రభువు కేదారిదండపాణులనుతమ్ములతోఁకూడినవాఁడై గొప్పయశమును పొంది సంపదచే ప్రకాశించెను।

౪౧। శా। శ్రీనీలావసుధాధరల జీవాత్ముఁడుద్వాహమై। తానింపొందినరీతివీరమను కాంతారత్నముఁ విస్సమాం। బానాళీకనిభేక్షణంగురవమాంబాభామినింబెల్లియై। త్మానాథస్తవనియ్యుఁడై వెలసెమార్కండేయుఁడుద్యత్ప్రభఁ। టీ। శ్రీనీలావసుధాధరలఁ। శ్రీ-శ్రీదేవి। నీలా-నీలాదేవి। వసుధా-భూదేవియనెడు। సుధాధరలఁ। సుధా -అమృతము। అధరలఁ- మోవియందుగలస్త్రీలను। రాజీవాక్షుఁడు- పద్మములవంటికన్నులుగలవిష్ణువు। ఉద్వాహమై-పెండ్లియై। తాను-తాను। ఇంపొందినరీతిఁ -సొంపునుపొందినట్లు। మార్కండేయుఁడు-మార్కండేయమహారాజు। కాంతారత్నముఁ-స్త్రీలలోశ్రేష్ఠమైన। వీరమను-వీరమ్మనును। విస్సమాంబానాళీకనిభేక్షణఁ। విస్సమాంబ-విస్సమ్మయనెడు। నాళీకనిభేక్షణఁ- పద్మములవంటికన్నులుగలస్త్రీని। గురవమాంబాభామినిఁ-గురవమ్మనును। పెండ్లియై- పెండిలిచేసికొని। త్మానాథస్తవనియ్యుఁడై। త్మానాథ-దూతలచే। స్తవనియ్యుఁడై-కీర్తించతగినవాఁడై। ప్రభఁ-కాంతిచే। వెలసెఁ- ప్రకాశించెను। తా। విష్ణుమూర్తి శ్రీనీలాదేవులను పెండ్లియాడినట్లు మార్కండేయప్రభువు వీరమ్మ విస్సమ్మ గురవమ్మలను పెండ్లియాడి ప్రకాశించెను।

౪౨। క। వీరల్మువ్వురయందు నాద్యయగునవ్వీరాంబకుంబుట్టిబ। ద్వారాయుండను బ్రవిస్సమకుఁ పార్వంబొప్పజన్మించిర। జ్ఞాఁధన్యతిచంద్రశేఖరుఁడనఁ బ్రాజ్ఞుండు బుత్త్రుండుఁ। న్యారత్నంబును చంద్రశేఖరమయాఖ్యవ్యాంగివీరమ్మయుఁ। టీ। వీరల్మువ్వురయందుఁ-ఈముగ్గురలోను। ఆద్య-మొదటిది। అగు-ఐన-వీరాంబకుఁ -వీరమ్మకు। బద్వారాయుండు-బ

నట్లంతటనిండు తద్గృహసమావృతిసాలములంకరింపుచుఁ॥ *టీ॥ ధవళేశ్వరసోమయమారుకందుధీమంతుని। ధవళేశ్వరపుసోమనాథపుత్రుడైన మార్కండేయవిద్వత్ప్రభువుయొక్క। రాజ్యభారము-రాజ్యాతిశయమును। సమగ్రవిభూతియు-సంపూర్ణమైనఐశ్వర్యమును। ఎంతనియెన్నవచ్చుఁ-యెంతనియెంచవచ్చును। సర్వమంత్రిసామంతులయందలంబులె। సర్వమంత్రి-సమస్తమైనప్రధానులయొక్కయు। సామంతుల-సాటిదొరలయొక్కయు। యందలంబులె-పల్లకీలె। చమత్కృతిబారగఁ-సొగసుగరాగను। కేతుదీర్చినట్లు-తోరణముగట్టినట్టు। తద్గృహసమావృతిసాలముఁ। తత్-ఆమార్కండేయప్రభువుయొక్క। గృహ-నగరునకు। సమావృతిసాలము। ఆవరణమైనకోటను। అలంకరింపుచుఁ-శృంగారముచేయుచు అంతటనిండుఁ। అంతట-ఎల్లెడల। నిండుఁ-నిండియుండును॥ తా॥ మనవినిమిత్తమునకువచ్చినమంత్రులయునరిదొరలయు పల్లకీలే కోటచుట్టును తోరణముగట్టినట్లుండు టవలన మార్కండేయమహారాజుయొక్క వైభమునువర్ణించుటయలవికాదు॥

కం సీ॥ లక్ష్యమానీసత్కులప్రసూతకరుంధ। తియుయగ్రకులజమైతనరెనేని। జోడుగాయిలసద్ద్విడావతికినవ। సూయయించుకలజ్జదోయదేని। మెనయుగునీజీవితేశానుపాయని। కిలసుతవరగృహంబెరుగదేని। ప్రతివచ్చునీశాంతమతికిపార్వతిచండి। కానామధేయంబుబూనదేని। యనగశుభలక్షణగుణంబులందు వెలసె। నౌరధవళేశ్వరపురవరాన్వయాంబు। జాతశుద్ధాంతవాసినిసంతతాన్న। దానపరితోషితార్థిబాంధవకదంబ। గురుతరనితంబ మార్కండుగురవమాంబా॥ *టీ॥ అరుంధతియు-అరుంధతీదేవియును। అగ్రకులజమై-బ్రాహ్మణకులమందుపుట్టినదై। తనరెనేని-ఒప్పినట్టయితే। ఈసత్కుల ప్రసూతకుంమంచికులమందుపుట్టినఈమెకు। అత్న్యమాను-సరియాను। అనసూయ-అనసూయాదేవి। యించుకలజ్జఁ-కొంచెపుసిగ్గును। తోయదేని-విడిచిపెట్టినదైతే। ఈలసద్ద్విడావతికిఁ-మంచిసిగ్గుగలయీమెకు। జోడుగా-సమానమాను। ఇలసుత-భూపుత్రికయైనసీతాదేవి। వరగృహంబు-యితరులయిల్లును। ఎరుగదేని-ఎరుగకపోయినట్టయితే। ఈజీవితేశానుపాయినికి-పెనిమిటినివిడదాయనియీమెకు। ఎనయగుఁ-సాటియగును। పార్వతి-గౌరీదేవి। చండికానామధేయంబుఁ-కోపముగలదియనుపేరును। పూనదేని-తాల్చనిదైతే। ఈశాంతమతికి-ఈశాంతురాలికి। ప్రతివచ్చుఁ-సరివచ్చును। అనగఁ-అనునట్లు। ధవళేశ్వరపురవరాన్వయాంబుజాతశుద్ధాంతవాసిని। ధవళేశ్వరపురవరాన్వయ-ధవళేశ్వరవరవంశముకు। అంబుజాతశుద్ధాంతవాసిని-పద్మాలయమైనలక్ష్మీవంటిదియు। సంతతాన్నదానపరితోషితార్థిబాంధవకదంబ సంతత-ఎల్లప్పుడు। అన్నదాన-అన్నప్రదానముచే। పరితోషిత-సంతోషపెట్టబడిన। అర్థి-యాచకులయు। బాంధవ-చుట్టములయు। కదంబ-గుంపులుగలదియు। గురుతరనితంబ-పెద్దపిరుదుకట్టుగలదియునైన। మార్కండుగురవమాంబ-మార్కండేయప్రభువుయొక్క-భార్యయగుగురవమ్మ। శుభలక్షణగుణంబులఁ। శుభలక్షణ-శుభచిహ్నలచేతను। గుణ-దాతృత్వాదిగుణములచేతను। వెలసెఁ-ప్రకాశించెను। ఔరా-ఆశ్చర్యము॥ తా॥ శుభలక్షణములుగలమార్కండేయప్రభువుయొక్క భార్యయగు గురవమ్మకు అరుంధతీదేవియు అనసూయయు సీతాదేవియు పార్వతీదేవియు ఆయాచెమసంగతులులేనియెడలసాటికివచ్చెదరు॥

౪౭ సీ॥ క్షమయందు ధూకాంత సౌందర్యమున రతి। నాత్మజసామగ్రి నదితి సుదతి। పతిచే నరుంధతి బహుభోగమున శచి। యఖిలపోషణశక్తి నన్నపూర్ణ। సువ్రతంబున సీత శుభగుణంబుల లక్ష్మి। పావనత్వమున గంగావధూటి। మహిమచే ననసూయ మతిచే సరస్వతి। సర్వలక్షణముల శైలతనయ। యనగ నుభయాన్వయములందు నమితగరిమ। మిరె ధవళేశ్వర పురీశ మారుకొండు। శౌరికులపాలికావతంసంబు విబుధ। వినుతసద్గుణనికురుంబ విస్సమాంబ॥ టీ॥ ధవళేశ్వరపురీశమారుకొండుశౌరికులపాలికావతంసంబు। ధవళేశ్వరపుర-ధవళేశ్వరపురవంశమునకు। ఈశ-నాయకుడైన। మారుకొండుశౌరి। మార్కండేయశౌరిని యొక్క। కులపాలికా-వంశవర్ధనకరు। అవతంసంబు-శిరోభూషణమైనట్టియు। విబుధవినుతసద్గుణనికురుంబ। విబుధ-విద్వాంసులచేత। వినుత-కొనియాడబడిన। సద్గుణ-పాతివ్రత్యాది సుగుణముల యొక్క। నికురుంబ-సమూహము గల్గినట్టియు। విస్సమాంబ-విస్సమ్మ। క్షమయందు ధూకాంత। క్షమయందున్-ఓరిమియందు। ధూకాంత ధూదేవియు। సౌందర్యమునన్-సొగసుచే। రతి-మన్మథుని భార్యయు। ఆత్మజసామగ్రిన్-పుత్రసంపత్తిచే। అదితిసుదతి-అదితి యనెడి రత్నగర్భము। పతిచేన్-పెనిమిటి యొక్క అనుకూలముచేత। అరుంధతియు-వసిష్ఠుని భార్యయును। బహుభోగమునన్-మంచిసుఖముచేత। శచియు-దేవేంద్రుని భార్యయును। అఖిలపోషణశక్తిన్-అందరిని కాపాడు రీతిచే। అన్నపూర్ణ-అన్నపూర్ణయు। సువ్రతంబునన్-మంచి నియతిచేత। సీత-సీతాదేవియు। శుభగుణంబులన్- మంచిగుణములచేత। లక్ష్మి శ్రీమహాలక్ష్మియు। పావనత్వమునన్-పవిత్రతచే। గంగావధూటి-గంగాభవానియును। మహిమచేన్-ప్రభావముచే। అనసూయ-అత్రిముని భార్యయు। మతిచే-బుద్ధిచేత। సరస్వతి-భారతియు। సర్వలక్షణములన్-అన్ని చిన్నెలచేతను। శైలతనయ-పార్వతీదేవి। అనగన్-అననటుల। ఉభయాన్వయములందున్। ఉభయ-రెండైన। అన్వయములందున్-పుట్టినమెట్టిన వంశములయందు। అమితగరిమన్। అమిత-హద్దులేని। గరిమన్- గొప్పచే। మిరె-విస్తరించెను॥ తా॥ మార్కండేయప్రభునకు పత్నియైన విస్సమ్మ క్షమాదిగుణసంపత్తిచే ధరాదేవి మొదలైనవారి గుణములు గలదియై యుభయవంశములకు ప్రతిష్ఠ తెచ్చినదై ప్రకాశించెను॥

౪౮ ఉ॥ పారావారము మేరగా గల్గు భూభాగంబుపైనున్న యూ। రూరం గూపములుం దటాకములు రమ్యోద్యానవంతుల్ మహా। గారంబుల్ నిరతాన్నసత్రములు నాకల్పంబుగా నిల్పె నౌరౌరా। సోమయమారుకొండు ఘనపుణ్యం బెన్నగా శక్యమే॥ టీ॥ సోమయమారుకొండు-సోమయప్రభుకుమారుడగు మార్కండేయప్రభువు। పారావారము - సముద్రము। మేరగాగలుగు-ఎల్లగా గలిగిన। భూభాగంబుపైన్ -పుడమితునకపైని। ఉన్న-ఉన్నట్టి। యూరూరన్-ప్రతిగ్రామమందును। కూపములున్-బావులును। తటాకములున్-చెరువులను। రమ్యోద్యానవంతుల్-మంచితోటలచాళ్లును। మహాగారంబుల్-సంన్యాసుల యిండ్లను। నిరతాన్నసత్రముల్- ఎప్పుడు అన్నము పెట్టెడి సత్రములను। ఆకల్పంబుగాన్-చంద్రసూర్యు లుందుదనుక। నిల్పెన్-ఒనరించెను। ఔరౌరా - ఆహాహా। పుణ్యము-గొప్పసుకృతము। ఎన్నగాన్-ఎంచుటకు। శక్యమే-తరమా నా॥ తా॥ అన్ని యూళ్లలోను బావులు మొదలైనవాటిని యేర్పరచిన మార్కండేయప్రభువు యొక్క పుణ్యము ఇంతంతని చెప్పనలవి కాదు॥

౭౯॥ సీ॥ కోటయేవీటికి మేటియై మిక్కిలి। జూపట్టుచక్రనిజుట్టుగట్టు। క్రీడాద్రులేపురికి నిసప్తకులపర్వ। తములును మేరుమందరనగములు। బొడ్డనబావులేపుటభేదనంబున। కమృతాబ్ధిముఖ్యరత్నాకరములు। రవిసోమవీధులేరాజధానికిప్రసి। ద్ధిగను నేబదియారుదేశములును। పరమమగునట్టిపెండోటపురవరమున। కధిపతిశిరోవతంసమైయలరెసకల। కళలధవళేశ్వరపురవిఖ్యాతుడైన। గురుతరయశోధనుండు మార్కండుఘనుడు॥ ✲టీ॥ కోట-ప్రాకారము। ఏవీటికి-ఏపురమునకు। మేటియై-శ్రేష్ఠమై। కనుపట్టు కానబడెడు। చుట్టుగట్టు-చక్రవాళాచలము। క్రీడాద్రులు-ఆటకొండలు। ఏపురికిని-ఏపట్టణమునకు। సప్తకులపర్వతములు। సప్త-ఏడగు। కులపర్వతములు-కులాచలములును। మేరుమందరనగములు-మేరుమందరపర్వతములు। ఏపుటభేదనంబునకు-ఏ రాజధానికి। బొడ్డనబావులు-తల్లివరగలనూతులు। అమృతాబ్ధిముఖ్యరత్నాకరములు-అమృతాబ్ధి- పాలసముద్రము। ముఖ్య- మొదలగు। రత్నాకరములు-సముద్రములు। ఏ రాజధానికి-ఏనగరమునకు। రవిసోమవీధులు-సూర్యచంద్రవీధులు-ప్రసిద్ధిగను- ప్రఖ్యాతిగల। ఏబదియారుదేశములును। ఏబదియారు- అయిదుపదులయారు నాములు। పరమమగునట్టిపెండోటవరపురమునకు-శ్రేష్ఠమైన పెండోటయనుమంచిపట్టణమునకు। అధిపతిశిరోవతంసమై-ప్రభువులలోశిరోభూషణమై- ధవళేశ్వరపురవిఖ్యాతుడైన -ధవళేశ్వరపురవంశప్రసిద్ధుడైన। గురుతరయశోధనుండు-మిక్కిలిగొప్పదియగుకీర్తియే ధనము గాగల। మార్కండుఘనుడు-మార్కండేయమహీపతి। సకలకళలన్-సమస్తవిద్యలచేత। అలరెన్-ప్రకాశించెను॥ తా॥ ధవళేశ్వరపు మార్కండేయమహారాజు చక్రవాళపర్వతమువంటికోటయు మేరుమందరసప్తకులపర్వతములవంటిక్రీడాపుకొండలును సముద్రములవంటిబొడ్డునూతులును ఏబదియారుదేశములవలెఅనేకప్రజలుగలరాజమార్గములునుకలిగిన పెండోటమహారాజధానికిప్రభువైప్రకాశించెను॥

౮౦॥ సీ॥ పెండోటపురవరమందు గాపురముండు। విశ్వకర్మావనీవిబుధవరులు। శ్రీమార్కకొండధరిత్రీవరాగ్ర। గణ్యప్రదత్తవిఖ్యాతములగు। నగ్రహారాదిసమగ్రసుస్వాస్థ్యా। కములుగన్గొటచేతకలిమిగాంచి। వేదశాస్త్రాదికవిద్యలుజదివిన। వ్యజ్ఞానసంపత్తిన తిశయిల్లి। సకలయజ్ఞంబులసరవితోగావించి। నిరతాగ్నిహోతులైనెగడుచుండి। సురవిభూమహూపనిశ్శబ్ద। ద్వసనిగుణిని। ధిక్కరించి యునిర్గతవిశీర్ణమహిమధైర్య మునజారిదారిలదంతు. జేసిబ్రహ్మణ్యులైరియాస్థిగనుస్థిరతా॥ ✲టీ॥ పెండోటపురవరమందు- పెండోటపురశ్రేష్ఠమందు। గాపురముండు-నివసించియున్న। విశ్వకర్మావనీవిబుధవరులు। విశ్వకర్మ-విశ్వకర్మయొక్క-ముఖమందు పుట్టిన। అవనీవిబుధవరులు। అవనీవిబుధ-భూదేవతలైన బ్రాహ్మణులలో। వరులు-శ్రేష్ఠులైనవిశ్వబ్రాహ్మణులు। శ్రీమార్కకొండధరిత్రీవరాగ్రగణ్యప్రదత్తవిఖ్యాతములు। శ్రీ-శోభాయుక్తుడైన। మార్కకొండు-మార్కండేయుడను। ధరిత్రీవర-భూపతులలో। అగ్రగణ్య-ముందులెక్కించతగిన అనగా ప్రభుశిఖామణిచేత। ప్రదత్త-యివ్వబడినట్టియు। విఖ్యాతములును-ప్రసిద్ధములైనట్టియు। అగ్రహారాదిసమగ్రసుస్వాస్థ్యాధికములు। అగ్రహార-అగ్రహారసాంజ్ఞగల గ్రామములు। ఆది-మొదలగు। సమగ్ర-ఫలభరితములై సస్యగర్భములైన। సు- మంచివైన। స్వాస్థ్య-భూములు। అధికములు

గృహాము మొదలగునవి। కల్గుట చేత-వచ్చుట చేత। కలిమి గాంచి। కలిమి-ఐశ్వర్యమును। కాంచి-పొంది। వేదశాస్త్రాదికవిద్యలు। వేద- వేదములు। శాస్త్ర-శాస్త్రములు। అదిక-మొదలుగాగల। విద్యలు విద్యలు। చదివి- నేర్చి। దివ్యజ్ఞానసంపత్తిన్-దివ్య-యోగ్యమైన। జ్ఞాన-తత్వజ్ఞానముయొక్క। సంపత్తిన్-సమృద్ధిచే। అతిశయిల్లి-గురుత్వమునొంది। సకలయజ్ఞంబులన్ సకల-సమస్తమైన। యజ్ఞంబులన్-సర్వతోముఖాదిక్రతువులను। సరవితోన్-క్రమముతో। కావించి-చేసి। నిరతాగ్నిహోత్రులై। నిరత-అవిచ్ఛిన్నములైన। అగ్నిహోత్రులై-గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులుగలవారలై। నెగడుచుండి- ఒప్పుచుండి। సురపితామహునిని। సుర-దేవతలకు। పితామహునిని- తాతయైనబ్రహ్మదేవునిని। శతాధ్వరునిని। శత-నూరగు। అధ్వరుని- యాగములుకలిగినదేవేంద్రునిని। గురుని-బృహస్పత్యాచార్యులనును। ధిక్కరించియు-తిరస్కరించియు। నిరతవితీర్ణిమహిమన్-నిరత-నిరంతరమైన। వితీర్ణి. దాతృత్వముయొక్క। మహిమన్-ప్రభావముచేతనను। ధైర్యమునన్-ధీరతచేతనను। వారిదాద్రులన్। వారిద- జీమూతవాహునిని। అద్రులన్-హిమాలయమునను। తలకిందులన్-తల్లడించులాగున। చేసి-ఒనర్చి। యీస్థిన్-యీపుడమియందు। స్థిరతన్-స్థిరత్వముచే। బ్రహ్మణ్యులు-బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు। ఐరి-సర్వోత్కర్షచేతప్రవర్తించిరి॥ తా॥ పెందోటపురనివాసులైనవిశ్వబ్రాహ్మణులుమార్కండేయప్రభువరునిచేతసత్కరించబడినవారలైవేదాదివిద్యలుచదివినిరతాగ్నిహోత్రులైవిద్యాసంపత్తిచేతనుక్రత్వాచరణముచేతనుజ్ఞానఘనతచేతనుధీరతచేతనుబ్రహ్మేంద్రగురులనునిరాకరించిదాతృత్వముచేతనుధీరతచేతనుమేఘహిమాలయములనుతృణీకరించిబ్రహ్మణ్యమూర్తులైస్థిరులైయుండిరి॥

౫౧॥ క॥ సురరాణ్మేచకమేఘమున్ ఘనతమైజోడైమహీభృత్సభం। జిరభోగంబుననెంచిజూచినవరక్షీరోదకశ్లాఘ్యవైఖరి దానైకకళావిశేషకలనాకల్యాణసౌభాగ్యచాతురిసోమప్రభుమారుకండువిభవేంద్రుంబోలగానేర్చునే॥ టీ॥ సురరాణ్మేచకమేఘమున్। సురరాణ్మేచక-ఇంద్రనీలమణులవంటికాంతిగల। మేఘమున్-మబ్బు। ఘనతమై-ఘనతచేత। జోడై-ఎదిరించినదై। మహీభృత్సభన్। మహీభృత్-రాజులయొక్క-సభన్-సభయందును కొండలమీదను। చిరభోగంబునన్। చిర-తడవుండెడు. భోగంబునన్-వైభముచేతను। ఎంచిచూచినన్-లెక్కించిచూడగా। వరక్షీరోదకశ్లాఘ్యవైఖరి। వర-శ్రేష్ఠమైన। క్షీరోదక। క్షీర-పాలచే। ఉదక-నీరుచే। శ్లాఘ్య.కొనియాడతగిన। వైఖరి-రీతిగల। దానైకకళావిశేషకలనాకల్యాణసౌభాగ్యచాతురిన్। దాన-ఇచ్చుటచే। ఏక-ముఖ్యమైన। కళావిశేష-విద్యావిశేషముయొక్క। కలనా-నేర్పుచేతను। కల్యాణ-శుభకరమైన। సౌభాగ్య-శుభగత్వముయొక్క। చాతురి-చతురతగల। సోమప్రభుమారుకండు-సోమనాధునకు కొమారుడైనమార్కండేయప్రభువను। విభవేంద్రున్-వైభవబిడౌజునిని। పోలగానేర్చునే-సాటికిరాగలదా॥ తా॥ దాతయనెడుమేఘుడుఘనుడనుపేరుగల్గుటచేసమర్థుడైననురాజసభలయందునకొండలయందును యోచించిచూడగాతడవుండెడుకలిమియుపాలిచ్చుటయులేనివాడౌట కతనస్థిరసంపదగ్గలిగినట్టియుపాలతోనీటితోదానమిచ్చెడుమార్కండేయప్రభువుతోసాటిజేయతగడు॥

౫౨॥ సీ॥ సకలదివ్యారామసాలనిర్వాహకా। వార్యధుర్యుడుదాతయగుటయరుదె। యు

తులగోకర్ణముఖ్యక్షేత్రపూర్ణభవ్యయశుండుమతిమంతుడగుటయరుదె । ఘనచిదంబరధామజనునుతాచార్యుడు । ద్యుతశీలవిఖ్యాతుడగుటయరుదె। శ్రీశైలనాయకార్జితనవ్యధృతిశాలి । యరయమహోన్నతుండగుటయరుదె। యనుచువర్ణించమించెవిద్యానవద్యహృద్యవిద్వజ్జనానీకహితకరుండు । నాధవళేశ్వరపురవిఖ్యాతుడైన। గురుతరగుణవిహారిమార్కండుశౌరి ॥ టీ॥ సకలవిద్యారామసాలనిర్వాహకౌదార్యధుర్యుడు ॥ సకల-సమస్తములైన । దివ్య-స్వర్గమందలి । ఆరామ-తోటలలో । సాల-మందారములు మొదలగుచెట్లయొక్క । నిర్వాహక-సమర్థమైన । ఔదార్య-దాతృత్వమునకు । ధుర్యుడు-భారవాహియైనవాడు । దాతయగుట-యాచకులకు ఇచ్చువాడగుట । అరుదె-అచ్చెరువా । అతులగోకర్ణముఖ్యక్షేత్రపూర్ణభవ్యయశుండు । అతుల-సాటిలేని । గోకర్ణ గోకర్ణము । ముఖ్య-మొదలైన । క్షేత్ర-పుణ్యస్థలములందు । పూర్ణ-నిండిన । భవ్య-శుభకరమగు । యశుండు-ఖ్యాతిగలవాడు । మతిమంతుడు-బుద్ధిమంతుడు । అగుట-అవడము । అరుదె-అబ్బురమా । ఘనచిదంబరధామజనసుతాచార్యుడు । ఘన-గొప్పదియగు । చిదంబరధామ-చిదంబరక్షేత్రప్రదేశమందు । జన-ప్రజలచేత । నుత-కొనియాడబడిన । ఆచార్యుడు-నడతగవాడు । ద్యుతశీలవిఖ్యాతుడు । ద్యుత-ఉద్యుక్తమైన । శీల-సదాచారసంపత్తిచే । విఖ్యాతుడు-తెలియబడినవాడు । అగుట-అయ్యుండుట । అరుదె-వింతా శ్రీశైలనాయకార్జితనవ్యధృతిశాలి । శ్రీశైలనాయక-మల్లికార్జునస్వామిచే । ఆర్జిత-పొందించబడిన । నవ-నూతనమైన । ధృతి-ధైర్యముచే । శాలి-యొప్పుచున్నవాడు । అరయఁగ-ఆలోచించగా । మహోన్నతుండు-మిక్కిలిగొప్పవాడు । అగుట-కావుట । అరుదె-చిత్రమా । అనుచుఁ-ఈరీతినిపలుకుచు । వర్ణించఁగ - వర్ణనలుచేయఁగ । విద్యానవద్యహృద్యవిద్వజ్జనానీకహితకరుండు । విద్య-సకలశాస్త్రములచేత । అనవద్య-దోషములుగాని । హృద్య-మనోహరులైన । విద్వజ్జన-పండితులయొక్క । అనీక-సంఘములకు । హితకరుండు-మేలుచేయువాడును । ధవళేశ్వరపురవిఖ్యాతుడు । ధవళేశ్వరపుర-ధవళేశ్వరపురమందు । విఖ్యాతుడు-పేరుపొందినట్టియు । గురుతరగుణవిహారి । గురుతర-మిక్కిలిగొప్పవియగు । గుణ-గుణములచే । విహారి-సంచరించుచున్నట్టియు । మార్కండుశౌరి-మార్కండేయధీరాగ్రేసరుడు । మించెఁ- వర్ధిల్లెను ॥ తా । ధవళేశ్వరపుమార్కండేయమహీనాధుడుదాతృత్వముగలవాఁడును పుణ్యక్షేత్రములయందువ్యాపించినకీర్తిగలవాడును గొప్పవాడును అవుటచేత వినుతిసేయఁ నెగడెను ॥

క ౩ ॥ ఉ ॥ చెప్పకుపూర్వదాతలప్రసిద్ధులు గానుగలిల్లమాడలం । గుప్పెనవారిసత్కవులుగోరినకోర్కికివెగ్గలంబుమున్నిప్పుడు జెప్పిజూపనుసమిద్ధయశోనిధియై ప్రసూరుకొండప్పనిసాటిసేయనాకర్ణైవగలండెవదాన్యుఁ డుర్విలోఁ ॥ టీ ॥ పూర్వదాతలప్రసిద్ధు । పూర్వపుదాతల-పూర్వపుదాతలయొక్క । ప్రసిద్ధులు-ప్రఖ్యాతులను । చెప్ప -చెప్పవద్దు । సత్కవులకోరినకోర్కికివెగ్గలంబు । సత్-శ్రేష్ఠులైన । కవులు-కవీశ్వరులు । కోరినకోర్కికి-కోరినదానికంటె । వెగ్గలంబు-అతిశయముగ । అవారి-కొల్లగా । గానుగలిల్లమాడలన్ । గానుగలిల్లు-టంకసాలలయందలి । మాడలన్-ధనములను । గుప్పెన్-వెదచల్లెను । మున్ను-మునుపు । ఇప్పుడు-ఈకాలమందును చెప్పిచూపను-పలికిచూపించుటకును । సమిద్ధయశోనిధియైనమారు సాటిసేయన్ । సమిద్ధ-ప్రసిద్ధమైన । యశః-కీర్తికి । నిధియై-ఆశ్రయమై

జప్పని-మార్కండేయధరారమణునితో॥సాటిసేయన్-పోల్చుటకును।ఉర్విలోన్-ధారుణిం।ఒకడైనవదాన్యుడు-ఒక్కదాతయైనను।కలండే-ఉండెనా॥ మార్కండేయమహారాజు కవులకు పంచిపెట్టుటకు టంకసాలలు వేయించి వారు అడిగినవాటికంటె యెక్కువగా వరాలు కూడలు ఇచ్చినందున పూర్వము ఇప్పుడు యెవ్వరును ఈలాగున నివ్వలేదు॥

౫౭॥ఉ॥ఏయెడనెయ్యురంవదలడేమఱండార్తజనైకరక్షవి। ద్యాయతనంబుధైర్యమునకాకరమార్యజనంబుకోరిరా।జేయుపరోపకారియువిశిష్టచరిత్రుఁడుదారధీరలీ।లాయుతమారుకొండఘనుడమ్మహిమేటికిసాటిలేరిలన్॥ టీ॥ విద్యాయతనంబు।విద్య-విద్యలకు।ఆయతనంబు-ఇల్లును।ధైర్యమునకు ఆకరము।ధైర్యమునకు-ధీరత్వమునకు।ఆకరము-నిధియును।ఆర్యజనంబున్-పెద్దలను।కోరి రాన్ జేయు-ప్రార్థించిరప్పించువాడును।పరోపకారియు-పరులకుపకారము చేయువాడును।విశిష్టచరిత్రుఁడు।విశిష్ట-మంచిగుణములతోకూడిన।చరిత్రుడు-చర్యలుగలవాడును। ఉదారధీరలీలాయుతమారుకొండఘనుడు ।ఉదార-ఉజ్వలములైన।ధీర-గంభీరములైన।లీలా-చేష్టలతో।యుత-కూడిన।మారుకొండఘనుడు -మార్కండేయమహీపతి।ఏయెడన్-ఎచ్చోటనైనను।నెయ్యురన్-ఆశ్రితులను।వదలడు-విడువడు ।ఆర్తజనైకరక్షన్।ఆర్త-దీనులైన।జన-మానవులయొక్క।ఏకరక్షన్-ముఖ్యరక్షణను।ఏమరడు -మరువడు।అమ్మహిమేటికిన్-పుడమిలోనియా శ్రేష్ఠునకు।ఇలన్-భూమియందు।సాటిలేరు-సమానులు లేరు॥ మార్కండేయమహారాజు స్నేహితులు మొదలైనవారిని విడువక రక్షించుట మొదలగు గుణములు గలవాడౌటను ఈగుణశ్రేష్ఠునకు సాటిసేయ నెవ్వరు గానుపించరు॥

౫౮॥క॥విశదముగనిల్పెనేకా।దశమార్కండయ్యలింగధామములు నిరం।కుశవృత్తి శ్రీగిరిన్ యా।శశితారార్కముగవీరశైవాగ్రణియై॥ టీ॥మార్కండయ్య-మార్కండేయమహారాజు।వీరశైవాగ్రణియై।వీరశైవ-వీరశైవులలో।అగ్రణియై-అగ్రేసరుడై।నిరంకుశవృత్తిన్।నిరంకుశ-అడ్డులేని।వృత్తిన్-చర్యచే।విశదముగన్-స్వచ్ఛముగాను।శ్రీగిరిన్ -శ్రీశైలమందు।ఏకాదశలింగధామములు।ఏకాదశ-పదునొకండు।లింగధామములు-శివాలయములను।నిల్పెన్-కట్టించెను॥ తా॥ ఈయన శ్రీశైలమందు ౧౧ లింగమూర్తులను ప్రతిష్ఠించెను॥

## షష్ఠ్యంతములు.

౫౯॥క॥ఏతాదృశగుణునకుసం।జాతాదరపోషితార్యజనతాభినుతా।శాతారుణ్యావతీము।క్తాతాటంకద్యశోనికరభరణునకున్॥ టీ॥ ఏతాదృశగుణునకున్। ఏతాదృశ-ఇటువంటి।గుణునకున్-ప్రసిద్ధగుణములుగలిగినట్టియు। సంజాత-పుట్టిన।ఆదర-ఆదరణచేత।పోషిత-రక్షించబడిన।ఆర్యజనతాభినుత।ఆర్యజనతా-పండితజనసమూహముచేత ।అభినుత-స్తుతించబడిన।ఆశాతారుణ్యావతీ-దిగంగనలకు।ముక్తాతాటంకత్-ముక్తియపుకమ్మలవలెనున్న।యశోనికర-కీర్తిసముదయమునకు।భరణునకున్-పెట్టెయైనట్టియు॥ మార్కండేయమహారాజు పండితమండలిపోషకుడనియు దిగంతవిశ్రాంతకీర్తి గలవాడనియు॥

౬౦॥క॥నిర్భరకరుణావీక్షణ। నిర్భీకృతవినమదహితనివహాసునకున్। దోర్భృతమదహృద్భయసం।దర్భాసోత్ప్రాసలసితదరహాసునకున్॥ టీ॥నిర్భరకరుణావీక్షణనిర్భీకృతవినమదహితనివహాసునకున్।నిర్భర- చులకనైన।కరుణావీక్షణ-దయాదృష్టిచేత।నిర్భీ

కృత-బహువృతీర్పబడిన। వివమత్-వంగిన। అహిత-శత్రువులయొక్క। నివహ-సమితియొక్క।
అసువకు-ప్రాణములుగలిగినట్టియు। దోర్ధృతమదదృప్యద్భయసందర్భసోత్ప్రాసలసితద
రహాసునకు। దోః-భుజములచేత। హృత-హరియింపబడిన। మద-మదముగల। హృత్-మనస్సు
లకు। భయ-భయమును। సందర్భ-కూర్చెడి। సోత్ప్రాస-అభిప్రాయములోనుగల। లసిత-ప్ర
కాశించుచున్న। దరహాసునకు-చిరునగవుగలిగినట్టియు। తా॥ వంగినశత్రువులనుదయా
దృష్టిచేతరక్షించెడివాడును మదించినవిరోధులమదమణిచెడు చిరునగవుగలవాడును॥

౫౮॥ క॥ కంఠాలంకారితశితి। కంఠామరభూజగుణవికచసూనునకు। కుండలీకృతరిపు
నయగజకంఠీరవసోమనాథఘనసూనునకున్॥ టీ॥ కంఠాలంకారితశితికంఠామరభూజ
గుణవికచసూనునకు। కంఠ-మెడయందు। అలంకారిత-అలంకరింపబడిన। శితికంఠ-లింగ
రూపుడైనశివుడనెడి। అమరభూజ-కల్పవృక్షమునకు। గుణ-తనయొక్క దయాదిగుణముల
నెడు। వికచ-విప్పారిన। సూనునకు పువ్వులుగలిగినట్టియు। కుండలీకృతరిపునయగజకంఠీ
రవసోమనాథఘనసూనునకు। కుండలీకృత-చాడిబోవునట్లుచేయబడిన। రిపు-విరోధులయొ
క్క। నయ-నీతియనెడు। గజ-ఏనుంగులకు। కంఠీరవ-తెరనోటిమెకమైనట్టి। సోమనాథఘన-
సోమప్రభువర్యునకు। సూనునకు-తనయుడైనట్టియు॥ తా॥ కంఠమందుభూషణ
ముగధరించినశివలింగమనుకల్పవృక్షమునకుపుష్పములవంటిసద్గుణములు గలిగినట్టియు
వాడిచెడినశత్రువులనుఏనుంగులకుసింగమువంటిసోమయప్రభువునకుతనయుడైనట్టియు॥

౫౯॥ క॥ శుంభదలంఘ్యనిజాజ్ఞా। స్తంభితపరవంచకాహితకళింగునకుం। దంభా
నభిజ్ఞపూజా। జృంభణసంభావితాత్మశివలింగునకున్॥ టీ॥ శుంభదలంఘ్యనిజాజ్ఞాస్తం
భితపరవంచకాహితకళింగునకు। శుంభత్-ప్రకాశించుచున్న। అలంఘ్య-మీరరాని। ని
జ-స్వంతమైన। ఆజ్ఞ-శాసనముచేత। స్తంభిత-కట్టివేయబడిన। పర-ఇతరులను। వంచ
క-మోసపుచ్చెడు। అహిత-విరోధియైన। కళింగునకు-కళింగదేశప్రభువుగలిగినట్టియు।
దంభానభిజ్ఞపూజాజృంభణసంభావితాత్మశివలింగునకు। దంభ-కపటమును। అనభిజ్ఞ-
తెలియని (కపటములేని)। పూజా-అర్చనయొక్క। జృంభణ-అతిశయముచేత। సం
భావిత-పూజింపబడిన। ఆత్మ-తనయొక్క। శివలింగునకు-లింగమూర్తిగలిగినట్టియు॥
తా॥ తనయాజ్ఞచేతకళింగాధిపతినికట్టివేసినవాడును మానసికశివపూజాదురంధరుడును

౬౦॥ క॥ వినతజనవినుతపోషణ। హనుమంతాకనకకుండలాభరణసనా। తనమేఘ
వాహనాళిక। ఘనబిరుదాంకభవపూజకద్విరదునకున్॥ టీ॥ వినతజనవినుతపోషణ।
వినత-అణిగియున్న। జన-మంచిమానవులచేత। వినుత-స్తుతించబడిన। పోషణహనుమం
తా-పోషణహనుమంతుడనెడియు। కనకకుండలాభరణ। కనక-బంగారపువైన। కుండల-
కుండలములనెడి। ఆభరణ-భూషణములుగలవాడనెడియు। సనాతనమేఘవాహన। సనా
తన-ప్రాచీనమైన। మేఘ-జీమూతము। వాహన-గుఱ్ఱముగాగలదేవేంద్రుడాయనుసదియు।
ఆళిక-మొదలుగాగల। ఘనబిరుదాంక। ఘన-గొప్పదియగు। బిరుదాంక-బిరుదావళులుగలి
గినట్టియు। భవపూజకద్విరదునకు। భవ-సాంబమూర్తియొక్క। పూజక-ఆరాధకులలో।
ద్విరదునకు-ఏనుగైనట్టియు (శ్రేష్ఠుడైనట్టియు)॥ తా॥ సజ్జనులచేతస్తోత్రముచే

యుతగిపోషణమహాసమంత్రాది బిరుదులు గలవాఁడనియు శివపూజాధురంధరుఁడనియును॥

౬౧॥ క॥ స్తుత్యజగద్గురుబిరుదాంకాత్యుజ్జ్వలలోకవిశ్రుతౌన్నత్యునకున్। నిత్యత్రిశంకుభూపాపత్యనిరాకరణతరుణతరసత్యునకున్॥ ✱ టీ॥ స్తుత్యజగద్గురుబిరుదాంకాత్యుజ్జ్వలలోకవిశ్రుతౌన్నత్యునకున్। స్తుత్య-స్తోత్రము చేయఁదగిన। జగద్గురు-జగద్గురువనెడు। బిరుద-బిరుదుయొక్క। అంక-చిహ్నముచేత। అత్యుజ్జ్వల-మిక్కిలి ప్రకాశించుచున్న। లోకవిశ్రుత। లోక-జగత్తులయందు। విశ్రుత-ప్రసిద్ధమైన। ఔన్నత్యునకున్-గొప్పగలట్టియు। నిత్యత్రిశంకుభూపాపత్యనిరాకరణతరుణతరసత్యునకున్। నిత్య-స్థిరుఁడైన। త్రిశంకుభూప-త్రిశంకుమహారాజుయొక్క। అపత్య-కుమారుఁడైన హరిశ్చంద్రమహారాజుయొక్క। నిరాకరణ-తిరస్కరించుటయందు। తరుణతర-మిక్కిలి నూతనమైనట్టియు। సత్యునకున్-సత్యప్రతిజ్ఞ కలవాఁడును॥ తా॥ హరిశ్చంద్రమహారాజును మించిన సత్యసంధుఁడు॥

౬౨॥ క॥ బృందారకబృందారకనందనకందర్పదర్పవైచ్యవిధానా। నందావధానమానిత। సౌందర్యభరేందిరాలసద్ధామునకున్॥ ✱ టీ॥ బృందారక-దేవతలయొక్క। బృంద-సమూహములో। ఆరక-ఉజ్జ్వలుఁడైన దేవేంద్రునియొక్క। నందన-తనయుఁడగు జయంతునియొక్కయు। కందర్ప-మన్మథునియొక్కయు। దర్ప-గర్వమునకు। వైచ్యవిధాన-తక్కువను చేయుటయందలి। ఆనందావధాన-సంతోషముయొక్క నిశ్చలతచేత। మానిత-సన్మానించఁబడ్డ। సౌందర్యభరేందిరా-సౌందర్యాతిశయలక్ష్మికి। లసద్ధామునకున్-ప్రకాశించుచున్న ఉనికిపట్టైనట్టియు॥ తా॥ జయంతమన్మథులవలె చక్కనివాఁడు॥

౬౩॥ క॥ కర్కశరిపుదుర్గమనయతర్కార్జితవాంఛితసముదాయునకు శుభోదర్కధవళైశ్వరపురమార్కండేయునకు రూపమాద్రేయునకున్॥ ✱ టీ॥ కర్కశ-కఠినులైన। రిపు-శత్రువులచేత। దుర్గమ-పొందశక్యముగాని। నయతర్క-నీతియుక్తిచే। అర్జిత-సంపాదించఁబడిన। వాంఛిత-కోర్కెలయొక్క। సముదాయునకున్-సమూహము గలవాఁడును। రూపమాద్రేయునకున్। రూప-సౌందర్యమునకు। మాద్రేయునకున్-నకులునివంటివాఁడును। శుభోదర్కధవళైశ్వరపురమార్కండేయునకున్। శుభోదర్క-శుభసూచకమగు। ధవళైశ్వరపురమార్కండేయునకున్। ధవళైశ్వరపుమార్కండేయమహారాజునకు॥ తా॥ శత్రువులకు అగోచరమైన నీతియుక్తులు గలవాఁడనియును గొప్పసౌందర్యము గలవాఁడనియును॥

౬౪॥ వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా మాయొనర్పంబూనిన శ్రీమహాస్కాందంబను మహాపురాణంబునందు నాగరఖండంబునకు కథాక్రమం బెట్టిదనిన॥ ✱ టీ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా। అభ్యుదయ-శుభములయొక్క। పరంపరా-మాలికలకు। అభివృద్ధిగా-పెంపుకలుగునట్లుగా। మాయొనర్పంబూనిన-మాచేత చేయనారంభించిన। శ్రీమహాస్కాందంబను మహాపురాణంబునందు। శ్రీ-శోభాయుక్తమైన। మహాస్కాందంబు-మహాస్కాందంబు అను మహాపురాణంబునందు-అను గొప్ప ప్రాచీనగ్రంథమందు। నాగరఖండంబునకు-నాగరఖండమను నొకభాగమునకు। కథాక్రమంబు-కథాసరళి। ఎట్టిదనిన-ఎటువంటిదంటె॥ తా॥ మేము చేయఁబూనిన స్కాందపురాణములోని నాగరఖండముయొక్క కథ ఎటువంటిదంటె॥

## నైమిశారణ్యవర్ణనము.

౬౫ ఉ॥ శ్రీకరచంద్రశేఖరవిరించిసరోరుహనాభముఖ్యది। వ్యాకరమైయనేకమహిమాద్భుతమైగనుగొన్నమాత్రలో। కైకశుభావహంబయిదిగంతసమంచితకీర్తిచంద్రికల్। గైకొనినైమిశంబనునొకానొకయాశ్రమమొప్పునెప్పుడున్॥ టీ॥ శ్రీకరచంద్రశేఖరవిరించిసరోరుహనాభముఖ్యదివ్యాకరమై। శ్రీకర-శోభాయుక్తులైన। చంద్రశేఖర-సాంబమూర్తియు। విరించి-బ్రహ్మదేవుడు। సరోరుహనాభ-విష్ణుమూర్తియు। ముఖ్య-మొదలగు। దివ్య-దేవతలకు। ఆకరమై-స్థానమై। అనేకమహిమాద్భుతమై। అనేక-బహువిధములైన। మహిమ-ప్రభావములచే। అద్భుతమై-ఆశ్చర్యకరమైనదియై। కనుగొన్నమాత్రన్-చూచినతోడనే। లోకైకశుభావహంబయి। లోక-జనులకు। ఏక-ముఖ్యమైన। శుభావహంబయి-శుభములను కలుగజేసెడిదియై। దిగంతసమంచితకీర్తిచంద్రికల్। దిగంత-దెసలచివరల। సమంచిత-ఒప్పుచున్న। కీర్తిచంద్రికల్-కీర్తిప్రకాశలను। కైకొని-చేబూని। నైమిశంబను-నైమిశమను। ఒకానొకయాశ్రమము। ఏదేనియొకపుణ్యారణ్యము। ఎప్పుడున్-అన్నికాలములయందును। ఒప్పున్-ప్రకాశించును ❧ బ్రహ్మాదిదేవతులకునికిపట్టైన నైమిశారణ్యపుణ్యక్షేత్రముకలదు॥

౬౬ సీ॥ శ్రీఫలబదరిహరీతకికేతకీ। నాగముల్కుటజపున్నాగములును। కాంచనమాతులుంగకపిత్థనింబమం। దారముల్తిలకమందారములును। పాటలివరుణపిప్పలశింశుపాగరు। తాళముల్పనసహింతాలములును। క్రముకప్రియాళువికంకతతింత్రిణీ। సాలముల్వకుళరసాలములును। కలిగిశుకపికనికరవికస్వరస్థిరస్వరోదాత్తసమనుదాత్తస్వరిత। పదసహితసంయమికుమారవిదితవేద। సముదయోచ్చైస్స్వనముతదాశ్రమముదనరు॥ టీ॥ శ్రీఫల-మారేళ్లు। బదరి-రేగులు। హరీతకీ-కరకలు। కేతకీ-మొగలులు। నాగముల్-నాగవృక్షములును। కుటజ-కొండమల్లెలు। పున్నాగములును-పొన్నచెట్లును। కాంచన-సంపెంగలు। మాతులుంగ-మాతులుంగములు। కపిత్థ-వెలగలు। నింబ-వేపలు। మందారముల్-మందారములు। తిలకమందారముల్-శ్రేష్ఠమైనబొట్టుకురుచెట్లు। పాటలి-కలిగొట్టులు। వరుణ-ఏపిచెట్లు। పిప్పల-రావులు। శింశుప-విరిశనలు। అగరు-అగరువులు। తాలముల్-తాళ్లు। పనస-పనసలు। హింతాలములును-ఈతలును। క్రముక-పోకలు। ప్రియాళు-ప్రియాళువులు। వికంకత-వికంకతములు। తింత్రిణీసాలముల్-చింతచెట్లు। వకుళ-పొగడలు। రసాలములును-తియ్యమామిడిచెట్లును। కలిగి-వుండి। శుకపికనికరవికస్వరస్థిరస్వరోదాత్తసమనుదాత్తస్వరితపద సహితసంయమికుమారవిదితవేదసముదయోచ్చైస్స్వనము। శుక-చిలుకలయొక్క। పిక-కోయిలలయొక్క। నికర-సమూహముయొక్క। వికస్వర-విప్పబారిన। స్థిర-నిశ్చలములైన। స్వర-స్వరములతోటియు(ధ్వనులతోటి)। ఉదాత్త-ఉదాత్తము। అనుదాత్త-అనుదాత్తము। స్వరిత-స్వరితములతోకూడిన। పద-వాక్యములతో। సహిత-కలసికొనిన। సంయమికుమార-ఋషికుమారులచే విదిత-తెలియచేయబడిన। వేద-యజుర్వేదముమొదలైనవేదములయొక్క। సముదయ-రాశియొక్క। ఉచ్చైస్స్వనము-గొప్పధ్వనియునుకలదియైన। తదాశ్రమము-ఆనైమిశారణ్యము। తనరు-ఒప్పును(ప్రకాశించెను) ❧ తా॥ ఆనైమిశముచాలాచెట్లుగలదియునుకోయిలలు మొదలఖునపులుగులకలనాదముగలదియు మునికుమారులవేదఘోషమునుగలదియు ై

ముతలకు-ఏనుగుకొదములకు।పిప్పొద్దు-ఎల్లప్పుడు। కుతలందిచ్చు-చేతులచే ఆహారము
లందిచ్చు।సింగములను-సింహములను।పుక్కువతో-ప్రేమతో।పీవులెక్కించుకొని-వీపుల
మీదనునిచికొని।బొట్టెల-పావలను।ఆడించుపులులకదుపు.ఉపలాలించుపెద్దపులులగుం
పును।రెక్కలకా-పక్షులచేత।పొదవిక్కి।పారెడు-మాటిమాటికి। పాముపాపలజేరి-
పాముపిల్లలనుగూడి।పోషించుమయూరములును-కాపాడునెమళ్ళును।కొండగొరియలతం
డంబుగూడి-దుష్టమృగములయొక్క గుంపులనుగూడి। వదలక-విడువక।ఎప్పుడుతిరుగుశి
వంగికసుపుంజ-ఎల్లప్పుడుసంచరించు శివంగిదండములును।హా హా ఆశ్చర్యము।అన్యోన్యమై
త్రిక-బండొంటితో గలిమి చేత నాశ్రమమునను ఆనుపూర్వ్యముగా।సంతతంబును।ఎప్పు
డును-సత్వచయము-జంతుజాలము।సంచరించును-సంచరించును॥ ।ఆవనములో ముని
లయొక్క మహిమచేత మృగములు పరస్పరవైరము విడుచున్నవి॥

౭౧॥వ॥-మరియు న్వనంబు పుండరీకసారంగసమాశ్రయంబై।యాగ్నేయభాగంబు
నుంబోలె।ద్విజరాజవిరాజితంబై।హరికొలువుకూటంబునుం బోలె।స్వర్ణరంజితంబై।శంక
రుకరాంబురుహంబునుంబోలె।పుండరీకపున్నాగసురసాలహారిణీవిద్రుమవల్లికాజాలక
సుమనస్సురభిపుణ్యజనబాడబసమాకీర్ణంబై సముద్రంబునుంబోలె।మందారకుజవిలసితం
బై గగనంబునుంబోలె।గాగుటీజపాంచితబ్రహ్మణ్యవానప్రస్థముని పాదపావనస్థలంబై।
బ్రహ్మసభాభ్యంతరంబునుంబోలె।సుకేశనువనమహాంసచకకేలితంబై।సరోవరంబునుం
బోలె।కాంచనస్యందనవైజయంతికాశోభాపరిణతరాజమానగంధర్వనామాభిరామం
బై।పట్టణంబునుంబోలె। శతప్రాసపున్నాగశ్లోకయుతిగణప్రధానంబై।మహాప్రబంధంబు
నుంబోలె।సమున్నద్ధప్రభాసురధనంజయమహోతికాండప్రకాశితంబై।భారతంబునుంబోలె
ఘనసారచందనకదంబతిలకపనసమాలికామయంబై।వసితాలంకారంబునుంబోలె।యొ
ప్పునయ్యాశ్రమంబు।౭౧॥ టీ॥ మరియును-ఇంకను।అన్వనంబు-ఆయాశ్రమము।ఆగ్నేయ
భాగంబునుంబోలె-అగ్నిహోత్రుని దెసవలె।పుండరీకసారంగసమాశ్రయంబై।పుండరీక-
పెద్దపులుల చేతను(పుండరీకమనునట్టిదేనుగు చేతను)।సారంగ-లేళ్ళచేతను(తుమ్మెదల చేతను)।
సమాశ్రయంబై-ఇరవై।హరికొలువుకూటంబునుంబోలె।హరి-విష్ణువుయొక్క।కొలు
వుకూటంబునుంబోలె-సభవలె।ద్విజరాజవిరాజితంబై।ద్విజరాజ-గరుత్మంతుని చేతను
(బ్రాహ్మణశ్రేష్ఠుల చేతను)।విరాజితంబై-ప్రకాశించుచున్నదై।శంకరుకరాంబురుహం
బునుంబోలె।శంకరు-శివునియొక్క।కరాంబురుహంబునుంబోలె-హస్తపద్మమువలె।స్వ
ర్ణ-మంచికాంతి చేతను(సంపెగల చేతను)।రంజితంబై-ప్రకాశింపచేయబడ్డదై।సముద్రం
బునుంబోలె-సాగరములాగున।పుండరీకపున్నాగసురసాలహారిణీవిద్రుమవల్లికాజాలక
సుమనస్సురభిపుణ్యజనబాడబసమాకీర్ణంబై।పుండరీక-తెల్లదామరల చేతను(పెద్దపులుల
చేతను)।పున్నాగ-ఐరావతము చేతను(పొన్నచెట్ల చేతను)।సురసాల।సుర-దేవతలయొ
క్క।సాలవృక్షముల చేతను(మంచితియ్యనిమామిడిచెట్ల చేతను)।హారిణీ-నదుల చేతను
(పడుసుల చేతను)।విద్రుమవల్లికాజాలకసుమనస్సురభి। విద్రుమవల్లిక-పగడపుతీగెలయొ
క్క।జాలక-సమూహము చేతను।సుమనస్సురభి-కామధేనువు చేతను(విద్రుమ-విశేష-

క్షుముల యొక్కయు । వల్లిక-తీగల యొక్కయు । జాలక-బంధికురువిందల యొక్కయు । సు
మనః-పుష్పముల యొక్కయు । సురభి-పరిమళము చేతను) । పుణ్యజనబాడబసమాకీర్ణంబై । పు
ణ్యజన-రాక్షసుల చేతను (పుణ్యాత్ముల చేతను) బాడబ-బడబాగ్ని చేతను (ఆడుగుఱ్ఱముల చే
తను) । సమాకీర్ణంబై-వ్యాప్తమైనదై । గగనంబును బోలె-ఆకాశమువలె । మందారకుజవిల
సితంబై । మంద-శని చేతను । ఆర్య-బృహస్పతి చేతను । కుజ-అంగారకుని చేతను । (మందారకు
జ-మందారవృక్షముల చేతను) । విలసితంబై-ప్రకాశించుచున్నదై । బ్రహ్మసభాభ్యంతరంబు
నుంబోలె । బ్రహ్మ-బ్రహ్మదేవుని యొక్క । సభ-పేరోలగము యొక్క । అభ్యంతరంబునుంబో
లె-మధ్యప్రదేశమువలె । గాయత్రీజపార్చిత బ్రహ్మణ్యవానప్రస్థమునిపాదపావనస్థలంబై
గాయత్రీజప-బ్రహ్మగాయత్రీధ్యానము చేత । అర్చిత-ఒప్పుచున్న । బ్రహ్మణ్య-బ్రహ్మనిష్ఠ
లైన । వానప్రస్థమునిపాద । వానప్రస్థ-వానప్రస్థాశ్రమముగల । ముని-మునుల యొక్క
పాద-చరణముల చేత । పావన-పవిత్రమైన । స్థలంబై-చోటుగలదై । (గాయత్రీ-గాయత్రీ
వృక్షములకు । జప-దాసనములకు । అంచిత-ఒప్పుచున్న । బ్రహ్మణ్య-బ్రహ్మణ్యులకు । వా
నప్రస్థ-వనసంబంధమైన చోటులయందలి । మునిపాదప-అవిసిచెట్లకు । అవనస్థలంబై-
రక్షణపు తావునైన) । సరోవరంబునుంబోలె-సరస్సువలె । కుశేశయపరమహంసచక్రకీలి
తంబై । కుశేశయ-పద్మములయందు నుండెడి । పరమహంస-యతిశ్రేష్ఠుల యొక్క । చక్ర-మం
డలములతో । (కుశేశయ-పద్మములతో । పరమహంస-శ్రేష్ఠములగు రాయంచలతో । చక్ర-
చక్రవాకములతో । కీలితంబు-కూర్పబడినదియు) । పట్టణంబునుంబోలె-పురమువలె । కాంచ
నస్యందనవైజయంతికాశైలూషగణికారాజకుమారగంధర్వరామాభిరామంబై । కాంచ
నస్యందన-బంగరు రథముల చేతను । వైజయంతిక-మేడల చేతను । శైలూష-నటుల చేత
ను । గణికా-వేశ్యల చేతను । రాజకుమార-రాజపుత్రుల చేతను । గంధర్వ-గుఱ్ఱముల చేత
ను । రామా-స్త్రీల చేతను । (కాంచన-రేలల చేతను । స్యందన-తిందుగుల చేతను । వైజ
యంతిక-వైజయంతీలతల చేతను । శైలూష-వృక్షభేదముల చేతను । గంధర్వరామ-గంధ
ర్వస్త్రీల చేతను । అభిరామంబై-మనోహరమై) । మహాప్రబంధంబునుంబోలె-గొప్పగ్రంథ
మువలె । శతపత్రపుణ్యశ్లోకయతిగణవిధానంబై । శతపత్ర-నూరుపత్రములు । పుణ్యశ్లోక-
పుణ్యములైన పద్యములు । యతి-విశ్రమస్థానములు । గణ-మగణాదిగణములు । (శతపత్ర-నూ
ర్లతంబడియైన । పుణ్యశ్లోక-పుణ్యకీర్తిగల । యతిగణ-మునిసమూహము । విధానంబై-ము
ఖ్యము గాగలదై) । భారతంబునుంబోలె-భారతేతిహాసమువలె । సమిన్మధ్యప్రభాసురధనంజ
యహేతికాండప్రకాశితంబై । సమిన్మధ్య-యుద్ధమధ్యమందు । ప్రభాసుర-మిక్కిలిప్రకా
శించుచున్న । ధనంజయ-అర్జునుని యొక్క । హేతికాండ । హేతి-ఆయుధముల చేతను । కాం
డ-సమూహముల చేతను (సమిన్మధ్య-సమిధల నడుమ । ప్రభాసుర-ప్రకాశించుచున్న । ధనం
జయ-అగ్ని యొక్క । హేతి-జ్వాలల యొక్క । కాండ-సమూహముల చేత) । ప్రకాశితంబై-
ప్రకాశింపచేయబడ్డదై । వనితాలంకారంబునుంబోలె । వనితా-స్త్రీల యొక్క । అలంకా
రంబునుంబోలె-సొగసువలె । ఘనసారచందనకదంబతిలకప్రసవమాలికామయంబై । ఘన
సార-కప్పురము చేత । చందన-గంధము చేత । కదంబ-కలవపుగంధము చేత । తిలక-బొట్టు చే

తి। ప్రసవమాలిక-పువ్వులదండలచేత। (ఘనసార-కప్పురపుటనంటులచేత। చందన-మంచిగంధపుచెట్లచేత। కదంబ-కడిమిచెట్లచేత। ప్రసవమాలిక-పువ్వుపరంపరలచేత) । మయంబై-వ్యాప్తమై। బిప్పుచున్-ప్రకాశించుచున్న। అయ్యాశ్రమంబులందున్-ఆయరణ్యమునందు॥

తా॥ ఆనైమిశారణ్యము సమస్తప్రసిద్ధమునికదంబావలంబనమును పావనమును నానావిధమృగపక్షిసంశోభితంబును సమిత్కుశకుసుమభరితపాదపాకీర్ణంబును సలలితసలిలపూర్ణసరోవరనికరశోభితంబైసుందరంబై యుండెను॥

౭౧॥ సీ॥ సానగాహాభునవిశ్వజ్ఞసువర్ణస। నాతనప్రత్నసనత్సుజాత। జమదగ్నిఘటజన్మజాబాలివైధ్రువ। వత్సదూర్వాసవాలివాప। శండిలకౌండిన్యశాండిల్యమాండవ్య। మైత్రేయగాధేయమందపాల। కపిలోపమన్యుమార్కండేయకశ్యప। వాల్మీకినారదవామదేవ। భృగుపరాశరరైభమరీచికౌత్స। దేవరాతశమీకజాత్రేయశౌన। కాదులైనట్టిబ్రహ్మర్షులమరఋషులు। రాజఋషులును సుఖగోష్ఠి రహివహింప॥ ✻టీ॥ సానగ-సానగఋషియు। అహాభున-అహాభునఋషియు। విశ్వజ్ఞ-విశ్వజ్ఞఋషియు। సువర్ణ-సువర్ణఋషియు। సనాతన-సనాతనఋషియు। ప్రత్న-ప్రత్నఋషియు। సనత్సుజాత-సనత్సుజాతఋషియు। జమదగ్ని-జమదగ్నియు। ఘటజన్మ-అగస్త్యుడును। జాబాలి-జాబాలియు। వైధ్రువ-వైధ్రువుడును। వత్స-వత్సుడును। దూర్వాస-దూర్వాసుడును। వాలివాప-వాలివాపుడును। శండిల-శండిలుడును। కౌండిన్య-కౌండిన్యుడును। శాండిల్య-శాండిల్యుడును। మాండవ్య-మాండవ్యుడును। మైత్రేయ-మైత్రేయుడును। గాధేయ-విశ్వామిత్రుడును। మందపాల-మందపాలుడును। కపిల-కపిలుడును। ఉపమన్యు-ఉపమన్యుడును। మార్కండేయ-మార్కండేయుడును। కశ్యప-కశ్యపుడును। వాల్మీకి-వాల్మీకియు। నారద-నారదుడును। వామదేవ-వామదేవుడును। భృగు-భృగువును। పరాశర-పరాశరుడును। రైభ-రైభుడును। మరీచి-మరీచియు। కౌత్స-కౌత్సుడును। దేవరాత-దేవరాతయు। శమీకజ-శమీకజయు। ఆత్రేయ-ఆత్రేయుడును। శౌనక-శౌనకుడును। ఆదులైనట్టి-మొదలైనటువంటి। బ్రహ్మర్షులు-బ్రాహ్మణఋషులును। అమరఋషులు-దేవఋషులును। రాజఋషులు-ప్రభుఋషులును। సుఖగోష్ఠిన్-సంతోషప్రసంగమందు। రహిన్-సొగసును। వహింపన్-తాల్చియుండగా॥

తా॥ ఈచెప్పబడ్డ సానగాదిఋషులందరు నైమిశారణ్యమందు మాటలాడుచుండిరి॥

ఋషులకడకు సూతుండు వచ్చుట.

౭౨ చ॥ బలుపులితోలువచ్చడముబాగుగభూతియులాతముంగమం। డలువున కెంపుదీరినజటావళిదాకలపేముకర్ణకుం। డలములుగల్గి రెండవనిటాలవిలోచనుబోలివహ్నిదీప్తులుగనుపించుయోగిజనపుంగవుడున్నతచారుమూర్తియై॥ ✻టీ॥ బలుపులితోలువచ్చడము। బలుపులితోలు-పెద్దపులిచర్మము। వచ్చడము-దుప్పటియు। బాగుగన్-లెస్సగా। భూతియు-బూదెయు। లాతమున్-బెత్తమును। కమండలువును-కుండికయు। కెంపుతీరినజటావళి। కెంపుతీరిన-ఎఱ్ఱనైన। జటావళి-జడలగుంపును। దాకలపేము-పుముకలదండయు। కర్ణకుండలములు-చెవుపోగులు। కలిగి-ఉండి। రెండవనిటాలవిలోచనుబోలి-రెండవసాంబమూర్తివలె। వహ్నిదీప్తులు-అగ్నిమినుకులు। కనుపించుతో-చెడు। యోగిజనపుంగవుడున్

యోగిజన-ఋషులలో। పుంగవుడు-శ్రేష్ఠుడును। ఉన్నతచారుమూర్తియై। ఉన్నత-గొప్పదియగు। చారు-సొగసైన। మూర్తియై- ఆకారమునుగులవాడై॥

తా॥ పులితోలుకప్పుకొనిబూడిదెపూసికొనిపులితోలుతాల్చి రెండవసాంబమూర్తివలెనుండెను॥ ౭౨

ఉ॥ ఆతరినేగుదెంచె సకలాగమశాస్త్రపురాణసత్కథా। న్వీతుడు తత్త్వవిస్తృతివినిర్జిత
దుర్జయమీనకేతుడు। ద్యోతతపోబలప్రణుతయోగసమేతుడఖాంధకారఖ। ద్యోతుడరివ్రజాద్రిపురుహూతుడు సూతుడు సద్వినీతుడై॥

టీ॥ ఆతరిన్- ఆసమయమందు। సకలాగమశాస్త్రపురాణసత్కథాన్వీతుడు। సకల-సమస్తమైన। ఆగమ-వేదములతోటి। శాస్త్ర-తర్కాదిషట్ఛాస్త్రములతోటి। పురాణ-పదునెనిమిదిపురాణముల యొక్క। సత్కథా- మంచికథలతోటి। అన్వీతుడు-కూడుకొనునట్టియు। తత్త్వవిస్తృతివినిర్జితదుర్జయమీనకేతుడు। తత్త్వ-వేదాంతసారముయొక్క। విస్తృతి-విస్తారముచేత। వినిర్జిత-జయించబడిన। దుర్జయ-జయించశక్యముగాని। మీనకేతుడు- చేపటెక్కెమందుగలమన్మథుడుగలవాడును। ఉద్యోతతపోబలప్రణుతయోగసమేతుడు। ఉద్యోత- ప్రకాశించుచున్న। తపోబల - తపశ్శక్తిచే। ప్రణుత-స్తోత్రముచేయబడిన। యోగ- అష్టాంగయోగములతో। సమేతుడు-కూడుకొనినట్టియు। అఖాంధకారఖద్యోతుడు। అఖ- పాపములనెడు। అంధకార- చీకటికి। ఖద్యోతుడు- సూర్యునివంటియు। అరివ్రజాద్రిపురుహూతుడు। అరి-శత్రువులయొక్క। వ్రజ- సమూహమనెడి। అద్రి-పర్వతములకు। పురుహూతుడు-దేవేంద్రుడైనట్టియు। సూతుడు- రోమహర్షణపుత్రుడు। సద్వినీతుడై। సత్-సజ్జనులచేత। వినీతుడై-శిక్షించబడ్డవాడై। ఏగుదెంచెన్- వచ్చెను॥

తా॥ సమస్తశాస్త్రప్రవీణుడును వేదాంతవేదియునునిష్పాపుడునుపురాణకథాచరితుడునువినయవిధేయుడునగుకథికుడు ఆమునులయాశ్రమమునకువచ్చెను॥ ౭౩

ఉ॥ ఆదటనిట్లువచ్చినమహామునిచంద్రుని సూతుగాంచియర్ఘ్యపా। ద్యాదియథోచితప్రి
యసమర్చలొనర్చుచు గందమూలసు। స్వాదుఫలోపహారములొసంగినచేకొని తృప్తు
డైనయ। య్యాదిమశైవసూతుగని యమ్మునివర్యులు పల్కిరయ్యెడన్॥

టీ॥ ఆదటన్-తృప్తిచేత(ప్రేమచే)ఇట్లు- ఈలాగున। వచ్చిన-ఏతెంచిన। మహామునీంద్రునిన్ సూతుని। కాంచి- చూచి। అర్ఘ్యపాద్యాదియథోచితప్రియసమర్చలు। అర్ఘ్య-పూజాద్రవ్యము। పాద్య-పాదోదకము । ఆది-మొదలగు । యథోచిత- తగిన । ప్రియ- ఇష్టములైన । సమర్చలు-పూజలు । ఒనర్చుచున్-చేయుచు। కందమూలసుస్వాదుఫలోపహారములు। కంద-కందములు। మూల-పెండలము। సుస్వాదు- మంచిరుచియైన। ఫల- పండ్లనెడు। ఉపహారములను- కానుకలను। ఒసంగినన్-ఇవ్వగా। చేకొని-చేతపుచ్చుకొని। తృప్తుడైన- సంతుష్టుడైన। అయ్యాదిమశైవసూతున్ । అయ్యాదిమ - ఆమొదటి। శైవ-శివభక్తుడైన। సూతున్- సూతుని । కని- చూచి। అమ్మునివర్యులు- ఆమునిశ్రేష్ఠులు। అయ్యెడన్-అచ్చోటను। పల్కిరి-అనిరి॥

తా॥ ఆసూతుడుతమఆశ్రమమునకురాగా నచటిమునులు సత్కరించిమాటలాడిరి॥ ౭౪

చ॥ శరధినిమున్నసోమకనిశాచరుచేశిథిలత్వమొందియే। ర్పరచగరానియాగ
వపురాణములెల్లనుజిక్కుదీర్చియా। దరమునసీకుమౌనికులధన్యుడువ్యాసవదా
న్యుడెంతయున్ । గరుణదలిర్పవిచ్చెనదిగావునమీరలుమాన్యులెప్పుడున్॥

టీ॥ శరధిని- సముద్రమునందు। మున్ను- పూర్వకాలమునందు। సోమకనిశాచరుచే- సోమకాసురునిచేత। శిథిలత్వము- చింపిరితనమును। ఒంది-పొంది। ఏర్పరచగరాని-విడతీయవీలులేని। ఆగమపురాణములు। ఆగమ-వేదములు। పురాణ- పదునెనిమిదిపురాణములు। ఎల్లను- అన్నిటిని। చిక్కుదీర్చి-విడదీసి। ఆదరమునన్-ఆసక్తిచేత। నీకు- ఈకు। మౌనికులధన్యుడు। మౌనికుల- మునిసమూహములో। ధన్యుడు-కృతార్థుడైన। వ్యాసవదాన్యుడు- వ్యాసులనెడుదాత। ఎంతయున్-ఎంతో। కరుణతలిర్పన్- దయవృద్ధిపొందునటుల। ఇచ్చెన్-ఒసగెను। అదిగావునన్- అందువలన। మీరు- తమరు। ఎప్పుడున్-సర్వకాలములయందును। మాన్యులు- పూజ్యులరు॥

తా॥ పూర్వముసోమకుండను రాక్షసుడు వేదపురాణములను దొంగిలించగా చెడినవాటినితిరిగి బాగుచేసి నీవు మొదలైన శిష్యులకువ్యాసమహాముని దయచేసినందున పూజ్యులైతిరి॥ ౭౫

క॥ మీరలు మాభాగ్యంబున। జేరితిరిచ్చోటు మేము జేసినతపమున్। జేరక నేడు
ఫలించెను। కారుణ్యసమేత సూతఘనవిఖ్యాతా॥

టీ॥ మీరలు-తమరు। మాభాగ్యంబునన్- మాయదృష్టమువలన। చేరితిరి-వంచితిరి। ఇచ్చటన్-ఈస్థలమందు। ఏము- మేము। చేసినతపమున్- ఒనర్చినతపస్సు। చేరిక- దాపుగ। నేడు- ఇపుడు। ఫలించెన్-పండెను। కారుణ్యసమేత- దయతోకూడుకొనినవాడా। ఘనవిఖ్యాత-గొప్పకీర్తిగలవాడా। సూత-ఓసూతుడా॥

తా॥ నీవుయిక్కడికివచ్చుటవలన మేముచేసినతపస్సుఫలించెను॥ ౭౬

క॥ ఓసంయమిపుంగవము। న్నీసచరాచరముబోల్చునెల్లజగముదా। నేసు
రనాయకువలనన్। భాసురముగబుట్టెనెఱుగబలుకుము మాకున్॥

టీ॥ ఓసంయమిపుంగవ- ఓమునిశ్రేష్ఠుడా। మున్ను-ముందు। ఈసచరాచరము-మనుష్యాదులతో కొండలు మొదలైనవాటితోకూడిన। ఎల్లజగము-యావత్ప్రపంచము। పోలుచు-ప్రకాశించును। తాను-ఈప్రపంచము। ఏసురనాయకువలనన్ - ఏదేవదేవునివల్ల। భాసురముగన్- ప్రకాశించునటుల। పుట్టెను- కలిగినది। మాకున్-మాకు। ఎఱుగబలుకుము। ఎఱుగన్- తెలియునటుల। పలుకుము-చెప్పుము॥

తా॥ ఈయావత్ప్రపంచము యెవనివలన బాడమెనో ఆమహానుభావుని తెలియచేయుమని యడిగిరి॥ ౭౭

క॥ అనియడుగశౌనకాదుల। కనియెన్సూతుండుమీరలడిగినప్రశ్నం। బున
నొకకథనముగలదది। వినుపించెదవినుడు మీకు వేడుకయొదవన్॥

టీ॥ అని-ఈలాగని। అడుగన్-అడుగగా। శౌనకాదులకు- శౌనకాదిమునులకు। సూతుండు-రోమహర్షణి। మీరలు- తమరు। అడిగినప్రశ్నంబునకు- వేడినసంగతికి। ఒకకథనము- ఒకవృత్తాంతము। కలదు-ఉన్నది। అది- దానిని। మీకు- తమకు। వేడుక-సంతోషము। ఒదవన్- పుట్టేలాగున। వినుపించెదన్-ఆకర్ణింపచేసెదను। వినుడు- ఆకర్ణింపుడని। అనియెన్- చెప్పెను॥

తా॥ మీరలడిగినలోకసృష్టికారణమైన యొకకథచెప్పెదనని సూతుడుపలికెను॥ ౭౮

మ॥ అనినన్సన్మునిసత్తములోరుచిరసవ్యాఖ్యానందవారాశిసం। జనితోత్తుంగత

రంగితామలమనస్సంచారులై పొంగి పా। వనమౌనీశ భవన్మహామహిమలన్ వర్ణిం

ప శేషాహికై। ననుశక్యంబె సమస్తలోకముల విన్నాణంబులౌ నీకథల్॥

టీ॥ అనినన్-ఈలాగనగా। సన్మునిసత్తముల్। సత్- యోగ్యములైన। మునిసత్తముల్-ముని శ్రేష్ఠులైన శౌనకాదులు। రుచిరనవ్యానందవారాశిసంజనితోత్తుంగ తరంగితామలమనస్సంచారులై। రుచిర-సుందరమైన। నవ్య- నూతనమైన। ఆనందవారాశి- సంతోషసముద్రముచేత। సంజనిత-పుట్టించబడిన। ఉత్తుంగ-ఉన్నతమానట్లుగ। తరంగిత- అలలుకలదైచేయబడిన। అమల-నిర్మలములైన। మనస్సంచారులై-మనోవ్యాపారముకలవారలై। పొంగి-ఉప్పొంగి। పావన- పవిత్రుడా। మౌనీశ- ఓమునినాయక। భవన్మహామహిమలన్। భవత్-నీయొక్క। మహా-గొప్పవియగు। మహిమలన్-ప్రభావములను। వర్ణింపన్-ఎన్నుటకు। శేషాహికైనను- ఆదిశేషువునకును। శక్యంబె-వల్లనౌనా। సమస్తలోకములన్। సమస్త-యావత్తు। లోకములన్ - జగత్తులయందు। నీకథల్ - నీచరిత్రములు। విన్నాణంబులు - సొగసులు। ఔను॥

తా॥ ఈలాగున సూతుడు చెప్పగా శౌనకాదులు సంతోషించి ఓమునివర్యా నీమహిమలు నీకథలును అన్నిలోకములలో అద్భుతములైనవి గనుక మీకు కాదు యాదిశేషువైనను వాక్రుచ్చి చెప్పలేడు॥

ఉ॥ వింటిమి సర్వశాస్త్రములు వీనులపండువుగా భవత్కృపం। గంటిమి మ

త్తపఃఫలముఁ గల్మషజాలము వీడిపోవఁగా। గైకొంటిమి ముక్తిమార్గముల కుంఠితవృత్తి

నిఁ బొందవేడుకన్। మంటిమి యెల్లలోకముల మాన్యులమైతిమి మౌనిశేఖరా॥

టీ॥ సర్వశాస్త్రములు- ఎల్లశాస్త్రగ్రంథములను। వీనులపండువుగాన్- కర్ణపర్వముగా। వింటిమి-ఆకర్ణించితిమి। భవత్కృపన్-నీదయచేతను। మత్తపఃఫలము। మత్- నాయొక్క-తపః-పుణ్యకర్మయొక్క। ఫలము- లాభమును। కంటిమి- చూచితిమి। కల్మషజాలము। కల్మష-పాపములయొక్క। జాలము-సమూహము-వీడిపోవన్- విడిచిపోవునట్లు। ముక్తిమార్గములు మోక్షమార్గములను। గైకొంటిమి-పొందితిమి। వేడుకన్-వేడుకచేతను। అకుంఠితవృత్తిని। అకుంఠిత-వాడిచెడని। వృత్తిని- నడతను। పొంది-చెంది। మంటిమి-జీవించితిమి। మౌనిశేఖరా-ఓమునిశ్రేష్ఠుడవైన సూతుడా-ఎల్లలోకములన్- అన్నిభువనములయందును। మాన్యులమైతిమి-పూజ్యులమైతిమి॥

తా॥ ఓసూతుడా నీవు మానివాసస్థలమునకు వచ్చుటచేత మేము సమస్తశ్రేయఃపరంపరలను పొందితిమని కొనియాడిరి॥ ౨౦

క॥ అని వినయపూర్వకంబుగ। మునిపుంగవులాడువాక్యములు విని వికచాననుడై సూతుడు మనమున। దనరిన కుతుకంబుతోడ తపసులకనియెన్॥

టీ॥ సూతుడు-ఆకథికుడు। అని-ఇట్లుపలికి। వినయపూర్వకంబుగన్। వినయ-అణకువ। పూర్వకంబుగన్- ముందగునట్లుగ। (వినయముతో) ।మునిపుంగవులు- మునిశ్రేష్ఠులు। ఆడువాక్యములు- పల్కినమాటలను। విని-ఆకర్ణించి। వికచాననుడై। వికచ-విప్పారిన। ఆననుడై- మోముకలవాడై। మనమునన్-మనస్సులో। తనరిన-పుట్టిన। కుతుకంబుతోడన్-సంతోషముతో। తపసులకు-శౌనకాదిఋషులకు। అనియెన్-ఈలాగున చెప్పెను॥

తా॥ సూతుడు శౌనకాదులు చేయుస్తోత్రములను విని ముదంబునొంది ఇట్లు పలుకందొడంగెను॥ ౨౧॥

మ॥ మునులారా నిఖిలాగమార్థనిచయంబుల్ శాస్త్రముల్ పద్మవామనముఖ్యాదిపురాణముల్ కథలు ప్రేమన్ వ్యాసమౌనీంద్రుచే । మును విన్నాడను మీరలిప్పుడు కడున్ మోదాత్ములై చెప్పుమ । న్నను నా నేర్చుకొలంది జెప్పెద మహానందంబు సంధిల్లగన్॥

టీ॥ మునులారా-ఓ శౌనకాదిఋషులారా। నిఖిలాగమార్థనిచయంబుల్। నిఖిల-సమస్తమైన। ఆగమ-వేదములయొక్క। అర్థ-శబ్దార్థములయొక్క। నిచయంబుల్-సమూహములను- శాస్త్రముల్-వ్యాకరణాదిశాస్త్రములను। పద్మ వామనముఖ్యాదిపురాణముల్-పద్మ-పద్మము। వామన- వామనము। ముఖ్య- మొదలైన। ఆదిపురాణముల్-మొదటిపురాణములను। కథలు-ఇతిహాసములను। ప్రేమన్-దయచేత। వ్యాసమౌనీంద్రుచే-వ్యాసమహామునివలన। మును-పూర్వము। విన్నాడను- వింటిని। మీరలు- తమరు। ఇప్పుడు-ఈసమయమందు। మోదాత్ములై-సంతోషహృదయులరై। చెప్పుమన్నను-వచింపుమనగా। నా నేర్చుకొలంది। నా-నాకు। నేర్చుకొలంది-తెలియుమట్టునకు। మహానందంబు-గొప్పసంతోషము। సంధిల్లగన్-కూడునటుల। చెప్పెదన్-తెలిపెదను॥

తా॥ నేనుపూర్వమువ్యాసమహామునీశ్వరునివలన అనేక పురాణాదులువింటిని యిప్రుడుమీరలు కోరినందున నాకు తెలిసినంతచెప్పెదను॥ ౧౨

వ॥ అని సకలాగమపురాణేతిహాసకథాశ్రవణకుతూహలులైన శౌనకాదిమహామునులనవలోకించి కృష్ణద్వైపాయనునకు నమస్కరించి నిగమార్థప్రసంగ వాగ్వైఖరీసమేతుండైన సూతుండిట్లనియె - మునీంద్రులారా పారాశర్యప్రోక్తంబులైన పదునెనిమిది పురాణంబులు నందు స్కాందమహాపురాణంబు శతసహస్రగ్రంథబంధురంబయ్యె- నందు సౌరసంహిత వేయు - శాంకరసంహిత ముప్పదివేలు- వైష్ణవసంహిత యైదువేలు - బ్రాహ్మ్యసంహిత మూడువేలు- సూతసంహితయారువేలు- సనత్కుమారసంహిత యేబదియైదువేలు -ఈసంహితలయందు నాగరఖండంబును - బ్రహ్మోత్తరఖండంబును- కాశీఖండంబును - కేదారీఖండంబును- శ్రీశైలఖండంబును- కాళహస్తిఖండంబును - శివరహస్యఖండంబును - కదలీఖండంబును- ద్రాక్షారామఖండంబును- క్షీరారామఖండంబును - గోదావరీఖండంబును- మైలావరఖండంబును-భీమఖండంబును- ధర్మఖండంబును-అరుణాచలఖండంబును-జ్ఞానయోగఖండంబును- యజ్ఞవైభవఖండంబును - బదరీఖండంబును-గోకర్ణఖండంబును- మధురాఖండంబును- వర్ణవైభవఖండంబును - పట్టిసఖండంబును- అహోబలఖండంబును-కాశ్మీరఖండంబును-కృష్ణాఖండంబును-ఏకవీరఖండంబును- బ్రహ్మపూర్వఖండంబును- గాయత్రీఖండంబును- శైవాగమఖండంబును - మొదలుగాగలయేబదిఖండంబులుగలుగుచునందు॥

టీ॥ నిగమార్థప్రసంగవైఖరీసమేతుండైన। నిగమ-వేదములయొక్క। అర్థ-అర్థములయొక్క। ప్రసంగ-అనువదించుటయందు। వైఖరి-నేర్పుతో। సమేతుండైన-కూడుకొనిన। సూతుండు-సూతుడు। అని-ఈలాగున చెప్పి। సకలాగమపురాణేతిహాసకథాశ్రవణకుతూహలులు-సకల-సమస్తమైన। పురాణ-వామనాదిపు

రాణములయొక్క। ఇతిహాస-భారతాదియితిహాసములయొక్క।కథా-వృత్తాంతములయొక్క।శ్రవణ-వినుటయందు।కుతూహలులు- వేడుకగలవారలు। అయినశౌనకాదిమహామునులన్- శౌనకుడు మొదలైనమహామౌనులను।అవలోకించి-చూచి।కృష్ణద్వైపాయనునకున్।కృష్ణ-నల్లనైనట్టి।ద్వైపాయనునకున్-దీవిబెంకిగాగలవ్యాసమహామునికి। నమస్కరించి-ప్రణమిల్లి। ఇట్లనియెన్-ఈలాగనెను। మునీంద్రులారా-ఓశౌనకాదులారా। పారాశర్యప్రోక్తంబులైన। పారాశర్య-వ్యాసులవారిచేత। ప్రోక్తంబులైన-చెప్పబడిన।పదునెనిమిదిపురాణంబులు-అష్టాదశపురాణములు।అందు-వానిలో।మహాస్కాందంబు।మహా-గొప్పదియగు।స్కాందంబు-స్కాందపురాణము।శతసహస్రగ్రంథబంధురంబు। శతసహస్ర- నూరువేలు।గ్రంథ-శ్లోకములతో।బంధురంబు-కూడినది।అయ్యెన్-అయినది।అందు-దానిలో।సౌరసంహిత-సౌరసంహిత।వెయ్యి-సహస్రశ్లోకములుగలది। శాంకరసంహిత-శాంకరసంహిత। ముప్పదివేలు- ముప్పదివేలశ్లోకములుగలది।వైష్ణవసంహిత-వైష్ణవసంహిత।అయిదువేలు- అయిదువేలశ్లోకములుగలది। బ్రహ్మసంహిత-బ్రహ్మసంహిత।మూడువేలు-మూడువేలశ్లోకములుగలది।సూతసంహిత- సూతసంహిత। ఆరువేలు-ఆరువేలశ్లోకములుగలది।సనత్కుమారసంహిత-సనత్కుమారసంహిత। యేబదియైదువేలు-యేబదియైదువేలశ్లోకములుగలది। యీసంహితలయందు-యీగ్రంథములలో।నాగరఖండంబును-బ్రహ్మోత్తరఖండంబును-కాశీఖండంబును- కేదారీఖండంబును- శ్రీశైలఖండంబును- కాళహస్తిఖండంబును- శివరహస్యఖండంబును- కదలీఖండంబును- ద్రాక్షారామఖండంబును- క్షీరారామఖండంబును - గోదావరీఖండంబును- మైలారఖండంబును- భీమఖండంబును- ధర్మఖండంబును- అరుణాచలఖండంబును-జ్ఞానయోగఖండంబును-యజ్ఞవైభవఖండంబును- బదరీఖండంబును- గోకర్ణఖండంబును- మధురాఖండంబును- వర్ణవైభవఖండంబును- పట్టసఖండంబును- అహోబలఖండంబును - కాశ్మీరఖండంబును- కృష్ణాఖండంబును- ఏకవీరఖండంబును- బ్రహ్మపూర్వఖండంబును- గాయత్రీఖండంబును - శైవాగమఖండంబును- మొదలుగాగల- మొదలైన। యేబదిఖండంబులు- పంచాశత్ఖండంబులు । మించున్-అతిశయించును। అందున్- వానిలోను॥

తా ॥ స్కాందపురాణములోని యీయైదు సంహితలలో నాగరఖండము మొదలైన యేబదిఖండంబులు నగరాదినిర్మాణాదిమహిమలనుగురించినవైయుండెను॥ ౭౩

ఉ ॥ ధరలోనన్ దశమాష్టనామము ప్రసిద్ధప్రక్రియన్ బొందుచున్ । స్థిరమై యొ
ప్పు పురాణముల్ వరబుధశ్రేణుల్ ప్రమోదించిచూ । తురువిభ్రాజితవిశ్వకర్మమహి
మాస్తోకంబునై యొప్పునా । గరఖండంబు దనర్చు ఖండములలో స్కాందాగ్రభా
గంబునన్ ॥

టీ॥ ధరలోనన్-పుడమిలో।దశమాష్ట- అష్టాదశమను। నామము-పేరును- ప్రసిద్ధప్రక్రియన్।ప్రసిద్ధ-ప్రకటమైన।ప్రక్రియన్-రతిచేతను।పొందుచున్- చెందుచును।స్థిరమై-శాశ్వతమై।ఒప్పు-తగిన।పురాణముల్- ప్రాచీనగ్రంథములను।వరబుధశ్రేణుల్ । వర- శ్రేష్ఠులైన। బుధ- విద్వాంసులయొక్క।శ్రేణుల్-పఙ్క్తులు । ప్రమోదించి- సంతోషించి।చూతురు-వీక్షింతురు। విశ్వకర్మమహిమాస్తోకంబునై- విశ్వకర్మ- విశ్వకర్మయొక్క।మహిమ-ప్రభావముచే। అస్తోకంబునై- అతిశయమైనదై। ఒప్పు-ప్రకాశించుచున్న। నాగరఖండంబు- నాగరఖండమనుగ్రంథము । ఖండములలోన్ - యేబదిఖండములలోను।

స్కాందాగ్రభాగంబునన్ । స్కాంద- స్కాందపురాణముయొక్క । అగ్రభాగంబునన్- మొదటను। తనర్చు- ప్రకాశించును॥

తా॥ లోకములోని పెద్దలు పదునెనిమిది పురాణములను ప్రేమతోఁ జదువుచుందురు-విశ్వకర్మ యొక్క మహిమను తెలియఁజేసెడు ఈనాగరఖండముస్కాందపురాణాగ్రభాగమందుటచే దీనిని సంతోషములోఁ జూతురు॥ ౨౪

చ॥ శరవణసంభవుండు మును సంతసమొప్పఁగ నొక్కనాఁడు శం । కరు నడిగెన్ జ
గజ్జననకారణ మెవ్వఁ డటంచు నీశ్వరుం । డరుదుగఁ దెల్పెఁ బుత్త్రునకు నా శిఖివాహనుఁడు దె
ల్పె మైత్రి మ । ద్గురునకుఁ దెల్పె నమ్ముని యనుగ్రహమి నాకది మీకుఁ దెల్పెదన్॥

టీ॥ శరవణసంభవుడు।శరవణ-రెల్లుయందు। సంభవుడు- పుట్టినకుమారస్వామి।మును-మును ఘటికాలమందు। సంతసమొప్పగన్।సంతసము-సంతోషము। ఒప్పగన్-పొడమగా। ఒక్కనాడు-ఒకదినము।జగజ్జననకారణము।జగత్-లోకములయొక్క।జనన- పుట్టుకకు। కారణము-హేతువు।ఎవ్వడు-ఎవరు।అటంచు-అటులనుచు। శంకరున్- తండ్రియగుసాంబమూర్తిని । అడిగెన్-అడిగెను।ఈశ్వరుండు-శివుడు।పుత్త్రునకున్-కొమరునకు।అరుదుగన్-అబ్బురముగ। తెలిపెన్-తెలియచేసెను। ఆశిఖివాహనుడు- ఆమయూరవాహనుడగుకుమారస్వామి । మైత్రిన్-చెలిమిచే। మద్గురునకున్। మత్-నాయొక్క। గురునకున్- గురువైనవ్యాసులవారికి। తెలిపెన్-చెప్పెను।అమ్మునియు-ఆవ్యాసఋషీశ్వరుడు।కూరిమిన్-ప్రేమచేత। నాకున్- నాకును। తెలిపెన్-బోధించెను। అది-దానిని।మీకున్-మీకు। తెల్పెదన్- చెప్పెదను॥

తా॥ కుమారస్వామి ఒకనాడుతండ్రినిఅడుగగా ఆయన కుమారునకు జగత్కారణమును చెప్పెను కుమారస్వామి వ్యాసులకుచెప్పెను ఆయననాకుచెప్పెను అదిమీకుచెప్పెదను॥ ౨౫

## కైలాసగిరివర్ణనము.

ఉ॥ వాసవముఖ్యదేవమునివారగణాధిపశేషభూషణా । వాసము సిద్ధయోగిజ
నవల్లభముక్తిసతీపదాంబుజ । న్యాసము కాంతదిక్కరివరాద్రివికాసము నై తన
ర్చు కై । లాసము దివ్యయోషిదుపలాలితపుష్పవనీవిలాసమై॥

టీ॥ వాసవముఖ్యదేవమునివారగణాధిపశేషభూషణావాసము । వాసవ - దేవేంద్రుడు।ముఖ్య-మొదలగు।దేవ- సురలకును। ముని-ఋషులయొక్క।వార- సమూహమునకును।గణాధిప-విఘ్నేశ్వరునకును।శేష- ఆదిశేషువు। భూషణా- ఆభరణముగాగలసాంబమూర్తికిని। ఆవాసము-నివాసమైనదియు । సిద్ధయోగిజనవల్లభముక్తిసతీపదాంబుజన్యాసము। సిద్ధ- సిద్ధులయొక్కయు। యోగిజనవల్లభ- ఋషీశ్వరులయొక్కయు।ముక్తిసతీ- ముక్తికాంతలయొక్కయు। పదాంబుజ- పాదపద్మములయొక్క।న్యాసము-ఉంచడముకలదియు।కాంతదిక్కరివరాద్రివికాసమును।కాంత- సుందరములైన।దిక్కరివర- దిగ్గజశ్రేష్ఠములయొక్కయు । అద్రి- కొండలయొక్కయు। వికాసము - ప్రకాశముకలదియును।ఐ-అయి। దివ్యయోషిదుపలాలితపుష్పవనీవిలాసము। దివ్యయోషిత్- దేవతాస్త్రీలచేత। ఉపలాలిత। పోషించబడిన। పుష్పవని- పూదోటలయొక్క- విలాసమై - సొగసులుగలదై। కైలాసము-కైలాస పర్వతము। తనర్చు- ప్రకాశించెను॥

తా ॥ కైలాసము ఇంద్రాదిదేవతలకును ముక్తికాంతలకును మంచి యుద్యానవనములకును ఆటపట్టు॥ రా॥

సీ ॥ అచ్చోటబుట్టిన యవనీరుహములెల్ల గామితార్థములిచ్చు కల్పవల్లు। లచ్చో
టబుట్టిన యశ్మసంఘములెల్ల నెరిమించు చింతామణీకులంబు । లచ్చోటదనరు
పద్మాయతేక్షణలెల్లనభిరూపరుద్రకన్యామతల్లు । లచటమెలంగెడునట్టిధేనువు లె
ల్లకమనీయమూర్తులౌ కామసురభు । లచటగలకొలనులెల్లనమృతపదము।లచ
టగలవారలెల్ల ఫాలాక్షుసదృశు । లనగలోకోన్నతఖ్యాతినలరెపరమ । పావనం
బైనకైలాసపర్వతంబు॥

టీ॥ అచ్చోటన్- ఆకైలాసమందు। పుట్టిన- మొలచిన-అవనీరుహములెల్లన్- చెట్లులన్నియు। కామితార్థములు-కోరికలను।ఇచ్చు-ఒసగెడు। కల్పవల్లులు-కల్పవృక్షపుతీగెలే। అచ్చోటన్-అచటను। పుట్టిన-కలిగిన- అశ్మసంఘములెల్లను- రాలగుంపులన్నియు। నెరిమించు।నెరి- మిక్కిలి। మించు-ఘనత కెక్కిన। చింతామణీకులంబు ।చింతామణి- చింతారత్నముయొక్క। కులంబు-జాతియే- అచ్చోటన్- అస్థలమందు।తనరు-ఒప్పుచున్న। పద్మాయతేక్షణలు। పద్మ- కమలములవలె। ఆయత-విస్తారములైన।ఈ క్షణలు-చూపులుగలస్త్రీలు। ఎల్లన్- అందరు। అభిరూపరుద్రకన్యామతల్లులు।అభిరూప- మంచిస్వరూపములుగల। రుద్రకన్యామతల్లులు- శివునియొక్కశ్రేష్ఠకన్యలే। అచటన్- ఆప్రదేశమందు। మెలంగెడునట్టి- సంచరించుచున్నట్టి। ధేనువులెల్లన్- ఆలలన్నియు । కమనీయమూర్తులు। కమనీయ-సుందరమైన। మూర్తులు- స్వరూపములుగలవి । ఔ- అయిన। కామసురభులు - కామధేనువులే।అచటన్-ఆస్థలమందు।కలకొలనులెల్లన్। కల- కలిగిన। కొలనులెల్లన్- సరస్సులన్నియు। అమృతపదములు। అమృత-సుధకు। పదములు-స్థానములే। అచటన్- అక్కడను। కలవారలెల్లన్-ఉన్నజనులందరు। ఫాలాక్షసదృశులు।ఫాలాక్ష- నొసటికన్నుగలశివునితో। సదృశులు- సమానులే।అనగన్-అనునట్లుగ।లోకోన్నతఖ్యాతిన్ ।లోక-జగత్తులయందు। ఉన్నత- గొప్పదియగు। ఖ్యాతిన్- కీర్తిచేత। పరమపావనంబైన-మిక్కిలి పవిత్రమైన। కైలాసపర్వతంబు- కైలాసమనుకొండ। అలరెన్- ప్రకాశించెను॥

తా॥ కైలాసపర్వతమందు కల్పవృక్షములుచింతామణులుశివకన్యకలుకామధేనువులుశివుని సమానరూపముగలవారలు కలరనియుకొండలలోకైలాసము బహుగొప్పదియనియు॥ రా॥

ఉ॥ ఎన్నివియత్ప్రవాహములొయెన్నివిధాతృకరోటికోటులో । యెన్నిశశాం
కరేఖలొసమృద్ధిగనారజితాద్రిగాపురం। బున్నగణంబులెల్లమహిమోన్నతిమిన్న
నబారునేరులన్।గ్రొన్నెలబువ్వులన్ బునుకకోటులుబూనుదురెంతచిత్రమో॥

టీ॥ వియత్ప్రవాహములు। వియత్-ఆకాశమందుండెడిగంగయొక్క। ప్రవాహములు- జాలులు।ఎన్నియో- ఎన్నియుండెనో । విధాతృకరోటికోటులు। విధాతృ - బ్రహ్మయొక్క । కరోటి-పుఱ్ఱెలయొక్క। కోటులు-సమూహములు। ఎన్నియో-ఎన్నో। శశాంకరేఖలు।శశాంక-చంద్రునియొక్క।రేఖలు-కళలు।ఎన్నియో- ఎన్నిగలవోసుమీ।సమృద్ధిగన్-నిండుగ।యారజితాద్రిన్-ఆవెండికొండయందు। కాపురంబున్నజనంబులు।కాపురంబున్న-నివాసులైన।జనంబులు- జనులు।ఎల్లను-అందరును।మహిమోన్నతిన్।మహిమ- ప్రభావముయొక్క। ఉన్నతిన్- ఎక్కువచేత। మిన్ననబారునేరులన్। మిన్నన-ఆకస

మందు। పారు- ప్రవహించెడి। ఏరులన్- గంగానదులనును। క్రొన్నెలపువ్వులన్। క్రొన్నెల-బాలచంద్రుల నెడు। పువ్వులన్। పుష్పములనును। పునుకకోటులన్। పునుక- బ్రహ్మకపాలములయొక్క। కోటులన్-సమూహములను। పూనుదురు- తాల్చెదరు। ఎంతచిత్రమో - ఎంతఆశ్చర్యమో॥

తా॥ ఆకైలాసపర్వతమందుండువారలందరును శివసారూప్యము కలిగియుండిరి॥ ౭౫

ఈ॥ హరమకుటేందుచంద్రికలనానికరంగువిధూపలంబులన్। దొరగుజలంబులేరులయితుంపెసలారును సానుసీమలన్। బరువడి గాలివేగమున బైకెనెదిర్చి నశీకరావళుల్। సురవనితాకుచాగ్రములసొంపగుముత్యపుపేరులోయనన్॥

టీ॥ హరమకుటేందుచంద్రికలన్। హర- సాంబమూర్తియొక్క। మకుట-కిరీటమందలి। చంద్రికలన్-వెన్నెలలను। ఆని-పొంది। కరంగు- ద్రవించిన। విధూపలంబులన్। చంద్రకాంతమణులవలన। తొరగు-బయలుదేరు। జలంబులు- ఉదకములు। ఏరులయి- నదులయి। సానుసీమలన్। సాను-చరియలయొక్క। సీమలన్-ప్రదేశములయందు- పరువడిన్- మిక్కిలివడిగా। గాలివేగమున-గాలివడిచేత-పైకిన్-మీదికి। ఎదిర్చి- ఎగిరిన। శీకరావళుల్- తుంపురులపఙ్క్తులు। సురవనితాకుచాగ్రములన్-సురవనితా-దేవతాస్త్రీలయొక్క। కుచాగ్రములన్- చన్నులమీదను। సొంపగు-సొగసైన। ముత్యపుపేరులోయనన్- ముత్యాలహారములాయేమిఅనునటుల। తుంపెసలారును-తోణకెను॥

తా॥ ఆకైలాసపర్వతమందు సాంబమూర్తియొక్క శిరస్సుననున్న చంద్రరేఖయొక్క వెన్నెలలవల్ల అక్కడిచంద్రకాంతమణులు కరగిచరియలలోపడి సెలయేరులై పారుచుండగా పైకెగసినతుంపురులు దేవతాస్త్రీలయొక్క కుచమండలములమీదిముత్తియపుపేరులవడువున నుండెను॥ ౭౬

క॥ వరహీరదండసుఘటిత। స్థిరతరచిత్రాతపత్రసితకలశమనా। నురగేంద్రశిరస్సంభృత। ధరపైనవ్వెండికొండతద్దయునొప్పెన్॥

టీ॥ ఆవ్వెండికొండ-ఆరజితాద్రి। వరహీరదండసుఘటితస్థిరతరచిత్రాతపత్రసితకలశము। వర-శ్రేష్ఠమైన। హీరదండ-వజ్రపుకామతో। సుఘటిత- బాగాకూర్చబడిన। స్థిరతర-మిక్కిలిగట్టిదైన। చిత్ర-విచిత్రమైన। ఆతపత్ర-గొడుగుయొక్క। సిత- తెల్లని। కలశము-చెంబు। అనాన్-అనునటుల। ఉరగేంద్రశిరస్సంభృతధరపైన్। ఉరగేంద్ర-ఆదిశేషువుయొక్క। శిరః- పడగలచేత। సంభృత- మోయబడిన। ధరపైన్-భూమిమీదను। తద్దయున్-మిక్కిలియు। ఒప్పెన్-ప్రకాశించెను॥

తా॥ వజ్రపుకఱ్ఱకలిగిన గొడుగుమీదికొప్పెరవలె ఆదిశేషునితలలమీదనున్న వెండికొండచూడముచ్చటాయెను॥ ౭౭

ఉ॥ ప్రీతిమెనర్చునగ్గిరిని కేతుయోగ్యదరీఘునప్రసవం। తీతటజాతరూపధరణీరమణీయమణీసమగ్రమై। స్ఫీతసుధాంబుపూరసరసీవరశీకరశీతలానిలా। స్ఫీతవిహారదేవతరుణీహరిణీకరిణీసమూహమై॥

టీ॥ అగ్గిరి-ఆకైలాసము-దరీఘునప్రసవంతీతటజాతరూపధరణీరమణీయమణీసమగ్రమై-దరీ-గుహలయందున్న। ప్రసవంతీ- సెలయేరులయొక్క। తట-ప్రాంతములయందలి। జాతరూపధరణీ-బంగరునేలయందు। రమణీయ-సొగసైన। మణీ-నవరత్నములచేత। సమగ్రమై - సంపూర్ణమై। స్ఫీతసుధాంబుపూరసరసీవరశీకరశీతలానిలాస్ఫీతవిహారదేవతరుణీహరిణీకరిణీసమూహమై। స్ఫీత-దట్టమైన। సుధా-

అమృతమువంటిది। అంబుపూర- ఉదకప్రవాహముగల। సరసీ - కొలనులయందలి। వర- శ్రేష్ఠములైన। శీకర-తుంపురులచేతను। శీతం-చల్లనైన।అనిల- వాయువుతో। అన్విత-కూడుకొనిన।విహార-సంచారములుగల। తరుణీ- స్త్రీలయొక్కయు। హరిణీ- లేళ్లయొక్కయు। గరిణీ - ఆడుఏనుంగులయొక్కయు। సమూహమై-గుంపులుగలదై।నిరీక్షణ- చూచుటను।ఒనర్పక-చేయగా। ప్రీతిక-ప్రేమను।ఒనర్చుక-చేయును॥

తా ॥ ఆకైలాసపర్వతముసువర్ణరత్నమయమైనదియు-స్వచ్ఛములుమధురములైనజలములుగల సరస్సులుగలదియును - దేవతాస్త్రీలకును మృగములకును విహారయోగ్యమైనది॥ ౯౧

సీ ॥ ఈదాపునీలంబులెల్లఁదుమ్మెదలుగాఁ కెంపులుజిగురాకుగుంపుగాఁగ। గ్రమ్మిన మగమానికమ్ములువిరులుగాఁ చంద్రకాంతములుగుచ్ఛములుగాఁగ। నలరుగోమేధికంబులు తేనియలుగాఁగ శృంగముల్కొమ్మల చెలువుగాఁగ। నవగైరికాదిధాతువులుపుప్పొడిగాఁగ గిరిజగంధము పువ్వువాసనగ। కిన్నరస్త్రీలపలుకులు కీరభాషణములుగా నిచ్ఛభక్తగణములకమృత। ఫలము లొసగుచు మహిత కల్పకమురీతి। భాసురంబుగనుండు నప్పర్వతంబు॥

టీ॥ అప్పర్వతంబు- ఆకైలాసగిరి। ఈదాపునీలంబులెల్లఁ- ఈదాపు-యీదగ్గిరనున్న।నీలంబులు-ఇంద్రనీలమణులు।ఎల్లఁ- అన్నియు। తుమ్మెదలుగాఁ- భ్రమరములుగను। కెంపులు-పద్మరాగమణులు।చిగురాకుగుంపులుకాఁగ। చిగురాకు- కిసలయములయొక్క। గుంపులుకాఁగ- ప్రోవులుగను।క్రమ్మిన- క్రమ్ముకొనిన ( వ్యాపించిన ) మగమానికమ్ములు- వజ్రములు। విరులుకాఁ- పుష్పములుగను।చంద్రకాంతములు- శశికాంతమణులు। గుచ్ఛములుగాఁగ- గుత్తులుగాను। అలరు - ఒప్పుచుండెడు। గోమేధికంబులు- గోమేధికమణులు। తేనియలుకాఁగ- మకరందములై యుండను। శృంగముల్ - గిరిశిఖరములు। కొమ్మలచెలువుకాఁగ- కొమ్మల-శాఖలయొక్క। చెలువు- విధము। కాఁగ-అవునట్లు-నవగైరికాధిధాతువులు - నవ- క్రొత్తవియగు। గైరికాదిధాతువులు- జేగురుమొదలైనరంగులు। పుప్పొడికాఁగ- పుష్పపరాగమైయుండ। గిరిజ- కొండవలనబుట్టిన। గంధము-సువాసనపుష్పపరిమళముగ। పుష్ప-పువ్వులయొక్క। పరిమళముగ- మంచివాసనగాను। కిన్నరస్త్రీలపలుకులు-కిన్నరస్త్రీల-కిన్నరస్త్రీలయొక్క। పలుకులు-మాటలు।కీరభాషణములుగాఁ। కీర-చిలుకలయొక్క।భాషణములుగాఁ-పలుకులుగాను।ఇచ్ఛఁ-ఆసక్తిచేత। భక్తగణములకుఁ- ప్రమథగణములకు। అమృతఫలములు-తియ్యనిఫలములను ( మోక్షఫలములను ) ఒసగుచుఁ- ఇచ్చుచు। మహితకల్పకమురీతిఁ।మహిత-ప్రసిద్ధమైన। కల్పకమురీతిఁ- కల్పవృక్షమువలె। భాసురంబుగఁ- ప్రకాశముగను। అప్పర్వతంబు-ఆకైలాసపర్వతము। ఉండఁ- ఉండగా॥

తా ॥ ఆకైలాసముపరిణామాలంకారముచేత కల్పవృక్షమువలెఅమృతఫలనిచ్చుచున్నది॥ ౯౨

చ ॥ హితముగనొండు రెండడుగులిచ్చటికిం జనుదేర బైటి రే। నతులితలీలబ్రహ్మపదమైననొసంగుదుమన్న రీతిసం। స్తుతపరమేష్ఠిలోకముఖచుంబిశిఖావళిగల్గు దేవతా। యతనములుల్లసిల్లనుతదాశ్రమసీమ సహస్రసంఖ్యముల్॥

టీ ॥ అతులితలీలఁ। అతులిత- సాటిలేని। లీలఁ-విలాసముచేత। హితముగఁ- ఇష్టముగను। ఇచ్చటికిఁ- ఇక్కడికి।ఒండు - ఒకటి। రెండు-రెండైన। అడుగులు-అంజలు। బైటదేరి- బయిలుదేరి।

మెట్టిరేని- వచ్చియుండిరేని। బ్రహ్మపదమైనను। బ్రహ్మ-బ్రహ్మదేవునియొక్క। పదమైనను-లోకమునైనను। ఒసంగుదము- ఇచ్చెదము। అన్నరీతిఁ-అనులాగున। సంస్తుతపరమేష్ఠిలోకముఖచుంబిశిఖావళిగల్గి। సంస్తుత-స్తోత్రముచేయబడిన। పరమేష్ఠి- బ్రహ్మయొక్క। లోక- సత్యలోకముయొక్క। ముఖ-అగ్రభాగమును। చుంబి-స్పృశించుచున్న। శిఖ-శిఖరములయొక్క। ఆవళి- పఙ్క్తులు। కల్గి-కలిగిన। దేవతాయతనములు। దేవత-సురలయొక్క। ఆయతనములు- ఇండ్లు। సహస్రసంఖ్యములే। సహస్ర- వేయి। సంఖ్యములే -లెక్కలుగలవియై। తదాశ్రమసీమఁ। తత్- ఆకైలాసపర్వతముయొక్క। ఆశ్రమ- ఆశ్రమములయొక్క। సీమఁ-ప్రదేశమందు। ఉల్లసిల్లును- ప్రకాశించును॥

తా॥ ఆకైలాసపర్వతమందుండు వేల్పులమేడలుసత్యలోకమునకు కొంచెమెచ్చుతగ్గుగనున్నవని చెప్పుటచేతగొప్పవి॥ ౯౩

సీ॥ రుచినేకఏవరుద్రోనద్వితీయోవతస్థేయనెడుమత్తశిఖిగణంబు । తగశివాదన్యథాదైవతంనాజజానేయనుశారికానికరములును। సంతతంబునుమహేశాన్నాపరోదేవయనుచుబల్కువనప్రియవ్రజంబు । భావించుకొనిశివాత్పరతరంనాస్తియంచునుతించు రాజకీరనిచయంబు। ననుపమానూనమహితసమాభిరామ। సామగానక్రియాభేదసరణిమ్రోయ । మదవదిందిందిరంబులమహిమదనరి । సుందరంబగుకైలాసమందిరంబు॥

టీ॥ కైలాసమందిరంబు- కైలాసగృహము। రుచిఁ- ప్రేమచే। ఏకఏవరుద్రోనద్వితీయోవతస్థే-రుద్రః-సదాశివుఁడు। ఏకఏవ-ఒక్కఁడే। ద్వితీయః-రెండవవాఁడు। నావతస్థే-ఉండఁడు। యనెడు- ఇటులబల్కెడు। మత్తశిఖిగణంబు। మత్త- మదించిన। శిఖి-నెమళ్లయొక్క। గణంబు-గుంపును। తగఁ-ఒప్పనటుల। శివాదన్యథాదైవతంనాజజానే। శివాత్ - సాంబమూర్తికంటెను। అన్యథా-మరియొకరీతిచేత। దైవతం- దేవునిని। నాజజానే-ఎరుగను। అను-అనెడు। శారికా-గోరువంకలయొక్క। నికరములును- సమూహములును। సంతతంబును- ఎల్లప్పుడును। మహేశాన్నాపరోదేవః। మహేశాత్-సాంబమూర్తికన్నను। అపరః- మరియొక। దేవః- దేవుఁడు। న- లేఁడు। అనుచుఁ-అని। పల్కు-వచించు। వనప్రియవ్రజంబు । వనప్రియ- కోయిలలయొక్క। వ్రజంబు-సముదాయమును। భావించుకొని -ఆలోచించుకొని- శివాత్పరతరంనాస్తి। శివాత్- శివునికన్నను। పరతరం- మిక్కిలిగొప్పదైవము। నాస్తి-లేదు। అంచుఁ- పలుకుచు। నుతించుచు- స్తుతించుచున్న। రాజకీరనిచయంబు। రాజ- శ్రేష్ఠమైన। కీర-చిలుకలయొక్క। నిచయంబు - సంఘమును। అనుపమానూనమహితసమాభిరామసామగానక్రియాభేదసరణిఁ। అనుపమ-సాటిలేని। అనూన- తక్కువగాని। మహిత- ప్రసిద్ధమైన। సమాభిరామ- లెస్సగమనోహరమైన। సామ- సామవేదముయొక్క। గానక్రియ- సంగీతకర్మయొక్క । భేద-విశేషములయొక్క। సరణిఁ- పద్ధతిచేత। మ్రోయు- ధ్వనిచేయుచున్న। మదవదిందిందిరంబులమహిమఁ। మదవత్- బలసిన। ఇందిందిరంబుల - తుమ్మెదలయొక్క - మహిమఁ- మహత్త్వచేత । తనరి- ఒప్పి । సుందరంబు - సొగసైనది। అగుఁ- అగును॥

తా॥ ఆకైలాసపర్వతముమీదిప్రతియింటను నెమళ్లు గోరువంకలు కోయిలలు చిలుకలు భ్రమరములుసాంబమూర్తినియెల్లప్పుడుస్తోత్రముచేయుచున్నవి॥ ౯౪

చ॥ మలచక లోఁతులైన మగమానికపుంబలు రోళ్ళలోనఁ బెం । పలయఁగ వేణుతం
డులములూఁచి దినంబు పుళింద రాట్పురీ । లలనలు విద్రుమోరు ముసలంబుల నేను
గుకొమ్మురోకళుల్ । మెలపుగఁ బూని శంకరుని లీలలు పాడుచు దంతు రెంతయున్॥

టీ॥ మలచక-తొలఁకకుండ।లోఁతులైన- అగాధములైన।మగమానికపుంబలురోళ్ళలోనన్। మగమానికపుం-వజ్రపుదైన।బలు-గొప్పవగు।రోళ్ళలోనన్-ఉలూఖలములయందు। ఇంపొలయఁగన్। ఇంపు-సొంపు।ఒలయఁగన్- ఒప్పుచుండునట్లు।వేణుతండులములు-వెదురుబియ్యము।ఊఁచి- పోసి।దినంబు-ప్రతిదినమును।పుళిందరాట్పురీలలనలు।పుళిందరాట్-చెంచురాజులయొక్క। పురీ-వీడులయందలి। లలనలు-స్త్రీలు।విద్రుమోరుముసలంబులన్। విద్రుమ-పగడపుదైన।ఉరు-గొప్ప।ముసలంబులన్-రోకళ్లను। ఏనుఁగుకొమ్మురోకళుల్।ఏనుఁగకొమ్ము-ఏనుఁగ దంతముల నెడు। రోకళుల్-దంచుకఱ్ఱలను।మెలపుగన్-జాగ్రతతో।పూని-పట్టుకొని। శంకరునిలీలలు। శంకరుని-గౌరీపతియొక్క। లీలలు-పాటలను । పాడుచు-చదువుచు।ఎంతయున్-మిక్కిలి।దంతురు-దంచుచుందురు॥

తా॥ ఆకొండమీఁదనుండు పట్టణములయందలి దొరికతలు చెంచెతలు మొదలగు యాటవిక స్త్రీలు వజ్రపురోళ్ళలో వెదురుబియ్యముపోసి పగడపురోకళ్ళతోను ఏనుఁగుకొమ్ములతోను దంగుళ్లు చేసిరి॥ ౯౫

సీ॥ అమరకోటుల వేత్రహస్తుఁడౌ నందికేశ్వరుండు ముందరఁ బరాబరులు సేయఁ। కంక
ణఝణఝణత్కారముల్ దగ రుద్రకన్యలు చామరోత్కరము వీవ జకగిణనకగిణఝుం
ఝుం తరికిటయని తవణించి భృంగి తాండవమొనర్ప । జయజయ భక్తవత్సల శర్వ
యనుచు సనకసనందనాదు లగ్గలికఁ బొగడ। గిరిజ వామాంకతలమున గరము మెఱయ। మా
ననీయ ప్రభాదీప్యమాన రత్న । చిత్ర సింహాసనమున నాసీనుఁడగుచు । హరుఁడు పే
రోలగంబుండె నమితమహిమ॥

టీక॥ హరుఁడు-సాంబమూర్తి।అందు-ఆకొండమీఁదను।వేత్రహస్తుఁడౌ।వేత్ర-బెత్తము। హస్తుఁడౌ-చేతం గలిగిన। నందికేశ్వరుండు- ప్రమథుఁడు। ముందరన్- ఎదుటను।అమరకోటులన్ । అమర-దేవతలయొక్క। కోటులన్- తండములను। బరాబరులు సేయన్-బార్లాచేయఁగా। రుద్రకన్యలు। రుద్ర- ఏకాదశరుద్రులయొక్క । కన్యలు-కన్నియలు । కంకణఝణఝణత్కారముల్ । కంకణ- కడియములయొక్క।ఝణఝణత్కారముల్ - ఝణంఝణధ్వనులు। తగన్- ఒప్పునట్లు। చామరోత్కరము। చామర-వింజామరులయొక్క। ఉత్కరము-సమూహమును। వీవన్-విసరఁగా। భృంగి- భృంగియనెడు ప్రమథుఁడు। జకగిణ-జకగిణ । నకగిణ-నకగిణ।ఝుంఝుంతరికిట - ఝుంఝుంతరికిట అని శబ్దములు కొలిపి । తవణించి-గడుసుమీరి।తాండవము-నాట్యమును।ఒనర్పన్-చేయఁగా। భక్తవత్సల। భక్త-సేవకులయందు।వత్సల-దయకలవాఁడా।శర్వ-ఓ ఈశ్వరుఁడా। జయజయ-గొప్పగనుండుము।అని-అనుచు । సనకసనందనాదులు-సనకాదిఋషులు।అగ్గలికన్-ఎక్కువగా। పొగడన్-కొనియాడఁగా।గిరిజ-పార్వతీదేవి।వామాంకతలమునన్।వామ-ఎడమదియగు।అంకతలమునన్-తొడమీఁదను।కరము-మిక్కిలి। మెఱయన్- ప్రకాశించఁగా। మాననీయప్రభాదీప్యమానరత్నచిత్రసింహాసనమునన్।మాననీయ- మన్నించఁ దగిన ।ప్రభ-కాంతిచేత। దీప్యమాన-ప్రకాశించుచున్న। రత్న-వజ్రము మొదలగు నవరత్నములచేత । చిత్ర-విచిత్రమైన। సింహాసనమునన్-గద్దెయందు। ఆసీనుఁడగుచున్-కూరుచుండి।అమితమహిమన్ । అమిత

ము లేని। మహిమన్-ప్రభావముచేత। పేరోలగంబున్-మొగసాలయందు। ఉండెను-సభచేసెను॥

తా॥ సాంబమూర్తికొలువుకూటములోగద్దెమీదకూర్చుండి నందికేశ్వరుడు భృంగి సనకాదులు తమతమపనులుచేయగా అమ్మవారిని యెడమతొడమీదనునిచికొని దివ్యమహిమతో సభచేసెను॥ ౯౬

మ॥ హరియీతండనలుండితండుశమనుండాతండురక్షోగణే । శ్వరుడాతండు
దధీంద్రుడీతడునభస్స్వంతుండితండెన్నకి । న్నరనాథుండితడీశుడాతడనుచున్ వా
క్ప్రౌఢియక్కొల్వులో। నురుగంభీరతరోక్తినెచ్చరికజేయన్నందిజెన్నొందుచున్॥

టీక॥ ఈతండు- ఈయన।హరి-విష్ణుమూర్తి।ఇతండు- ఈయన। అనలుండు-అగ్నిహోత్రుడు। అతండు-ఆయన।రక్షోగణేశ్వరుడు। రక్షోగణ-రాక్షససమూహమునకు। ఈశుండు- ప్రభుడగు నైబుతి। అతండు-ఆయన।ఉదధీంద్రుడు- వరుణుడు। ఈతడు--ఈయన। నభస్స్వంతుండు-వాయువు।ఇతండు-ఈయన-ఎన్నన్- ఎంచగను- కిన్నరనాథుండు-కుబేరుడు। ఇతడు--ఈయన-ఈశుడు-దిక్పతియగుయీశానుడు। అనుచున్-అంచును। వాక్రుచ్చి-చెప్పి। అక్కొలువులోన్- ఆసభలోను। ఉరుగంభీరతరోక్తిన్।ఉరు-గొప్పదియగు।గంభీరతర- మిక్కిలిగంభీరమైన। ఉక్తిన్-మాటచే। నంది-నందికేశ్వరుడు। చెన్నొందుచున్ । చెన్ను - సొగసుగను । ఒందుచున్ - పొందుచు । ఎచ్చరికచేయన్ - జ్ఞాపకము చేయగా॥

తా॥ నందికేశ్వరుడుసభాముఖమందునుండి సభలోనున్న దిక్పతులు మొదలైనవారిని మహాప్రభువైన సాంబమూర్తికి చోపుదారువలె తెలియజేసెను॥ ౯౭

సీ॥ గోకర్ణవిజయఘంటాకర్ణగజకర్ణ శంఖకర్ణులొకపార్శ్వమునఁగొలువ। కరి
ముఖనరముఖకపిముఖాహిముఖసింహముఖాదులొకవంకనంటిగొలువ । పర్వత
కుండలబ్రహ్మాండకుండలసర్పకుండలులొకచక్కిగొలువ । కుంభోదరనికుంభకుం
భవక్త్రోదర పాండురతను లొక్కసజ్జగొలువ । నజుడుగరుడధ్వజుడునుఘటజు
డుకలహ। భుజుడుబహువిధవేదార్థములనుతింప । నవుడుకన్నులపండువైయల
రెనయ్యు । మాకళత్రునియాస్థానమంటపంబు॥

టీ॥ గోకర్ణవిజయఘంటాకర్ణగజకర్ణ। గోకర్ణ। గో-ఆవుయొక్క। కర్ణ- చెవులుగలవాడును। విజయఘంటాకర్ణులు। విజయఘంట-జయఘంటికలు। కర్ణ - చెవులయందుగలవాడును। గజకర్ణ। గజ-ఏనుంగుయొక్క। కర్ణ- చెవులుగలవాడును। శంఖకర్ణులు-శంఖములుచెవులయందుగలవాడును।ఒక్కపార్శ్వమునన్- ఒకవైపునను। కొలువన్- కొలుచుచుండగా । కరిముఖ నరముఖ కపిముఖాహిముఖసింహముఖాదులు। కరిముఖ-ఏనుగుమోముగలవాడును। నరముఖ- మనుష్యముఖముగలవాడును। కపిముఖ- కోతిముఖముగలవాడును । అహిముఖ- సర్పముఖముగలవాడును । సింహముఖ- సింహముఖముగలవాడును। ఆదులు- మొదలైనవారలు । ఒకవంకన్ - ఒకమూలను। అంటికొలువన్। అంటి- ఉండి। కొలువన్- కొలుచుచుండగా। పర్వతకుండల బ్రహ్మాండకుండలసర్పకుండలులు। పర్వతకుండల।పర్వత- కొండలవంటి । కుండల-పోగులుగలవాడును - బ్రహ్మాండకుండల। బ్రహ్మాండములవంటి।కుండల-పోగులుగలవాడును। సర్పకుండలులు।సర్ప-పాములు। కుండలులు-కుండలములుగరవారలు।ఒకచక్కిన్-ఒకపక్కను। కొలువన్-కొలువగా। కుంభోదరనికుంభకుంభవక్త్రోదరపాండురతనులు।కుంభోదర। కుంభ-కడవవంటి। ఉదర- కడుపుగలవాడును। నికుంభ - నికుంభుడును। కుంభవక్త్రోదర। కుంభ-

కడవవంటి। వక్త్ర-ముఖము।ఉదర-కడుపుగలవాడును। పాండురతనులు।పాండుర- తెల్లని। తనులు-దేహములుగలవారును।ఒక్కపజ్జన్-ఒకదెసను। కొలువన్- సేవించుచుండగా - అజుడు - బ్రహ్మదేవుడు। గరుడధ్వజుడును- గరుడకేతనుడైనవిష్ణువును। ఘటజుడు-కడవవలన।పుట్టినఅగస్త్యమునియు। కలహభుజుడు-కలహాశనుడైన నారదమునీశ్వరుడును। బహువిధవేదార్థములన్। బహువిధ- నానావిధములైన। వేదార్థములన్-వేదార్థములచేత। నుతింపన్ - స్తోత్రములుచేయగా। అప్పుడు। ఆసమయమందు। అయ్యుమాకళత్రుని- ఆపార్వతీదేవిభార్యాగాగలశివునియొక్క। ఆస్థానమంటపంబు- సభాగృహము। కన్నులపండువై। కన్నుల- నేత్రములకు- పండువై- పర్వమై। అలరెన్ - ప్రకాశించెను॥

తా॥ సాంబమూర్తివారి సభాభవనము అనేకులైన మహావీరశైవ భక్తాగ్రణులచేత సేవించబడ్డదై పౌరాణికాదిసప్తాంగములచేత ప్రకాశించెనని॥ ఆసమయంబున॥ ౯౪

చ॥ తిదిమితిదిన్నినాదములు దేవతమామికలంటిమ్రోయగా। వడిదెరగంటిమూ
కపడవారలు వ్రాలగజుట్టుపిట్టుతత్తడినురికింపుచున్ మదిముదంబున వేత్రధరాళి
ముందటం। న్నడిచిబరాబరుల్ తగనొనర్పగవచ్చెమనోజవంబునన్॥

టీ॥ తిదిమితిదిన్నినాదములు। తిదిమితిద- తిదిమితిదియనెడు।నినాదములు-ధ్వనులను।దేవతమామికలు। దేవ-దేవతలయొక్క। తమామికలు - తమామికలనువాద్యవిశేషములు। అంటి-పొంది। మ్రోయగాన్- సందడిచేయుచుండగా-వడిన్- వేగమే। తెరగంటిమూకపడవారలు । తెరగంటి- దేవతలయొక్క। మూక - సేనయొక్క। పడవారలు- నాయకులు । వ్రాలగన్-రాగా।జుట్టుపిట్టుతత్తడిన్- మయూరవాహనమును। ఉరికించుచున్- పరుగెత్తింపుచు। మదిన్ - మనస్సునందు । ముదంబునన్- సంతోషముచేతను- వేత్రధరాళి। వేత్రధర- చోపుదారులయొక్క। ఆళి-పఙ్క్తి।ముందటన్- ఎదుటను। నడచి-వెళ్లి । బరాబరుల్- తెరువులను। తగన్- ఒప్పునట్లు। ఒనర్పగన్-చేయగా।మనోజవంబునన్-మనోవేగముచేతను॥

తా॥ కుమారస్వామి తమామికతమ్మటమ్ములు మ్రోగుచుండగా సేనాపతులు చుట్టుకొనగా మయూరవాహనమెక్కి వెత్తగాండ్రుదోవచేయగా అతివేగమువచ్చిరి॥ ౯౫

వ॥ వచ్చికుమారుండుమారమణుని దివ్యభవనప్రాకారంబునకనతిదూరంబున
నిజమయూర వాహనంబునవరోహణంబుజేసి సముచితపరివారుండై తన్మందిర
ద్వారంబులంగొన్నిగడచి వడివడిందోడన జనుదెంచునాత్మజసహస్తోపాయనంబు
లుంగానెబూనిజగజ్జనకుండును బ్రహ్మాండనాయకుండునగు మహాదేవునింగాంచి
క్రౌంచవిదారుండప్పురవిదారు మహోపహారంబులు తదీయపాదారవిందంబు
ముందరదిరంబుకొల్పిసాష్టాంగ దండప్రణామంబులొనర్చి లేచిఃటలతట ఘటిత
కరకమలుండై యిట్లనిస్తుతియించె॥

టీ॥ కుమారుండు- కుమారస్వామి। వచ్చి- ప్రవేశించి। ఉమారమణుని- పార్వతీపతియొక్క। దివ్యభవనప్రాకారంబునకు। దివ్య-శ్రేష్ఠమైన। భవన- సభామందిరముయొక్క। ప్రాకారంబునకు-ఆవరణమునకు। అనతిదూరంబున- సమీపమందు। నిజమయూరవాహనంబును। నిజ-తనదైన।మయూరవాహనంబును- నెమలితత్తడిని । అవరోహణంబుచేసి- దిగి। సముచితపరివారుండై। సముచిత-తగిన। పరివారుండై- సేవకజనముగలవాడై। తన్మందిరద్వారంబులన్। తత్-ఆ।మందిర- మొగసాలయొక్క।

ద్వారంబులన్-వాకిండ్లను। కొన్ని- కొన్నిటిని। గడచి-దాటి। వడివడిన్- మిక్కిలిత్వరగా । తోడఁ గొలిచి నడచెడు- కూడనడచెడు। ఆత్మజనహస్తోపాయనంబులు। ఆత్మ-తనయొక్క। జన-భటులయొక్క। హస్తోపాయనంబులు। హస్త- చేతులయందలి। ఉపాయనంబులు- కానుకలు। తానె - ఆకుమారస్వామియే। పూని-తాల్చి। జగజ్జనకుండును। జగత్- లోకములకు। జనకుండును-తండ్రియును। బ్రహ్మాండనాయకుండును। బ్రహ్మాండ - అనంతకోటిబ్రహ్మాండకటాహములకు । నాయకుండును - ప్రభువును। అగు-అయిన। మహాదేవునిన్-మహేశ్వరునిని। కాంచి-చూచి। క్రౌంచవిదారుండు। క్రౌంచ- క్రౌంచ పర్వతమును। విదారుండు- బాణముచేతతూటుపొడచినకుమారస్వామి। అప్పురవిదారమహోపహారంబులు। అప్పుర- ఆత్రిపురములను। విదారుని-దహించినశివునియొక్క। ఉపహారంబులు- కానుకలను। తదీయపాదారవిందంబులముందరన్। తదీయ- ఆయీశ్వరసంబంధముతైన । పాదారవిందంబుల - పాదపద్మములయొక్క। ముందరన్-ఎదుటను-తిరంబుకొల్పి-ఉనిచి। సాష్టాంగదండప్రణామంబులు। సాష్టాంగ-ఎనిమిదియగుచేతులుకాళ్లుమొదలగుఅవయవములతోకూడిన। దండప్రణామంబులుకర్రవలెసాగిలపడిచేసిననమస్కారమును। ఒనర్చి-చేసి। లేచి-నిలువబడి - నిటలతటఘటితకరకమలుండై। నిటలతట-నుదుటియందు। ఘటిత-కూర్చబడిన। కరకమలుండై - తామరపువ్వులవంటిచేతులుకలవాడై। ఇట్లని- ఈలాగని । స్తుతియించెన్- స్తోత్రముచేసెను॥

తా॥ కుమారస్వామివారు తనపరిభవములోకూడ మయూరవాహనమెక్కి తనతండ్రియగు సాంబమూర్తియొక్క కైలాసశిఖరమందున్న పురముప్రవేశించి సవినయముగ కానుకలు సమర్పించి నమస్కరించి స్తుతించెను॥

లయగ్రాహి ॥ శ్రీకరబుధోత్తమవశీకరవిలోచనవిభాకరవిరోచనసుధాకరకనచ్చా । మీకరనగేంద్రధనురాకరశయాంబుజ సమీకరిపులోకచయభీకరదయారత్నాకరమునిప్రకరలోకరమణాదివిబుధైకవినుతాంఘ్రియుగయీకలుషబుద్ధిన్। మీకరణియిట్టిదని నాకు వచియింపన్ దరమా కరణవశ్యుడ నిశాకరకిరీటా॥

టీక॥ శ్రీకర। శ్రీ-సంపత్తిని। కర- చేయువాడా। బుధోత్తమవశీకర। బుధోత్తమ-దేవశ్రేష్ఠులను। వశీకర- స్వాధీనపరచుకొనినవాడా। విలోచనవిభాకరవిరోచనసుధాకర। విలోచన-మూడుకన్నులైన। విభాకర- సూర్యుడు। విరోచన-అగ్ని। సుధాకర- చంద్రుడుకలవాడా। కనచ్చామీకరనగేంద్రధనురాకరశయాంబుజ। కనత్- ప్రకాశించుచున్న। చామీకర- బంగారపుదైన। నగేంద్ర- పర్వతరాజైన మహామేరువనెడి। ధనుః- విల్లుకు। ఆకర-స్థానమైన। శయాంబుజ- హస్తపద్మముగలవాడా। సమీకరిపులోకచయభీకర। సమీక- యుద్ధములయందు। రిపులోక-శత్రుజనముయొక్క। చయ- సమూహమునకు। భీకర- భయంకరమైనవాడా। దయారత్నాకర- దయా- కృపకు। రత్నాకర - సముద్రమువంటివాడా। మునిప్రకరలోకరమణాదివిబుధైకవినుతాంఘ్రియుగ। ముని- నారదాదిమునులయొక్క। ప్రకర-సమూహములచేతను। లోక-జగత్తులయొక్క। రమణ-ప్రభువులు। ఆది-మొదలైన- విబుధ-దేవతలచేత। వినుత-స్తుతించబడిన। అంఘ్రి - పాదములయొక్క । యుగ-దోయిగలవాడా। ఈకలుషబుద్ధిన్। ఈ-ఇట్టి। కలుషబుద్ధిన్-పాపబుద్ధిచేత। మీకరణి- మీస్వభావము । ఇట్టిదని- ఇటువంటిదని। నాకున్-నాకు। వచియింపన్-పలుకుటకు- అకరణవశ్యుడ। చక్షురాదియింద్రియములకు స్వాధీనముకానివాడా। నిశాకరకిరీట। నిశాకర- చంద్రుడు। కిరీట- కిరీటమందుగలవాడా। తరమా-శక్యమా॥

తా ॥ కుమారస్వామిసాంబమూర్తితోనిన్ను పొగడుటకు నేనెంతవాడనని మనవిచేసుకొనెను॥౧౦౨

తరల ॥ భువననాయకవిష్ణునాయకభుక్తిముక్తివిధాయకా। భవవిదారణభవ్యకారణపాతకార్ణవతారణా । దివిజపాలనదివ్యఖేలనధీరహృత్పరిశీలనా। శివధురంధరనీలకంధరశిష్టబర్హిణకంధరా॥

టీక॥ భువననాయక। భువన-లోకములకు।నాయక-ప్రభువా। విష్ణునాయక। విష్ణు-సర్వవ్యాపకుడవైన।నాయక-పాలకుడా।భుక్తిముక్తివిధాయకా।భుక్తి- ఆహారమును। ముక్తి- మోక్షమును।విధాయకా-ఇచ్చువాడా।భవవిదారణ। భవ-జన్మమును। విదారణ- పోగొట్టువాడా। భవ్యకారణ-భవ్య-మంగళములకు। కారణ- హేతువైనవాడా। పాతకార్ణవతారణా। పాతక - పాపముల నెడు।అర్ణవ-సముద్రమును।తారణా- దాటించువాడా- దివిజపాలన। దివిజ - దేవతలను। పాలన-రక్షించువాడా। దివ్యఖేలన।దివ్య-శ్రేష్ఠములైన- ఖేలన- క్రీడలుగలవాడా। ధీరహృత్పరిశీలనా। ధీర-జ్ఞానులయొక్క। హృత్-మనస్సులను। పరిశీలనా- వెదకువాడా। శివ- మంగళస్వరూపుడా। ధురంధర-భూభారమును మోచువాడా। నీలకంధర।నీల- నల్లని।కంధర-మెడగలవాడా। శిష్టబర్హిణకంధరా। శిష్ట-సజ్జనుల నెడు।బర్హిణ-జుట్టుపిట్టలకు। కంధరా- మేఘునివంటివాడా॥

తా ॥ సమస్తజగత్కారణుడవనియు సర్వోత్తముడవనియు సర్వగుణసంపన్నుడవనియు మహేశ్వరుని స్తుతియించెను॥ ౧౦౩

వ ॥ అని స్తుతియించి మహాదేవుని యనుగ్రహంబు గైకొని సుఖాసీనుండై యుండె నంత గౌరీదేవి యమ్మహాదేవు నింగనుంగొని యిట్లనియె॥

టీక॥ అని-ఈలాగని।స్తుతియించి- పొగడి। మహాదేవుని యనుగ్రహంబు। మహాదేవుని-సదాశివునియొక్క। అనుగ్రహంబు- కృపను।గైకొని- పొంది । సుఖాసీనుండై। సుఖ-విశాలముగ।ఆసీనుండై। కూర్చున్నవాడై। ఉండెన్-ఉండెను। గౌరీదేవి- తల్లియగు పార్వతీదేవి। అమ్మహాదేవునిన్- ఆమహేశ్వరుని। కనుంగొని-చూచి। ఇట్లనియె- ఇటులబల్కెను॥

తా॥ కుమారస్వామి ఈలాగున స్తుతించగా పార్వతియమ్మవారు పెనిమిటిని జూచి యిటులబల్కెను॥ ౧౦౪

## పార్వతీదేవి ప్రశ్నలు.

ఉ ॥ భోగికలాప మీకరుణఁ బూని రహస్యములై తనర్చు స । ర్వాగమముల్పురాణకథలన్నియు మును విన గల్గెనిప్పుడో । యోగివరేణ్య మానసపయోరుహ రాజమరాళ నాకు వే । వేగ జగంబులెల్ల ప్రభవించుట లెవ్వని చేత దెల్పవే॥

టీక॥ భోగికలాప। భోగి- పాపలు।కలాప- సొమ్ములుగకలవాడా। మీకరుణన్-తమదయను। పూని-పొంది। రహస్యములై- గోప్యములై।తనర్చు-ఒప్పుచున్న। సర్వాగమముల్।సర్వ-సమస్తమైన। ఆగమముల్- శైవవైష్ణవాగమగ్రంథములను। పురాణకథలు । పురాణ-పదునెనిమిది పురాణములయొక్క।కథలు-ఇతిహాసములను। అన్నియున్- యావత్తును। మును- పూర్వము। వినగల్గెన్-వింటిని।ఇప్పుడు-ఈసమయమందు। ఓయోగివరేణ్యమానసపయోరుహరాజమరాళ। ఓ- ఓయి। యోగివరేణ్య-మునిశ్రేష్ఠులయొక్క।మానస- మనస్సుల నెడు। పయోరుహ- పంకజములకు। రాజమరాళ-రాయంచ।నాకున్-నాకొరకు। వేవేగ- మిక్కిలివడిగ। ఎవ్వనిచేతన్- ఏదేవునివలన। జగంబులెల్లన్-అన్నిలోకములు।ప్రభవించుట- పుట్టుట। తెల్పవే- చెప్పుడీ॥

తా॥ ఓప్రాణనాయకా పూర్వముమీరుచెప్పగా అన్నికథలనువింటినిగాని యీప్రపంచములను యెవరుసృజించిరో అదినాకానతివ్వుడనివేడుకొనెను॥ ౧౦౫

సీ॥ సప్తపయోధిలక్షణముకొండలతీరుగ్రహతారకౌఘనక్షత్రగతులు। మునివ
ర్తనము దేవమనుజగంధర్వవిద్యాధరోరగయక్షదనుజరీతు। లనిలప్రచారంబులబ్జ
జముఖలోకపరిమాణమతలాదిపటిమలోహ। పంచకనవరత్న పాషాణజననం
బుధాన్యబీజౌషధీతతులగతులు। నఖిలదేహాండపద్మజాతాండభాండ। గగనగం
ధవహానలకాండధరణి। సంభవంబుచరాచరసముదయంబు। దెల్పవేనాకునమ
రనదీకిరీట॥

టీక॥ సప్తపయోధిలక్షణము। సప్త- ఏడగు। పయోధి- సముద్రములయొక్క। లక్షణము-స్వరూపమును।కొండలతీరు। కొండల- శైలములయొక్క। తీరు- రీతిని।గ్రహతారకౌఘనక్షత్రగతులు।గ్రహ- సూర్యుడుమొదలగునవగ్రహములయొక్కయు।తారక-చుక్కలయొక్కయు।ఔఘ-గుంపులయొక్కయు।నక్షత్ర-అశ్వనిమొదలగునక్షత్రములయొక్కయు।గతుల-నడతలను।మునివర్తనము।ముని-సప్తమహర్షులయొక్క। వర్తనము- నడవడినిన్ని। దేవమనుజగంధర్వవిద్యాధరోరగ యక్షదనుజరీతులు।దేవ-సురలయొక్కయు। మనుజ- మానవులయొక్కయు। గంధర్వ- గంధర్వులయొక్కయు। విద్యాధర-విద్యాధరులయొక్కయు। ఉరగ- సర్పములయొక్కయు। యక్ష- యక్షులయొక్కయు।దనుజ-దానవులయొక్కయు।రీతులు - విధములను। అనిలప్రచారంబులు। అనిల- సప్తవాయువులయొక్క। ప్రచారంబులు- సంచారములను। అబ్జజముఖలోకపరిమాణము। అబ్జజ - పద్మమువలనపుట్టినబ్రహ్మ। ముఖ-మొదలగుదేవతలయొక్క। లోక- ప్రపంచములయొక్క। పరిమాణము- కొలతనున్ను। అతలాదిపటిమ। అతల-అతలలోకము।ఆది- మొదలగుక్రిందిలోకములయొక్క। పటిమ- పటుత్వమును। లోహపంచకనవరత్నపాషాణజననంబు। లోహ- రాగిమొదలగు లోహములయొక్క। పంచక-ఏనింటియొక్కయు। నవరత్న। నవ-తొమ్మిదియైన। రత్న - వజ్రాదిమణులయొక్కయు। పాషాణ - రాళ్లయొక్కయు। జననంబు - పుట్టుకయును। ధాన్యబీజౌషధీతతులగతులును। ధాన్య - వడ్లుమొదలైన నవధాన్యములయొక్కయు। బీజ- విత్తనములయొక్కయు। ఓషధీ - తీగెలుమొదలైనవాటియొక్కయు। తతుల-గములయొక్క। గతులును - రీతులనున్ను। అఖిలదేహాండపద్మజాతాండభాండ గగనగంధవహానలకాండధరణిసంభవంబు। అఖిల- సమస్తజంతువులయొక్క। దేహాండ- ఒడలుతుదిగాగల।పద్మజాత-బ్రహ్మయొక్క-అండభాండ- బ్రహ్మాండభాండములయొక్కయు। గగన- ఆకసముయొక్కయు। గంధవహ। వాయువుయొక్కయు। అనల- అగ్నియొక్కయు। కాండ- నీళ్లయొక్కయు। ధరణి- భూమియొక్కయు।సంభవంబు- పుట్టుకను। చరాచరసముదయంబు। చరాచర- స్థావరజంగములయొక్క। సముదయంబు-సమూహమును। అమరదీనకిరీట। అమరనదీ- ఆకాశగంగను।కిరీట-కిరీటమందుగలయో దేవా-నాకుక్-నాకు। తెల్పవే- చెప్పుడీ॥

తా॥ యీచరాచరవృత్తాంతమునుదయచేసిచెప్పుము॥ ౧౦౬

క॥ వినిమొదజగదాధారం। బునుస ప్తద్వీపముల సము ద్రములనుద। ర్శనమ
ట్కముసంజననం। బునునవఖండాత్మధరణిపొలుపు దెలుపవే॥

టీక॥ జగదాధారంబును। జగత్- లోకములయొక్క। ఆధారంబును- నిలుచువిధంబును-సప్త

ద్వీపములసముద్భవమును। సప్త-ఏడైన। ద్వీపముల- జంబూద్వీపము మొదలైనవాటియొక్క। సముద్భవమును- పుట్టుకయును। దర్శనషట్కముసంజననంబును। దర్శన- వ్యాకరణము మొదలైనశాస్త్రములయొక్క।షట్కము- ఆరింటియొక్క। సంజననంబును- ఉత్పత్తినిని। నవఖండాత్మధరణిపాలువు।నవ-తొమ్మిదియైన। ఖండాత్మ- తునకలయొక్కస్వరూపమైన। ధరణిపాలువుఁ- ధరణి- భూమియొక్క। పాలువుఁ-విధమును। తెలుపవే- ఎరుగింపుము। వినియెద-ఆకర్ణించెదను॥

తా॥ లోకములుఎట్లానిలిచియున్నవోయాసంగతి మొదలైనవాటిని నాకెరుంగబల్కుము॥౧౦౬

గీ॥ అమరగంగాదినదులుపుణ్యస్థలములు। పుణ్యపర్వతములు జగంబులకుఁబది
యును। నెనిమిదియగుశక్తులునిట్టివాని। స్థానవిభవంబులెరింగింపుదయదలిర్ప॥

టీ॥ అమరగంగాదినదులు। అమరగంగ-ఆకాశగంగ। ఆది- మొదలైన- నదులు-ఏళ్లు।పుణ్యస్థలములు। పుణ్య-పవిత్రములైన। స్థలములు-క్షేత్రములు। పుణ్యపర్వతములు। పుణ్య-పావనములైన। పర్వతములు-హిమాలయము మొదలగుకొండలు। జగంబులకుఁ-లోకములకు।పదియునెనిమిది-పదునెనిమిది। అగు-అయినట్టి। శక్తులు-చాముండికాదిపీఠాధిదేవతలును। ఇట్టివానిస్థానవిభవంబులు। ఇట్టివాని- ఇటువంటివెనకచెప్పినవాటియొక్క। స్థాన - నెలవులయొక్క। విభవంబులు - వైభవములను। దయఁ- కృప। తలిర్పఁ-అంకురించునటుల। ఎరిగింపు- తెలియచేయుము॥

తా॥ గంగాదినదులు పుణ్యక్షేత్రములు అష్టాదశపీఠములు మొదలైన వాటియొక్క ఉత్పత్తిస్థానములను తెలియచేయుము॥ ౧౦౭

క॥ అష్టాంగయోగలక్షణ। మష్టైశ్వర్యములు విలసితాష్టతనువులుఁ। సృష్టి
సమష్టివ్యష్టులు। నిష్టివిధానంబునాకునెరిగింపుదయఁ॥

టీ॥ అష్టాంగయోగలక్షణము। అష్టాంగ-యమనియమాదికములగుయెనిమిదైన। యోగ-ధారణలయొక్క। లక్షణము- స్వరూపమును। అష్టైశ్వర్యములు-అణిమాదియెనిమిదియగుసంపత్తులను।విలసితాష్టతనువులుఁ। విలసిత-ప్రకాశించుచున్న। అష్టతనువులుఁ। అష్ట-యెనిమిదియగు।తనువులుఁ-శివశరీరములైన పంచభూతాదికములను। సృష్టిసమష్టివ్యష్టులు। సృష్టి-సృజనయొక్క। సమష్టి-కలియకలను। వ్యష్టులును- విడుటలును। ఇష్టివిధానంబు।ఇష్టి- అశ్వమేధాదియాగములయొక్క।విధానంబు-చేయుటను। దయఁ- అనుగ్రహముచేత। నాకును-నాకుకూడను। ఎరింగింపు-తెలుపుము॥

తా॥ యమనియమాదియోగధారణలు మొదలగువాటిని నాకుచెప్పుము॥ ౧౦౮

సీ॥ తగచతుర్వింశతితత్త్వమార్గములుష ట్త్రింశల్లలితతత్త్వరీతులెల్ల।సరవినిచ్ఛా
క్రియాజ్ఞానశక్తులమహామహిమంబులోకధర్మములజాడ। వరుసధర్మాదిత్రివర్గసం
సిద్ధిమోక్షరమాఫలప్రాప్తిసరణియెట్లు। ఘనసుదర్శన ముద్రికాధారణప్రాణలింగ
ధారణములకులీలలెట్లు।కడుసుషుమ్నాదిపవనమార్గములువంచ। విలసితగ్రంథిభే
దనవిద్యలెట్లు। సాధితలగుషడధ్వలక్షణములెట్లు। కృపనెరింగింపుమోభుజగేం
ద్రకటక॥

టీక॥ తగఁ- తగునట్లు। చతుర్వింశతితత్త్వమార్గములు।చతుర్వింశతి - ఇరువదినాలుగైన। తత్త్వ-తత్త్వములయొక్క- మార్గములు- త్రోవలను।షట్త్రింశల్లలితతత్త్వరీతులెల్లఁ।షట్త్రింశత్-

ముప్పదియారగు। లలిత- సుందరములైన। తత్త్వ- తత్త్వములయొక్క। రీతులెల్లన్-అన్నివిధములను। సరవిన్-క్రమముచే। ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులమహామహిమంబు। ఇచ్ఛ- ఇచ్ఛయనెడు। క్రియ-క్రియయనెడు। జ్ఞాన-జ్ఞానమనెడు। శక్తుల- మూడుశక్తులయొక్క। మహా- గొప్పదియగు। మహిమంబు-మహిమనున్ను। లోకధర్మములజాడన్। లోక- జనులయొక్క। ధర్మముల- ఆచారములయొక్క। జాడన్-మార్గమునున్ను। వరుసన్-క్రమముగా। ధర్మాదిత్రివర్గసంసిద్ధి। ధర్మాది- ధర్మార్థకామముల నెడు। త్రివర్గ-త్రివర్గముయొక్క। సంసిద్ధి- సిద్ధినిన్ని। మోక్షరమాఫలప్రాప్తిసరణి। మోక్షరమా - మోక్షలక్ష్మియొక్క। ఫల-కార్యముయొక్క। ప్రాప్తి - పొందుటయొక్క। సరణి- మార్గమును। అట్లు-ఆలాగున। ఘనసుదర్శనముద్రికాధారణప్రాణలింగధారణములలీలలు। ఘన-గొప్పదియగు। సుదర్శన- చక్రమను। ముద్రిక- ముద్రయొక్క। ధారణ- పట్టుటయు। ప్రాణలింగ- ప్రాణలింగముద్రయొక్క। ధారణముల-పట్టుటలయొక్క। లీలలు-విలాసములు-ఎట్లు-ఏలాగు। కడు-మిక్కిలి। సుషుమ్నాదిపవనమార్గములు। సుషుమ్నాది-ఇళపింగళసుషుమ్నల నెడి। పవన-వాయుధారణయొక్క। మార్గములు- తెరువులు। పంచవిలసితగ్రంధిభేదనవిద్యలు। పంచ-అయిదైన। విలసిత- ప్రకాశించుచున్న। గ్రంధి-చక్రములయొక్క। భేదన-పెకలించెడి। విద్యలు-చదువులు। ఎట్లు- ఏప్రకారము। సాధితలగు- సాధించబడ్డవైన। షడధ్వలక్షణములు। షడధ్వ-షట్- ఆరగు। అధ్వ-మార్గములయొక్క। లక్షణములు-చిహ్నాలు। ఎట్లు- ఏలాగు। కృపన్- దయచేత। ఓభుజగేంద్రకటక। భుజగేంద్ర- ఆదిశేషువు। కటక-కడియములుగాగలఓమహాదేవా। ఎరిగింపుము-తెలియచెప్పుము॥

తా॥ ఓప్రాణనాయకా నేనడిగిన యిరువదినాలుగు తత్త్వములు మొదలగుసంగతులను సవిస్తరముగ నాకు తెలియచేయుము॥ ౧౦౯

చ॥ అవనిసురోద్భవంబుయజనాదిసుకర్మవిశేషముల్ సమి। ద్భువిననివర్తులౌనృ
పుల భూరిచరిత్రముల్ వైశ్యజాతిసం। భవమునుపాశుపాల్యమహిమంబుజఘన్యజ
సృష్టివారిశా। స్త్రవిహితధర్మముల్ దగనుదారదయానిధి నాకు దెల్పవే॥

టీ॥ అవనిసురోద్భవంబు। అవనిసుర-బ్రాహ్మణులయొక్క। ఉద్భవంబు-పుట్టుకను। యజనాదిసుకర్మవిశేషముల్। యజన-యజ్ఞముచేయించుట-ఆది- మొదలైన। సు-మంచివైన। కర్మ- ఆరుకర్మలయొక్క। విశేషముల్-అతిశయములు। సమిద్భువిన్-యుద్ధభూమియందు। అనివర్తులౌ- మళ్లని। నృపులభూరిచరిత్రము। నృపుల- రాజులయొక్క। భూరి - విస్తారమైన। చరిత్రము- వృత్తాంతమును। వైశ్యజాతిసంభవమును। వైశ్యజాతి-కోమట్లయొక్క। సంభవమును- పుట్టుకయును। పాశుపాల్యమహిమంబు। పాశుపాల్య-పశుపాలకత్వముయొక్క। మహిమను మహత్తును। జఘన్యజసృష్టి-జఘన్యజ-నీచజాతులయొక్క। సృష్టి-సృష్టిని వారిశాస్త్రవిహితధర్మముల్। వారి-వెనుకచెప్పినవారలయొక్క। శాస్త్రవిహిత-శాస్త్రోక్తములైన। ధర్మముల్-వృత్తిని। ఉదారదయానిధి। ఉదార- ఉజ్జ్వలమైన। దయానిధి- కరుణాకరుడవైనఓదేవా। నాకున్-నాకును। తెల్పవే- చెప్పుడీ॥

తా॥ నాలుగువర్ణములయొక్కయుఇతరజాతులయొక్కయుజన్మములనువృత్తులనుచెప్పుము॥ ౧౧౦

క॥ అనులోమవిలోమాదుల। యినసంకరజాతివిహితవృత్తులుసకలం। బునుస
విశేషంబుగనే। వినవలతుం దెలియబలుకవేసర్వజ్ఞా॥

టీ॥ అనులోమవిలోమాదులు। అనులోమ- క్రమములైనవి। విలోమ - తలక్రిందులైనవి। ఆది-

మొదలుగాగలవి।అయిన- అయినట్టి। సంకరజాతవిహితవృత్తులు।సంకరజాతి- హీనజాతులకు।విహిత- ఏర్పరచబడిన । వృత్తులు- పనులును। సకలంబును- అంతయును। సవిశేషంబుగ- భేదములతోకూడునట్టుల। నే- ఏను। వినవలతుక్- వినవలయును। సర్వజ్ఞా- అన్నిసంగతులు తెలిసినఓజగదీశ్వరుడా। తెలియబలుకవే- తెలియచెప్పుడీ॥

తా॥ మీరలు అన్నిసంగతులు తెలిసినవారలు గాన వ్యత్యాసములైనసంకరకులముల జీవనవృత్తులను తెలుపుము॥ ౧౧౧

సీ॥ ఖగమృగపంచాస్యకరిహరిసంభవంబులు సృష్టిజలచరస్థలచరములు । చక్ర
వాళాద్రిసంస్థానంబు నింద్రప్రముఖలోకపాలసముద్భవములు పూరుషలక్షణంబు
లు గిరిశ్రేష్ఠకైలాసవినిర్ణయలక్షణంబు। వైకుంఠనగరప్రవరలక్షణంబబ్జసంభవలో
కప్రశస్తి ధ్రువప। దంబు నిర్ణీతి సప్తర్షిధామమహిమ। శింశుమారపదంబునంచితనవ
ప్ర। జాపతులపుట్టువు చతుర్దశమనుజనన । మష్టవసుసంభవ విధంబు నానతిమ్ము॥

టీ॥ ఖగమృగపంచాస్యకరిహరిసంభవంబులు। ఖగ- పక్షులయొక్కయు।మృగ- లేళ్లు మొదలైనవాటియొక్కయు। పంచాస్య- సింగములయొక్కయు। కరి- ఏనుంగులయొక్కయు।హరి-గుఱ్ఱములయొక్కయు। సంభవంబులు- పుట్టుకలను । సృష్టిజలచరస్థలచరములు । సృష్టి-జగన్నిర్మాణమును।జలచర-నీటియందుసంచరించెడుచేపలుమొదలగువాటిని। స్థలచరములు - మెట్టనుసంచరించెడి పాములు మొదలైనవాటిని। చక్రవాళాద్రిసంస్థానంబుక్। చక్రవాళాద్రి-చక్రవాళ పర్వతముయొక్క।సంస్థానంబుక్- నిలుచుటను। ఇంద్రప్రముఖలోకపాలసముద్భవములు। ఇంద్ర-దేవేంద్రుడు । ప్రముఖ- మొదలగు। లోకపాల-దిక్పాలురయొక్క।సముద్భవములు-పుట్టుకలను।పూరుషలక్షణంబులు। పూరుష-మగవారియొక్క।లక్షణంబులు-చిహ్నలను। గిరిశ్రేష్ఠకైలాసవినిర్ణయలక్షణంబు। గిరిశ్రేష్ఠ - కొండలలో మేరువైన। కైలాస-వెండికొండయొక్క।వినిర్ణయ - మితియొక్క।లక్షణంబు - స్వరూపమును।వైకుంఠనగరప్రవరలక్షణంబు। వైకుంఠ-వైకుంఠమనెడు। నగరప్రవర- మంచిపురముయొక్క । లక్షణంబు- రతిని। అబ్జసంభవ- తామరచూలియొక్క। లోక-సత్యలోకముయొక్క । ప్రశస్తి- ప్రసిద్ధిని । ధ్రువపదంబునిర్ణీతి। ధ్రువ- ధ్రువునియొక్క। పదంబు-స్థానముయొక్క। నిర్ణీతి- నిర్ణయమును । సప్తర్షిధామమహిమ। సప్తర్షి- సప్తమహర్షులయొక్క। ధామ - ఉనికిపట్టుయొక్క । మహిమ- మహత్తును । శింశుమారపదంబును।శింశుమార-శింశుమారమనెడునక్షత్రచక్రముయొక్క । పదంబును- స్థానంబును । అంచిత- ఒప్పుచున్న। నవప్రజాపతులపుట్టువు। నవ- తొమ్మండ్రుగురైన- ప్రజాపతుల-బ్రహ్మలయొక్క। పుట్టువు-పుట్టుకను। చతుర్దశమనుజననము । చతుర్దశ- పదునలువురగు । మను-మనువులయొక్క।జననము-పుట్టినరీతిని। అష్టవసుసంభవవిధంబును। అష్ట-ఎనమండ్రగు।వసు-వసువులయొక్క । సంభవ-జననముయొక్క। విధంబును-రీతిని। ఆనతిమ్ము- సెలవివ్వుము॥

తా॥ వెనుకచెప్పిన వాటికన్నిటికిని ప్రత్యుత్తరములు దయచేయుము॥ ౧౧౨

క॥ ద్వాదశరవిసంభవమే। కాదశరుద్రోద్భవముయుగచతుష్టయము। ర్వ్యాదలు
మరివష్టాశర । దాదిగవేళాప్రకారమానతియీవే॥

టీ॥ ద్వాదశరవిసంభవము। ద్వాశ-పన్నిద్దరగు। రవి- సూర్యులయొక్క । సంభవము- పుట్టుకను। ఏకాదశరుద్రోద్భవము। ఏకాదశ- పదునొకండుగురైన।రుద్ర-రుద్రదేవులయొక్క।ఉద్భవ[illegible]

ఉదయమును। యుగచతుష్టయమర్యాదలు । యుగచతుష్టయ - కృతయుగాదిచతుర్యుగములయొక్క। మర్యాదలు-నడవళ్లను। మరి-మరియు।వర్షాశరదాదికవేళాప్రకారము।వర్షా-వర్షఋతువును। శరదాదిక-శరదృతువు మొదలుగాగల । వేళ - సమయములయొక్క । ప్రకారము-విధమును । ఆనతియీవే-సెలవీయుడీ॥

తా॥ పన్నిద్దరైన సూర్యాదులయొక్క జననాది వృత్తాంతమును తెలుపుడీ॥ ౧౧౩

సీ॥ **అనిమిషమానుషహాయనపరిమితి కల్పాంతరంబులకల్పనంబు । అఖిలలోకోత్పత్తియతులితాయుర్వేదముఖ్యభావంబుసాముద్రికాది। మహిమభూషణవినిర్మాణంబుపరిమితిధ్వజపతాకాతపవారణాంక । చామరప్రముఖలక్షణవీధికామరచయముప్రాకారరాజహితచతురు । పాయపంచాంగసరణిసప్తస్వరములు। పృథివికల్పంబులునువాద్యభేదవిధము । అంచితాధ్యాత్మవిధులసిద్ధాంతరీతి । దేహజీవాత్మరూపముల్ దెలుపుమయ్య॥**

టీ॥ అనిమిషమానుషహాయనపరిమితి । అనిమిష-దేవతలయొక్కయు । మానుష- మనుష్యులయొక్కయు। హాయన- సంవత్సరములయొక్క। పరిమితి- ప్రమాణమును।కల్పాంతరంబులకల్పనంబు। కల్పాంతరంబుల। కల్ప- బ్రహ్మకల్పాదికల్పములయొక్క। అంతరంబుల- అవకాశములయొక్క । కల్పనంబు- చేయడమును । అఖిలలోకోత్పత్తి । అఖిల-సకలమైన । లోక-భూర్భువస్స్వర్లోకములయొక్క। ఉత్పత్తి- జన్మమును। అతులితాయుర్వేదముఖ్యభావంబు। అతులిత- సాటిలేని।ఆయుర్వేద - వైద్యశాస్త్రముయొక్క। ముఖ్యభావంబు। ముఖ్య- ప్రసిద్ధమైన। భావంబు- అభిప్రాయమును । సాముద్రికాదిమహిమ। సాముద్రిక-రేఖాపరీక్ష। ఆది-మొదలైనశాస్త్రములయొక్క। మహిమ- ఘనతను।భూషణవినిర్మాణంబు। భూషణ-నగలయొక్క। వినిర్మాణంబు-చేయుటయొక్క। పరిమితి-కొలతయు। ధ్వజపతాకాతపవారణాంకచామరప్రముఖలక్షణము।ధ్వజ- జండాలయొక్క।పతాక-టెక్కెములయొక్క। ఆతపవారణ- గొడుగులయొక్క। అంక-బిరుదులయొక్క।చామర। వింజామరలు। ప్రముఖ- మొదలైనవాటియొక్కయు। లక్షణ- రూపమును। వీధికామరచయము। వీధికా- త్రోవలయందలి । అమరచయము । అమర - దేవతలయొక్క। చయము - సముదాయమును । ప్రాకారరాజహితచతురుపాయపంచాంగసరణి। ప్రాకార- కోటలయొక్కయు। రాజ- ప్రభువులకు। హిత-ఇష్టములైన।చతుః-నాలుగైన। ఉపాయ- సామము మొదలైనఉపాయములయొక్కయు । పంచాంగ। పంచ-అయిదైన। అంగ-రాజ్యావయవములైనరాష్ట్రదుర్గకోశమంత్రిభృత్యులయొక్కయు। సరణి- పద్ధతిని। సప్తస్వరములు। సప్త- ఏడగు।సరిగమపధనిఅనుస్వరములను। పృథివికల్పంబులును- భూకల్పములును । వాద్యభేదవిధములు। వాద్య- మద్దెలమొదలగువాటియొక్క। భేద- భేదములయొక్క । విధములు - ప్రకారములను। అంచితాధ్యాత్మవిధులసిద్ధాంతరీతి। అంచిత-ఒప్పుచున్న। అధ్యాత్మ- వేదాంతముయొక్క।విధుల-విధానములయొక్క। సిద్ధాంత- నిశ్చయముయొక్క। రీతి-విధమును। దేహజీవాత్మరూపముల్, దేహ-శరీరములయొక్క- జీవాత్మ- జీవునియొక్కయు । రూపముల్ - స్వరూపములను । అయ్యా- ఓస్వామీ! తెలుపుము- తెలియచేయుము॥

తా॥ వేదాంత సిద్ధాంతము జీవేశ్వర స్వరూపములు మొదలైనవాటినిచెప్పుము॥ ౧౧౪

వ॥ శబ్దస్పర్శరూపరసగంధవిషయప్రభేదంబులును - మనోనేత్రాదిబుద్ధీంద్రియవికల్పనంబులును- వాగాదికర్మేంద్రియరూపంబులును - తన్మాత్రలక్షణంబును-ద్రవ్యపరిమాణంబును-నామజధాతుజశబ్దక్రమంబులును - ఆక్షేపసమాధానంబులుగలవాదిప్రతివాదిలక్షణంబును - స్వాహాస్వధావషట్కారాది భాషావిభేదంబులును - శృంగారాదినవరసంబులును - కటుతిక్తాదిషడ్రసంబులును- పాకభేదంబులును- పంచయజ్ఞప్రపంచంబును- శాకభేదంబన్నభేదంబును- యాజ్ఞికలక్షణంబును- యజ్ఞశాలాలక్షణంబును - నాట్యశాలాలక్షణంబును - మఠారామప్రకారంబును- రథవీథినిర్ణయంబును- ధాతుమయశాలాలక్షణంబును - చతుశ్శాలాశ్రమలక్షణంబును- కేళీగృహనిర్మాణప్రకారంబును - అంతఃపురగృహాంగణలక్షణంబులును- గవాక్షనిర్మాణలక్షణంబును- కర్ణాటలాటమరాటఅంగవంగకళింగాదినానాదేశలక్షణంబులును- ఘటికాయంత్రఘటనంబును- క్షేపణీయోపలక్షణంబును- శక్త్యాదృష్టగుణప్రభావంబును - మరియులోకంబులందన్నివిశేషంబులుగలవన్నియుందెలియ నానతిమ్మనియమ్మహాదేవునిపార్వతీదేవియడిగెడుసమయంబునకుమారస్వామియిట్లనియె- దేవాయీప్రకారంబేనుపినవలకునానతిమ్మనినయమ్మహేశ్వరుండిట్లనియె॥

టీక॥ శబ్దస్పర్శరూపరసగంధవిషయప్రభేదంబులును । శబ్దస్పర్శరూపరసగంధ - సబ్దస్పర్శరూపరసగంధములనెడి। విషయ - పంచేంద్రియగుణములయొక్క । ప్రభేదంబులును- భేదములనున్న। మనోనేత్రాదిబుద్ధీంద్రియవికల్పనంబులును । మనోనేత్రాది। మనః- మనసస్సు। నేత్ర- కన్నులు। ఆది- మొదలగు।బుద్ధీంద్రియ- జ్ఞానేంద్రియపంచకముయొక్క। వికల్పనంబులును- భేదములను । వాగాదికర్మేంద్రియరూపంబులును। వాగాది। వాక్- వచనము।ఆది-మొదలగు।కర్మేంద్రియ- కర్మేంద్రియపంచకముయొక్క। రూపంబులును- ఆకారములును- తన్మాత్రలక్షణంబును। తన్మాత్ర- పృథివ్యాదిపంచభూతములగుణములైనఅంశములయొక్క । లక్షణంబును - స్వరూపమును । ద్రవ్యపరిమాణంబును। ద్రవ్య- భూమిమొదలైనతొమ్మిదివస్తువులయొక్క । పరిమాణంబును - పరిమితిని । నామజధాతుజధాతుజశబ్దక్రమంబులును।నామజధాతుజశబ్ద- సుబంతతిఙంతశబ్దములయొక్క। క్రమంబును-వరుసను।ఆక్షేపసమాధానంబులుగలవాదిప్రతివాదిలక్షణంబును। ఆక్షేప - నిషేధించడము । సమాధానంబులు- తగుయుక్తులును। కల- కలిగిన। వాదిప్రతివాది । వాది- తర్కించువారు। ప్రతివాది। వ్యతిరేకముగవాదించువారియొక్క। లక్షణంబును - వాస్తవస్థితిని । స్వాహాస్వధావషట్కారాదిభాషావిభేదంబులును। స్వాహా- స్వాహాఅనుదేవతాహ్వానంబును। స్వధా- పితృదేవతలనుపిలుచుటయును। ఆది - మొదలగు। భాషా- పలుకులయొక్క। విభేదంబును- భేదమును। శృంగారాదినవరసంబులును। శృంగారాది- శృంగారము మొదలగు।నవరసంబులును- తొమ్మిదిరములను।కటుతిక్తాదిషడ్రసంబులును।కటు-కారము।తిక్త-చేదు। ఆది- మొదలగు। షట్-ఆరైన। రసంబులును- రుచులను। పాకభేదంబులును। పాక- వంటలయొక్క। భేదంబులును- విధములను।పంచయజ్ఞప్రపంచంబును।పంచ - అయిదైన। యజ్ఞ-దేవఋషిపిత్రాదితర్పణములయొక్క। ప్రపంచంబును- విస్తారమును। శాకభేదంబును। శాక। కూరలయొక్క। భేదంబును- భేదమును।అన్నభేదంబును। అన్న- వంటకముయొక్క। భేదంబును- యాజ్ఞికలక్షణంబును।యాజ్ఞిక-

పూజకులయొక్క। లక్షణంబును- స్వరూపమును। యజ్ఞశాలాలక్షణంబును। యజ్ఞశాల-యజ్ఞగృహము యొక్క।లక్షణంబును- స్వరూపమును। నాట్యశాలాలక్షణంబును।నాట్యశాల-నాట్యరంగముయొక్క। లక్షణంబును-చిహ్నను। మఠారామప్రకారంబును। మఠ- సత్రములయందలి।ఆరామ-తోటలయొక్క। ప్రకారంబును- రీతిని। రథవీథినిర్ణయంబును। రథవీథి- రాజమార్గముయొక్క।నిర్ణయంబును- నిశ్చయమును। ధాతుమయశాలాలక్షణంబును। ధాతుమయ - జేగురుమొదలైనరంగులుగల। శాల- గృహముల యొక్క।లక్షణంబును- ప్రకారమును। చతురాశ్రమలక్షణంబును। చతుః- నాలుగగు। ఆశ్రమ-బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, యత్యాశ్రమములయొక్క। లక్షణంబును- స్వరూపమును। కేళిగృహనిర్మాణప్రకారంబును। కేళిగృహ- కేళికాగృహములయొక్క। నిర్మాణ - చేయుటయొక్క। ప్రకారంబును-విధమును। అంతఃపురగృహాంగణలక్షణంబులును। అంతఃపురగృహ-లోనగరుటిండ్లయొక్క- లక్షణంబును-ప్రకారములను। గవాక్షనిర్మాణలక్షణంబును। గవాక్ష- సోరణగండ్లయొక్క। నిర్మాణ-చేయుటయొక్క। లక్షణంబును- విధమును।కర్ణాటలాటమరాటఅంగవంగకళింగాది నానాదేశలక్షణంబును- కర్ణాట- కర్ణాటదేశము। లాట-లాటదేశము। మరాట- మరాటదేశము। అంగ-అంగము। వంగ-వంగము।కళింగ- కళింగము। ఆది- మొదలగు। దేశ- దేశములయొక్క। లక్షణంబులును- విధములను। ఘటికాయంత్రఘటనంబును। ఘటికాయంత్ర- ఘడియారములయొక్క। ఘటనంబును - చేయుటను। క్షేపణీయోపలక్షణంబును। క్షేపణీయ- అవులయొక్క। ఉపలక్షణంబును- విధమును। శక్త్యాదృష్టగుణప్రభావంబును।శక్త్య- వల్లనైన। అదృష్టగుణ-భాగ్యస్వభావముయొక్క। ప్రభావంబు-మహిమమును। మరియు-ఇంకను। లోకంబులందు- ప్రపంచములలో। ఎన్నివిశేషములు- ఎన్నిపనులు। కలవు-ఉన్నవో। అన్నియుఁ-అన్నిటిని।తెలియఁ- తెలియునట్లు। ఆనతిమ్ము-సెలవిమ్ము।అని-అని।అమ్మహాదేవుని-ఆసాంబమూర్తిని।పార్వతీదేవి- గౌరిదేవి। అడిగెడుసమయంబునఁ- అడుగుచున్నవేళలో। కుమారస్వామి-షణ్ముఖుడు।ఇట్లనియెఁ- ఈలాగనెను-దేవా-ఓతండ్రీ। ఈప్రకారంబు-ఈవిధమును। ఏను- నేను।వినవలతుఁ- వినవలయును। ఆనతిమ్ము- దయచేయుము। అనినఁ- అనగా। అమ్మహేశ్వరుండు-ఆమహాదేవుడైనసదాశివుడు। ఇట్లనియె- ఈలాగనిచెప్పెను॥

తా॥ పార్వతీదేవి వెనకచెప్పిన ప్రపంచసంగతులను చెప్పుమని ప్రియుడైన సాంబమూర్తిని వేడుకొనుచుండగా నచటనున్న మయూరవాహనుడు తద్వృత్తాంతాకర్ణన కుతూహలాయ మాన మానసుండగుటకతన నేనును యీవృత్తాంతంబు వినవలయునానతిమ్మని జనకుని వేడికొనిన కరుణారసభరితుండై చంద్రజూటుం డిట్లని చెప్పందొడంగె॥ ౧౧౪

## సాంబమూర్తి జెప్పెడియుత్తరములు,

సీ॥ భూమియాకసముసభోమణిశీతాంశుదుదధులుబొడమక యున్న యపుడు।
గ్రహములునక్షత్రగణములువహ్నియుపవనంబుసంభవింపకయున్న। బ్రహ్మవి
ష్ణుసురపతిరుద్రవసుదైత్యసంఘమావిర్భవించకయున్న। గిరులువృక్షములు
కిన్నరలుసిద్ధులునుసాధ్యులు గనుపించకయున్నయపుడు। ఘోరచరాచరపఙ్క్తితో
భువనవితతి। యంతకంతనిరాలంబమైనయప్పు। డాఢ్యుడవ్యక్తుడచ్యుతుండనగ
తాన। వెలయుచుండుపరబ్రహ్మవిశ్వకర్మ॥

టీ॥ భూమి- పుడమి। ఆకసము- ఆకాశము- నభోమణి- సూర్యుడు। శీతాంశుడు-చంద్రుడు। ఉదధులు- సముద్రములు। పొడమకయున్నయపుడ- పుట్టనప్పుడు। గ్రహములు - సూర్యుడు మొదలైన గ్రహములును। నక్షత్రగణములు। నక్షత్ర- అశ్విని మొదలగు నక్షత్రములయొక్క। గణములు-సమూహములు। వహ్నియు- అగ్నియు। పవనంబు- వాయువు। సంభవింపకయమున్న - పుట్టకమునుపు। బ్రహ్మ- చతుర్ముఖుడు। విష్ణువు- విష్ణుమూర్తియు। సురపతి- దేవేంద్రుడు। రుద్రవసుదైత్యసంఘము। రుద్ర- ఏకాదశరుద్రులయొక్క। వసు। అష్టవసువులయొక్క। దైత్య- రాక్షసులయొక్క। సంఘము-సమూహము। ఆవిర్భవించకయమున్న- కలుగకమునుపే। గిరులు- కొండలు। వృక్షములు-చెట్లు। కిన్నరులు- దేవయోనివిశేషములు। సిద్ధులు-సిద్ధులును। సాధ్యులును-సాధ్యులును। కనుపించక- చూడబడక। ఉన్నయపుడ- ఉన్నప్పుడే। పొరి- మిక్కిలి। చరాచరపఙ్క్తితో। చర- మనుష్యులు మొదలైనజంతువులయొక్కయు। అచర- కొండలు మొదలైనవాటియొక్కయు। పఙ్క్తితో-చాలుతో। భువనవితతి। భువన-లోకములయొక్క। వితతి-సమూహము। అంతకంత- అక్కడక్కడికి। నిరాలంబమైన-ఆధారములేని। అపుడ-అప్పుడు। ఆఢ్యుడు- సమర్థుడును। అవ్యక్తుడు- కనుపించనివాడును। అచ్యుతుండు। నాశములేనివాడును। అనగన్-అనునట్లు। తాన- తానొకడే- పరబ్రహ్మన్। పరబ్రహ్మమైన। విశ్వకర్మ- విశ్వకర్మ। వెలయుచుండు- ప్రకాశించుచుండును॥

తా॥ ఈలోకములన్నియు లేనివేళ పరాత్పరుడైన సర్వశక్తిసంపన్నుడైన అవాఙ్మానసగోచరుడైన జ్ఞానస్వరూపుడైన విశ్వకర్మయనెడు బ్రహ్మకలడు॥ ౧౧౬

మ॥ అజుడై లోకములన్ సృజించు నవి దైత్యారాతియై పెంచు న ।
ట్టిజగంబుల్ హరుడై హరించు నిటు తం డే సుమ్మి నానాత్మకుం ।
డజరుం డవ్యయుఁ డాదివిగ్రహుడు వేదాతీతుఁ డాఢ్యుండు స ।
ర్వజనస్తుత్యుడు నిత్యుడీశుడు పరబ్రహ్మంబు దా వర్తిలున్॥

టీ॥ అజుడై- చతుర్ముఖుడై। లోకములన్-జగత్తులను। సృజించున్-సృష్టించును। అవి-ఆలోకములను। దైత్యారాతియై। దైత్య- రాక్షసులకు। అరాతియై- శత్రుడైన విష్ణుమూర్తియై। పెంచున్-పాలించును। అట్టిజగంబుల్ - అటువంటిలోకములను। హరుడై- రుద్రుడై। హరించున్-సంహరించును। ఇటు- ఇట్లు। అతండే- ఆవిశ్వకర్మయే- సుమ్మి-సుమీ। నానాత్మకుండు- నానాస్వరూపుడైనట్టియు। అజరుండు- ముదిమిలేనట్టియు। అవ్యయుడు-నాశములేనట్టియు। ఆదివిగ్రహుడు- ఆదిస్వరూపుడు। వేదాతీతుడు। వేద-వేదములకు। అతీతుడు-అతిక్రమించినవాడును। ఆఢ్యుండు- సర్వగుణసంపన్నుడును। సర్వజనస్తుత్యుడును। సర్వ-సమస్తమైన। జన - జనులచేతను। స్తుత్యుడు - స్తోత్రముచేయతగినవాడును। నిత్యుడు- భూతభవిష్యత్కాలములయందుండువాడును। పరబ్రహ్మంబు-పరబ్రహ్మయగు ఆవిశ్వకర్మ। తాన్-తాను। వర్తిలున్- సర్వోత్కర్షముచేత ప్రవర్తించును॥

తా॥ ఆవిశ్వకర్మయనెడు బ్రహ్మ తానొక్కడే బ్రహ్మవిష్ణురుద్రులనెడు త్రిమూర్తి స్వరూపకుడై సృష్టిస్థితిసంహారకుడై ప్రవర్తించెను॥

సీ॥ ఏదేవతారాధ్యుఁ డెందిరాధవముఖ్యమూర్తిత్రయాధ్యుఁడా మొదటివేల్పు।
యేదేవదేవు సమిద్ధతేజము జగదంతర్బహిఃపూర్ణమై వెలుంగు। నేవరంజ్యోతిభూ
యిష్ఠచంద్రాద్యష్టతనువుల జాండమంతయును నిండు। నేవిశ్వమయుసమాహిత

నిమేషోన్మేషములలోకములడంగుబుట్టుచుండు । నతడువేదాంతవేద్యుండనంతుడ
జుడు । సకలదేవసమూహసంస్తూయమాన । చరితభరితుండుసత్కళాచయయు
తుండు । శాశ్వతంబైనబ్రహ్మంబువిశ్వకర్మ॥

టీ॥ ఏదేవతారాధ్యుడు। ఏ- యే। దేవతారాధ్యుడు। దేవత- దేవతలచేతను। ఆరాధ్యుడు- సేవింపబడినవాడు। ఇందిరాధవముఖ్యమూర్తిత్రయాధ్యుడు। ఇందిర-లక్ష్మీదేవికి। ధవ- పెనిమిటియైన విష్ణువు। ముఖ్య-మొదలైన। మూర్తిత్రయ- త్రిమూర్తులకు। ఆధ్యుడు-కర్తయైన మొదటివేల్పు-ఆదిదైవమో। ఏదేవదేవుసమిద్ధతేజము। ఏదేవదేవు। ఏ-యే। దేవ-దేవతలకు। దేవు- ప్రభువుయొక్క। సమిద్ధతేజము। సమిద్ధ- వృద్ధిపొందిన। తేజము- తేజస్సు। జగదంతర్బహిఃపూర్ణమై। జగత్- లోకములయొక్క। అంతః-లోపలను। బహిః-బయలను। పూర్ణమై- నిండినదై। వెలుంగు-ప్రకాశించునో। ఏపరంజ్యోతిభూయిష్ఠచంద్రాద్యష్టతనువులు। ఏ - యే। పరంజ్యోతి - పరమతేజస్సుయొక్క । భూయిష్ఠ- గొప్పవైన। చంద్రాద్యష్టతనువులు । చంద్ర-చంద్రుడు। ఆది- మొదలుగాగల। అష్ట- యెనిమిదగు। మూర్తులు-శరీరములు। అజాండమంతయును। అజాండము- బ్రహ్మాండమును। అంతయున్-యావత్తును। నిండు- వ్యాపించునో। ఏవిశ్వమయుసమాహితనిమేషోన్మేషములు। ఏ- యే । విశ్వమయు - లోకస్వరూపునియొక్క। సమాహిత-కూర్చబడిన । నిమేష- రెప్పపాటువలన । ఉన్మేషములన్ - తెరువులవల్లను। లోకములు- జగములు। అడంగు-నశించునో। పుట్టుచుండు- పుట్టునో। అతడు- ఆదేవుడు। వేదాంత-ఉపనిషత్తులవలన। వేద్యుడు-తెలియతగినవాడు। అనంతుడు-అంతములేనివాడు। అజుడు- పుట్టనివాడు । సకల-సమస్తమై। దేవ- దేవతలయొక్క। సమూహ-సమూహముచేత। సంస్తూయమాన-స్తోత్రముచేయతగిన। గరిత-చారిత్రలచేత। భరితుండు-నిండించబడినవాడు। సత్- యోగ్యములైన । కళాచయ - విద్యాచయములతో। యుతుండు- కూడుకొనినవాడును। శాశ్వతంబైన-స్థిరమైన। బ్రహ్మంబు- బ్రహ్మము। విశ్వకర్మ- విశ్వకర్మయే॥

తా॥ విశ్వకర్మయనెడుబ్రహ్మముత్రిమూర్తులకు మూలమైనవాడు జగములలోలోబయలనువ్యాపించినపరబ్రహ్మము॥

సీ॥ అణుమాత్రమైనవేదాంతములకడముట్టవర్ణింపనేరవెవ్వానిమాయ। యాం
డించుబొమ్మలయట్లబ్రహ్మాదిదే। వతలనుజేయునెవ్వానిమాయ । భేదవాదంబుల
బెనచిమతములవర్తింపజేయునెవ్వానిమాయ। పరగపిపీలికాబ్రహ్మపర్యంతం
బువ్యాప్తమైయుండునెవ్వానిమాయ। వదలగానిదహామికనెవ్వానిమాయ । వాగ
గోచరమయ్యెనెవ్వానిమాయ । యట్టిశ్రీవిశ్వకర్మమహానుభావు। శరవణోదయ
యులవియెసన్నుతింప॥

టీక॥ అణుమాత్రమైనన్- లేశమైనను। వేదాంతముల్ - ఉపనిషత్తులు। యెవ్వానిమాయ-ఎవని మాయాశక్తిని। కడముట్టన్- చివరదనుక। వర్ణింపనేరవు- చెప్పలేవు। ఎవ్వానిమాయ- ఎవనిప్రకృతి। బ్రహ్మాదిదేవతలను। బ్రహ్మ-చతుర్ముఖుడు। ఆది- మొదలగు। దేవతలను-సురలను। బొమ్మలయట్లు-బొమ్మలలాగున। చేయును- చేయునో। ఎవ్వానిమాయ- ఎవనిమాయావిశేషము। భేదవాదంబులన్। భేద-భిన్నములైన। వాదంబులన్- సంవాదములతో। పెనచి- కలిపి। మతములన్ - ఆరుమతములను । వర్తింప

చేయును-ప్రవర్తింపజేసునో। ఎవ్వానిమాయ- ఎవనిమాయాలీల। పరగన్-ఒప్పునటుల। పిపీలికాబ్రహ్మపర్యంతంబు। పిపీలిక-చీమలుమొదలుకొని। బ్రహ్మపర్యంతంబు- బ్రహ్మదేవునిదనుక। వ్యాప్తమై-వ్యాపించినదై। ఉండును- నిలుచునో । ఎవ్వానిమాయ- ఎవనిమాయావైచిత్ర్యము । అహమికను- అహంకారమును। వదలన్-విడుచుటకు। కానిది- వల్లలేనిదో। ఎవ్వానిమాయ। ఎవ్వాని- ఏయీశ్వరునియొక్క। మాయ- అభావలీల। వాగగోచరమయ్యెన్। వాక్- పలుకులకు । అగోచరమయ్యెన్ - చెప్పశక్యముకాదో।అట్టి- అటువంటి। విశ్వకర్మమహానుభావున్- విశ్వకర్మయనుమహాత్ముని।సన్నుతింపన్-స్తుతించుటకు।శరవణోదయ।శరవణ- రెల్లుయందు। ఉదయ- పుట్టినఓకుమారా। అలవియె-శక్యమా॥

తా॥ ఇట్టిమాయామహిమగల విశ్వకర్మను వర్ణించుటకు నాకే యలవికాదు యితరులకేమి చెప్పవలెను॥ ౧౧౯

చ॥ ఇనుడననెవ్వఁడబ్జుడ నెవ్వఁడువిష్ణువనంగనెవ్వఁడం । బునిధియనంగనెవ్వ
డహిపుంగవహారుడనంగనెవ్వఁడ । య్యనిలుడనంగనెవ్వఁడుబలారియునానతనెవ్వ
డెంచగా । ననుపమవిశ్వకర్మమహితాంశములందురుక్రౌంచభేదనా॥

టీక॥ క్రౌంచభేదనా- ఓకుమారస్వామీ। ఇనుడనన్- సూర్యుడనగను । ఎవ్వడు-ఎవడు।అబ్జుడనన్-చంద్రుడనగను। ఎవ్వడు- ఎవడు। విష్ణువనంగన్- విష్ణువనగను। ఎవ్వడు-ఎవడు। అంబునిధియనంగన్- సముద్రుడనగను। ఎవ్వడు-ఎవడు।అహిపుంగవహారుడనంగన్।అహిపుంగవ-సర్పశ్రేష్ఠుడైనఆదిశేషువు। హారుడు- పేరుగాగలసాంబమూర్తియనగను।ఎవ్వడు-ఎవడు। అయ్యనిలుడనంగన్-ఆవాయువుఅనగను। ఎవ్వడు- ఎవడు। బలారియునాన్- దేవేంద్రుడనగను। అతడు-ఇంద్రుడనగను। ఎవ్వడు-ఎవడు। ఎంచగాన్- లెక్కించగా। అనుపమవిశ్వకర్మమహితాంశములు। అనుపమ- పోల్కలేని।విశ్వకర్మ- విశ్వకర్మయొక్క। మహితాంశములు।మహిత-గొప్పవియగు।అంశములు-భాగములని। అందురు-అనియెదరు॥

తా॥ దేవతలుమొదలైనవారంఁదరు విశ్వకర్మయంశలవల్లజన్మించిరి॥ ౧౨౦

వ॥ అనిశివకుమారసంవాదంబువినుపించినవినిశౌనకాదిమహామునులుతదనంతర
కథావృత్తాంతంబడిగిన॥

టీక॥ అని-ఇట్లుచెప్పి। శివకుమారసంవాదంబు । శివ - సాంబమూర్తియొక్కయు । కుమార। కుమారస్వామియొక్కయు। సంవాదంబు- సంభాషణమును।వినుపించిన- తెలియచేయగా।విని-ఆలించి-శౌనకాదిమహామునులు। శౌనక- శౌనకముని। ఆది- మొదలగు। మహామునులు- గొప్పతపసులు।తదనంతరకథావృత్తాంతంబు। తదనంతర- తరువాతనైన। కథా- కథయొక్క।వృత్తాంతంబు-ప్రశంసను-అడిగినన్- అడుగగా॥

తా॥ సూతుడుయీరీతినిఉమహేశ్వర కుమారసంవాదమునుచెప్పగా శౌనకాదులువినితరువాతివృత్తాంతంబేమనియడిగిరి॥ ౧౨౧

మ॥ అవనీకల్పమహీరుహస్ఫురదుదారాకారరాకారవిం। దవిభేదద్యుతికాం
తకీర్తిమయకాంతారాగతారాగవ। ర్యవిభుశ్రీవదపద్మకేలితమనోరాజీవరాజీవ
జాస్మవిరాజన్నవసౌకుమార్యరుచిసీమాధుర్యమాధుర్యగా॥

టీ॥ అవనీకల్పమహీరుహస్ఫురదుదారాకార। అవనీ- భూమియందలి। కల్పమహీరుహ-కల్పవృక్షముయొక్క। స్ఫురత్-ప్రకాశించుచున్న। ఉదార- ఔదార్యయుక్తమైన। ఆకార- స్వరూపముగలవాడా।రాకారవిందవిభేదద్యుతికాంతకీర్తిమయకాంతారాగ। రాక-పూర్ణిమయందలి।అరవిందవిభేద-

పద్మవైరియైనచంద్రునియొక్క। ద్యుతి- వెన్నెలవలె। కాంత- సుందరమైన। కీర్తిమయ- యశస్స్వరూపమైన। కాంత- స్త్రీయందు। రాగ- ప్రేమగలవాడా। తారాగవర్యవిభుశ్రీపదపద్మకీలితమనోరాజీవ। తారాగవర్య। తార- వెండిదగు। అగవర్య- పర్వతశ్రేష్ఠమైన కైలాసమునకు। విభు- ప్రభువైనసాంబమూర్తియొక్క। శ్రీ- శోభాయుక్తమైన। పదపద్మ- చరణకమలములయందు। కలిత- ఉంచబడిన। మనోరాజీవ- హృదయపద్మముకలవాడా- రాజీవజన్మవిరాజన్నవసౌకుమార్యరుచిశ్రీమాధుర్య। రాజీవజన్మ। రాజీవ - పద్మమత్స్యములవలన। జన్మ- పుట్టుకగలఅనిరుద్ధునివలె। (అనగామన్మథునివలె- బ్రహ్మవలెను)। విరాజిత్- ప్రకాశించుచున్న। నవ-నూతనమైన। సౌకుమార్య-సుకుమారత్వముయొక్క। రుచి- కాంతియొక్క। సీమ- ప్రదేశమునకు। ధుర్య- ధురంధరుడా। మాధుర్యగా। మాధుర్య-వాఙ్మాధుర్యమును। గా- పొందినవాడా॥

తా॥ దాతృత్వమువలనభూలోకకల్పవృక్షమనియు- నిర్మలమైనకీర్తిగలవాడనియు-శివభక్తాగ్రణియనియు- సుందరుడనియు- తియ్యనిపలుకులుగలవాడనియు॥ ౧౨౨

మాలినీవృత్తము॥ చతురగుణకలాపాసత్యహృద్యానులాపా। వితరణగుణశూరా వీరమార్కండధీరా। నతజనహితకారీనవ్యసౌభాగ్యహారీ। మతిమదమరభూజామానుషోదీర్ణ తేజా॥

టీ॥ చతురగుణకలాపా। చతుర - చమత్కారముతైన। గుణ- గాంభీర్యాదిగుణముల నెడు। కలాపా- భూషణములుకలవాడా। సత్యహృద్యానులాపా। సత్య- కల్లలుకాని। హృద్య- మనోహరములైన। అనులాపా- సంభాషణలుకలవాడా। వితరణగుణశూరా। వితరణగుణ - దాతృత్వగుణమునకు। శూరా- వీరుడా। వీరమార్కండధీరా। వీర- వీరధర్మముకలవాడా। మార్కండధీరా-మార్కండమహీపతీ। నతజనహితకారీ। నతజన- లొంగినవారికి- హితకారీ- మేలుచేయువాడా। నవ్యసౌభాగ్యహారీ। నవ్య- నూతనమైన। సౌభాగ్య- సొగసుచేత। హారీ- మనోహరుడా। మతిమదమరభూజా। మతిమత్- పండితులకు। అమరభూజా - కల్పతరువువంటివాడా- అమానుషోదీర్ణ తేజా। అమానుష- మనుష్యసంబంధముకాని। ఉదీర్ణ-ప్రకాశించుచున్న। తేజా- కాంతిగలవాడా॥

తా॥ మార్కండుమహారాజుసర్వగుణసంపన్నుడనియు - సత్యమాడువాడనియు - దాతయనియు- నమ్రజనపోషకుడనియు- చక్కనివాడనియు-పండితులనుసన్మానించువాడనియును॥ ౧౨౩

గద్య॥ ఇది శ్రీమద్దుగ్గాదక్షిణామూర్తివరప్రసాదఫలిత తుర్కారాజకవివరాయ్యంకిబాలసరస్వతీనామధేయప్రణీతంబైన శ్రీస్కాందంబనుమహాపురాణంబునందుసనత్కుమారసంహితయును నాగరఖండంబున నైమిశారణ్యవర్ణనంబును. శౌనకాదులుసూతునిసత్కరించుటయును - శౌనకాదులు జగత్కారణ దేవుం డెవ్వండని సూతునడుగుటయును - సూతుండు నాగరఖండవర్ణనంబు జేయుటయును-కైలాసవైభవవర్ణనంబును- కుమారస్వామి శివునికొలువుకూటంబునకు వచ్చి సేవించి నుతించి శివానుగ్రహంబువడసి సుఖాసీనుండై యుండుటయును-పార్వతీదేవిజగత్కారణదేవుండెవ్వండని శివునడుగుటయును - శివుండువిశ్వకర్మమహానుభావంబు జెప్పుటయును- సూతునిచేత చెప్పంబడిన శివకుమారసంవాదంబు విని శౌనకాదులుయవ్వలివృత్తాంతంబడుగుటయునను కథలంగల ప్రథమాశ్వాసము॥

శ్రీవిశ్వకర్మార్పణము.

శ్రీరస్తు.

## సటీక నాగరఖండము.

## ద్వితీయాశ్వాసము.

### కృతి నాయక స్తుతి.

క॥ శ్రీపెందోటపురాధిప। భూపతిజనవశ్యదృశ్యపుణ్యాచరిత్రో। ద్దీపితవైభవ జంబూ। ద్వీపజనోద్దండసోమవిభుమార్కండా॥

టీక॥ శ్రీపెందోటపురాధిప। శ్రీ- శోభాయుక్తమైన। పెందోటపుర - పెందోటపురమునకు। అధిప-నాయకుడా।భూపతిజనవశ్య। భూపతిజన- రాజజనులు।వశ్య-స్వాధీనులుగాగలవాడా।దృశ్యపుణ్యచరిత్రోద్దీపితవైభవ। దృశ్య- చూడతగిన। పుణ్యచరిత్ర-పుణ్యకథలచేతను।ఉద్దీపిత- ప్రకాశింపచేయబడిన - వైభవ- విభవముకలవాడా। జంబూద్వీపజనోద్దండ। జంబూద్వీప-నేరేడుదీవియందలి। జన-జనులలో। ఉద్దండ- ప్రసిద్ధుడా- సోమవిభుమార్కండా। సోమవిభు- సోమమహారాజునకుకుమారుడవైన।మార్కండా- మార్కండేయమహారాజా॥

తా॥ మార్కండేయమహారాజుపుణ్యచరిత్రలుకలవాడనియు రాజవశ్యముకలవాడనియు॥

వ॥ అవధరింపు మివ్విధంబున కుమారునకెఱింగించెనని సూతుండు శౌనకాదిమహామునులకిట్లనియె॥

టీక॥ అవధరింపుము- చిత్తగింపుము। ఇవ్విధంబున- ఈప్రకారముగా। కుమారునకు- కుమారస్వామికి। ఎరింగించెను- చెప్పెను। అని- పలికి। సూతుండు- రోమహర్షిణి। శౌనకాదిమహామునులకు- శౌనకఋషిమొదలైనమహర్షులకు। ఇట్లనియె- ఈలాగునచెప్పెను॥

తా॥ సాంబమూర్తికుమారస్వామికి చెప్పినాడని సూతుడుఋషులకు చెప్పెను ఆకథ మీరుచిత్తగించుడని కవీశ్వరులుమార్కండేయమహారాజుతోమనవిచేసిరి॥

### సాంబమూర్తికుమారస్వామితోచెప్పుట.

గీ॥ అతిరహస్యములందురహస్యమగుచు। సూక్ష్మములకెల్ల నత్యంతసూక్ష్మమగుచు। గ్రంథసాహస్రయుక్తమై గలిగెవిశ్వ। కర్మచారిత్ర మఖిల విఖ్యాతమగుచు॥

టీక॥ అతిరహస్యములందు- మిక్కిలిగోప్యములైనవాటియందు। రహస్యములు- గోప్యములు। అగుచు- అవుచు। సూక్ష్మములకెల్లన్- అన్నిసూక్ష్మములకు। అత్యంతసూక్ష్మము- మిక్కిలిసూక్ష్మమైనది। అగుచు- అవుచును। గ్రంథసాహస్ర- వేయిశ్లోకములతో। యుక్తమై-కూడినదై। విశ్వకర్మచారిత్రము। విశ్వకర్మ-విశ్వకర్మయొక్క। చారిత్రము- చరితము। అఖిలలోకవిఖ్యాతము।అఖిల- సమస్తమైన।లోక- జగత్తులయందు।విఖ్యాతము- ప్రసిద్ధమైనది। అగుచున్- అవుచు। కలిగె-ఆవిర్భవించెను॥

తా॥ విశ్వకర్మయొక్క చరిత్రము మంత్రములవలె మిక్కిలిరహస్యమైనదియు వేయిశ్లోకములు గలదనియు॥ ౩

చ॥ హితమొనరించుసాధకులకెల్లను భుక్తియుముక్తినిచ్చుశాశ్వతమగువిశ్వకర్మఘనశాస్త్రము నానమృతంబుమాడ్కి వి। శ్రుతమగుతత్వసారములసొంపువహించిపురాణరాజమై। యతులితలీలతోఁదగెనిరంతరముఁ శిఖిరాజవాహనా॥

టీక॥ విశ్వకర్మఘనశాస్త్రము।విశ్వకర్మ- విశ్వకర్మయొక్క। ఘనశాస్త్రము-గొప్పశాస్త్రము। సాధకులకెల్లను - మోక్షవాంఛగలజ్ఞానులకందరికిని । హితమొనరించు। హితము - ఇష్టమును । ఒనరించు-చేసెడిదియును। భుక్తియుముక్తినిచ్చు। భుక్తియు - అన్నమును। ముక్తిని-మోక్షమునును।ఇచ్చు- ఇచ్చెడిదియును। శాశ్వతమగు। శాశ్వతము - ఎల్లప్పుడుఉండెడిదియును । అగు- అయినట్టిదియును। నాఁ- అనునట్లు। అమృతంబుమాడ్కి - అమృతమువలె । విశ్రుతమగుతత్వసారములసొంపు। విశ్రుతమగు-ప్రసిద్ధమైన।తత్వసారముల। తత్వ- వేదాంతముయొక్క।సారముల-శ్రేష్ఠాంశములచేత।సొంపు- శోభను।వహించి-తాల్చి। పురాణరాజమై- శ్రేష్ఠపురాణమై। అతులితలీలతోఁ। అతులిత- సాటిలేని। లీలతోఁ- విలాసముచేత। నిరంతరముఁ- ఎల్లప్పుడును। తగెఁ- ఒప్పెను- శిఖిరాజవాహనా- ఓమయూరవాహనుడా॥

తా॥ ఓకుమారస్వామీ విశ్వకర్మయొక్కచరిత్రము ముముక్షులకు మేలును చేసెడిదియు ఇహపరసౌఖ్యములనిచ్చెడిదియు అనునట్లు అమృతమువలె మోక్షసారాంశరీతినిపొంది ముఖ్యపురాణమైయెల్లప్పుడు ప్రకాశించుచున్నది॥ ౪

## విశ్వకర్మయందు పంచశక్త్యుత్పత్తి.

క॥ శివుఁడాదిమధ్యముసదా । శివుఁడగ్రముశంభుడనఁగ జెలఁగుచునొకవృ। క్షవిశేషమలరుమూర్తి। త్రివిధంబై విశ్వకర్మ దేవుడు గాఁగన్॥

టీక॥ ఒకవృక్షవిశేషము। ఒక- ఒక్కటియైన।వృక్షవిశేషము-చెట్లలో మేలైనది।ఆది-మొదలు। శివుడు-శివుడను దేవుడును। మధ్యము-నడుము। సదాశివుడు। సదాశివుడను-ఈశ్వరుడును। అగ్రము- చివర। శంభుడు-సుఖజనకుడైనసాంబశివుడును ।అనఁగన్- చెప్పునట్లుగా। మూర్తిత్రివిధంబై।మూర్తి- శరీరములయొక్క। త్రివిధంబై। త్రి- మూడగు । విధంబై- రీతులుగలదై। చెలగుచు- ప్రకాశించుచు। విశ్వకర్మదేవుడు-విశ్వకర్మబ్రహ్మము।కాఁగన్- అగునట్లుగా।అలరు- ఒప్పును॥

తా॥ విశ్వకర్మయనెడుబ్రహ్మము శివాదిత్రిమూర్త్యాత్మకమైనవృక్షరాజమైప్రకాశించెను॥ ౫

క॥ పంచబ్రహ్మాత్మకమై। పంచశిఖల్గలిగిమిగులభాసురమగుచున్ । మించెన్మరి తద్వృక్షం। బెంచంగానట్టిభేదమెరిగింతసుతా॥

టీక॥ సుతా- కొమరుడవగుఓషడాననా। తద్వృక్షంబు। తత్- ఆప్రసిద్ధమైన। వృక్షంబు-విశ్వకర్మయనుత్రిమూర్త్యాత్మకమైనభూజము। పంచబ్రహ్మాత్మకమై। పంచ- అయిదుగురగు। బ్రహ్మ- మనుమయత్వష్టశిల్పిదైవజ్ఞుడు। ఆత్మకమై- స్వరూపముకలదియై- పంచశిఖల్ - పంచ- ఏనగు । శిఖల్- కొమ్మలు।కలదియై- కలదై। మిగులన్- మిక్కిలి। భాసురమగుచున్।భాసురము- ప్రకాశించుచున్నది। అగుచున్-అవుచును। మరి- మరియు। ఎంచగాన్- గణనచేయునట్టుగా। మించెన్-అతిశయించెను। అట్టిభేదము- అటువంటివిభాగరీతిని। ఎరిగింతు- తెలియజేయుచున్నాను॥

తా॥ ఓకుమారా విశ్వకర్మయను త్రిమూర్తివృక్షముయొక్క అయిదుకొమ్మలసంగతిని పేరు పేరుగాచెప్పెదను॥ ౬

చ॥ శివుఁడనిపించునమ్మొదలిశృంగముశక్తిద్వితీయశాఖమూఁడవలతచెన్నగుఁ
హరిసమాఖ్యమునాల్గవకొమ్మపద్మసంభవుఁడగుఁబంచమప్రవిటపంబుదనర్చుసు
కర్మనామమిట్టివివిధపుణ్యనామమునుడెందములోనదలంచుమెప్పుడున్॥

టీ॥ అమ్మొదలిశృంగము। అ- ఆచెట్టుయొక్క। మొదలి- మొదటిదగు।శృంగము-కొమ్మయు। శివుఁడు-శివుఁడని। అనిపించున్- చెప్పదగును। ద్వితీయశాఖ-ద్వితీయ- రెండవదియగు।శాఖ-కొమ్మయు। శక్తి-శక్తియనుపేరుగలది। మూఁడవలత। మూఁడవ- మూఁడవదియగు। లత-తీగె।హరిసమాఖ్యము।హరి- శ్రీమహావిష్ణువను। సమాఖ్యము। సమ- శ్రేష్ఠమైన। ఆఖ్యము- పేరుగలదై।చెన్నగున్- ఒప్పుచుండును। నాల్గవకొమ్మ।నాల్లవ- నాలుగవదియగు। కొమ్మ- విటపము।పద్మసంభవుఁడు।పద్మ-కమలమందు।సంభవుఁడు-పుట్టినట్టిచతుర్ముఖుఁడు। అగున్- ఆయెను। పంచమప్రవిటపంబు। పంచమ-ఏనవదియగు।ప్రవిటపంబు।ప్ర- ప్రసిద్ధమైన। విటపంబు- ననయు। కర్మనామము।కర్మ- క్రియయను। నామము- పేరుగలదై। తనర్చున్- శోభిల్లెను। ఇట్టి-ఇటువంటి। వివిధపుణ్యనామము। వివిధ-పలుతెరగులగు।పుణ్య- సుకృతములయొక్క।నామము- పేళ్లను। డెందములోన్-మనస్సుయందు।ఎప్పుడున్- పల్లప్పుడును। తలంచుము- భావించుము॥

తా॥ ఈవిశ్వకర్మయను వృక్షమునకు కలిగినకొమ్మలైనశివశక్త్యాదిపంచకమును నిరతముస్మరించితివేనిపుణ్యమబ్బును॥ ౭

క॥ ఈశాఖలైదుఁగూడిస। దాశివరూపంబనంగదనరునుతత్సా। దాశివమూ
ర్తినిమున్నుసు। ధీశక్తినివిశ్వకర్మధృతిఁబుట్టించెన్॥

టీ॥ ఈశాఖలు- ఈకొమ్మలు। అయిదు- ఏనుగు। కూడి-కలసి। సదాశివరూపంబు। సదాశివ- సదాశివునియొక్క।రూపంబు- ఆకారము। అనన్- అనునట్లుగా। తనరును- పొసగెను। తత్సాదాశివమూర్తిని।తత్-ఆప్రసిద్ధమైన। సాదాశివ- సదాశివసంబంధమైన। మూర్తిని-ఆకృతియైనట్టి। సుధీశక్తిని। సు-లెస్సయగు। ధీశక్తిని- బుద్ధిశక్తిని। మున్ను- మునుపే। విశ్వకర్మ- విశ్వకర్మ । ధృతిన్ - తాల్మిచే। పుట్టించెన్- చేసెను॥

తా॥ విశ్వకర్మ యీయైదుశాఖలసమష్టివలనకలిగిన సదాశివమూర్తికంటెమున్న బుద్ధిశక్తిని ధీరతచేగల్పించెను॥ ౮

సీ॥ పరశివుండననాదిభాసిల్లునమ్మహేశ్వరు సహస్రాంశంబువలనబుట్టె। ప
రశక్తియనునట్టిపరశక్తితనుసహస్రాంశంబుచేబుట్టెనాదిశక్తి। యయ్యాదిశక్తిస
హస్రాంశమునమరిసంభవించెనుజ్ఞానశక్తియనఁగ । నాజ్ఞానశక్తిసహస్రాంశము
ననుద్భవించెక్రియాశక్తివిశ్రుతముగ। నాక్రియాశక్తిఘనసహస్రాంశసహితయ
గుచునుదయించెదగనిచ్ఛయనెడుశక్తి। యిట్టిశక్తులుగడునైదుని-పుమీర। కీర్తిత
ములయ్యెజగతివిస్ఫూర్తియగుచు॥

టీక॥ పరశివుండు- పరమశివుఁడు। అనన్- అనునటుల । ఆదిభాసిల్లునమ్మహేశ్వరుసహస్రాంశంబువలనన్। ఆది- మొదట। భాసిల్లు- ప్రకాశించుచున్న । అమ్మహేశ్వరు- ఆమహాదేవునియొక్క।

సహస్రాంశంబువలనన్। సహస్ర- వేయగు।అంశంబువలనన్- భాగమువలన।పుట్టెన్-కలిగెను।మరి- మరియు। అయ్యాదిశక్తిసహస్రాంశమునన్- అయ్యాదిశక్తి - ఆమొదటిశక్తియొక్క। సహస్రాంశమునన్- వేయవపాలువలన। జ్ఞానశక్తి- జ్ఞానశక్తి। అనగన్-అనునటులనొకశక్తి। సంభవించెను-కలిగెను। ఆజ్ఞానశక్తిసహస్రాంశమునన్। అజ్ఞానశక్తి- ఆజ్ఞానమనుశక్తియొక్క। సహస్రాంశమునన్- సహస్రభాగమువలన। విశ్రుతముగన్ - ప్రసిద్ధముగ। క్రియాశక్తి - క్రియయనుశక్తి। ఉద్భవించెను- పుట్టెను। ఆక్రియాశక్తిఘనసహస్రాంశసహితయగుచు। ఆక్రియాశక్తి- ఆక్రియాశక్తియొక్క।ఘన- గొప్పదియగు। సహస్రాంశ- వేయవభాగముతో। సహితయగుచు - కూడికొనినదై। ఇచ్ఛయనెడు- ఇచ్ఛయనెడి।శక్తి- సామర్థ్యమనుశక్తి। తగన్- ఒప్పునటుల। ఉదయించెన్- జన్మించెను। ఇట్టి-ఇటువంటి। అయిదు- పంచసంఖ్యాకములైన। శక్తులు- శక్తులనెడివి। కడున్- మిక్కిలి। ఇంపుమీరి-ఇంపు- సొంపుచేత। మీరి- అతిశయించి। విస్ఫూర్తులగుచు। వి- విశేషముగ। స్ఫూర్తులగుచు- ప్రకాశించుచున్నవగుచు। జగతిన్- జగత్తుయందు। కీర్తితములయ్యె- కొనియాడబడినవైనవి॥

తా॥ మొట్టమొదటపరశివునివలన పరాశక్తియు దానిసహస్రాంశమువలనఆదిశక్తియు ఆలాగుననే యాశక్తివలన జ్ఞానశక్తియు ఆశక్తివలనక్రియాశక్తియు ఆశక్తివలనఇచ్ఛాశక్తియు యనెడు అయిదుశక్తులుకలిగెను॥ ౯

వ॥ ఇట్లుదయించినపంచశక్తులమాహాత్మ్యంబు॥

టీక॥ ఇట్లు- ఈవెనకచెప్పినలాగున। ఉదయించిన - పుట్టినట్టి। పంచశక్తులమాహాత్మ్యంబు। పంచ- అయిదగు। శక్తుల - పరాశక్తిమొదలగుశక్తులయొక్క। మాహాత్మ్యంబు- మహిమను। వివరించెదను- చెప్పెదను॥

తా॥ ఈపంచశక్తులయొక్కపనులనుక్రమముగచెప్పెదను॥ ౧౦

చ॥ శివునిప్రమోదయైకొలిచెచేరికనమ్మొదలింటిశక్తిరెం। డవయదిదానమూ
ర్తియనునాఖ్యజెలంగెతృతీయశక్తియుం। పవనిలమూర్తితోనెసగెంతటనాలవ
శక్తిజ్ఞానసం। భవయనమించెనైదవదిబంధురతన్రచియించెలోకముల్॥

టీక॥ మొదలింటిశక్తి-మొదటిదియైనపరాశక్తి। ప్రమోదయై- ప్ర- ప్రభూతమైన।మోదయై- సంతసముగలదియై।చేరికన్- సన్నిధియందు। శివుని- సదాశివదేవునిని। కొలిచె- సేవించెను। రెండవయది-రెండవదియగుయాదిశక్తియు। తాను-ఆయాదిశక్తి। అమూర్తియనున్-శరీరములేనిదియనెడు। ఆఖ్యన్- పేరుచే। చెలంగెన్- ప్రవర్తించెను। తృతీయశక్తి। తృతీయ- మూడవదియగు। శక్తి-జ్ఞానశక్తియు।ఇంపవు- సొంపైన। ఇలమూర్తితోన్- పుడమిరూపుతోన। ఎసగెన్-వెలసెను।అంతటన్-అంతలోన।నాలవశక్తి-క్రియాశక్తియు। జ్ఞానసంభవయనన్। జ్ఞాన-జ్ఞానశక్తివల్ల। సంభవయనన్- పుట్టినదనునట్లు। మించెన్- మీరెను। అయిదవది- అయిదవదియైనయిచ్ఛాశక్తియు। బంధురతన్- సాంద్రతచే। (అనగా ప్రేమచే)। లోకముల్- పదునాలుగుభువనములను।రచియించె-సృజియించెను॥

తా॥ పరాశక్తియుసదాశివునిసన్నిధియందుప్రమోదనామముగలదియైయుండెను ఆదిశక్తియు అమూర్తియనుపేరుచేత.రాజిల్లెను జ్ఞానశక్తియు పృథివీరూపముతోవెలసెను క్రియాశక్తియు జ్ఞానసంభవమనియొప్పెను ఇచ్ఛాశక్తియు బంధురత్వనామముచే భువననిర్మాణప్రవీణయయ్యెను॥ ౧౧

ఉ॥ దీపమునందసంఖ్యములుదీపములుద్భవమందిదృష్టికిన్। బ్రాపగునట్టివై ఖరి
పరంబునకుంబరుడైనవానిలీ। లాపరమాంశకాంశకములందగనుద్భవమందిరింపు
తో। నీపరశక్తిముఖ్యములనిట్లనిపల్కెను వేదశాస్త్రముల్॥

టీక॥ ఈపరశక్తిముఖ్యములు - ఈపరాశక్తిమొదలగునైదుశక్తులు। దీపమునందు- దీపజ్యోతియం దు। అసంఖ్యములు-సంఖ్యలేనివి। (అనగాన్- అనేకములైన) దీపములు-దీపకళికలు। ఉద్భవమంది-పుట్టి।దృష్టికిన్- చూపునకు। ప్రాపగునట్టివై ఖరి- సహాయమైనలాగున। పరంబునకున్- పరబ్రహ్మము నకు। పరుడైనవానిలీలాపరమాంశకాంశకములన్। పరుడైనవాని- ఇతరుడైనపరాత్పరునియొక్క। లీలా-విలాసములయొక్క। పరమ- మిక్కిలిసూక్ష్మమైన। అంశక- సూక్ష్మకళయొక్క। అంశకములన్- పాళ్లవలనను। తగన్। అనుకూలముగ। ఇంపుతోన్- సొంపుచేతను। ఉద్భవమందిరి- పొడమిరి।ఇట్లని-ఈలాగని-వేదశాస్త్రముల్।వేద-దములును। శాస్త్రములు। మన్వాదిస్మృతులును।పల్కెను-చెప్పినవి॥

తా॥ దీపమువలనననేకదీపంబులొదవురీతిని పరాత్పరుండగు పరమసదాశివబ్రహ్మయొక్క లవాంశలోలవాంశవలన పరాశక్త్యాద్యనంతశక్తులావిర్భవించెను॥ ౧౨

విశ్వకర్మస్వరూపము.

గీ॥ వెలయుపూరుషసూక్తోక్తవిశ్వపదము। పంచసాదాఖ్యమూర్తిచేబలు
కదగిన। కర్మపదమునగూర్చియేకముగబలుక। విశ్వకర్మాఖ్యవర్తించె విశ్వ
గురుడు॥

టీక॥ విశ్వగురుడు। విశ్వ- పదునాలుగులోకములకు। గురుడు- తండ్రియగుసదాశివదేవుడు। వెలయు-ప్రకాశించుచున్న। పూరుషసూక్తోక్తవిశ్వపదము। పూరుషసూక్త-పురుషసూక్తముచేత।ఉక్త-పలుకబడిన। విశ్వపదము- విశ్వ- విశ్వయను। పదము- శబ్దమును। పంచసాదాఖ్యమూర్తిచే। పంచ-అయిదైనసద్యోజాతాదిముఖములవలనపుట్టిన। సాద- తత్వములయొక్క। ఆఖ్య-పేరుగల।మూర్తిచే-స్వరూపముచేతను।పలుకతగిన-చెప్పతగిన।కర్మపదమున।కర్మ-కర్మమనెడు। పదమున-శబ్దముతో।కూర్చి-కలిపి। ఏకముగన్-ఒక్కటిగ।పలుకన్-ఉచ్చరించగా।విశ్వకర్మాఖ్య।విశ్వ-ప్రపంచములయొక్క। కర్మ- సృష్టిస్థిత్యంతకర్మలుగలవిశ్వకర్మయనెడు। ఆఖ్య-నామమునను।వర్తించెన్- ప్రవర్తించెను॥

తా॥ శ్రీసదాశివుడుపురుషసూక్తమందలి విశ్వకర్మయనెడురెండుశబ్దముల కలియుటచే పంచసాదాఖ్యమూర్తిగలవిశ్వకర్మయనెడుబ్రహ్మమాయెను॥ ౧౩

చ॥ గురుడుసమస్తదైవములకున్గురుడెన్నచరాచరాళికిన్। గురుడుజగత్సమూ
హములకున్గురుడబ్జభవాండపాళికిన్। గురుడగువేదశాస్త్రములకున్మను గావున
విశ్వకర్మయే। సరవిజగద్గురుండనుచుసన్నుతిజేయుచును-దులోకముల్॥

టీక॥ విశ్వకర్మయే- విశ్వకర్మయనెడుబ్రహ్మ। సమస్తదైవములకున్।సమస్త-యావత్తు।దైవములకున్-దేవతలకు। గురుడు- పూజ్యుడును।ఎన్నన్-లెక్కించగా।చరాచరాళికిన్।చర-జంగమములైన జంతువులయొక్కయు। అచర - స్థావరములైనకొండలుమొదలైనవాటియొక్కయు। ఆళికిన్-పఙ్క్తికి।గురుడు-తండ్రియు।జగత్సమూహములకున్। జగత్- లోకములయొక్క।సమూహములకున్-సంఘములకును। గురుడు- సృష్టికర్తయు। అబ్జభవాండపాళికిన్। అబ్జ- పద్మమువలన। భవ- పుట్టినచ

ఖ్యాస్యునియొక్క। అండ- గ్రుడ్లవంటిలోకములయొక్క। పాళికిన్- వరుసకును। గురుడు-ప్రభువును। అగును-అవును। వేదశాస్త్రములకున్। వేద- ఋగాదివేదములకును। శాస్త్ర-వ్యాకరణము మొదలగువాటికిని। గురువు-నియామకుడును। కావునన్- కావున। సరవిన్- సరళిచే। లోకముల్-సకల లోకములను। జగద్గురుండు। జగత్- భువనములకు। గురుండు- ఆచార్యుడు। అనుచున్- పలుకుచును। సన్నుతిజేయుచున్। సన్నుతిన్- స్తుతిని। చేయుచున్-ఒనరించుచు। ఉండున్-ఉండెను॥

తా॥ విశ్వకర్మయనెడుబ్రహ్మలోకములు మొదలైనవానికిముఖ్యగురువు॥ ౧౪

క॥ ధరనెవ్వనిమూర్తిజగ। ద్గురుడనివిఖ్యాతి శ్రుతులుగొనియాడునుతత్ । ద్వర
లక్షణంబులనీకు। నిరువుగ నెరిగింతువినుసమిద్ధచరిత్రా॥

టీక॥ సమిద్ధచరిత్రా। సమిద్ధ-బాగుగవిఖ్యాతమైన। చరిత్రా-చరితలుగలఓకుమారా। శ్రుతులు-వేదములు। ధరన్-ఈధాత్రియందు। ఎవ్వని- ఏవిశ్వకర్మయొక్క। మూర్తి- స్వరూపము। జగద్గురుడని। జగత్-జగములకు। గురుడని- ప్రభువని। విఖ్యాతి- ప్రసిద్ధిచే। కొనియాడును- పొగుడునో। తద్వరలక్షణంబులను। తత్-ఆవిశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। వరలక్షణంబులను-శుభకరమైనచిహ్నలను। నీకు-ఈకు। ఇరువుగన్- ఇమ్ముగ। ఎరిగింతు- తెలియచేయుదును। విను-ఆకర్ణింపుము॥

తా॥ వేదములుయేమహామహిముని జగదీశ్వరునిగావర్ణించుచున్నవో అట్టివిశ్వకర్మకళ్యాణగుణ సంపత్తినిబాగుగ తెలిపెదను వినుమనికుమారునితో పార్వతీపతియనెను॥ ౧౫

సీ॥ శుద్ధతత్త్వమునందుసూక్ష్మాతిసూక్ష్ముండుశివుడప్రమేయుండుచిన్మయుండు।
పరమార్థగురుపరాత్పరుడుసర్వగతుండుకారణాతీతుడగమ్యుడనఘు । డమలుం
డనిందితుండక్షీణవిభవుండనామయుండనఘనిర్గుణాత్మకుండు । జ్యోతిస్స్వరూపియును
ద్దీప్తుడసదృశుండజుడుసర్వవ్యాపియక్షరుండు। ఘనుడనగనుండిసర్వలక్షణసమృద్ధి।
వినుతికెక్కుచుంగదగునట్టివిశ్వకర్మ। దలతులోకోపకర్తయైదనరువాని । సతతనిఖిల
జగత్సర్గచతురమహిమ॥

టీక॥ ఏజగద్గురుడు। శుద్ధతత్త్వమునందున్। శుద్ధ- మాయాశబలముగానినిర్మలమైన। తత్త్వమునందున్-సత్తయందు। సూక్ష్మాతిసూక్ష్ముండు। సూక్ష్మ- పరమాణువుకంటే। అతిసూక్ష్ముడు। అతి-మిక్కిలి। సూక్ష్ముండు-అణువైనవాడును। శివుడు- పరమమంగళకరుడును। అప్రమేయుండు-ఇంతంతనరానివాడును। చిన్మయుండు- జ్ఞానస్వరూపుడును। పరమార్థగురు। పరమార్థ- ముఖ్యార్థమునకు। గురు- గురుడును। పరాత్పరుడు- పరునికంటెపరుడును। సర్వగతుండు। సర్వ-ఆకాశమువలెఅంతటను। గతుండు-పొందినవాడును। కారణాతీతుడు। కారణ- హేతువును । అతీతుడు-అతిక్రమించినవాడును। ( అనగా అజుడును ) అగమ్యుడు-మనోవాక్కులకుఅందనివాడును । అనఘుడు- పాపములులేనివాడును। అనంతుడు- తుదిలేనివాడును। అనిందితుండు- దూషించబడనివాడును। అక్షీణ- తక్కువగాని। విభవుండు-వైభవముగలవాడును। అనామయుండు- వ్యాధిలేనివాడును। అనన్। అనగా। నిర్గుణాత్మకుండు-నిర్గుణ-సత్త్వరజస్తామగుణరహితమైన । ఆత్మకుండు- మనసుకలవాడును। జ్యోతిస్స్వరూపియును- తేజోరూపుడును। ఉద్దీప్తుడు - సూర్యాదులను ప్రకాశింపజేసెటివాడును । అసదృశుండు - సాటిలేనివాడును। అజుండు-పుట్టుకలేనివాడును సర్వవ్యాపి। సర్వ- సమస్తలోకములయందు। వ్యాపి- నిండినవాడును। అక్షరుండు-నాశనములేనికూటస్థుడును। ఘనుడు-గొప్పవాడు। అనగన్- అనునటుల। ( ఉండి) సర్వ

లక్షణసమృద్ధిగా। సర్వ - సమస్తమైన। లక్షణ - అంకములయొక్క। సమృద్ధిగా - సంపత్తిచే। వినుతి సే యంగా। వినుతి-స్తోత్రము। సేయంగా- చేయునట్లుగా। తగుగా-ఒప్పునో। అట్టి-అటువంటియు। లోకోపకర్తయై। లోక-జగత్తులకు। ఉపకర్తయై- ఉపకారియై। తనరువాని- ఒప్పుచున్నవాడైనట్టియు। సతతనిఖిలజగత్సర్గచతురమహిమ। సతత- ఎల్లప్పుడు। నిఖిల- సమస్తమైన। జగత్- జగత్తులయొక్క। సర్గ- సృష్టియందు। చతుర-నేర్పుగల। మహిమ-శక్తిగలయట్టియు। విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మను। తలతు- ధ్యానించెదను॥

తా॥ అతిసూక్ష్ముడైనట్టియుఅతిదుర్భరుడైనట్టియుపరమాత్మస్వరూపుడైనట్టియుజగత్కారణాది ధర్మములుమొదలగుసమస్తకళ్యాణగుణములుగలవిశ్వకర్మనుధ్యానించెదను॥ ౧౬

గీ॥ వేయుశిరములుగల్గినవృక్షరాజ। గర్భముననుదయించియకారమునునుకార
ముమకారమునుమైత్రిగలసి తత్త్రి। మూర్తులనగనుతద్రూపమున వెలుంగు॥

టీక॥ వేయుశిరములు। వేయు- సహస్రమైన। శిరములు- తలలు। (అనగాకొమ్మలుగల) వృక్షరాజుగర్భమునన్। వృక్షరాజు- తరుశ్రేష్ఠముయొక్క। గర్భమునన్- కడుపువలన। ఉదయించి-పుట్టి। అకారమును। అ- అనువర్ణమును। ఉకారమును। ఉ- అనుఅక్షరమును। మకారమును। మ - అనువర్ణమును। మైత్రిన్- చెలిమిచే। కలసి- కూడి। తత్త్రిమూర్తులు। తత్-ఆ। త్రిమూర్తులు-బ్రహ్మవిష్ణుమహేశ్వరులు। అనగను- అనగా। తద్రూపమునన్। తత్- వారియొక్క। రూపమునన్- స్వరూపముచేత। వెలుంగు- ప్రకాశించును॥

తా॥ పదివందలకొమ్మలుగలవృక్షరాజమను సహస్రశీర్షములుగలపరమపురుషునివలనప్రణవరూపమునబొడమినఅకారఉకార మకారములుకలసిబ్రహ్మవిష్ణుమహేశ్వరరూపమునప్రకాశించెను॥ ౧౭

చ॥ పొలుపుగనట్టివృక్షమునబుట్టినకొమ్మలుచిన్నికొమ్మలున్। కలిగినరీతిదైవ
తనికాయములెల్లను బుట్టెనిప్డు నిర్మలతనమశ్శివాయయనుమంత్రముతత్ప్రణ
వంబుమున్నుగా। విలసితదివ్యకాంతిప్రభవించెనుముక్తిఫలప్రదాయియై॥

టీ॥ పొలుపుగన్- ఒప్పుగను। అట్టివృక్షమునన్। అట్టి- వెనుకజెప్పినట్టి। వృక్షమునన్-వనస్పతివలన। పుట్టిన- పొడమిన। కొమ్మలు- గొప్పలగుశాఖలు। చిన్ని- కురచవగు। కొమ్మలున్-శాఖలును కలిగినరీతిన్- ఉన్నలాగున। ఎల్లను- అన్ని। దైవతనికాయములు। దైవత - దేవతలయొక్క- నికాయములు-సందోహములును। పుట్టెన్- కలిగెను। ఇప్డు-ఇప్పుడు। నిర్మలత స్వచ్ఛతచే। తత్ప్రణవంబు। తత్-ఆ ప్రసిద్ధమైన। ప్రణవంబు - ఓంకారము। మున్నుగాన్ - అగ్రమందుగలుగునట్లుగా। నమశ్శివాయయను- నమశ్శివాయయనెడి। మంత్రము- శివపంచాక్షరీమంత్రమును। విలసితదివ్యకాంతిన్। విలసిత ప్రకాశించుచున్న। దివ్య- దేవసంబంధమైన। కాంతిన్- ప్రకాశతచే। ముక్తిఫలప్రదాతయై। ముక్తిఫల- మోక్షశ్రీఫలమును। ప్రదాతయై- ఇచ్చెడిదై। పుట్టెన్- కలిగెను॥

తా॥ ఆవృక్షరాజువలన చిన్నపెద్దకొమ్మలుపుట్టినవడువున ప్రణవయుక్తమైనశివపంచాక్షరియునుసకలదేవతావ్రాతమునుఆవిరాట్స్వరూపునివలనపుట్టెను॥ ౧౮

## విశ్వకర్మయందు నాదబిందుకళాద్యుత్పత్తి.

క॥ నాదముబిందువునడుమను। వేదలతికబుట్టెనట్టివేదమురూపం। బై దైవ
మనగప్రణవం। బాదినితద్విశ్వకర్మయందుదయించెన్॥

టీ॥ నాదము- నాదముయొక్కయు- బిందువు- బిందువుయొక్కయు। నడుమను-మధ్యప్రదేశమందు। వేదలతిక। వేద- వేదమనెడు । లతిక- తీవె । బుట్టెన్ - జనించెను । అట్టివేదమురూపంబై। అట్టి- అటువంటి। వేదము- వేదవల్లియొక్క । రూపంబై - ఆకారముగలదై । దైవము- ఈశ్వరుడు। అనగన్- అనుసటుల। తత్- ఆ। విశ్వకర్మయందున్-విశ్వకర్మయనెడుబ్రహ్మయందు। ఆదిని-మొదట। ప్రణవంబు- ఓంకారము। ఉదయించెన్- అవతరించెను॥

తా॥ నాదబిందువులనడుమవేదముబుట్టెను, ఆవేదరూపమైన ఈశ్వరరూపమైనప్రణవముమొదట ఆవిశ్వకర్మయందుగానబడెను॥

ఋషులువిశ్వకర్మపుగుణసంభవంబు డిగినసూతుండు చెప్పుట.

వ॥ మఱియునాదబ్రహ్మంబును, నాదాత్మకుండును, ఆదిశక్తిశివోపేతుండును, నాదబిందుకళాతీతుండును, విశ్వమూర్తియు, విశ్వప్రకీర్తియు, విశ్వత్రాతయు, విశ్వనేతయు, జగద్గురుడనందనరే, విశ్వకర్మయుదియునగాక నాదబిందుమధ్యంబున వేదంబులుజనియించె, తద్వేదాత్మకుండు మహాదేవుండనందనరే, వేదంబులువిశ్వాన్వయంబున గర్తకర్మక్రియామూలంబులు వేదంబులు విశ్వజననకారణంబులు, వేదంబులువిశ్వకర్మనిర్మితంబులట్టివేదాత్మకుండగువిశ్వకర్మవలన సహస్రశీర్షంబులుంగల పురుషుండుదయించె, నాపురుషునినాభిమధ్యంబుననీలవర్ణంబు నధోముఖంబును, కోమలంబును, శాంగళపరిమళంబైన నాళంబునుంగలిగియొప్పెడుపద్మంబొక్కటిగలదదిజ్ఞానజ్యోతిచేప్రకాశించు, దానికిబీజంబోంకారంబై కానంబడు, నాబీజమధ్యంబున పల్లవపత్రికలతో నంకురంబుదయించె, నాపల్లవంబులప్రత్యేకంబు వివరించెద, వి॥ ము॥ అది నాభిదేశంబున, హృదయంబున, గంఠంబున,జిహ్వాగ్రంబుదుపసిరుచుపత్రంబులాతగ్రంబులకధిదేవతానామంబులెన్నియనిన, పదస్థానంబున భేదశక్తి, నాభిహృదయమధ్యంబునిచ్ఛాశక్తి, హృదయతాలుమధ్యంబునజ్ఞానశక్తి, తాలుజిహ్వామధ్యంబునక్రియాశక్తి, ఈశక్తులకుంటరమస్థానంబునదేవశక్తియు, నేతచ్ఛక్తిసముదాయంబునధోభాగంబునగుండలీశక్తియు, నవియునుంగాక నాడీకామధ్యంబుననవశక్తులుదనర్చు, నిట్టిపరబ్రహ్మస్వరూపుండైనవిశ్వకర్మవలనంబ్రబల్గంబయ్యెననికుమారునకుమహాదేవుడెరింగించినవిధంబునసూతుండు శౌనకాదిమహామునులకెరింగించినవినివారలుపురాణసంభవంబువినవలయునాసతీయువలయుననిననతండిట్లనియె॥

టీ॥ మరియు- ఇంకను। విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మ। నాదబ్రహ్మంబును - నాదస్వరూపబ్రహ్మమును। నాదాత్మకుండును- నాదస్వరూపుడును।ఆదిశక్తిశివోపేతుండును।ఆదిశక్తి - మొదలింటిశక్తితోను। శివ- సదాశివునితోడను । ఉపేతుండు- కూడినవాడును । నాదబిందుకళాతీతుండును। నాద-నాదమునకును। బిందు- బిందువునకును। కళా- కళకును। అతీతుండును- మించినవాడును। విశ్వమూర్తియు।విశ్వ- ప్రపంచము। మూర్తియు- శరీరముగాగల్గినవాడును । విశ్వకీర్తియు। విశ్వ-సమస్తమైనకీర్తియు- యశస్సుగల్గినవాడును । విశ్వత్రాతయు।విశ్వ- లోకములకు।త్రాతయు-రక్షకుడును।

విశ్వనేతయు। విశ్వ- లోకములకు। నేతయు- ప్రభువును । జగద్గురుండును । జగత్ - భువనములకు॥ గురుండును- బోధకుండును। అనన్ - అనునటుల। తనరెన్ - ప్రకాశించెను। అదియునుంగాక-వెనుక చెప్పినదియేకాక। నాదబిందుమధ్యంబునన్ । నాదబిందు - నాదబిందువులయొక్క । మధ్యంబునన్- నడుమను। వేదంబులు- వేదములు। జనియించెన్-పుట్టెను। తద్వేదాత్మకుండు।తత్- ఆవెనుకచెప్పిన। వేదాత్మకుండు। వేద- ఆగమములు। ఆత్మకుండు - శరీరముగాగలవాడు । మహాదేవుండు- మహేశ్వరుడు।అనగన్- అనుటుల। తనరెన్- ఒప్పెను। వేదంబులు-ప్రాజదువులు । విశ్వాన్వయంబున।విశ్వ-లోకములయొక్క। అన్వయంబునన్ - అన్వయించుటయందు । (అనగా నొకపదముతో నొకటికూర్చుటచే) కర్త-కర్తృపదవాచ్యుడైనయీశ్వరునకును। కర్మ- కర్మవాచ్యమైనలోకములకును । క్రియా-క్రియాపదమైచేసెననుదానికిని। మూలంబులు-మూలగ్రంథములైనట్టి। వేదంబులు-వేదములు। విశ్వజననకారణంబులు।విశ్వ-ప్రపంచముయొక్క । జనన - జన్మమునకు। కారణంబులు - సమవాయికారణంబులు। ( అనగావఖ్యహేతువులు ) వేదంబులు- తొలిజదువులు। విశ్వకర్మనిర్మితంబులు।విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మచేత। నిర్మితంబులు- చేయబడినవి। అట్టివేదాత్మకుండగు। అట్టి- అటువంటి। వేదాత్మకుండు - వేదస్వరూపుడు । అగు - అయినట్టి। విశ్వకర్మవలనన్ - విశ్వకర్మయనెడిబ్రహ్మవల్లను। సహస్రశీర్షంబు। సహస్ర- వేయు। శీర్షంబులు- శిరస్సులు । కలపురుషుండు । కల- కలిగినట్టి। పురుషుండు- విరాట్పురుషుడు। ఉదయించెన్- మొదటపుట్టెను। ఆపురుషునినాభిమధ్యంబునన్। ఆపురుషుని- ఆవిరాట్పురుషునియొక్క।నాభిమధ్యంబునన్ । నాభి- బొడ్డుయొక్క। మధ్యంబునన్- నడిమిభాగమందు । వర్ణంబును।నీల - నల్లని। వర్ణంబును- కాంతికలిగినట్టియు। అధోముఖంబును। అధః-క్రిందుచూచెడిముఖంబును- మోముగలయట్టియు।కోమలంబును-మృదువైనట్టియును।దశాంగుళపరిమాణంబు। దశ-పదుగు - అంగుళ- వ్రేళ్లయొక్క। పరిమాణంబు- మితిగలిగినట్టియు। అయిన - అయినట్టి। నాళంబు కాడయును। కలిగి- ఉన్నదై। ఒప్పెడు - ప్రకాశించుచున్న । ఒక్కటి- ఏకమగు। పద్మంబు - తమ్మిపువ్వు।కలదు-ఉండెను। అది- ఆతమ్మి। జ్ఞానజ్యోతిచే। జ్ఞాన - తెలివియను। జ్యోతిచే-కాంతిచే। ప్రకాశించు- దీపించును । దానికి - ఆపద్మమునకు । బీజంబు - కారణము । ఓంకారంబై-ప్రణవమై।కాబడు-కాన్పించు।ఆబీజమధ్యంబునన్।ఆబీజ-ఆవిత్తుయొక్క।మధ్యంబునన్-నడుమను। పల్లవపత్రికలన్ । పల్లవ-చిగుళ్లతోను । పత్రికలతోన్- ఆకులతోను। అంకురంబు- మొలక। ఉదయించెన్-ఖను।ఆపల్లవంబులన్- ఆయాకులను। ప్రత్యేకంబు- వేరువేరుగను । వివరించెద- స్పష్టముచేసెద । ము-ఆకర్ణించుము । అవి- ఆపల్లవములు । నాభిదేశంబునన్। నాభి - బొడ్డుయొక్క। దేశంబునన్-ప్రదేశమందును। హృదయంబునన్ - హృదయప్రదేశమందును। కంఠంబునన్- ఎలుగునందును। జిహ్వయందున్ - నాలుకయందును। వసియించున్- ఉండును । ఆపత్రంబులకు- ఆయాకులకు। అధిదేవతానామంబులు।అధిదేవతా- అధిపతులయొక్క । నామంబులు- పేళ్లు। ఎవ్వియనినన్-ఏవన్నను। స్థానంబునన్।పద- అంజలయొక్క। స్థానంబునన్ - తావునను। భేదశక్తియు- భేదశక్తియనునదియు। నాభిహృదయమధ్యంబునన్ । నాభి- బొడ్డుయొక్కయు । హృదయ - హృదయముయొక్కయుమధ్యంబునన్- నడుమను । ఇచ్ఛాశక్తియు- ఇచ్ఛయనెడుశక్తియును। హృదయతాలుమధ్యంబున హృదయ - రొమ్ముయొక్కయు।తాలు- చెలిపెలయొక్కయు । మధ్యంబునన్ - నడుమను। జ్ఞానశక్తియు-జ్ఞానశక్తియనునదియు। తాలుజిహ్వామధ్యంబునన్ । తాలు-దవడలయొక్కయు।

జిహ్వా- రసనయొక్కయు। మధ్యంబునన్-అంతరమందు। క్రియాశక్తియు- క్రియాశక్తియనునదియు- ఈశక్తులకున్- ఈవెనుకజెప్పుశక్తులకు।పరమస్థానంబునన్। పరమ- శ్రేష్ఠమైన। స్థానంబునన్- తావునను। దేవశక్తియు - దేవశక్తియనునదియు। ఏతశ్ఛక్తిసముదాయంబునకున్। ఏతత్- ఈ। శక్తి- శక్తులయొక్క।సముదాయంబునకున్- సమష్టికి। అధోభాగంబునన్- క్రిందను। కుండలీశక్తియు-కుండలిశక్తియనునదియు। అదియనుంగాక- అదిగాక। నాడికామధ్యంబునన్। నాడికా-నాడులయొక్క। మధ్యంబునన్-నడుమను। నవశక్తులు। నవ- తొమ్మిదియగు। శక్తులు- శక్తులు।తనర్చున్- ఒప్పును। ఇట్టిపరబ్రహ్మాత్మకుండైన। ఇట్టి- ఇటువంటి। పరబహ్మాత్మకుండైన- పరబ్రహ్మస్వరూపుడైన।విశ్వకర్మవలనన్- విశ్వకర్మవల్లను। ప్రసిద్ధంబయ్యెన్। ప్రసిద్ధికెక్కెను।అని-పలికి।కుమారునకు-కుమారస్వామికి।మహాదేవుండు-శివుడు।ఎఱింగించినవిధంబున-ఎఱిగించిన-తెలియచేసిన।విధంబున-రీతిని।సూతుండు-కథకుడు।శౌనకాదిమహామునులకున్ - శౌనకాదిమహాఋషులకు। ఎఱింగింపన్ - తెలియచేయగా। వారలు- ఆశౌనకాదులు। విని- ఆకర్ణించి।పురాణసంభవంబు। పురాణ - అష్టాదశపురాణముల యొక్క। సంభవంబు- పుట్టుకను। వినవలయున్ - ఆకర్ణించవలయును। అనతీంవలయును - సెలవివ్వవలయును। అనన్- అనియడుగగా। అతండు- ఆసూతుడు। ఇట్లనియెన్- ఈలాగుఅనెను॥

తా॥ విశ్వకర్మయనెడుబ్రహ్మ నాదస్వరూపుడును వేదమయుడును విరాట్పురుషునకు మూలకారణంబును ఆవిశ్వకర్మవలన ఇచ్ఛాదిశక్తులును సర్వలోకంబులును బ్రహ్మదివతలును గలిగిరి గాన నతండు కేవలబ్రహ్మమని మహాదేవుడు కొడుకునకు తెలియజేయుసంగతినిసూతుడు శౌనకాదులకు జెప్పగావిని శౌనకాదులు పురాణోత్పత్తిని తెలియజేయుండనివేడుకొనినసూతుండు చెప్పందొడంగెను॥ ౨౧

ఉ॥ చారణసిద్ధకిన్నరదిశారమణుల్ కడుభక్తిగొల్వఁగా। రీ మణికళత్రుడుహరి
ప్రియుడారజతాద్రిశృంగశృం। గారమహాసనంబున సుఖస్థితిగొల్వునయున్న
వేళలన్ । నారదుడేగుదెంచెనొకనాడటుకున్ బరమేశుగొల్వఁగన్॥

టీక॥ హరిప్రియుడు। హరి- శ్రీమహావిష్ణువునకు। ప్రియుడు- ఆప్తుడునగు।గిరమణీ-పార్వతీదేవి। కళత్రుడు-భార్యగాగలశివుడు। చారణసిద్ధకిన్నరదిశారమణుల్। చారణ-దేవయోని విశేషములైనచారణులును। సిద్ధ-సిద్ధులు। కిన్నర-కిన్నరలును। దిశారమణుల్। దిశా-దెసలకురమణుల్- ప్రభువులగుయింద్రాదులును। కడుభక్తిన్। కడు-మిక్కుటమైన। భక్తిన్-భక్తిచే। కొల్వఁ- సేవించగా। ఆరజతాద్రిశృంగశృంగారమహాసనంబునన్। ఆ- ప్రసిద్ధమైన।రజతాద్రి-వెండికొండయొక్క।శృంగ-శిఖరమునందు। శృంగార-సొగసగు। మహాసనంబునన్। మహా-గొప్పదియగు। ఆసనన్ - సింహాసనమందు। సుఖస్థితిన్- సుఖస్థితిచే। కొల్వయి - సభచేసి। ఉన్నవేళలన్-ఉన్నసమయమందు। నారదుడు-నారదమహాముని।ఒకనాడు-ఒకదినము। పరమేశ్వరుగొల్వఁగన్।పరమేశ్వరున్-శంభమూర్తిని। కొల్వఁగన్-కొలుచుటకై। అటకున్- అచ్చటికి। ఏగుదెంచెన్-వచ్చెను॥

తా॥ సాంబమూర్తి పార్వతీసమేతుడై వెండికొండ శిఖరముమీద ఇంద్రాదిగొల్చుచుండ బంగరుగద్దెపైనంగూర్చుండి కొలువుచేయుచుండగా ఒకనాడు నారదమునీశ్వరుడేగెను॥ ౨౨

ఉ॥ పొంగుచు నిట్లువచ్చి మునిపుంగవు డద్రిసుతేశు గాంచి సా। ష్టాంగనమస్కృ
తుల్ సలిపి యాదటలేచి లలాటపట్టికన్ । సంగతిగా గహ స్తజలజంబులు మోడ్చినుతించుచున్నపుడు సా। రంగధరుండు మౌనిగని యాగతమెయ్యది నాగ నాతడున్॥

టీ॥ మునిపుంగవుడు। ముని- ఋషులలో। పుంగవుడు - శ్రేష్ఠుడగు నారదమహాముని । పొంగుచున్- సంతోషించుచును। ఇట్లువచ్చి- ఈవిధముగావచ్చి। అద్రిసుతేశున్। అద్రి- హిమవద్గిరికి। సుతా- కుమారికయైన పార్వతీదేవికి । ఈశున్ - పెనిమిటియగు సాంబమూర్తిని । కాంచి-చూచి । సాష్టాంగనమస్కృతుల్ - సాష్టాంగదండప్రణామంబులను। సలిపి-చేసి। యాదటన్- తృప్తిచే। లేచి-నిలచి। లలాటపట్టికన్- పట్టికవంటి ఫాలప్రదేశమందు । సంగతిగాగన్-అనుకూలమగునట్లు । హస్తజలజంబులు। హస్త- కేళ్లను। జలజంబులు- తమ్ములను। మోడ్చి- ముడచి- నుతించునప్పుడు-స్తోత్రము జేయువేళ। సారంగధరుండు। సారంగ-లేడిని। ధరుండు- చేతంబూనినశివుడు। మౌనిన్- నారదమునిని। కని-చూచి। ఆగతము-వచ్చుట। ఎయ్యది-ఎద్ది। నాగన్-అనగా। ఆతండు- ఆనారదుడును॥

తా॥ నారదమహాముని వీణాగానము జేయుచువచ్చి శివునిజూచి సాగిలపడి మ్రొక్కి లేచి యంజలిఘటించి స్తుతించుచుండగా యేమివచ్చితిరని కుశలమడుగ నారదుండిట్లనుచున్నాడు॥ ౨౨

నారదుడు సాంబమూర్తితో గర్గునివలన వినినపురాణసంగతి చెప్పుట.

క॥ కనుగొంటి మేరుదక్షిణ । ఘనతరదిగ్భాగమున సుఖస్థితునిజగ । జ్జనకుని మహేశ్వరుని ప్రా । జ్ఞనుమూర్తిని విశ్వకర్మ మహిమోదాత్తున్॥

టీ॥ మేరుదక్షిణఘనతరదిగ్భాగమునన్। మేరు - మేరుపర్వతముయొక్క । దక్షిణ-దక్షిణపువైన। ఘనతర-మిక్కిలిగొప్పదియగు। దిగ్భాగమునన్। దిక్-దిక్కుయొక్క। భాగమునన్-ప్రదేశమందు। సుఖస్థితుని। సుఖ- సుఖముగ। స్థితుని - ఉన్నట్టియు। జగజ్జనకుని। జగత్- లోకములకు। జనకుని-తండ్రియైనట్టియు। మహేశ్వరుని- మహాప్రభువైనట్టియు। ప్రాజ్ఞనుమూర్తిని। ప్రాక్-ప్రాచీనుడైన। మను- మనుబ్రహ్మయొక్క। మూర్తిని-శరీరముగలయట్టియు। మహిమోదాత్తున్। మహిమ-ప్రభావముచే। ఉదాత్తున్- అతిశయుడైనట్టియు। విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మను। కనుగొంటిన్ - చూచితిని॥

తా॥ మహామేరుదక్షిణదిగ్భాగమందు సుఖముగనున్న మహామహిముడగు విశ్వకర్మయనెడు బ్రహ్మనుచూచితినని నారదుండుచెప్పెను॥ ౨౩

గీ॥ కాచియుండితినే బహుకాలమచట । నతనివ్యాఖ్యానసామర్థ్యమతనిచరిత। మతనిదర్శనజనితపుణ్యంబునిట్టి । దట్టిదనియెన్న బ్రహ్మకునైన వశమె॥

టీ॥ ఏ- నేను। బహుకాలము- తడవుసేపు। అచటన్-అచ్చటను। కాచియుండితిని-ప్రతీక్షించియుంటిని। అతనివ్యాఖ్యానసామర్థ్యము। అతని-ఆవిశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। వ్యాఖ్యానసామర్థ్యము। వ్యాఖ్యాన- వేదార్థవివరణమందు। సామర్థ్యము- శక్తిని । అతనిచరితము। అతని- ఆబ్రహ్మయొక్క। చరితము-నడవడికను। అతనిదర్శనజనితపుణ్యంబును। అతని- ఆయనయొక్క। దర్శన-చూచుటవలన। జనిత- పుట్టిన। పుణ్యంబును- సుకృతమును । ఇట్టిది-ఇటువంటిది । అట్టిది-ఇటువంటిది। అని-వాక్రుచ్చి। యెన్నన్- చెప్పుటకు। బ్రహ్మకునైనన్- నాలుగు మోములుగల బ్రహ్మదేవునికైనను। వశమె- వశమా॥

తా ॥ ఆవిశ్వకర్మయొక్క సర్వశక్తి సంపన్నతను కొనియాడుటకు చతురాస్యునకు నైన నలవిగాదు॥

## విశ్వకర్మపురాణసంఖ్య.

గీ॥ మరియునచ్చటనేగార్గ్యమౌనివలన । విశ్వకర్మపురాణంబువిని చదియును।
పదియురెండగులక్షలపైని గ్రంథ । సంఖ్యఁబదమూడువేలుగఁజదివినాఁడ॥ అందు॥

టీ॥ మరియుఁ - ఇంకను। ఏను-నేను। అచ్చటఁ-అదిక్కుననే। గార్గ్యమౌనివలనఁ-గర్గము నీశ్వరునివలన। విశ్వకర్మపురాణంబు।విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। పురాణంబు-పురాణమును। విని-ఆకర్ణించి। అది- ఆపురాణమును। పదియు-పదియును। రెండు- రెండును। అగు-అయిన। లక్షలపైని-లక్షలమీద। గ్రంథసంఖ్య। గ్రంథ- గ్రంథముయొక్క। సంఖ్య-లెక్క।పదమూడువేలుగఁ- పదమూడువేలుగా। చదివినాఁడ- చదివితిని॥

తా॥ నేనుఅక్కడ గర్గమహర్షివలన విశ్వకర్మ పురాణమునువిని పండ్రెండులక్షల పదమూడువేలుగల ఆవిశ్వకర్మపురాణమునుచదివితిని॥ ౨౪

## ఆయాలోకంబులనున్నపురాణగ్రంథసంఖ్య.

సీ॥ జగతియందును ద్వాదశగ్రంథమొకలక్ష పాతాళమునసరిత్పతులనడుమ।
లక్షద్వయంబు కైలాసంబుపైనంది సవిధదేశమున లక్షత్రయంబు । నాకలోకంబుననాలుగులక్షలు చక్రిలోకమునలక్షద్వయంబు । కంజాతబంధులోకమునసహస్రంబు వెలసెనీరీతినివిశదబుద్ధి । విశ్వకర్మపురాణంబువిబుధతిలక। యేనువ్యాఖ్యానమొనరించితేనునిదియు । మొదలుగల్గుపురాణసమూహమెల్ల । నతఁసితను వందుజపియించిగుతిశముల్లె॥

టీక॥ జగతియందును - ఈజగత్తుయందు। ద్వాదశగ్రంథము । ద్వాదశ - పండ్రెండువేలైన। గ్రంథము- పుస్తకము। పాతాళమునఁ - పాతాళలోకమందు । ఒకలక్ష- ఒకలక్షయు। సరిత్పతులనడుమఁ। సరిత్- గంగాదినదులకు । పతులు - పెనిమిట్లయినసప్తసముద్రములయొక్క। నడుమఁ- మధ్యరంగమందు। లక్షద్వయంబు- రెండులక్షలును। కైలాసంబుపై- కైలాసపర్వతముమీద।నందిసవిధదేశమునఁ।నంది- నందికేశ్వరునియొక్క। సవిధదేశమునఁ- సమీపమందు। లక్షత్రయంబు।లక్ష-లక్షలయొక్క-త్రయంబు- మూడును। నాకలోకంబునఁ- స్వర్గలోకమునందు। నాలుగులక్షలు- నాలుగులక్షలగ్రంథమును। చక్రిలోకమునఁ । చక్రి - సుదర్శనచక్రముగలవిష్ణుమూర్తియొక్క। లోకమునఁ- వైకుంఠభువనమందు। లక్షద్వయంబు- రెండులక్షలును। కంజాతబంధులోకమునఁ। కంజాత-పద్మములకు। బంధు - మిత్రుఁడైనసూర్యునియొక్క । లోకమునఁ - భువనమందు । సహస్రంబు - వేయును। వెలసెఁ-ప్రకాశించెను। ఈరీతిని- ఈవిధమున। విశదబుద్ధిఁ। విశద-నిర్మలమగు। బుద్ధిఁ-ప్రతిభచే। విబుధతిలక। విబుధ- దేవతలలో। తిలక- పుండ్రమైనసాంబమూర్తీ। విశ్వకర్మపురాణంబు। విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క । పురాణంబు - పురాణగ్రంథమును । ఏను- నేను। వ్యాఖ్యానమొనరించితి- అర్థమునువివరించితిని। ఏను - నేనును। ఇదియు- ఈవిశ్వకర్మపురాణము। మొదలు- మొదలుగాగల । పురాణసమూహమెల్లఁ । పురాణ - పురాణములయొక్క । సమూహమెల్లఁ - సంఘము

లన్నియు। అతనితనువందు। అతని- ఆవిశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। తనువందుఁ- దేహమునందును। జనియించి- పుట్టి। అతిశయిల్లె- ఘనతకెక్కెను॥

తా॥ ఈవిశ్వకర్మపురాణము పదిరెండు లక్షల పదమూడువేలపరిమితిగలదియై ప్రకాశించెను, ఈపురాణమునుతక్కిన పదునెనిమిదిపురాణములనుసృష్టికరించితినని చెప్పెను॥ ౨౯

విశ్వకర్మముఖాద్యవయవములవలనగలిగినపురాణములవేవి.

క॥ తుండమున పద్మమును మా । ర్కండేయము నాభియందు గారుడము తనూ।
కాండంబున మౌళిని బ్ర । హ్మాండంబును విశ్వకర్మయందుదయించెన్॥

టీ॥ తుండమునన్- మోమునందు। పద్మమును - పద్మపురాణమును । నాభియందున్- బొడ్డుయందు। మార్కండేయము - మార్కండేయపురాణమును । తనూకాండంబునన్- కర్రవంటిశరీరమునందు। గారుడము- గరుడపురాణమును। మౌళిని- శిరస్సుయందు। బ్రహ్మాండంబును- బ్రహ్మాండపురాణమును। విశ్వకర్మయందు- విశ్వకర్మయనెడుబ్రహ్మయందు। ఉదయించెన్- పుట్టెను॥

తా॥ విశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క శీర్షాద్యవయవములయందు పద్మాదిపురాణములుపుట్టెను॥ ౩౦

గీ॥ శ్రోత్రములభాగవతమును నేత్రములను । నారదీయంబులైంగ్యంబునఖర
ములను । ఘ్రాణమునవైష్ణవంబంతరమునవామ । నంబునుదయించెనౌబర్హిణ
ఖగతురగ॥

టీ॥ బర్హిణఖగతురగ। బర్హిణ- నెమలియును। ఖగ- పక్షి। తురగ - గుఱ్ఱముగాగలఓకుమారా। శ్రోత్రములన్-కర్ణములవలన। భాగవతమున్- భాగవతపురాణమును- నేత్రములను । కన్నులవలన। నారదీయంబు- నారదీయపురాణమును। నఖరములను- గోరులవలన । లైంగ్యంబు- లింగపురాణమును। ఘ్రాణమునన్- ముక్కువలన। వైష్ణవంబు- విష్ణుపురాణమును। అంతరమునన్- మనస్సువలన । వామనంబును- వామనపురాణమును। ఉదయించెను- పుట్టెను। ఔ- అవును॥

తా॥ ఆయనయొక్క అనగా విశ్వకర్మయొక్క కర్ణాదులవలనభాగవతాదిగ్రంథములుపుట్టెనని కుమారస్వామితో చెప్పెను॥ ౩౧

సీ॥ హస్తాగ్రమున శైవమాగ్నేయమంఘ్రులప్రమదంబువలనకౌర్మ్యంబురసన।
బ్రాహ్మ్యంబుజంఘలబ్రహ్మకైవర్తంబునూరువులను భవిష్యోత్తరంబు । ధ్యాన
సంగతినిమాత్స్యంబువరాహంబుహృదయదేశంబునసింధుమిగుల । ఘనతరంబై
నట్టిస్కాందంబునగల్గుప్రకటితంబైనపురాణసమితి । మహినిదీపించెవేదసమ్మ
తిదనర్చి । శాశ్వతంబుగజనియించె విశ్వకర్మ । పరమ సర్వాంగములననివలుక
దనరె । నను చువిస్మయమొనరించియమరమౌని॥

టీ॥ హస్తాగ్రమునన్। హస్త-చేయియొక్క। అగ్రమునన్- కొనవలన। శైవము- శివపురాణమును। అంఘ్రిలన్- పాదములవలన। ఆగ్నేయము- అగ్నిపురాణమును। ప్రమదంబువలనన్- సంతోషమువల్ల। కౌర్మ్యంబు - కూర్మపురాణమును । రసనన్- నాలుకవలన। బ్రాహ్మ్యంబు- బ్రహ్మపురాణమును। జంఘలన్- పిక్కలవలన। బ్రహ్మకైవర్తంబును-బ్రహ్మకైవర్తపురాణమును। ఊరువులను-తొడలవలన। భవిష్యోత్తరంబు- భవిష్యోత్తరపురాణమును। ధ్యానసంగతిని। ధ్యాన- సమాధియొక్క। సంగ

తిని-సంగతిచేత। మాత్స్యంబు- మత్స్యపురాణమును। హృదయదేశంబున- హృదయప్రదేశమువలన। వరాహంబు। వరాహపురాణమును।ఇందు- వీటిలో। మిగుల- మిక్కిలి । ఘనతరంబైనట్టి - మిక్కిలిగొప్పదైనట్టి । స్కాందంబును-స్కాందపురాణమును। అనఁ- అనునట్లు। కలుగు- కలిగిన । ప్రకటితంబైన- ప్రసిద్ధమైన। పురాణసమితి।పురాణ- పదునెనిమిదిపురాణములయొక్క । సమితి- సమూహమును। మహిని- భూమియందు। దీపించి- ప్రకాశించి। వేదసమ్మతిఁ। వేద- వేదములయొక్క। సమ్మతిఁ- అంగీకారముచేత । (అనగా వేదానుకూలముగా ) తనర్చి - ఒప్పి । శాశ్వతంబుగఁ - స్థిరముగా। విశ్వకర్మపరమసర్వాంగములఁ।విశ్వకర్మ-విశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। పరమ - శ్రేష్ఠములైన। సర్వ- సమస్తమైన।అంగములఁ-అవయవములవలన। జనియించెఁ - పుట్టెను।అని- అనుచు।పలుకఁ- చెప్పగా। తనరెను-ఒప్పెను। అనుచు-పలుకుచు। అమరమౌని। అమర- దేవతలయొక్క। మౌని- ఋషియైననారదమునీశ్వరుడు। విన్నపము- విజ్ఞాపనము। ఒనరించె- చేసెను॥

తా॥ నారదమహాముని విశ్వకర్మయొక్క దేహమువలననన్నిపురాణములుకలిగెననివిజ్ఞాపనము చేసెను॥ ౨౯

నా ర దుం డు వె ళ్లు ట.

**వ॥ పునరభివందనంబొనరించి యాసర్వజ్ఞునిచేత ననుజ్ఞాతుండై సకలలోకసంచారియగునారదుండెందేనియుంజనియెననివిని శౌనకాదిమహామునులు తదనంతర కథావృత్తాంతంబంతయువినవలయుననియడిగిన రోమహర్షిణికుమారుండు వారలకిట్లనియె॥**

టీ॥ సకలలోకసంచారియగు। సకల - సమస్తమైన। లోక-లోకములయందు । సంచారియగు-తిరిగెడు। నారదుండు- నారదమహాముని। పునరభివందనంబు। పునః-తిరుగా। అభివందనంబు-సాష్టాంగదండప్రణామమును। ఒనరించి- చేసి।ఆసర్వజ్ఞునిచే- సర్వవేదియైనయీశ్వరునిచేత। అనుజ్ఞాతుండై-సెలవివ్వబడినవాడై। ఎందేనియుఁ - యెక్కడికో। జనియెను- వెళ్లెను। అనివ-అనగా। విని-ఆకర్ణించి। శౌనకాదిమహామునులు - శౌనకుడుమొదలైన మహర్షులు । అంతయు-యావత్తు । తదనంతరకథావృత్తాంతము। తదనంతర। తత్- ఆవెనుకటిదానికి।అనంతర- పిమ్మటయైన। కథావృత్తాంతము।కథ-చరిత్రయొక్క। వృత్తాంతమును- వార్తను। వినవలయును- ఆకర్ణించవలయును। అని-అని। అడుగగా - వేడుకొనగా। రోమహర్షిణికుమారుండు । రోమహర్షిణి- రోమహర్షిణియగు శూద్రుడైనవ్యాసశిష్యునియొక్క- కుమారుండు- తనయుడైనసూతుండు। వారలకు-శౌనకాదులకు । ఇట్లనియెఁ - ఈలాగునచెప్పనారంభించెను॥

తా ॥ నారదమునిపుంగవుండు శివునకుమరల దణ్ణము సమర్పించి వెళ్లెననిచెప్పగావిని యావలివృత్తాంతముదెలుపుమన సూతుడు శౌనకాదులకుంజెప్ప నుపక్రమించెను॥ ౩౦

క॥ నారదుడువచ్చియీక్రియ । గౌరీపతితోడవిశ్వకర్మచరిత్రం । బారూఢిదె
ల్పిజనపు । డారాజర్షిబుడనియెనాత్మజుతోడఁ॥

టీ ॥ నారదుడు- నారదముని। వచ్చి- విచ్చేసి। ఈక్రియఁ- ఈరీతిగా। గౌరిపతితోడ। గౌరి-పార్వతీదేవియొక్క। పతితోడ - భర్తయగుశివునితో। విశ్వకర్మచరిత్రంబు। విశ్వకర్మ- విశ్వకర్మ

యనెడుబ్రహ్మయొక్క। చరిత్రంబు-వృత్తాంతమును। ఆరూఢిన్-నిరూఢిచేత। తెల్పి-విన్నవించి। జనన్-వెడలగా। అపుడు-ఆకాలమందు। ఆరాజకిరీటుడు। ఆరాజ-ఆచంద్రుడు। కిరీటుడు-మౌళియందుగల మహాదేవుడు। ఆత్మజుతోడన్-కొమరుడగుకుమారస్వామితో। అనియెన్-చెప్పెను॥

తా॥ నారదుడువిశ్వకర్మయొక్కవృత్తాంతమును సవిస్తరముగాచెప్పి వెళ్ళినతర్వాత సాంబమూర్తికుమారస్వామితోయిటులచెప్పెను॥ ౩౧

శివుడుకుమారస్వామితో విశ్వకర్మవంశజులమహిమలను జెప్పుట.

ఉ॥ స్వస్తిసమస్తభవ్యగుణసాధకులీశ్వరపాదయుగ్మవి। న్యస్తమనస్సరోజులు
దయాప్రతిపాదులుసాధువుల్సదా। భ్యస్తఘనశ్రుతిస్మృతినయవ్యవహారులు
నైనవిశ్వక। ర్మస్తవనీయవంశజులమాన్యచరిత్రలెఱుంగఁజెప్పెదన్॥

టీ॥ స్వస్తి-శుభమగుగాత। సమస్తభవ్యగుణసాధకులు। సమస్త-సకలములైన। భవ్య-మంగళప్రదములైన। గుణ-సౌశీల్యాదిగుణములను। సాధకులు-సంపాదించువారలును। ఈశ్వరపాదయుగ్మవిన్యస్తమనస్సరోజులు। ఈశ్వర-మహాదేవునియొక్క- పాద-చరణములయొక్క-యుగ్మ-ద్వయమందు। విన్యస్త-అర్పించబడిన। మనః-హృదయములనెడు। సరోజులు-పద్మములుగలయట్టియు। దయాప్రతిపాదులు। దయా-కరుణను। ప్రతిపాదులు-ప్రకటించునట్టియు। సాధువుల్-సజ్జనులైనట్టియు। సదాభ్యస్తఘనశ్రుతిస్మృతినయవ్యవహారులు। సదా-ఎల్లకాలము। అభ్యస్త-అభ్యసించబడ్డ। (అనగాచదువబడిన) ఘన-గొప్పవియగు। శ్రుతి-వేదములయు। స్మృతి-మన్వాదిస్మృతులయు। నయ-మంచిదగు। వ్యవహారులు-పనిగలవారును। అయిన-అయినట్టి। విశ్వకర్మస్తవనీయవంశజుల। విశ్వకర్మ- విశ్వకర్మయనెడుబ్రహ్మయొక్క। స్తవనీయ-కీర్తించతగిన- వంశజుల- అన్వయమందుపుట్టినవారలయొక్క। మాన్యచరిత్రలు-మాన్య-మన్నించతగిన। చరిత్రలు-నడవళ్లను। ఎరుంగన్- తెలియునట్లు। చెప్పెదన్- తెలియపల్కెదను॥

తా॥ వేదములును ఆగమములు స్మృతులుమొదలైనవాటినిచదువుటయందుచెప్పుటయందునిష్ఠాగరిష్టులును సమస్త సద్గుణనికురుంబాది యోగ్యశీలములునుగల విశ్వకర్మసంతతివారల యాచారములను చెప్పెదనునీకు శుభమగుగాకయనియీశ్వరుడుబల్కెను॥ ౩౨

సీ॥ సర్వలక్షణగుణసంపన్నులసమానపరమవ్రతులు జగద్గురులుదుష్ట। నిగ్ర
హుల్సజ్జనానుగ్రహుల్లోకప్రతిపాలురు ధార్మికుల్ధీరమతులు। శ్రీయుతుల్పంచాతురీ
మంత్రసిద్ధులష్టాంగయోగనిరూఢులింగిజ్ఞులు। శుచిసదాచారులాత్మజ్ఞులబ్రహ్మ
నిష్ఠాగరిష్ఠులుసత్యసంధులఖిల। వేదవేదాంగపారగుల్విశ్వకర్మ। దైవతధ్యాన
శీలురుతత్త్వవేత్త। లమితశాస్త్రపురాణజ్ఞులైతిహాసి। కులునుసిద్ధాంతవిదులు
వారలుదలంప॥

టీ॥ వారలు-ఆవిశ్వకర్మసంతతివారలు। తలంపన్-ఆలోచించగా। సర్వలక్షణగుణసంపన్నులు। సర్వ-సమస్తమైన। లక్షణ-శుభాంకములుగల। గుణ- దానదయాదిగుణములచేత। సంపన్నులు-సమృద్ధిగలవారును। అసమానపరమవ్రతులు। అసమాన- సాటిలేని। పరమ-శ్రేష్ఠములైన। వ్రతులు-దీక్షానియమముగలవారును। జగద్గురులు। జగత్-లోకములలో। గురులు-శ్రేష్ఠులు। (అనగాపూజ్యులు

కంబళికా- తివాచీలయందు। ఆరూఢులును- కూర్చుండువారును । రత్నసింహాసనాధిష్ఠితులును। రత్న- వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, విద్రుమ, మౌక్తిక, పద్మరాగములనెడు నవరత్నఖచితములైన। సింహాసన-గద్దెయందు। ఆసీనులును - కూర్చుండువారలును । వైడూర్యరత్నఖచితయోగదండధారణులును। వైడూర్యరత్న-విదూరపర్వతమందుపుట్టినమణులచేత-ఖచిత- చేయబడిన। దండ-లగుడములను। ధారణులును-చేబూనువారలును। సువర్ణకుండలాభరణులును । సువర్ణ-బంగరువైన। కుండల-మకరకుండలములు। ఆభరణులును-భూషణములుగాగలవారలును । సువర్ణముద్రికాంకితులును। సువర్ణ-పయిడివగు-ముద్రికా-అంగుళీయకములచేత। అంకితులును-చిహ్నితులైనవారలును। షడ్దర్శనపారాయణులును। షట్-ఆరైన। దర్శన-తర్కము, వ్యాకరణము, మీమాంసము, ఛందస్సు, జ్యోతిషము, వైద్యశాస్త్రములనెడుశాస్త్రములయొక్క। పారాయణులును- పఠనగలవారలును। సకలజనహితులును-సకల సమస్త। జన-మానవులకు। హితులును-మిత్రులును। అగు-అయినట్టి। దేవతాపురోహితుండైన। దేవతా-ఇంద్రాదిదేవతలకు। పురోహితుండైన-మంత్రియైన। ఆచార్యుడైన। విశ్వరూపుని-విశ్వరూపునియొక్క। వంశజులమాహాత్మ్యంబు। వంశజుల-గోత్రమందుపుట్టినవారియొక్క। మాహాత్మ్యంబు-మహిమను। ఎఱింగించితి-తెలియజేసితిని। మరియు-ఇంకను। విశ్వకర్మవిరాడ్రూపంబు। విశ్వకర్మ - విశ్వకర్మయొక్క। విరాడ్రూపంబు-జగదాకారమును। అభివర్ణించెద-స్తుతించెదను। ఏకాగ్రమతివై। ఏకాగ్ర-నిశ్చలమైన। మతివై-మనస్సుగలవాడవై। ఆకర్ణింపుము-వినుము॥

తా॥ విశ్వరూపవంశస్థులైన సమస్త వేదశాస్త్రాది సంపన్నులైన విశ్వబ్రాహ్మణుల యొక్క మహిమనుచెప్పి విశ్వకర్మయొక్క చరాచరాత్మకస్వరూపమును చెప్పనారంభించెను॥ ౩౮

## విరాడ్రూపవర్ణనము.

సీ॥ ఇనచంద్రులక్షులుహృత్సీమ విశ్వంబుతగ సర్వదేవతల్తనువునందు । సరసిజ
భవుడాత్మ కరపద్మములురత్నహాటకగిరులును ముఖాంబుజములు । మహనీయములగు
నామ్నాయసమూహముల్ భుజపఙ్క్తి నాచతుర్భుజుడుశౌరి । భూర్భువస్స్వస్సత్య
భువనపరంపరాజనుహేతుశక్తికేశములు సిట్లు । విశ్వకర్మవలననుయీవిశ్వ ము
దవె । విశ్వకర్మయె సర్వారాధ్యవిగ్రహంబు । విశ్వకర్మయె వేదాంతవేద్యమూర్తి।
విశ్వకర్మసమానుండు వేల్పు గలడె॥

టీ॥ ఇనచంద్రులు। ఇన-సూర్యుడును। చంద్రుడు-శశియును। అక్షులు-కన్నులు। హృత్సీమ- హృదయప్రదేశము। విశ్వంబు-ప్రపంచము। తగన్-ఒప్పునటుల। తనువును-శరీరమును। సర్వదేవతల్ । సర్వ-సమస్తమైన। దేవతల్-సురలు। అందు- ఆయొడలియందు-ఆత్మ-మనస్సు। సరసిజభవుడు। సరసిజ-తామరవలన। భవుడు-పుట్టినచతుర్ముఖుడు। కరపద్మములు-పద్మములవంటిచేతులు। రత్నహాటకగిరులు। రత్న-నవరత్నమయమైన। హాటక-సువర్ణమయమైన। గిరులు-రోహణము-మహామేరువనుకొండలు। ముఖాంబుజములు-ముఖపద్మములు। మహనీయములగు-గొప్పవియగు। ఆమ్నాయసమూహముల్ । ఆమ్నాయ-వేదములయొక్క। సమూహముల్ -సంఘములు। కేశములు-తలవెండ్రుకలు। ఆచతుర్భుజుడు। ఆ-ప్రసిద్ధుడగు। చతుఃనాలుగైన। భుజుడు-బాహువులుగలిగిన। శౌరి-శూరపుత్రుడైనకృష్ణుడను శ్రీమహావిష్ణువు। భూర్భువస్స్వ

ర్ముఖ్యభువనపరంపరాజనుహేతుశక్తి। భూః- భూలోకము।భువః-భువర్లోకము। స్వః-స్వర్గలోకము। ముఖ్య-మొదలగు-పదునాలుగైన। భువన-లోకములయొక్క।పరంపరా-పఙ్క్తియొక్క। జను-జన్మమునకు।హేతు-కారణమైన। శక్తి-సామర్థ్యము। యీవిశ్వము-యీప్రపంచము।ఇట్లు - యీప్రకారముగా।విశ్వకర్మవలనను-విశ్వబ్రహ్మవల్లను। ఈవిశ్వము-ఈప్రపంచము । ఒదవె-పుట్టెను। విశ్వకర్మయె-విశ్వకర్మే।తద్విరాడ్విగ్రహంబు।తత్ - ఆప్రసిద్ధమైన।విరాడ్విగ్రహంబు- విరాట్-విరాట్టనెడు । విగ్రహంబు-మూర్తియు-విశ్వకర్మయె-విశ్వకర్మే।వేదాంతవేద్యమూర్తి। వేదాంత - ఉపనిషత్తులచేత-వేద్య-తెలియదగిన। మూర్తి-శరీరముగలవాడును।విశ్వకర్మసమానుండు। విశ్వకర్మ-విశ్వకర్మతో-సమానుండు-సదృశుడైన। వేల్పు-దేవుడు-కలడె-వున్నాడా॥

తా ॥ విశ్వకర్మ విరాట్స్వరూపుడును జగజ్జనకుడును దేవతామయుడును వేదవేద్యుడును గాననట్టిదేవుడద్వితీయుండును॥ ౨౫

వ॥ మఱియువిశ్వకర్మతనూజులమహిమఁజెప్పెద॥

టీ॥ మరియు-ఇంకను।విశ్వకర్మతనూజులమహిమ।విశ్వకర్మ-విశ్వకర్మయొక్క- తనూజుల-పుత్రులయొక్క।మహిమ-మహత్తును।చెప్పెద-వచించెదను॥

తా॥ ఇకమీదట తత్పుత్రవర్యులచరిత్రలనువివరించెదను॥ ౩౬

## నలుడు సేతువును నిర్మించుట

క ॥ ధీరమతివిశ్వకర్మకు । మారుండునలుడుగట్టె మహినెన్నికగా। నూరా
మడపొడవంబుధి । కారణజన్ముడగు రాము కార్యార్థమునై॥

టీ॥ ధీరమతి। ధీర-ధైర్యముతోగూడిన। మతి మనసుగలినట్టియు-విశ్వకర్మకుమారుండు।విశ్వకర్మ-విశ్వకర్మకు।కుమారుండు-పుత్రుడైనట్టియు। నలుండు-నలుడనువానరుడు।మహిఁ-పుడమిని।ఎన్నికగాఁ-గణ్యముగాను। అంబుధిఁ-సముద్రమందు। నూరామడ।నూరు-నూరైన।ఆమడ-ఆమడలు।పొడవును-పొడవైనసేతువును। కారణజన్ముడగు।కారణ-నిమిత్తమాత్రమైన।జన్ముడగు- పుట్టుకకలిగినట్టి। రాముకార్యార్థమునై। రాము-శ్రీరాములవారియొక్క। కార్యార్థమునై-పనికొరకు।కట్టెఁ-ఒనర్చెను॥

తా ॥ శ్రీరాములవారు లంకకువెళ్ళి సీతాదేవిని తెచ్చుటకుగాను సముద్రములో నలుడు శతయోజనవిస్తీర్ణమైన కట్టను గట్టెను॥ ౩౭

మ ॥ జలరాసుల్ వసుధాస్థలింబొదువ తత్సర్వంసహాచక్రముం । జలధుల్గా
గిరులెల్లభూసమముగాక్ష్మాభాగమెల్లన్ మహా । చలశృంగంబులుగానొనర్చుటకు
నోజన్ విశ్వకర్మాంశజుల్ । నలకొన్నట్టిజగద్గురుల్ ఘనమతుల్ నిర్జీవజీవేశ్వరుల్॥

టీ॥ ఘనమతుల్ ।ఘన-గొప్పవియగు।మతుల్-బుద్ధులుగలయట్టియు। నిర్జీవజీవేశ్వరుల్ -చేతనాచేతనప్రభువైనట్టియు। విశ్వకర్మాంశజుల్ ।విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । అంశజుల్-కళాసంభూతులైనపంచబ్రహ్మలు। జలరాసుల్-సప్తసముద్రములు।వసుధాస్థలిఁ- భూతలమును।పొదువఁ-ఆక్రమించగా।తత్సర్వంసహాచక్రముఁ।తత్-ఆ।సర్వంసహాచక్రముఁ-భూమండలమును-జలధులుగా- సముద్రములనుగాను।గిరులెల్లఁ-కొండలన్నిటిని।భూసమముగా- నేలపరుపుగా।క్ష్మాభాగమెల్లఁ - యీవసుధాభాగ

మును। మహాచలశృంగంబులుగాఁ। మహాచల-గొప్పకొండలయొక్క।శృంగంబులుగాఁ-శిఖరములుగను।ఒనర్చుటకుఁ-చేయుటకు-ఓజఁ-శక్తిచే। నెలకొన్నట్టిజగద్గురుల్।నెలకొన్నట్టి-ప్రానుకొన్నట్టి-జగద్గురుల్-లోకగురువులు॥

తా॥ సముద్రములు భూమిని ఆక్రమించియుండగా సర్వశక్తిసంపన్నులైన విశ్వకర్మ పుత్రులు భూమినిసముద్రములను కొండలనువాటిశిఖరములను వేరువేరుగాయేర్పరిచిరి॥ ౩౮

## యజ్ఞోత్పత్తి కథనము.

గీ॥ అనఁ గుమారుఁడిట్లు నడిగెహరుని। దేవదేవమహాదేవ దేవవినుత। యజ్ఞ
కర్మార్థమైన వేదార్థసరణి। తెలుపుసియెడ నానతీవలయునన॥

టీ॥ అనఁ-యిట్లుచెప్పగా। కుమారుడు-కుమారస్వామి। విని-ఆకర్ణించి। దేవదేవ-దేవతలకు దేవుడా।మహాదేవ-గొప్పయీశ్వరుడా।దేవవినుత।దేవ-సురలచేత।వినుత-స్తుతించబడ్డవాడా।యజ్ఞకర్మార్థమైన। యజ్ఞ-యజనములయొక్క। కర్మార్థమైన-పనికొరకైనట్టి। వేదార్థసరణిఁ। వేద-ఆగమములయొక్క। అర్థ-అర్థముయొక్క।సరణిఁ-త్రోవను।తెలియఁ-స్పష్టముగా। ఈయెడఁ-ఇచ్చోటను। ఆనతీవలయును-సెలవివ్వవలయును। అని-చెప్పి।హరునిఁ-సాంబమూర్తిని। అడిగె-వేడుకొనెను। అనినఁ-మనవిచేయగా॥

తా॥ ఆచెప్పినసంగతులు కుమారస్వామివిని ఈశ్వరునిస్తుతియించి యజ్ఞసంబంధములైన వేదమార్గముల జన్మమును తెలియచేయుమనియడిగెనని॥ ౩౯

క॥ వినిపరమేశుడునీవడిగినప్రశ్నము పుత్రసకలకిల్బిషహరము। ఘనయజ్ఞ
కర్మలక్షణ। మొనరగవినుపింతుపురుషసూక్తవిధమునఁ॥

టీ॥ పరమేశుడు-సాంబమూర్తి।విని-ఆకర్ణించి।పుత్ర-ఓకుమారుడా। నీవు-ఈవు। అడిగినప్రశ్నము-కోరినసంగతి।సకలకిల్బిషహరము। సకల-సమస్తమైన।కిల్బిష-పాపములను।హరము-పోగడిచెడిది।ఆఘనయజ్ఞకర్మలక్షణము।ఆ-ప్రసిద్ధమైన।ఘన-గొప్పవియగు।యజ్ఞకర్మ- దేవపూజావిధానములయొక్క।లక్షణము-స్వరూపవ్యవహారములను।ఒనరగఁ-ఒప్పునటుల।పురుషసూక్తవిధమునఁ। పురుషసూక్త-పురుషసూక్తముయొక్క-విధమునఁ-రీతిచే।వినుపింతు-తెలియపరచెదను॥

తా॥నీవడిగినసంగతిదురితనాశకమైనదిగాన పురుషసూక్తప్రకారంబుగనదిచెప్పుచున్నాడను॥ ౪౦

గీ॥ ఏయెడనుసాశనానశనేనని యెడు ఘనతశ్రుతిఁబల్కుఁ దద్విశ్వకర్మవలన। తత
విరాణ్మూర్తిజనియించె నతనివలన। యజ్ఞకర్మంబులన్నియు నవతరించె॥

టీ॥ ఏయెడఁ-దేనివిషయమై।సాశనానశనేఅభి-సాశనానశనేఅభి। అనియెడు-అనుచున్న। ఘనతశ్రుతి।ఘనత-గొప్పగల।శ్రుతి-వేదము।తద్విశ్వకర్మవలనఁ। తత్-ఆ।విశ్వకర్మవలనఁ-విశ్వకర్మవల్ల।తతవిరాణ్మూర్తి। తత-విస్తారుడైన। విరాణ్మూర్తి-విరాట్పురుషుడు।జనియించెఁ-పుట్టెను।అతనివలనఁ-ఆవిరాట్‌వలన।అన్నియు-యావత్తు।యజ్ఞకర్మంబులు-యజనవిధులు। అవతరించెఁ-కలిగెనని। పల్కెఁ-చెప్పెను॥

తా॥ పురుషసూక్తము విశ్వకర్మవల్ల విరాట్టుపుట్టెననియు ఆవిరాట్టువలనయజ్ఞక్రియలు సంభవించెననిచెప్పెను॥ ౮౧

వ॥ శ్రుతులచేత వర్ణింపదగు విశ్వరూపకుండును- సహస్రాంశుండును - నగు విశ్వకర్మనుగురించియజ్ఞంబునీవునుయథోక్తప్రకారంబున నొనరింపందగు - మరి యుప్రసన్నముఖుండును- యఖిలవాంఛాప్రదుండును - పరమపురుషుండును నైనయాదేవునిముఖమువలన పంచసాదాఖ్యతత్వంబులుద్భవించె - నాపంచసాదాఖ్యాతత్త్వముఖస్వరూపునిక్రౌంచవిదారణవినుము॥

టీ॥ శ్రుతులచేతవర్ణింపదగు విశ్వరూపకుండును। శ్రుతులచేత- వేదములచేతను। వర్ణింపదగు- నిరూపించతగిన। విశ్వరూపకుండును। విశ్వ-ప్రపంచము।రూపకుండును- స్వరూపముగాకలవాడైనట్టియు। సహస్రాంశుండును-సూర్యుడైనట్టియు। పరమపురుషుండును।పరమశ్రేష్ఠుడైన। పురుషుండును- (పురుషశబ్దవాచ్యుండును)అయిన-అయినట్టి। ఆదేవునిముఖమువలనన్। ఆదేవుని- ఆవిరాట్పురుషుని యొక్క।ముఖమువలనన్- మోమువల్ల। పంచసాదాఖ్యతత్త్వంబులు। పంచ-అయిదగు-సాదాఖ్య-సాదములను పేరుగల।తత్త్వంబులు-తత్త్వములు। (అనగాబ్రహ్మభావములు) ఉద్భవించెన్-పొడమెను।ఆ పంచసాదాఖ్యతత్త్వ ముఖస్వరూపుని। ఆ-వెనుకచెప్పిన।పంచ-అయిదగు। సాదాఖ్యతత్త్వ- సాదాఖ్యతత్త్వములు।ముఖస్వరూపుని-సద్యోజాతాదిపంచముఖాకారములుగలఆవిశ్వకర్మను। క్రౌంచవిదారణ-ఓకుమారా।వినుము-ఆకర్ణింపుము॥

తా॥ శ్రుతిప్రతిపాదితుడైనపంచసాదాఖ్యముఖములుగలవిశ్వకర్మయొక్కస్థితినివినుపించెదను॥

ఉ॥ ఆదికిఁ గారణం బహఃపతికోటిసమాన తేజుఁడు। త్పాదితసర్వలోకుడును బ్రహ్మము నైతగు విశ్వకర్మ నా। నాదివిజాళిలోన భువనంబుల కెల్లను హేతుకార్యక। ర్త్రాదులు తా నెయై తగుఁ దథార్థము సుమ్ము మయూరవాహనా॥

టీ॥ ఆదికిన్-సృష్ట్యారంభమునకు। ఆదికారణము।ముఖ్యకారణము। అహఃపతికోటిసమాన తేజుడు। అహఃపతి।అహః-పగటికి-పతి-ప్రభువులైనసూర్యులయొక్క-కోటి-కోట్లతో- సమాన తేజుడు। సమాన-సదృశమైన।తేజుడు-ప్రకాశముగలిగినట్టియు-ఉత్పాదితసర్వలోకుడును।ఉత్పాదిత-సృష్టించబడిన।సర్వ-సమస్తమైన। లోకుడును- ప్రపంచములుగలయట్టియు। బ్రహ్మము నై-పరబ్రహ్మస్వరూపకుడునై। తగు-ఒప్పుచున్న। విశ్వకర్మ-విశ్వకర్మ। నానాదివిజాళిలోనన్। నానా-అనేకులైన।దివిజ-దేవతలయొక్క। ఆళిలోనన్-పఙ్క్తిలోపలను। భువనంబులకెల్లను- అన్నిలోకములకును। హేతుకార్యకర్త్రాదులు।హేతు- కారణమును। కార్య-కార్యమును । కర్త-ప్రభువును। ఆదులు-మొదలైనవి। తానె యై-ఆవిశ్వకర్మయేఅయి।తగున్-ఒప్పును।మయూరవాహన- ఓషణ్ముఖుడా।యథార్థముసుమ్ము- సత్యము సుమీ॥

తా॥ ఓకుమారావిశ్వకర్మ-సమస్తలోకములకుముఖ్యకారణమునుయీదేవతలందరిలో యీలోకములకుతానొక్కడేకార్యకారణకర్తృత్వాదులనుపొందిసృజించెను సత్యము॥ ౮౩

క॥ అంగాధనవిశ్వభువనకు। మొదలను బ్రహ్మాదివిజముఖ్యులుగలరే। తుదను నాదియాదికాద్యుండిదివెన్నఁగ విశ్వకర్మకెన యేయితరుల్॥

టీ॥ ఆదిగావునన్-ఆదిగనుకను। అవ్విభునకున్-ఆవిశ్వకర్మకు। మొదలను-క్రిందను।బ్రహ్మాది దివిజముఖ్యులు।బ్రహ్మ-బ్రహ్మదేవుడు-ఆది-మొదలగు।దివిజముఖ్యులు-దేవతాశ్రేష్ఠులు।కలరు-ఉండిరి-తుదవకు-ఈచివరకు।తుది-చివరయైనవాడు।ఆదికిన్-మొదటికి। ఆద్యుండు-మొదటివాడు। ఇది- ఈ సంగతి। ఎన్నగన్-లెక్కించగా। విశ్వకర్మకు-విశ్వకర్మకు। ఇతరుల్- ఇతరదేవతలు । ఎనయే-సాటి యౌదురా॥

తా॥ ఆవిశ్వకర్మయను వృక్షమునకు అధఃప్రదేశముబ్రహ్మ మొదలైన దేవతలుగాన యీవిశ్వ కర్మయే మొదలుకు మొదలుచివరకుచివరైనవాడు॥ ౮౪

క ॥ ఆనందలీలచేబర । మానందస్థలిని గ్రీడలాడుచుత్రిదివ॥ స్థానులకు నెల్ల జన్మకి । ధానంబై విశ్వకర్మపెద్దయుమించెన్ ॥

టీ॥ విశ్వకర్మ-విశ్వకర్మ।ఆనందలీలచేన్- బ్రహ్మానందవిలాసములచేత। పరమానందస్థలిన్- బ్రహ్మపదమందు। క్రీడలు-ఆటలను।ఆడుచున్-చేయుచును। త్రిదివస్థానులకునెల్లన్- అందరుదేవతల కును।జన్మనిదానంబై। జన్మ-పుట్టుకకు।నిదానంబై-మూలకారణమై।పెద్దయు-మిక్కిలి।ఒప్పెన్- ప్రకా శించెను॥

తా॥ ఆపరమకైలాసపదమందు విశ్వకర్మ ఆనందఖేలనము లొనర్చుచు దేవతలకు జనకుడై ప్రకాశించెను॥ ౮౫

వ ॥ అనిననిని బాహులేయుండయ్యుమాధవ ణునకిట్లనియె - సర్వజ్ఞ సర్వదేవో త్పత్తివినవలతునానతీయ వేయనిన శంకరుండు కుమారా నీవడిగిన సకలదేవతా సంభవంబు బ్రాహ్మణోస్య ముఖ మాసీత్తను శ్రుత్యుక్త ప్రకారంబుజెప్పెదనా కర్ణింపుము॥

టీ॥ అనినన్-సాంబమూర్తి యీలాగునజెప్పగా। బాహులేయుండు- కుమారస్వామి। విని-ఆకర్ణించి। అయ్యుమాధవుణునకున్-ఆపార్వతీపతికి।ఇట్లనియెన్-ఈలాగనెను। (ఏమనగా) సర్వజ్ఞ-సమస్తము తెలిసినతండ్రీ।సర్వదేవోత్పత్తిన్।సర్వ। సకలమైన।దేవ-బ్రహ్మాదిదేవతలయొక్క। ఉత్ప త్తిన్-పుట్టుకను। వినవలతున్-వినవలయును।ఆనతివ్వవే-సెలవీయుడీ।అనినన్- అనగను।శంకరుండు-సాంబమూర్తి।కుమార-ఓకుమారుడా । నీవడిగినసకలదేవతాసంభవంబు।నీవు-ఈవు। అడిగిన-పృచ్ఛ చేసిన। సకల-సమస్తమైన-దేవతా-దేవతలయొక్క। సంభవంబు-పుట్టుకను। బ్రాహ్మణోస్యముఖ మాసీత్। అస్య-ఈవిశ్వకర్మయొక్క।ముఖం-మోము । బ్రాహ్మణః-విశ్వబ్రాహ్మణుడు। ఆసీత్-ఆయెను। అనుశ్రుత్యుక్తప్రకారంబు।అను-అనియెడి। శ్రుతి-పురుషసూక్తముచేత।ఉక్త-చెప్పబడిన। ప్రకారంబు-విధమును। చెప్పెదన్-వక్కాణించెదను। ఆకర్ణింపుము-వినుము॥

తా॥ కుమారస్వామిసర్వదేవతాజన్మప్రకారమును అడుగగా పురుషసూక్త ప్రకారముచేత చెప్పందొణంగె॥ ౮౬

విశ్వకర్మ వలన పంచభూతాద్యుత్పత్తి.

చ ॥ అరయసహస్రశీర్షపురుషాధ్యశిఖన్ జ్వలనుండు మోమునన్ । హరుడు భుజంబులన్ హరినిజాంకములందజుడుఘ్రుక్షుందుమున్ । సురపతి చంద్రుడాత్మ

నలసూర్యుడుకన్నులఁబ్రాణపఙ్క్తిను । త్కరమగువాయువున్నభము గైకొని నా
భినిబుట్టెనెంతయున్॥

టీ॥ అరయన్-విచారించగా।సహస్రశీర్షపురుషాఖ్యు। సహస్ర- వేయగు।శీర్ష- శిరస్సులు
గల-పురుషాఖ్యు-పురుషశ్రేష్ఠుడైన-విశ్వకర్మయొక్క।శిఖన్-శిఖవలన। జ్వాలనుండు- అగ్నిహోత్రు
డును। మోమునన్-ఆననమువలన।హరుడు-శివుడును।భుజంబులన్- బాహువులవలన-హరి-విష్ణుమూ
ర్తియును-నిజాంకమునందు।నిజ-స్వకీయములగు। అంకములందు-తొడలయందు అజుడు-బ్రహ్మయును।
అంఘ్రులందు- పాదములయందు।సురపతి-దేవేంద్రుడును।ఆత్మన్- మనస్సునందు। చంద్రుడు-జాబిల్లి
యు।కన్నులన్-నేత్రములవలన।సూర్యుడు-దివాకరుడును। ప్రాణపఙ్క్తిన్। ప్రాణ- పంచప్రాణముల
యొక్క।పఙ్క్తిన్-పంక్తివలన।ఉత్కరమగు-సముదాయమైన।వాయువున్-తెమ్మెరయును।నాభిని-
బొడ్డును। కైకొని-గ్రహించి। నభము-ఆకసము।ఎంతయున్-మిక్కిలి।పుట్టెన్-పొడమెను॥

తా॥ ఆవిరాట్పురుషునివదనము మొదలగు అవయవములవలనఅగ్నిహోత్రుడు మొదలైనదేవ
తలుజన్మించిరి॥ ౪౭

క॥ శిరసునగగనము ధారుణి । చరణంబులకర్ణములదిశలునుదయించెన్। బర
మోపకారుడుజగ । ద్గురుడనదగువిశ్వకర్మకును సేనానీ॥

టీ॥ సేనానీ- దేవసేనాపతియైన ఓకుమారా। పరమోపకారుడు। పరమ-శ్రేష్ఠములైన।ఉప
కారుడు-ఉపకృతులనుచేసెటివాడును। జగద్గురుడు।జగత్-ప్రపంచములకు।గురుడు।తండ్రియును।అన
దగు-చెప్పదగిన-విశ్వకర్మకును-విశ్వకర్మకు।శిరస్సునన్-తలయందు।గగనము-ఆకసమును।చరణంబు
లన్-పాదములయందు।ధారుణి-పుడమియును।కర్ణములన్-శ్రోత్రములవలన। దిశలును- దెసలును।ఉ
దయించెన్-పుట్టెను॥

తా॥ జగజ్జనకుడైన విశ్వకర్మయొక్కశీర్షాదులవలన ఆకాశాదిపంచభూతములుపుట్టెను॥ ౪౮

బ్రహ్మాదులకువర్ణచతుష్టయంబుచెప్పుట.

క॥ ధరణీసురుడు మహేశుడు । హరిక్షత్రియుడజుడు వైశ్యుడమరాధీశుం ।
డరయగ శూద్రుండనసి । కరణింబుట్టించెవిశ్వకర్మధరిత్రిన్॥

టీ॥ మహేశుడు-సాంబమూర్తి। ధరణీసురుడు- బ్రాహ్మణుడు। హరి-విష్ణుమూర్తి। క్షత్రియు
డు-రాజు।అజుడు-బ్రహ్మ।వైశ్యుడు-కోమటి।అమరాధీశుండు-దేవేంద్రుడు।అరయగన్-విచారించగా
శూద్రుండు-పాదజుడు।అనన్-అనునట్లు। ఈకరణిన్-ఈరీతిచేత।విశ్వకర్మ- విశ్వకర్మ। ధరిత్రిన్-
భూమియందు। పుట్టించెన్-జన్మింపజేసెను॥

తా॥ విశ్వకర్మ శంకరాదులను బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనుగాకలుగజేసెను॥ ౪౯

పంచబ్రహ్మలకుపంచభూతాత్మకత్వము జెప్పుట.

చ॥ లలితమనుస్వరూపమనలంబుమయాకృతివాయువున్సదా । కలితముత్వా
ష్ట్రమంబరముగౌరవమొప్పగ శైల్ప్యమూర్వరన్ । సలిలము దైవ వైశ్యమును
సాధువృతిన్సృజియించె ధారుణీ। స్థలమునవిశ్వకర్మవిబుధస్తుతచారు పదార
విందుడై॥

టీ॥ విశ్వకర్మ-విశ్వకర్మ। విబుధస్తుతచారుపదారవిందుఁడై। విబుధ-దేవతలచేత। స్తుత-స్తోత్రము చెయ్యఁబడ్డ। పదారవిందుఁడై - పాదపద్మములుగలవాఁడై। ధారుణీభాగమునన్ - భూభాగమందు। లలితమనుస్వరూపము। లలిత-సుందరమైన। మనుస్వరూపము - మనుబ్రహ్మరూపమైన। అనలంబు-తేజస్సును। మయాకృతి। మయ-మయబ్రహ్మయొక్క। ఆకృతి-ఆకారమైన। వాయువున్ - గాలినిని। సదాకలితము - ఎల్లప్పుడొప్పుచున్నట్టియు। త్వాష్ట్రము - త్వష్టబ్రహ్మసంబంధమైనట్టియు। అంబరము-ఆకసమును। గౌరవమొప్పఁగన్-గురుత్వమొప్పునట్లుగా। శైల్ప్యము - శిల్పిబ్రహ్మసంబంధమైన। ఉర్వరన్ - పృథివినిన్ని। దైవతాకము - దైవజ్ఞబ్రహ్మసంబంధమైన। సలిలము - జలమునున్ను। సాధుధృతిన్ - మంచిధైర్యముచే। సృజియించెన్ - నిర్మించెను॥

తా॥ విశ్వకర్మ మనుబ్రహ్మమొదలగు పంచబ్రహ్మాత్మకమైన పృథివ్యాది భూతపంచకమును తనశక్తిచే సృజియించెను॥ ౫౦

## సాదాఖ్యపంచతత్త్వోత్పత్తి కథనము.

సీ॥ మొదలసద్యోజాతముఖరాజమునశివ సాదాఖ్యతత్త్వంబుసంభవించె।
ఘనవామదేవ వక్త్రసరోరుహంబున సాదాఖ్యతత్త్వంబు జననమొందె।
తత్పురుషాననాంతరమునమూర్తిసా దాఖ్యతత్త్వంబువిఖ్యాతినొందె।లలితరూ
పాఘోరలపనదేశంబున దగకర్తృసాదాఖ్యతత్త్వమొదవె। నలరునీశాన
నామధేయాస్యసీమ। కర్మసాదాఖ్యతత్త్వంబుగానుపించె। నెందులకువిశ్వ
కర్మమహేశ్వరుండు। పరమమునకంటెపరముఁడై పరగుచుండె॥

టీ॥ మొదలన్-మొదటను। సద్యోజాతముఖరాజమునన్। సద్యోజాత-సద్యోజాతమనెడు। ముఖరాజమునన్-వదనశ్రేష్ఠమువలన। శివసాదాఖ్యతత్త్వంబు। శివసాదాఖ్య-శివసాదమనేపేరుగల। తత్త్వంబు-తత్త్వము। సంభవించెన్-కలిగెను। ఘనవామదేవవక్త్రసరోరుహంబునన్। ఘన-గొప్పదియగు। వామదేవ-వామదేవమనెడు। వక్త్రసరోరుహంబునన్-ముఖపద్మమువలన। సాదాఖ్యతత్త్వంబు-సాదమనుతత్త్వము। జననమొందెన్-ఉద్భవించెను। తత్పురుషాననాంతరమునన్। తత్పురుష - తత్పురుషమనెడు। ఆననాంతరమునన్ - ముఖసరోజమువలన। మూర్తిసాదాఖ్యతత్త్వంబు। మూర్తి - మూర్తియనెడు। సాదాఖ్యతత్త్వంబు-సాదాఖ్యతత్త్వము। విఖ్యాతిన్-ప్రసిద్ధిని। ఒందెన్-పొందెను। లలితరూపాఘోరలపనదేశంబునన్। లలిత-సుందరమైన। రూప-స్వరూపముగల। అఘోర-అఘోరమనెడు। లపన-వక్త్రముయొక్క। దేశంబునన్-ప్రదేశమువలన। తగన్-ఒప్పునట్లు। కర్తృసాదాఖ్యతత్త్వము। కర్తృ-కర్తయనెడు। సాదాఖ్యతత్త్వము- సాదమనుతత్త్వము। ఒదవెన్ - పుట్టెను। అలరునీశాననామధేయాస్యసీమన్। అలరును - ఒప్పుచుండెడు। ఈశాననామధేయ - ఈశానమనుపేరుగల। ఆస్యసీమన్ - వదనస్థలమువలన। కర్మసాదాఖ్యతత్త్వంబు। కర్మ - కర్మయనెడు। సాదాఖ్యతత్త్వంబు-సాదమనుతత్త్వము। కానుపించెన్ - తోచెను। ఎందులకున్-అన్నిటికిని। విశ్వకర్మ-విశ్వకర్మ। మహేశ్వరుండు - గొప్పప్రభువు। పరమమునకంటెన్ - ఉత్కృష్టమైనదానికంటె। పరముఁడై - అత్యుత్కృష్టుఁడై। పరగుచుండెన్ - వర్తించుచుండెను॥

తా॥ విశ్వకర్మయొక్క పంచముఖములవలనను పంచతత్త్వములు గలిగెనుగాన యాయన యన్నిటికిని మహారాజనియు పరాత్పరుఁడనియు॥ ౫౧

క॥ పంచబ్రహ్మాత్మకుఁడును। పంచాక్షరమంత్రమయుఁడు ఫాలాంబకుఁడున్।
బంచాననుండెయొల్లప్ర। పంచమునను విశ్వకర్మప్రభువై వెలసెన్॥

టీ॥ విశ్వకర్మ-విశ్వకర్మ । పంచబ్రహ్మాత్మకుడును - పంచబ్రహ్మస్వరూపుడును । పంచాక్షరమంత్రమయుడు - పంచాక్షరీమంత్రవిగ్రహుడును । ఫాలాంబకుడుఁ । ఫాల - నొసటియందు । అంబకుడుఁ-కన్నుగలవాడును । పంచాననుండు । పంచ-అయిదైన । ఆననుండు - మోములుగలవాడును। ఎల్లప్రపంచమునకుఁ - లోకమంతకును । ప్రభువై - నిగ్రహానుగ్రహసమర్థుడునై । వెలసెఁ - ప్రకాశించెను॥

తా॥ విశ్వకర్మ యావజ్జగత్స్వరూపుడునై యెల్లలోకములకు సృష్టిస్థితిలయ సంహారకర్తయైయుండెను॥ ౫౨

గీ॥ తనరమన్వీశుడైనట్టిత్వష్టవిశ్వ। కర్మ రెండవరూపంబుగా నెఱుంగు।
విదితమీయర్థమాయజుర్వేదమునను। తనయ తెలియంగఁనుడేనునుదహరింతు॥

టీ॥ తనయ-ఓకుమారా । తనరఁ-ఒప్పునట్లుగ । మన్వీశుడైనట్టి-మనుప్రభువైన । త్వష్ట - త్వష్టబ్రహ్మ । విశ్వకర్మ రెండవరూపంబుగాఁ । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । రెండవరూపంబుగాఁ-ప్రతిబింబమునుగా । ఎఱుంగుము-తెలియుము । ఈ యర్థము-ఈసంగతి । ఆయజుర్వేదమునను । ఆ-ప్రసిద్ధమైన । యజుర్వేదమునను-యజుర్వేదమందుకూడను । విదితము-తెలియదగినది । ఏను-నేను । తెలియంగఁ-తెలియునట్లుగా । ఉదహరింతుఁ-చెప్పెదను । వినుడు - ఆలింపుము॥

తా॥ త్వష్టబ్రహ్మ విశ్వకర్మయొక్క రూపాంతరమునుగా యజుర్వేదము చెప్పుచున్నది. యాయర్థమును తెలియజెప్పెద వినుము॥ ౫౩

## త్వష్టబ్రహ్మ మహిమానువర్ణనము.

క॥ జంభారిసురార్చితపా। దాంభోజుడువిశ్వకర్మయాత్మజుడతులా।
రంభుండుత్వష్టధ్వర। సంభూతశ్రుతిపదార్థ చర్చయొనర్చుఁ॥

టీ॥ జంభారిసురార్చితపాదాంభోజుడు । జంభారి - దేవేంద్రుడుమొదలైన । సుర-దేవతలచేత। అర్చిత-పూజించబడ్డ । పాదాంభోజుడు - పాదపద్మములుగలట్టివాడు । విశ్వకర్మయాత్మజుడు । విశ్వకర్మ - విశ్వకర్మకు । ఆత్మజుడు - పుత్రుడైనట్టియు । అతులారంభుండు । అతుల - సాటిలేని । ఆరంభుండు-ప్రయత్నములుగలట్టియు । త్వష్ట-త్వష్టబ్రహ్మ । అధ్వరసంభూతశ్రుతిపదార్థచర్చయు । అధ్వర - యాగములకొరకై । సంభూత-పుట్టిన । శ్రుతి-వేదములయొక్క । పదార్థ - శబ్దార్థములయొక్క । చర్చయు-ప్రసంగమును । ఒనర్చుఁ-చేయును॥

తా॥ విశ్వకర్మ కుమారుడైన త్వష్టబ్రహ్మ శ్రౌతార్థపరిజ్ఞానముకలవాడనియు అశ్వమేధాంతయాగములుచేసి చేయించినాడనియు॥ ౫౪

## నిందించువాని ఫలము.

క॥ ఈ వేదవాణిజననీ। భావంబుననలరుజగతి బ్రాహ్మణ్యమునుఁ। వ్యావర్తింపంగాదని। వేవాద మొనర్చువాడు వృజినముబొందుఁ॥

టీ॥ ఈవేదవాణి - ఈవేదవచనము । జననీ భావంబునఁ - మాతృభావముచేత । అలరు - ఒప్పుచున్న । జగతి - పుడమియందు । బ్రాహ్మణ్యమును-బ్రాహ్మణ్యమును । వ్యావర్తింపఁ - ప్రవర్తింపచేయుచుండఁగా । కాదని-కూడదని । వే-శీఘ్రముగ । వాదమొనర్చువాడు - వాదించువాడు । వృజినమును - పాపమును । బొందుఁ-పొందును॥

తా॥ వేదమాత పురుషసూక్తమందు విశ్వబ్రాహ్మణ ప్రశంసను జేయుచుండగా అట్లుగాదని కువాదములు జేయుచున్నడు మాతృద్రోహపాపమును పొందును॥ ౫౧

గీ॥ వేదమార్గంబుమార్గంబు వేదవిదిత।ధర్మమెంతయుధర్మంబుధర్మమైన।
యట్టివేదార్థమైనకాదనెడువాడు। భువినిమలరాశిపురువులైపుట్టుగాదె॥

టీ॥ వేదమార్గంబు। వేద-వేదములయొక్క। మార్గంబు-పద్ధతియే। మార్గంబు-పద్ధతి। వేదవిదితధర్మము। వేద-వేదములచేత। విదిత-తెలియచేయబడిన। ధర్మంబు-విధి। ఎంతయు-మిక్కిలి। ధర్మంబు-న్యాయము। ధర్మమైన-న్యాయమైన। అట్టివేదార్థమైనన్। అట్టి-అటువంటి। వేదార్థమైనన్। వేద-వేదములయొక్క। అర్థమైనన్-అర్థమునైనను। కాదనెడువాడు-మంచిదికాదని పలుకుచున్న బుద్ధిమంతుడు। భువిని-ఈపుడమియందు। మలరాశి-పురీషరాసిలో। పురువులై-క్రిములై। పుట్టుగాదె-పుట్టడా॥

తా॥ వేదవిహిత ధర్మములకంటె నెక్కుడు ధర్మము లెక్కుడగానముగాన తద్ధర్మ బోధకార్థమును గాదుకాదని ప్రేలెడు పరమపతితుడు అమేధ్యగర్తములో వర్తించు అసహ్య నీచక్రిమిగణములై పుట్టుచునుండును॥

క॥ వేదాచారవిహీనుని। వాదమువ్యర్థమగు సకలవర్ణంబులలో। వేదా
ధ్యయనవిదూరుం। డాదటపుల్కసునకన్న నల్పుడుగాదే॥

టీ॥ వేదాచారవిహీనుని। వేద-వేదోక్తములైన। ఆచార-విధులతో। విహీనుని-తక్కువైనవానియొక్క। వాదము-దుష్ప్రశంస। వ్యర్థమగున్-నిరర్థకమగును। సకలవర్ణంబులలోన్। సకల-అన్ని। వర్ణంబులలోన్-జాతులలో। వేదాధ్యయనవిదూరుండు। వేద-వేదములయొక్క। అధ్యయన-అర్థముతోకూడచదువుటకు। విదూరుండు-దూరమైనవాడు। ఆదటన్-మిక్కిలి। పుల్కసునకన్నన్-చండాలునికంటెను। అల్పుడుగాదే-తక్కువవాడుకాదా॥

తా॥ వేదోక్తాచారము జరుపుకొననివాడు జేసెడివాదము నిరర్థకము. సార్థవేదపాఠములేనివాడు చండాలునికంటె నధమాధముడు॥ ౫౨

## తత్త్వజ్ఞుని ఫలము.

క॥ మతి నెరుగదగినదిస। ద్వ్రతచరితాయపుడు వేదవాక్యమవశ్యం।
బతులితముగనది దెలిసిన। చతురుడు పరతత్త్వవిదుడు శాస్త్రజ్ఞుడగున్॥

టీ॥ సద్వ్రతచరిత। సత్-యోగ్యములైన। వ్రత-వ్రతములుగలవారియొక్క। చరిత-చరిత్రలవంటి చరిత్రలుగలఓకుమార। మతిన్-మనస్సుచేత। ఎరుగదగినది-తెలిసికొనదగినది। వేదవాక్యము-వేదములయొక్కవచనము। అవశ్యంబు-ముఖ్యముగ। అదిదెలసినన్-ఆవాక్యము తెలిసినట్లయిన। చతురుడు-చాతుర్యముగలవాడును। పరతత్త్వవిదుడు। పరతత్త్వ-పరమతత్త్వమును। విదుడు-తెలిసినవాడును। శాస్త్రజ్ఞుడు-శాస్త్రములు తెలిసినవాడును। అగున్-అవును॥

తా॥ ఓకుమారుడా, అందరు బాగుగ దెలియతగినది వేదముగనుక దానిని లెస్సగ జదివినవారలు పరబ్రహ్మజ్ఞాన సంపత్తిగలవారలవుదురు॥ ౫౩

## వేదమునకు విశ్వకర్మకు అభేదము.

ఉ॥ కావున వేదవాక్యమె జగద్ధితసత్యముజూడ వేదమే। దైవతమట్టి వేద

మును తత్త్వమయుండగు విశ్వకర్మకుం। దావలమై జనించెను యథాకథనం
బుగ వేదముల్ మహా। దేవుడ నాగ భేదమతి దేరగ నంగన శక్యమేరికిన్ ॥

టీ॥ కావునన్-గనుక । వేదవాక్యమె-వేదవచనమే । సత్యము-యథార్థము । జగద్ధిత । జగత్-లోకములకు । హిత-ఇష్టుడవైనఓకుమారా । చూడన్-చూడగా। వేదమే-ప్రాజదువే । దైవతము-దేవత । అట్టివేదమును । అట్టి-అటువంటి । వేదమును-నిగమమును । తత్త్వమయుండగు-యాథార్థ స్వరూపుడైన । విశ్వకర్మకున్-విశ్వకర్మకు । తావలమై-తావై । జనించెను-పుట్టెను । యథాకథనంబుగ-యథార్థముగ । వేదముల్-నిగమములును । మహాదేవుడు-గొప్పదేవుడైన విశ్వకర్మయును । అనగా-అనగ । భేదమతిన్ । భేద-వేదములకును విశ్వకర్మకును భేదముయొక్క । మతిన్- బుద్ధిచేత । తేరిచూగుగ । కనంగన్-చూచుటకు । ఏరికిన్-ఎవ్వరికిని । అశక్యంబు-శక్యముగాదు ॥

తా॥ వేదములు సత్యములు వేదములు దైవము అట్టివేదమయుడైన విశ్వకర్మకును వేదములకును భేదమున్నదని నెవ్వరు చెప్పగలరు ॥ ౫౯

విశ్వకర్మస్తుతి.

సీ॥ త్వష్టప్రజాపతి తరణిమహేంద్రుండు వెలయదివస్పతి విశ్వకర్మ ।
భూరితరమయుండు పుండరీకాక్షుండు మనువుశాస్త్రింబులై మహిని వెల
యు । మన్వీశుడు శివుండు మనుమూర్తిమయుడును మురిపెంపుగా హరి
మూర్తిత్వష్ట । కర్మశిల్పియుబంచ కర్మమైపంచసా దాఖ్యతవిశ్వజ్ఞుడలరెన
తడె । దెలియ నామత్రయముల నాదిత్యుడగుచు । పంచవింశతి తత్త్వైకపరు
డుపంచ । రూపితత్పంచభూత స్వరూపుడరయ । నీశరవివహ్నిమూర్తులనె
సగెమనువు ॥

టీ॥ త్వష్టప్రజాపతి - త్వష్టబ్రహ్మ । తరణి - సూర్యుడు । విశ్వకర్మ - విశ్వకర్మ । వెలయు - ప్రకాశించెడి । దివస్పతి-స్వర్గనాథుడైన । మహేంద్రుడు-దేవేంద్రుడు । భూరితరమయుండు । భూరితర-మిక్కిలిగొప్పవాడగు । మయుండు-మయబ్రహ్మ । పుండరీకాక్షుండు-శ్రీమహావిష్ణువు । మనువు-మనుబ్రహ్మ । శాస్త్రింబులై-శాస్త్రస్వరూపకుడై । మహిని-భూమియందు । వెలయున్-ప్రకాశించు । మన్వీశుడు-మనుబ్రహ్మ । శివుండు-సాంబమూర్తి । మయుండును-మయబ్రహ్మయును । మారమూర్తియు-మన్మథస్వరూపుడు । త్వష్ట-త్వష్టబ్రహ్మము । మురిపెంపుగాన్-ముద్దుగ । హరిమూర్తియు-చంద్రస్వరూపుడు । కర్మశిల్పియు-కర్మశిల్పిబ్రహ్మ । పంచకర్మమై-పంచకర్మస్వరూపుడునై । పంచసాదాఖ్యత-పంచసాదాఖ్యతత్త్వభావముచేత । విశ్వజ్ఞుడు-దైవజ్ఞబ్రహ్మ । అలరెన్-ప్రకాశించెను । అతడె-అద్దైవజ్ఞుడే । తెలియన్-ఆలోచించగా । నామత్రయములన్ । నామ-పేళ్లయొక్క । త్రయములన్-మూటిచేత । ఆదిత్యుడగుచు-సూర్యుడగుచును । పంచవింశతి తత్త్వైకపరుడు । పంచవింశతి-ఇరువదియైదగు । తత్త్వ-పృథివ్యాదితత్త్వములు । పరుడగు-ప్రధానముగాగలవాడైనట్టియు । పంచరూపి-పంచబ్రహ్మస్వరూపముగలవాడును । తత్పంచభూతాత్మరూపుడు । తత్-ఆప్రసిద్ధమైన । పంచభూతాత్మరూపుడు-పంచభూతస్వరూపుడునగు । మనువు-మనుబ్రహ్మ । ఈశరవివహ్నిమూర్తులన్ । ఈశ-శివునియొక్కయు । రవి-సూర్యునియొక్కయు । వహ్ని-అగ్నిహోత్రునియొక్కయు । మూర్తులన్-స్వరూపములచేత । ఎసగెన్-ప్రకాశించెను ॥

తా॥ త్వష్ట మొదలగు పంచబ్రహ్మలు ఆయాదేవతా స్వరూపములచేత ప్రకాశించిరి. వారలలో త్వష్టపంచ కర్మ పంచ సాదాఖ్య తత్త్వస్వరూపకుడై తేజరిల్లెను. మనుబ్రహ్మ పంచవింశతి తత్త్వాదిరూపకుడై ప్రకాశించెను ॥ ౬౦

క॥ జలమై చంద్రుడు సూర్యుడు । జ్వలనంబై విశ్వకర్మవలన గలిగిరు । జ్జ్వ
లముగ ననియశ్రాంతము । వలనుగ నథరవణ వేదవాక్యము దెలిపెన్ ॥

టీ॥ చంద్రుడు-చందురుడు । జలమై-ఉదకమై । సూర్యుడు-రవి । జ్వలనంబై-అగ్నిహోత్రుడై । విశ్వకర్మవలనన్-విశ్వకర్మబ్రహ్మవల్లను । ఉజ్జ్వలముగన్-ప్రకాశముగ । కలిగిరి-పుట్టిరి । అనిశంబాగునని । అశ్రాంతము-ఎల్లప్పుడును । వలనుగన్-ఒప్పుగా । అథరవణవేదవాక్యము । అథరవణవేద-అథర్వణవేదముయొక్క । వాక్యము-వచనము । దెలిపెన్-చెప్పెను ॥

తా॥ సూర్యచంద్రాదులు జలాగ్ని స్వరూపులై విశ్వకర్మవలన పుట్టిరని యథర్వణవేదము చెప్పెను. ౬౧

విశ్వకర్మకు త్రిమూర్త్యాత్మకత్వము.

క॥ కమలాసనరూపంబుద । యమునన్ మధ్యాహ్నవేళ హరరూపమున ।
స్తమయంబున శ్రీహరిరూ । పమునగు యవ్విశ్వకర్మ పరమాకృతియై ॥

టీ॥ అవ్విశ్వకర్మ-ఆవిశ్వకర్మ । ఉదయమునన్-ప్రాతఃకాలమందు । కమలాసనరూపంబునన్ । కమలాసన-బ్రహ్మయొక్క । రూపంబునన్-ఆకారముచేతనున్న । మధ్యాహ్నవేళన్-మధ్యాహ్నకాలమందు । హరరూపమునన్ । హర-సాంబమూర్తియొక్క । రూపమునన్-స్వరూపముచేతనున్న । అస్తమయంబునన్-సాయంతనకాలమందు । శ్రీహరిరూపమునన్ । శ్రీహరి-విష్ణుమూర్తియొక్క । రూపమునన్-రూపముచేతనున్న । పరమాకృతియై । పరమ-శ్రేష్ఠమైన । ఆకృతియై-ఆకారముగలవాడునై ॥

తా॥ విశ్వకర్మ ఉదయాది త్రికాలములయందును త్రిమూర్తిస్వరూపకుడై ప్రకాశించెను ॥ ౬౨

విశ్వకర్మకు సర్వాత్మకత్వము.

మ॥ తరణీంద్వాదినవగ్రహంబులును తత్తద్వాహనశ్రేణులన్ । కరణవ్రా
తముశస్త్రసంఘములు రంగద్ధామముల్ విశ్వసం । చరణార్హోన్నత
దివ్యమార్గములు సాక్షాద్బ్రహ్మమా విశ్వక । ర్మరచించెన్ శిఖివాహ వారలకు
సేమంబొప్పునే తత్కృపన్ ॥

టీ॥ శిఖివాహ-ఓమయూరవాహనుడా । సాక్షాద్బ్రహ్మమా-ప్రత్యక్షబ్రహ్మమైన । విశ్వకర్మ-విశ్వకర్మ । తరణీంద్వాదినవగ్రహంబులను । తరణి-సూర్యుడు । ఇందు-చంద్రుడు । ఆది-మొదలగు । నవ-తొమ్మిదియగు । గ్రహంబులను-గ్రహములనున్న । తత్తద్వాహనశ్రేణులన్ । తత్తత్-వారివారియొక్క । వాహన-గజాదియానములయొక్క । శ్రేణులన్-పఙ్క్తులనున్న । కరణవ్రాతమున్ । కరణ-సాధనశ్రేష్ఠములయొక్క । వ్రాతమున్-సమూహమునున్న । శస్త్రసంఘమున్ । శస్త్ర-వజ్రాయుధాదిశస్త్రములయొక్క । సంఘములన్-సమూహములనును । రంగద్ధామముల్ । రంగత్-ప్రకాశించుచున్న । ధామముల్-గృహములు మొదలైనవానినిన్ని । విశ్వసంచరణార్హోన్నతదివ్యమార్గములు । విశ్వ-సమస్తమైన । సంచరణ-తిరుగుటకు । అర్హ-తగిన । ఉన్నత-గొప్పవియైన । దివ్య-దేవసంబంధమైన । మార్గములు-త్రోవలను । రచించెన్-ఒనరించెను । వారలకున్-ఆయింద్రాదులకును । ఏతత్కృపన్ । ఏతత్-ఈవిశ్వకర్మయొక్క । కృపన్-దయచేత । సేమంబు-క్షేమము । ఒప్పున్-కలుగును ॥

తా॥ విశ్వకర్మ సూర్యుడు మొదలగు తొమ్మిది గ్రహములను చేసి వారికి తగిన గృహాదులను యేర్పరుచుటవలన వారు క్షేమముగ నుండిరి ॥ ౬౩

సీ ॥ తిథులుపక్షంబులాదిత్యాదివారంబు లశ్వినీముఖ్యతారాళియోగ ।
కరణముల్ మేషాదిఘనరాసులధికసూక్ష్మములైన యట్టిలగ్నములు హోర ।
లలరుద్రేక్కాణనవాంశకంబులుత్రింశ దంశంబులునుద్వాదశాంశములును ।
షడ్వర్గముఖ్యలక్షణములుచంద్రకా లానలసూర్యకాలములువరుస । సర్వతో
భద్రభద్రాదిచతురశీతి । చక్రములుగల్గుజ్యోతిషశాస్త్రమహిమ। పరగషట్ఛా
స్త్రములుపంచపక్షిమతము । వీనినన్నియునిర్మించెవిశ్వకర్మ॥

టీ॥ తిథులు-పాడ్యమి మొదలగుదినములను । పక్షంబులు-శుక్లకృష్ణపక్షములను । ఆదిత్యాదివారంబులు-ఆదివారము మొదలగు యేడు వారములను । అశ్వినీ ముఖ్యతారాళియోగకరణముల్ । అశ్వినీ-అశ్విని మొదలగు యిరువదియేడునక్షత్రములను । యోగ - విష్కంభము మొదలగు యిరువదియేడు యోగములను । కరణముల్-బవాదిపదకొండుకరణములనున్ను । మేషాదిఘనరాసులు । మేష-మేషము। ఆది-మొదలగు । ఘన-గొప్పవియైన । రాసులు-పదకొండు రాసులను । అధికసూక్ష్మములైన-మిక్కిలి కాన్పించని । అట్టిలగ్నములు-అటువంటి మేషాది పన్నెండులగ్నములను । హోరలు-సూర్యహోర మొదలైన హోరలను । అలరుద్రేక్కాణనవాంశకంబులు । అలరు-ప్రకాశించుచున్న । ద్రేక్కాణ - ద్రేక్కాణములను । నవ - తొమ్మిదియగు | అంశకంబులను - అంశములను । త్రింశదంశంబులును । త్రింశత్ - ముప్పదియగు । అంశంబులును - అంశలనున్ను। ద్వాదశాంశములును । ద్వాదశ - పన్నెండగు । అంశములును - అంశలనున్ను । షడ్వర్గముఖ్యలక్షణంబులును । షడ్వర్గ - షడ్వర్గము। ముఖ్య - మొదలైనవానియొక్క। లక్షణంబులు - స్వరూపములనున్ను । చంద్రకాలానలసూర్యకాలములును । చంద్రకాల-చంద్రునికాలమును । అనల-అగ్నియొక్కయు । సూర్య - సూర్యునియొక్కయు । కాలములును-సమయములనున్ను | వరుసన్-క్రమముగా । సర్వతోభద్రభద్రాదిచతురశీతి చక్రములుగలుగు । సర్వతోభద్ర-సర్వతోభద్రము । భద్ర-భద్రము । ఆది-మొదలగు । చతురశీతి-ఎనబదినాలుగైన । చక్రములుగలుగు-చక్రములుగలిగిన । జ్యోతిషశాస్త్రమహిమ । జ్యోతిషశాస్త్ర-జ్యోతిషశాస్త్రముయొక్క । మహిమ - మహిమనున్ను । పరగన్ - ఒప్పునటుల । షట్ఛాస్త్రములు । షట్-ఆరగు । శాస్త్రములు-శాస్త్రములనున్ను । పంచపక్షిమతము - పంచపక్షిమతమునెడు ప్రశ్నభాగమునున్ను । వీనినన్నియు- ఈ వెనక జెప్పినవానినన్నియును । విశ్వకర్మ-విశ్వకర్మ । నిర్మించెన్-చేసెను ॥

తా॥ విశ్వకర్మ తిథివారాదులను సర్వలక్షణసంపన్నంబగు జ్యోతిశాస్త్రమును తదితరశాస్త్రములను నిర్మించెను. ౬౪

## సాముద్రికలక్షణము.

క॥ రమణీమణులందగుయంకములను సాముద్రికప్రకారముతత్తత్క్రమ
ములువినుపించెదవిను । మమరవరూధిన్యధీశయంతయుదెలియన్ ॥

టీ॥ రమణీమణులందగుయంకములను । రమణీమణుల-స్త్రీరత్నములయందు । తగు-ఒప్పెడి । అంకములను-చిన్నెలను । సాముద్రికప్రకారము। సాముద్రిక-సాముద్రికశాస్త్రముయొక్క । ప్రకారము-రీతిని । తత్తత్క్రమములు। తత్-వానివానియొక్క । క్రమములు-విధులను | అంతయు-యావత్తును । తెలియన్ - తెలయునటుల। వినుపించెద-ఆకర్ణింపజేసెదను। అమరవరూధిన్యధీశ । అమర-దేవతలయొక్క। వరూధిని-సేనకు । అధీశ-అధిపతివైన ఓకుమారా । వినుము-ఆకర్ణింపుము ॥

తా॥ శ్రేష్ఠములైన స్త్రీలకుండదగిన సౌశీల్యాదిగుణములను వారల సాముద్రికరీతి మొదలైన వానిని తెలియఁజేసెదవినుము. ౬౫

గీ॥ మనుజవర్యుడైన యనఘునినెమ్మేన । సప్తతలులునెరవు సరవిత్రిస్థ ।
లులగభీరములును లలిజతుస్థలములు । దెలియవినగవలయు దేటపడగ ॥

టీ॥ మనుజవర్యుడైన-మనుజశ్రేష్ఠుడైనట్టి । యనఘుని-నిష్పాపజనునియొక్క । నెమ్మేనఁ-మంచిమొడలయందు । సప్తతలులు-సప్తసంఖ్యాకత్వములను । నెరవు-శ్రేష్ఠమైన । సరవిఁ-సరణిచేత । గభీరములును-గంభీరములునైన । త్రిస్థలులఁ । త్రి-మూడగు । స్థలులఁ-హృదయాదిస్థానములను । లలిచతుస్థలములు । లలి - సుందరములగు । చతుః-నాలుగగు । స్థలములు-ప్రదేశములనున్న । తేటపడగఁ-స్పష్టముగా । తెలియఁ-తెలియునటుల । వినవలయుఁ-ఆలకించవలయును ॥

తా॥ పురుషశ్రేష్ఠుని శరీరమందు నుండదగిన సప్తతలులు త్రిస్థలులు గంభీరములును చతుస్థలములను జెప్పెద బాగా వినుము ॥ ౬౬

## భూమి నెత్తుట.

సీ॥ నీరంబునందు జన్మించెరసాదేవి యారసాతలగతయైనఁజూచి । యావి
శ్వకర్మమహాజ్ఞ చేత్వష్టవ రాహరూపమునదంష్ట్రినుధరిత్రి । గొనియాదికూ
ర్మంబుకుదురుగావించి సహస్రఫణాధరుండైన శేషు । నందుమీఁదటనిల్పి యా
చుట్టుప్రాపుగా కరులనుగిరుల చొక్కముగనునిచి । యట్టిశేషునియాదల
యందుబెట్టి । ధారుణీదేవియంతయు దరలకుండ । సకలభారంబు ధరి
యించి చతురుడనగ । మెరసివస్త్వంతరములు నిర్మించెమరియు ॥

టీ॥ రసాదేవి-భూదేవి । నీరంబునందు-నీటియందు । జన్మించి-పుట్టి । ఆరసాతలగతయైనఁ-ఆ నీటియడుగును బొందినదికాగ । విశ్వకర్మ - విశ్వకర్మ । చూచి - కని । ఆవిశ్వకర్మమహాజ్ఞచే । ఆవిశ్వకర్మ - ఆవిశ్వకర్మయొక్క । మహా - గొప్పదియగు । ఆజ్ఞచే-సెలవుచేత । త్వష్ట - త్వష్టబ్రహ్మ । వరాహరూపమునఁ । వరాహ - అడవిపందియొక్క । రూపమునఁ - ఆకృతిచేత । దంష్ట్రిను - కోరచే । ధరిత్రిఁ-పుడమిని । కొని - తీసి । ఆదికూర్మంబును । ఆది-మొదటిదియగు । కూర్మంబును - తాబేలును । కుదురుగావించి - ఆధారమునుచేసి । సహస్రఫణాధరుండైన । సహస్ర-వేయగు । ఫణ - పడగలను । ధరుండైన - తాల్చిన । శేషునందు - ఆదిశేషునిపైని । మీదట-పడగలమీదను । నిల్పి-ఉంచి । ఆచుట్టు-దానిచుట్టు । ప్రాపుగ - ఆశ్రయముగ । కరులను - దిగ్గజములనును । గిరులను-కొండలనును । చొక్కముగఁ-సొగసుగను । ఉనిచి - ఉంచి । అట్టిశేషునియాదలయందు । అట్టి - అటువంటి । శేషుని-పాపరేనియొక్క । ఔదలయందు - మందలలయందు । పెట్టి-ఉంచి । ధారుణీదేవి-భూదేవి । అంతయు - యావత్తు । కదలకుండ - చెలించకుండునట్లు । సకలభారంబు । సకల-సమస్తమైన । భారంబు - బరువును । ధరియించి - వహించి । చతురుడనగఁ-చాతుర్యముగలవాడనునట్లుగ । మెరసి-ప్రకాశించి । వస్త్వంతరములు - మరియొకవస్తువులను । నిర్మించెఁ - సృష్టించెను । మరియు—ఇంకను॥

తా॥ భూదేవి ఉదకమువలనబుట్టి నీటిలో మునుగుచుండగ విశ్వకర్మాజ్ఞచేత త్వష్టప్రజాపతి వరాహరూపమెత్తి కొమ్ముచే పైకెత్తి ఆదికూర్మమును కుదురుగజేసి ఆదశేషునిపడిగెలమీదనునిచి కదలకుండ కొండలను దెసల ఏనుంగులను ప్రక్కలదాపి సమస్తభారమును తాల్చె నేర్పరియని స్తుతించగ సకలవస్తుసామగ్రిని నిర్మించెను॥ ౬౭

క॥ కాకోదరలోకముభూ । లోకము మొదలైనసకలలోకంబులు ర ।
త్నాకరములద్భుతముగన । నేకంబులొనర్చెనతడు హితమతితోడన్ ॥

టీ॥ కాకోదరలోకము - నాగలోకమును । భూలోకము మొదలగు సకలలోకంబులు । భూలోకము-మర్త్యలోకము । మొదలగు-ఆదిగాగల । సకల-సమస్తమైన । లోకంబులు-జగత్తులను । రత్నాకరములు-సముద్రములను । అద్భుతంబుగన్-ఆశ్చర్యముగ । అనేకంబులు - బహుపదార్థములను । అతడు-ఆత్వష్టప్రజాపతి । హితమతితోడన్ । హిత - ఇష్టమైన । మతితోడన్ - మనస్సుతో । ఒనర్చెన్ - చేసెను॥

తా॥ ఆవిశ్వకర్మ నాగలోకము మొదలైన పదునాలుగులోకములను సముద్రములు మొదలైన వానిని సృజించెను ॥ ౬౮

మ॥ క్షితిఖండంబులు తొమ్మిదేరుపరచెన్ జిత్తక్రియన్ నీలప । ర్వతమం
థానన గేంద్రరోహణగిరి స్వర్ణాద్రిముఖ్యంబులా । యతబుద్ధిం రచియించె
వార్ధులు సమస్తప్రాణిజాతంబు భా । రతవర్షంబునుమున్నుగానొనరిచెన్
ప్రాగల్భ్యమింపొందగన్ ॥

టీ॥ తొమ్మిది-తొమ్మిదియగు । క్షితిఖండంబులు - భూఖండములను । ఏరుపరచెన్ - చేసెను । చిత్తక్రియన్-మనోవృత్తిచేత । నీలపర్వతమంథాననగేంద్రరోహణగిరిస్వర్ణాద్రిముఖ్యంబులు । నీలపర్వత-నీలాద్రియు । మంథాననగేంద్ర - మందరపర్వతము । రోహణగిరి-రోహణాచలము । స్వర్ణాద్రి - మహామేరువు । ముఖ్యంబులు - మొదలుగాగలపర్వతములను । ఆయతబుద్ధిన్ । ఆయత - పొడవగు । బుద్ధిన్-బుద్ధిచేత । రచియించెన్-చేసెను । వార్ధులు-సముద్రములను । సమస్తప్రాణిజాతంబు । సమస్త-సమస్తమైన । ప్రాణి - ప్రాణులయొక్క । జాతంబు - సమూహమును । భారతవర్షంబును - భారతవర్షమున్ను । మున్నుగాన్-మొదలుగాగలవానిని । ప్రాగల్భ్యము-ప్రగల్భత । ఇంపొందగన్-సొంపుపొందునట్లుగ । ఒనరిచెన్-చేసెను ॥

తా॥ విశ్వకర్మ మనస్సుచేత నవఖండములను సమస్తపర్వతములను సముద్రములను ప్రాణికోటిని అద్భుతంబుగ సృజించెను॥ ౬౯

ఉ॥ కావునలోకవంద్యుడు జగద్గురుడాఢ్యుడు మన్వధీశుడున్ । దైవము
సృష్టికర్తయును దారగుణాకర సిద్ధముఖ్యనా । నావిబుధవ్రజంబునకు నా
థుడునైతగు విశ్వకర్మలీ । లావిలసన్మహత్త్వము దలంపగ నేరికినైనశక్యమె॥

టీ॥ కావునన్-గనుక । లోకవంద్యుడు । లోక-లోకములచేత । వంద్యుడు-నమస్కరించతగినవాడును । జగద్గురుడు । జగత్-భువనములకు । గురుడు-గురువైనట్టియు । ఆఢ్యుడు-సంపన్నుడైనట్టియు । మన్వధీశుడున్ । మను-చతుర్దశమనువులకు । ఈశుడున్-ప్రభువైనట్టియు । దైవము-దేవుడైనట్టియు । సృష్టికర్తయు-సృష్టికారకుడైనట్టియు । ఉదారగుణాకరసిద్ధముఖ్యనానావిబుధవ్రజంబునకున్ । ఉదార - ఉజ్జ్వలములైన । గుణ - గుణములకు । ఆకర - ఖనీభూతులైన । సిద్ధ - సిద్ధులు । ముఖ్య-మొదలైన । నానా-అనేకులైన । విబుధ - దేవతలయొక్క । వ్రజంబునకున్ - సమూహమునకు । నాథుడై - అధీశ్వరుడై । తగు - తగిన । విశ్వకర్మలీలావిలసన్మహత్త్వము । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । లీల-విలాసములచే । విలసత్ - ప్రకాశించుచున్న । మహత్త్వము-మహిమను । తలంపగన్-స్మరించుటకు । ఏరికినైనన్-ఎవరికినైనను । శక్యమె-ఒల్లగునా॥

తా॥ లోకగురువైన సర్వకళ్యాణానంతగుణాకరుడైన విశ్వకర్మను ఇట్టివాడని తలచుటకునైన నెవ్వరికి శక్యముగాదు ॥ ౨౦

క॥ శృతులకు విప్రాచార । క్రతుముఖ్యంబులకు జాతకర్మాదులకుం ।
బతియైన విశ్వకర్మకు । హితమతికి నమస్కరించి యేవినుపింతుఁ ॥

టీ॥ శృతులకుఁ - వేదములకును । విప్రాచారక్రతుముఖ్యంబులకుఁ । విప్ర-విప్రులయొక్క । ఆచార-నడతలు । క్రతు-యాగములు । ముఖ్యంబులకుఁ-మొదలగువానికిని । జాతకర్మాదులకుఁ । జాతకర్మ - జననకర్మము । ఆదులకుఁ - మొదలగు షోడశకర్మములకును । పతియైన - ప్రభువైనట్టి యు । హితమతికిఁ । హిత - పక్షపాతములేని । మతికిఁ - బుద్ధిగలిగినట్టి । విశ్వకర్మకుఁ-విశ్వకర్మకు । నమస్కరించి-వందనమొనర్చి । ఏ-నేను । వినుపింతుఁ-ఆకర్ణింపజేసెదను ॥

తా॥ వేదాచారములకు కర్తయైనట్టియు సర్వసముడైనట్టియు విశ్వకర్మకు నమస్కరించి చెప్పెదను॥ ౨౧

క॥ అనమన్వీశునకునువం । దనమొనరిచి దేవతాపితామహుడగుశం ।
భునిగనుఁగొనియిట్లనియెఁ । ఘనగంభీరస్వరంబు గడలుకొనంగఁ ॥

టీ॥ అనఁ-ఇటులనగ । మన్వీశునకుఁ-మనుప్రభువైనవిశ్వకర్మకు । వందనము-నమస్కృతిని । ఒనరిచి-చేసి । దేవతాపితామహుడగు । దేవత-బ్రహ్మాదిదేవతలకు । పితామహుడగు-తాతయైనట్టి । శంభునిఁ-సదాశివుని । కనుగొని - చూచి । ఘనగంభీరస్వరంబు । ఘన-గొప్పదియగు । గంభీర-నిండైన । స్వరంబు-కంఠధ్వని । కడలుకొనంగఁ-వృద్ధిపొందియుండగ । ఇట్లనియెఁ - ఈలాగుననెను ॥

తా॥ కుమారస్వామి దేవదేవుడైన సాంబశివునకు నమస్కరించి గంభీరముగ నిట్లడిగెను ॥ ౨౨

గీ॥ దేవదేవ మహాదేవ దేవజాది । శంకర మహేశ సర్వజ్ఞ చంద్ర
మౌళి । మొదల బ్రాహ్మ్యంబునకు నాదిమూల మెద్ది । యంతయు నెరుంగ
నానతి యిమ్ము నాకు ॥

టీ॥ దేవదేవ-దేవతలకుదేవుడ । మహాదేవ-గొప్పదేవ । దేవజాదిశంకర । దేవజ-దేవతలవలన పుట్టువారు । ఆది-మొదలగువారలకు । శంకర-సుఖమునిచ్చెడువాడ । మహేశ-మహాప్రభు । సర్వజ్ఞ-అన్నిటినితెలిసినవాడ । చంద్రమౌళి । చంద్ర-చంద్రుడు । మౌళి-కిరీటమునగలవాడ । మొదలఁ-మొదటను । బ్రాహ్మ్యంబునకుఁ-బ్రహ్మత్వమునకు । ఆది-మొదలు । ఎద్ది-ఏదో । అంతయు - దానినియావత్తును । ఎరుంగఁ - తెలియునటుల । నాకుఁ-నాకొరకు । ఆనతియిమ్ము-శెలవివ్వుడి ॥

తా॥ ఓమహాదేవ యీలోకమందు బ్రాహ్మణజన్మమునకు మొదటికారణమును తెలియజేయుము. 23

వ॥ అని సేనానివిన్నవింప విని లోకారాధ్యుండిట్లనియె॥

టీ॥ అని-ఈలాగని । సేనాని-కుమారదేవుడు । విన్నవింపఁ-మనవిజేసికొనగ । విని-సాదరముగనాలించి । లోకారాధ్యుండు । లోక-లోకములచేత । ఆరాధ్యుండు-ఆరాధించదగిన యుమామహేశ్వరుడు । ఇట్లనియెఁ-ఇటులబలికెను ॥

బ్రాహ్మణోత్పత్తి.

క॥ పుడమిగలజీవరాసుల । కడుపులజనియించి ధేను గర్భంబున వే । ల్వ
డిపావనుడై జీవుడు । బొడముం భూదేవ జన్మమున ననఘాత్మా ॥

టీ॥ పుడమిగలజీవరాసులకడుపులన్ । పుడమిగల-భూమియందున్న । జీవరాసుల-జీవకోట్ల యొక్క । కడుపులన్-కడుపులవలన । జనియించి-పుట్టి । ధేనుగర్భంబునన్ - గోగర్భమువల్ల । వెల్వడి-బయలుదేరి । పావనుడై-పవిత్రుడై । జీవుడు-జీవాత్మ । అనఘాత్మ । అనఘ-పాపరహితమైన । ఆత్మ-మనసుగలఓకుమార ! భూదేవజన్మమునన్ । భూదేవ-బ్రాహ్మణులయొక్క । జన్మమునన్ - పుట్టక చేత । పొడముఙ్-పుట్టును ॥

తా॥ ఓకుమార జీవుడు నానా యోనులయందుపుట్టి చివరకు గోగర్భమువలన వెడలి పిమ్మట బ్రాహ్మణ జన్మము నెత్తును ॥ ౭౪

వ॥ అట్టిభూదేవజన్మంబెట్టిదంటివేని । గర్భాధాన । సీమంత । పుంసవన । జాతకర్మనామకరణాన్నప్రాశన చవులోపనయనాదు లొనర్చిన పిమ్మట । త్రిసంధ్యలందుగాయిత్రికి నమస్కరించి వేదంబులుజదువవలయు । చదివిననతండు పరమపావనుండగునని । బ్రాహ్మణుల బ్రశంసవినిపించినవిని । దేవా విశ్వకర్మకుమారుల మహిమయు । వారి ఆచారప్రకారంబు వినుపించుమనిన కుమార నీవడిగిన విధంబున మున్ను కర్మసాక్షియను నతనికి విశ్వకర్మ వినుపించిన ప్రకారంబు వినుపించెదవినుము ॥

టీ॥ అట్టి-అటువంటి । భూదేవజన్మంబు । భూదేవ - బ్రాహ్మణులయొక్క । జన్మంబు - పుట్టుక । ఎట్టిదంటివేని-ఎటువంటిదంటివ । గర్భాధాన-పునస్సంధానము । సీమంత - సీమంతము । పుంసవన-పుంసవనము । జాతకర్మ-జాతకర్మము । నామకరణ-పేరుపెట్టుట । అన్నప్రాశన-అన్నముతినిపించుట । చెవుల - చూడాకర్మము । ఉపనైన - ఉపనైనము । ఆదులు - మొదలగునవి । ఒనర్చి-చేసి । పిమ్మటన్-తర్వాతను । త్రిసంధ్యలందు । త్రి - మూడగు । సంధ్యలందు - ప్రాతర్మధ్యాహ్నసాయంతనసంధ్యలయందు । గాయత్రికి-గాయత్రిదేవతకు । నమస్కరించి-వందనము జేసి । వేదంబులు-వేదములను । చదువవలయు-పఠింపవలయును । చదివిననతండు-పఠించువాడు । పరమపావనుండు-పరమపవిత్రుడు । అగునని-కాగలడని । బ్రాహ్మణుల-బ్రాహ్మణులయొక్క । ప్రశంసన్-సంగతిని । వినుపించినన్-తెలియచేయగ । విని-ఆలించి । దేవ-ఓతండ్రీ । విశ్వకర్మకుమారులమహిమయు । విశ్వకర్మ - విశ్వకర్మయొక్క । కుమారుల-పుత్రులయొక్క । మహిమయు-ప్రభావమును । వారలయాచారప్రకారంబు । వారల - ఆపుత్రులయొక్క । ఆచార-నడవళ్లయొక్క । ప్రకారంబు-విధమును । వినుపించుమనినన్ - తెలియజేయుమనగ । కుమార-ఓకుమారుడ । నీవడిగినవిధంబునకున్ । నీవు-ఈవు । అడిగినవిధంబునకున్-అడిగినరీతికి । మున్ను-పూర్వము । కర్మసాక్షియనునతనికి-సూర్యుడనువానికి । విశ్వకర్మ - విశ్వకర్మ । వినుపించినప్రకారంబు-చెప్పినవడువున । వినుపించెదన్-చెప్పెదను । వినుము-ఆకర్ణింపుము॥

తా॥ సాంబమూర్తి బ్రాహ్మణజన్మప్రకారము తెలియజేసినవిని కుమారస్వామి విశ్వకర్మకుమారులమహిమను జెప్పుమనిన సాంబమూర్తి పూర్వమందు విశ్వకర్మ సూర్యునకు జెప్పినప్రకారంబు చెప్పెద వినుము॥ ౭౫

## కృతినాయకస్తుతి.

మ॥ మదవద్వైరి విదూషఘోషిణీహనూమద్ధామద్ధామస్ఫుర । ద్విదితానేకసుధీరధీరకవి సంవిద్భావభావార్థిత । ప్రదపాదాంబురుహద్వయానిశ

సపర్యాదక్షదక్షారిస । మ్మదకృద్భాగ్యనిరంతరాద్భుత కృపోద్యన్నేత్ర
నేత్రాగ్రణీ॥

టీ॥ మదవద్వైరివిదూష । మదవత్-మదముగల । వైరి-శత్రువులను । విదూష-నిందించువాడ। శేషిణీహనూమద్ధామ । శేషిణీహనూమత్-శేషిణీహనుమంతుడుగలవాడనుబిరుదుకు । ధామ-స్థానమైనవాడ । ధామస్ఫురద్విదితానేకసుధీర । ధామ-గృహమందు । స్ఫురత్-ప్రకాశించుచున్న । విదిత-ప్రసిద్ధులైన । అనేక-అనేకులైన । సుధీర-మంచిపండితులుకలవాడ । ధీరకవిసంవిద్భావ । ధీర-బుద్ధిశాలురగు । కవి-కవీశ్వరులను । సంవిత్-బాగుగతెలిసిన । భావ-అభిప్రాయముగలవాడ । భావార్థితప్రదపాదాంబురుహద్వయానిశసపర్యాదక్ష దక్షారిసమ్మదకృద్భాగ్య నిరంతరాద్భుత కృపోద్యన్నేత్ర । భావ-అభిప్రాయములచేతను । అర్థిత-కోరబడినకోరికలను । ప్రద-ఇచ్చెడియీశ్వరునియొక్క । పాదాంబురుహద్వయ - పాదపద్మయుగళముయొక్క । అనిశ-నిరంతరమైన । సపర్యా-పూజయందు।దక్ష - సమర్థుడా । దక్షారి । దక్ష-దక్షప్రజాపతికి। అరి-శత్రువుడగుసాంబమూర్తికి । సమ్మదకృత్-సంతోషమును జేయుచున్న । భాగ్య-అదృష్టముచేత । నిరంతర-నిరవకాశమైన । అద్భుత - ఆశ్చర్యకరమైన । కృప-దయచేత । ఉద్యత్ - వృద్ధిపొందుచున్న । నేత్ర - ప్రభుత్వముగలవాడ । నేత్రాగ్రణీ । నేత్ర-ప్రభువులలో । అగ్రణీ-అగ్రేసరుడవైనవాడ॥

తా॥ మదించిన శత్రువులను భంజించువాడనియు విద్వత్కవిమండల పోషకుడనియు శివారాధన తత్పరుండనియు ॥ ౭౬

ఉత్సాహం॥ ఖండశర్కరోపమానకావ్యకావ్యసన్నుతా । ఖండలాహి
శాయిభోగగాఢభాగ్యవైభవా । పండితప్రకాండకాండపక్షదానశౌండశ్రీ।
దండపాణిశంభుపాదతత్పరైకమానసా ॥

టీ॥ ఖండశర్కరోపమానకావ్యకావ్యసన్నుత । ఖండశర్కర - కలకండతో । ఉపమాన - పోల్చదగిన । కావ్య-కావ్యములుగల । కావ్య-కవిసమూహములచేత । సన్నుత - స్తోత్రముచేయబడ్డవాడ । ఆఖండలాహిశాయిభోగగాఢభాగ్యవైభవ । ఆఖండల-దేవేంద్రునియొక్కయు । అహిశాయి - శేషశాయియగు శ్రీమహావిష్ణువుయొక్కయు । భోగ-అయిశ్వర్యముయొక్కయు । గాఢ-నిబిడమైన । భాగ్య-అదృష్టముయొక్కయు । వైభవ-విభవముగలవాడ । పండితప్రకాండకాండపక్ష । పండితప్రకాండ-పండితశ్రేష్ఠులయొక్క । కాండ-సమూహములయందు । పక్ష - ప్రేమగలవాడ । దానశౌండ । దాన-వితరణమందు । శౌండ - నేర్పరివైనవాడ । శ్రీదండపాణిశంభుపాదతత్పరైకమానస । శ్రీదండపాణిశంభు-శ్రీదండపాణీశ్వరస్వామియొక్క । పాదతత్పర । పాద-చరణములయందు । తత్పర-ఆసక్తమైన । మానస-మనస్సుగలవాడ॥

తా॥ మధురకవిత్వముగల కవివరులచే స్తుతించబడినవాడనియు భోగభాగ్యములకు ఇంద్రోపేంద్రులనుపోలినవాడనియు దండపాణి దేవరయందు మనసుగలవాడనియు॥ ౭౭

గద్య.

ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తి వరప్రసాద భరిత తురగరాజకవివ
రాయ్యంకిబాలసరస్వతీనామధేయప్రణీతంబైన నాగరఖండంబునందు విశ్వ
కర్మాఖ్యవృక్షంబునందు సదాశివాదిపంచశక్తుల యుత్పత్తియు విశ్వకర్మస్వ
రూపంబును । విశ్వకర్మవలన నాదబిందు కళావేదప్రధాన దేవోపదేవతల

యుత్పత్తిప్రకారకథనంబునువిని । శౌనకాదులు పురాణసంభవంబెట్లని సూతు నడిగిన నతండు నారదుండు మేరుదక్షిణదిగ్భాగంబున విశ్వకర్మనుచూచి బహుకాలంబచ్చటనుండి యతని సామర్థ్యాతిశయంబంతయు నెరింగి । గార్గ్య మహామునివలన పండ్రెండులక్షల పదమూడువేల గ్రంథసంఖ్యగల విశ్వకర్మపురాణంబువినుటయు । నదితత్తల్లోకంబులనున్న సంఖ్యాప్రకారంబును విశ్వకర్మముఖాద్యవయవంబుల పద్మాద్యష్టాదశపురాణోత్పత్తి ప్రకారకథనంబును । నెరింగించిచనుటయును । విశ్వకర్మవంశజులమాహాత్మ్యంబును । విశ్వకర్మవిరాడ్రూపవర్ణనంబును । నలసేతుబంధనంబును । యజ్ఞోత్పత్తికథనంబును । చాతుర్వర్ణ్యోత్పత్తియు । పంచసాదాఖ్యోత్పత్తియు । మన్వీశుండు విశ్వకర్మద్వితీయరూపంబని చెప్పుటయును । విశ్వకర్మ చంద్రసూర్యాదిలోకాధిపతులయావద్వస్తువుల నిర్మించినవిధంబును । విశ్వకర్మాఖ్యచేత జగత్తునిలిచిన ప్రకారంబును । మన్వంతరాదినిర్మాణకథనంబును । బ్రాహ్మణజన్మాగమన ప్రకారంబును । కుమారస్వామి విశ్వకర్మపుత్రుల ధర్మంబులెట్లనియడుగుటయు । శివుండు సూర్యవిశ్వకర్మ సంవాదంబు నుపపాదించుటయునను కథలంగల ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.

# తృతీయాశ్వాసము.

## కృతినాయకస్తుతి.

క॥ శ్రీధవళేశ్వరపురవర । శ్రీధవళేశ్వరకటాక్షసిద్ధసమస్త । శ్రీధుర్య
ధృతివిజితపృ । థ్వీధరవరకాండసోమవిభుమార్కండా॥

టీ॥ శ్రీధవళేశ్వరపురవర । శ్రీ-శోభాయుక్తమైన । ధవళేశ్వరపురవర । ధవళేశ్వరపుర - ధవళేశ్వరపురవంశమందు । వర-శ్రేష్ఠుడవైనవాడ। శ్రీధవళేశ్వరకటాక్షసిద్ధసమస్తశ్రీధుర్య । శ్రీ-అణిమాద్యష్టైశ్వర్యయుక్తుడైన । ధవళేశ్వర-ధవళేశ్వరస్వామియొక్క । కటాక్ష-క్రేగంటిచూపువలన । సిద్ధ-ప్రసిద్ధమైన । సమస్త-సమస్తమైన । శ్రీ-ఐశ్వర్యమునకు । ధుర్య - ధురంధరుడ । ధృతివిజితపృథ్వీధర । ధృతి-ధైర్యముచేత । విజిత- జయించబడిన । పృథ్వీధర - పర్వతముగలవాడ । వరకాండ । వర-శ్రేష్ఠములయిన । కాండ - గుఱ్ఱములుగలవాడ । సోమవిభుమార్కండా । సోమవిభు-సోమమహారాజుకుమారుడవైన । మార్కండ-మార్కండేయమహారాజా॥

తా॥ మార్కండేయమహారాజు ధవళేశ్వరదేవుని దయగలవాడనియు ధైర్యముగలవాడనియు గుఱ్ఱపుదళవాయిగలవాడనియు॥ ౧

వ॥ అవధరింపు మవ్విధంబున మహాదేవుండు కుమారున కెఱింగించెనని
సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె॥

టీ॥ అవధరింపుము-చిత్తగింపుము । అవ్విధంబునన్-ఆప్రకారముచేత । మహాదేవుండు-సాంబమూర్తి । కుమారునకున్-కుమారస్వామికి । ఎఱుంగించెనని- చెప్పెనని । సూతుండు-కథకుడు । శౌనకాదిమహామునులకున్ । శౌనక-శౌనకుడు । ఆది-మొదలగు । మహామునులకున్-మహర్షులకు । ఇట్లనియెన్-ఈలాగుననెను ॥

తా॥ ఓ మార్కండా చిత్తగింపుము సాంబమూర్తి కుమారస్వామికి చెప్పినరీతిని సూతుడు శౌనకాదులతో చెప్పెను॥ ౨

## విశ్వకర్మ సభ చేయుట.

శా॥ శ్రీనీరేరుహరాగగారుడమణీ సింహాసనాసీనుడై । నానానిర్జర
కోటిమానితతులెన్నంగల్గుదివ్యాంఘ్రియై । వీనులన్నలుహస్తముల్మాదలు
గావేయేసి మేనందగం । సానందంబుగ విశ్వకర్మచెలువై యాస్థానమధ్యం
బునన్ ॥

టీ॥ విశ్వకర్మ-విశ్వకర్మ । ఆస్థానమధ్యంబునన్-సభామధ్యమందు । చెలువై-సొగసయి । శ్రీనీరేరుహరాగగారుడమణీసింహాసనాసీనుడై । శ్రీ-శోభాయుక్తములైన । నీరేరుహరాగ-పద్మరాగమణులయొక్కయు । గారుడమణీ-గరుడపచ్చలయొక్కయు । సింహాసన-గద్దెయందు । ఆసీనుడై-కూర్చున్నవాడై । నానానిర్జరకోటిమానితతులు । నానా-అనేకులైన । నిర్జర-దేవతలయొక్క । కోటి - కోట్లయొ

క్కయు । మౌని-మునులయొక్కయు । తతులు-సమూహములు । ఎన్నంగల్గుదివ్యాంఘ్రిమై । ఎన్నంగల్గు-స్తుతించతగిన । దివ్య-శ్రేష్ఠములయిన । అంఘ్రిమై-పాదములుకలవాడై । వీనుల్-కర్ణములును । కన్నులు-నేత్రములును । హస్తముల్-చేతులును । మొదలుగ-మొదలయినవియు । వేయేసి-ఒక్కొక్క వెయ్యి । మేనన్-శరీరమందు । తగన్-ఒప్పియుండగ । సానందంబుగన్-సంతోషముతోకూడుకొన్నట్టుగ ॥

తా॥ విశ్వకర్మ, సభలో నానారత్నఖచిత సింహాసనస్థుడై సహస్రశీర్షపురుషుడై దేవతలును మునులును కొలుచుచుండగా ప్రకాశించెను॥ ౩

క॥ యక్షేశ్వరవిద్యాధర । రక్షోగంధర్వకిన్నరస్తోమసహ । స్రాక్షము
ఖుల్గొలువదయా । వీక్షావహుడగుచునున్న వేళన్ హాళిన్॥

టీ॥ యక్షేశ్వరవిద్యాధరరక్షోగంధర్వకిన్నరస్తోమసహస్రాక్షముఖుల్ । యక్షేశ్వర - కుబేరుడును । విద్యాధర-విద్యాధరులును । రక్షః-రాక్షసులును । గంధర్వ - గంధర్వులును । కిన్నరస్తోమ । కిన్నర-కిన్నరులయొక్క । స్తోమ - గుంపులును । సహస్రాక్షముఖుల్ । సహస్రాక్ష - దేవేంద్రుడు । ముఖుల్ - మొదలుగాగలవారలు । కొల్వన్ - కొలుచుచుండగ । దయావీక్షావహుడగుచు । దయావీక్ష-దయాదృష్టిని । ఆవహుడగుచు - ఆవహింపజేయువాడగుచును । హాళిన్ - సంతోషముచేత । ఉన్న వేళన్-ఉన్నసమయమందు॥

తా॥ విశ్వకర్మ దేవేంద్రుడు మొదలుగాగల దిక్పతులును సమస్త దేవయోనివిశేషులునుకొల్వగా దయగలవాడై సంతోషముగనున్న వేళను॥ ౪

సూర్యుడు వచ్చుట.

ఉ॥ సంతసమొప్పనచ్చటికి చయ్యననెయ్యముతోడవచ్చెభా । స్వంతు
డుసజ్జనాగమవసంతుడు లోకనిశాంతుడంజనీ । కాంతుడు ద్యోతితోడునిజ
కాంతుడు వ్యోమచరగ్రహాళిసా । మంతుడుపేక్షితార్థజనవంతుడు దీప్తన
భోనిశాంతుడై॥

టీ॥ సంతసమొప్పన్ । సంతసము-సంతోషము । ఒప్పన్-ఒప్పుచుండగా । అచ్చటికిన్-ఆవిశ్వకర్మయున్నయెడకు । చయ్యనన్-శీఘ్రముగ । నెయ్యముతోడన్-ప్రేమతో । సజ్జనాగమవసంతుడు । సజ్జన-సత్పురుషులనెడు । ఆగమ - వృక్షములకు । వసంతుడు - వసంతర్తువైనవాడును । లోకనిశాంతుడు । లోక-భువనములు । నిశాంతుడు-ఇల్లుగాగలవాడును । అంజనీకాంతుడు । అంజనీ-అంజనాదేవికి । కాంతుడు-పెనిమిటైనట్టియు । ద్యోతితోడునిజకాంతుడు । ద్యోతిత - ప్రకాశింపచేయబడ్డ । ఉడు-నక్షత్రములకు । నిజకాంతుడు । నిజ-స్వకీయుడైన । కాంతుడు-ప్రభువైనట్టియు । వ్యోమచరగ్రహాళిసామంతుడు । వ్యోమ-అంతరిక్షమందు । చర - సంచరించెడి । గ్రహ - నక్షత్రములయొక్క । ఆళి-పఙ్క్తికి । సామంతుడు-సాటిరాజైనట్టియు । ఉపేక్షితార్థజనవంతుడు । ఉపేక్షితం నిరాకరించబడిన । అర్థ-ధనముగల । జనవంతుడు-జనులుగలవాడునైనట్టి । భాస్వంతుడు -సూర్యుడు । దీప్తనభోనిశాంతుడై । దీప్త - ప్రకాశింపచేయబడిన । నభః - ఆకాశమను । నిశాంతుడై - ఇల్లుగలవాడునై । వచ్చెన్-ఏతెంచెను॥

తా॥ ధనమదాంధులను తిరస్కరించునట్టి గ్రహరాట్టైన సూర్యుడచ్చటికేతెంచెను॥ ౫

గీ॥ వచ్చిహస్తాబ్జములు భక్తిహెచ్చ మోడ్చి । ఫాలభాగంబుపైఁ జేర్చిప్రణతిసేయ । వినిదయావీక్షణుండైనవిశ్వకర్మ । యాదరించినఁజూచి యిట్లని యెనినుఁడు॥

టీ॥ వచ్చి-ఏతెంచి । హస్తాబ్జములు-కరకమలములు । భక్తిన్-భక్తిచేత । మోడ్చి-ముకుళించి। ఫాలభాగంబుపైన్-నొసటిపైని । చేర్చి-ఉంచి । ప్రణతిసేయన్-వందనముచేయగా । విని-ఆకర్ణించి। దయావీక్షణుండైన-దయాదృష్టిగల । విశ్వకర్మ-విశ్వకర్మ । ఆదరించినన్-ఆదరించగా । ఇనుఁడు-సూర్యుఁడు । చూచి-వీక్షించి । ఇట్లనియెన్-ఈలాగుననెను॥

తా॥ సూర్యుఁడు నచ్చటికివచ్చి కేలుమోడ్చి వందనముజేయగా విశ్వకర్మ ఆదరించిన నినుండ డుగం దొడంగెను. ౬

ఉ॥ దేవమునీశ్వరప్రముఖ ధీజనతావినుతాత్మపాదరా । జీవభవచ్చరిత్రమతిచిత్రమువీనుల విన్నపాపముల్ । బోవునుశోభనంబులగు పుణ్యముగల్గును సంతసంబునా । నావిధభోగభాగ్యముల నారతముంగనుపట్టునేరికిన్॥

టీ॥ దేవ-ఓప్రభువా । దేవమునీశ్వరప్రముఖధీజనతావినుతాత్మపాదరాజీవ । దేవము. నీశ్వర-దేవతామునిశ్రేష్ఠులు । ప్రముఖ-మొదలగు । ధీజనత-విద్వజ్జనముచేత । వినుత-స్తోత్రముచేయఁబడిన । పాదరాజీవ-పాదపద్మములుగలవాఁడ । భవచ్చరిత్రము । భవత్-నీయొక్క । చరిత్రము-చరితము । అతిచిత్రము-మిక్కిలివింతమైనయది । వీనులవిన్నన్ । వీనుల-చెవులచేత । విన్నన్-వినగా । పాపముల్-దురితములు । పోవును-నశించును । శోభనంబులు-శుభములు । అగున్-అవును । పుణ్యము-సుకృతము । కల్గును-వచ్చును । సంతసంబు-సంతోషమును । నానావిధభోగభాగ్యములు । నానావిధ-అనేకవిధములైన । భోగ-విభవములును । భాగ్యములు-అదృష్టములును । అనారతము-ఎల్లప్పుడును । ఏరికిన్-ఎవ్వరికిని । కనుపట్టున్-చూపడును॥

తా॥ ఓమహాదేవా,నీచరిత్రముఅద్భుతమైనదియు వినినవారలకుసమస్తశ్రేయస్సంపాదకమనియు॥

సూర్యుఁడడుగుట.

వ॥ అదిగావున నీవు మహానుభావుండవు నీవెఱుంగని యర్థంబులు లేవుగాన నేనొక్కవిన్నపంబొనర్చెద నవధరింపుమని యిట్లనియె॥

టీ॥ అదిగావునన్-అదిగనుక । నీవు-ఈవు । మహానుభావుండవు । మహా-గొప్పదియగు । అనుభావుండవు-ప్రభావముగలవాఁడవు । నీవెఱుంగనియర్థంబులు । నీవు-ఈవు । ఎఱుంగని-తెలియని । అర్థంబులు-వస్తువులు । లేవు-కానము । కానన్-గనుక । ఏను-నేను । ఒక్కవిన్నపంబు-ఒకమనవిని । ఒనర్చెదన్-చేసెదను । అవధరింపుము-చిత్తగింపుము । అని-అని । ఇట్లనియెన్-ఈలాగనెను॥

తా॥ నీవు దివ్యజ్ఞానసంపత్తిగలవాఁడవుగాన నీకు తెలియని సంగతులెచ్చటలేవు॥ ౭

క॥ మనువనమయుఁడనత్వష్టన । విను శిల్పి యనంగవిశ్వవిదుఁడనమహిమన్ । ఘనులైరిలోకములమీ । తనయులువీరలు సమస్తతత్త్వజ్ఞులిలన్॥

టీ॥ మీతనయులు-మీకొమరులు । మనువు-మనువు । అనన్-అనగను । మయుఁడు-మయుఁడు । అనన్-అనగను । త్వష్టన-త్వష్టయనియు । విను-ఆకర్ణింపుము । శిల్పియు-శిల్పియనియు । అనంగన్-అనగను । విశ్వవిదుఁడు-విశ్వజ్ఞుఁడు । అనన్-అనగను । మహిమ-మహత్త్వచేత । మీతనయులు-మీకు

మాళ్లు। లోకములన్ - జగత్తులయందు । ఘనులైరి-గొప్పవారలైరి । వీరలు-ఈమన్వాదులు । ఇలన్-పుడమిని । సమస్తతత్వజ్ఞులు-సమస్తతత్వవేత్తలు॥

తా॥ మను మయ త్వష్ట శిల్పి దైవజ్ఞులను మీ యయిదుగురు కొమరులు సమస్త తత్వవేత్తలై లోకముల బ్రసిద్ధిగనిరి॥ ౯

ఉ॥ వీరలొనర్చుయజ్ఞముల వేళలువీరలబ్రహ్మవిద్యయుం । వీరలకర్హమైన యుపవీతివిధానము వీరియాగమా । చారములన్నియుం దెలియ సందియమంతయు బాపుపాపసం । హరణమహానుభావ కమలాసనసన్నుతపాదపంకజా॥

టీ॥ వీరలు - ఈ విశ్వకర్మపుత్రులు । ఒనర్చుయజ్ఞములవేళలు । ఒనర్చు-చేసెడి । యజ్ఞముల-క్రతువులయొక్క । వేళలు-కాలములను । వీరలబ్రహ్మవిద్యయున్ । వీరల-ఈ విశ్వబ్రాహ్మణులయొక్క। బ్రహ్మవిద్యయున్-వేదవిద్యయును । వీరలకున్-ఈ విశ్వబ్రాహ్మణులకు । అర్హమైనయుపవీతివిధానము। అర్హమైన-తగిన । ఉపవీతి-యజ్ఞోపవీతధారణముయొక్కయు । విధానము-విధియును । వీరియాగమాచారములు । వీరి-వీరలయొక్క । ఆగమ - శైవాగమములయందలి । ఆచారములు - నడతలను । అన్నియున్-యావత్తును । తెలియన్-తెలియునట్లు । సందియమంతయున్-యావత్సందేహమును । పాపుపోగొట్టుము-పాపసంహరణ । పాప - దురితములను । సంహరణ - కొట్టివేయువాడ । మహానుభావ-మహాప్రభావముగలవాడ । కమలాసనసన్నుతపాదపంకజా । కమలాసన-బ్రహ్మచేత । సన్నుత-స్తుతించబడిన । పాదపంకజ-పాదపద్మములుగల ఓ విశ్వకర్మా॥

తా॥ ఓమహానుభావ నీకుమారులు జేయవలసిన క్రతుకాలములను ఉపనయనాదవిధమును ఆచారములను తెలియజేయుము ॥ ౧౦

విశ్వకర్మ చెప్పుట.

గీ॥ అతిరహస్యములందు రహస్యమగుచు । ధర్మములయందు నత్యంత ధర్మమగుచు । నఖిలజగముల కుపకారమైతనర్చు । వినుమహిమధామ యీకథవిశదబుద్ధి ॥

టీ॥ అతిరహస్యములందున్-మిక్కిలిగోప్యములైనవానియందు । రహస్యమగుచు-గూఢమైనదగుచు । ధర్మములయందున్-న్యాయములయందు । అత్యంతధర్మమగుచున్ । అత్యంత-మిక్కిలి । ధర్మమగుచున్-న్యాయమైనదగుచును । అఖిలజగములకున్-యావల్లోకములకును । ఉపకారమై-ఉపకృతిజనకమై । ఈకథ-ఈచరిత్రము । తనర్చున్-ఒప్పును । అహిమధామ । అహిమ-చల్లనిదికాని । ధామ-కాంతిగలిగినఓసూర్యుడా । విశదబుద్ధిన్ । విశద-నిర్మలమగు । బుద్ధిన్-బుద్ధిచేత । వినుము-ఆలింపుము॥

తా॥ ఓసూర్యుడా రహస్యాతి రహస్యమైన యీచరిత్రమును సావధానముగ వినుము॥ ౧౧

సీ॥ మనువంశమునబుట్టిన వారలెల్లన త్యభివృద్ధిగా గలోహంబొనర్ప । మయునివంశమున సంభవమైనవారలు రూఢిగామించు దారువులొనర్ప।త్వష్టృవంశమునను ద్భవమైనవారలు బంధురంబగుకంచుపనియొనర్ప । శిల్పివంశమునవాసికెనెక్కు-ధన్యులు మహిమించునుపలకర్మంబొనర్ప । తక్షవంశజులగు మహాబాదారులెల్ల । ఘనతరంబైనయట్టికాంచనమొనర్ప । వలయునిది పంచకర్మ ప్రవర్తనంబు । వరుసతో నీకుజెప్పితి వారిజాప్తా ॥

టీ॥ మనువంశమునను । మను-మనుబ్రహ్మయొక్క । వంశమునను-అన్వయమందు । పుట్టిన వారలెల్లను-జన్మించినవారందరును । అత్యభివృద్ధిగాఁ-మిక్కిలివృద్ధిపొందునట్లుగ । లోహంబొనర్చ-పంచలోహములు చేయునట్లుగను । మయునివంశమునసంభవమైనవారలు । మయుని-మయబ్రహ్మయొక్క । వంశమునఁ - కులమందు । సంభవమైనవారలు - పుట్టినవారలు । రూఢిగ - నిశ్చయముగ । మించుదారువులొనర్పఁ । మించుదారువులు । మించు - గొప్పవియగు । దారువులు-కొయ్యపనిముట్లు । ఒనర్పఁ-చేయునట్లుగను । త్వష్టృవంశమునఁ । త్వష్టృ-త్వష్టబ్రహ్మయొక్క । వంశమునఁ-వంశమందు । ఉద్భవమైనవారలు-పుట్టినవారలు । బంధురంబగు - గాఢమైన । కంచుపనియొనర్పఁ । కంచు-కాంస్యముయొక్క । పని-కర్మ । ఒనర్పఁ-చేయునట్లుగను । శిల్పివంశమునఁ । శిల్పి-శిల్పిబ్రహ్మయొక్క । వంశమునఁ-వంశమందు । వాసికి నెక్కు-ధన్యులు । వాసికి నెక్కు-కీర్తినిపొందిన । ధన్యులు-కృతార్థులు । మహిమించునుపలకర్మంబొనర్పఁ । మహిమించు । మహి-భూమియందు । మించు-అతిశయించిన । ఉపలకర్మంబు । ఉపల-శిలలయొక్క । కర్మంబు-పనిని । ఒనర్పఁ-చేయునట్లు । తక్షవంశజులగు-విశ్వజ్ఞబ్రహ్మవంశమందుపుట్టినట్టి । మహాదారులెల్లఁ-మిక్కిలిగొప్పవారలందరును । ఘనతరంబైనయట్టి-మిక్కిలిగొప్పదియైనట్టి । కాంచనమొనర్పఁ-బంగారపుపనిచేయునట్లుగ । వలయును-తగును । ఇది-ఈవెనకచెప్పినది । పంచకర్మప్రవర్తనంబు । పంచ-అయిదగు । కర్మ-పనులయొక్క । ప్రవర్తనంబు-నడతను । వారిజాప్త-ఓసూర్యుడా । వరుసతోఁ-క్రమముగ । నీకు-ఈకు । చెప్పితి-తెలియచేసితిని ॥

తా॥ ఓసూర్యుడా, విశ్వకర్మయొక్క అయిదుగురగు పుత్రులయొక్క అయిదుపనులను తెలియజేసితిని ॥ ౧౨

క॥ ఈమైదు విధానంబులు । శ్రేయంబులు యజ్ఞకర్మసిద్ధిగనొందఁ ।
జేయసదోపాసనమగు । నాయతతల్లోహమయమహాహుతినిడుటఁ ॥

టీ॥ ఈమైదువిధానంబులు । ఈ-చెప్పబడిన । అయిదువిధానంబులు । అయిదు - అయిదగు । విధానంబులు-విధులు । శ్రేయంబులు-శ్రేయస్కరములు । యజ్ఞకర్మసిద్ధిని । యజ్ఞ-యాగములయొక్క । కర్మసిద్ధిని-కర్మసాఫల్యమును । చెందఁ-పొందునట్లుగ । చేయు-ఒనర్చును । ఆయతతల్లోహమయమహాహుతిఁ । ఆయత-దీర్ఘములైన । తత్-ఆప్రసిద్ధములైన । లోహమయ-సువర్ణాదిలోహస్వరూపమైన । ఆహుతిఁ-ఆహుతిని । ఇడుటఁ - ఇచ్చుటవలన । సదోపాస్యములు । సదా-ఎల్లప్పుడు । ఉపాస్యములు-సేవించతగినవి । అగుఁ-అవును॥

తా॥ వెనుకజెప్పిన కమ్మరముమొదలైన పనులు సువర్ణాది పంచలోహాహుతి ప్రదానముచేత సర్వదా పంచయజ్ఞసిద్ధిని కలుగచేసును. ౧౩

క॥ ఆయాహుతి ఫలమొందెను । ధీయుతసస్యములులతలు తృణసంఘ
ములుం । తోయజహితమరియును । శ్రేయముతత్పుత్రమహిమ జెప్పెదనింకఁ ॥

టీ॥ ధీయుత-బుద్ధితోగూడిన । తోయజహిత । తోయజ-పద్మములకు । హిత-మిత్రుడవైనఓసూర్యుడా । ఆయాహుతి - ఆలోహస్వరూపమైన హోమద్రవ్యము । సస్యములు - పైరులు । లతలు - తీవెలు । తృణసంఘములుఁ । తృణ-గడ్డియొక్క । సంఘములుఁ - సమూహములనెడు । ఫలము-ఫలితమును । ఒందెను-పొందెను । మరియును - ఇంకను । శ్రేయము-శ్రేయస్కరమైన । తత్పుత్రమహిమఁ । తత్-ఆవిశ్వకర్మయొక్క । పుత్ర - కుమారులయొక్క । మహిమఁ-మహిమను । ఇంకఁ-విశేషించి । చెప్పెదఁ-పలికెదను ॥

తా॥ ఓసూర్యుడా, ఆయాహుతులవల్ల సస్యాదికము కలిగెను ॥ ౧౪

క॥ ఈ రాజితపుత్రులలో । నారూఢిగ బెద్దయగుచు నాగమమార్గా ।
చారములమంత్రతంత్రవి । హారంబులుమనువుస్థపతియనగావించెన్ ॥

టీ॥ ఈ రాజితపుత్రులలోనన్-ఈ ప్రకాశించుచున్న విశ్వకర్మపుత్రులలోపలను । ఆరూఢిగన్-రూఢిగ । పెద్దయగుచున్-జ్యేష్ఠుడగుచును । మనువు-మనుబ్రహ్మ । స్థపతియనన్-త్వష్టబ్రహ్మనునట్లుగ। ఆగమమార్గాచారములన్ । ఆగమమార్గ-వేదపద్ధతులయొక్క । ఆచారములన్-నడతలను । మంత్రతంత్రవిహారంబులు । మంత్ర-మంత్రములయొక్కయు । తంత్ర-క్రియలయొక్కయు । విహారంబులు-విహారములను । కావించెన్-ఒనర్చెను॥

తా॥ మనుబ్రహ్మ త్వష్టయను పేరుగలవాడై వేదాచారములను మంత్రతంత్రములనుచేసెను ॥ ౧౫

సీ॥ వేదశాస్త్రపురాణవివిధేతిహాసపా రగుడునులోహ కర్తయునుమ
నువు। శాస్త్రార్థవేదియై సకలదారువులెల్ల భేదింపుచుండును బేర్మిమయుడు।
కాంశ్యాదికమొనర్ప గలలోహములలోన దక్షుండువిజ్ఞానధనుడుత్వష్ట ।
బ్రహ్మాదిమూర్తికల్పకుడైయనేక భూధరశిలావేదియైపరగుశిల్పి । భోగకలి
తుండునానావిభూషణాది । నిపుణుడైకాంచనముసేయ నేర్చుదైవ । వేత్త
యనవిని మదినుబ్బివేగనబ్జ । హితుడుకరపద్మములుమోడ్చి యిట్టులనియె॥

టీ॥ మనువు-మనుబ్రహ్మ । వేదశాస్త్రపురాణవివిధేతిహాసపారగుడును । వేద-వేదములయొక్కయు । శాస్త్ర-శాస్త్రములయొక్కయు । పురాణ-పురాణములయొక్కయు । వివిధ-నానావిధములైన । ఇతిహాస-ఇతిహాసవస్తువులయొక్కయు । పారగుడును-అంతముజూచినవాడును । లోహకర్తయును । లోహ-ఆయసలోహమునకు । కర్తయును-ప్రభువైనవాడును । మయుడు-మయబ్రహ్మ । పేర్మిన్-ప్రేమచేత । శాస్త్రార్థవేదియై । శాస్త్ర-శాస్త్రములయొక్క । అర్థ-అర్థమును । వేదియై-తెలిసినవాడై । సకలదారువులెల్లన్-కొయ్యలన్నిటిని । భేదింపుచుండును-చెక్కుచుండును । త్వష్ట-త్వష్టబ్రహ్మ । కాంశ్యాదికము-కంచుమొదలైనదానిని । ఒనర్పగలలోహములలోనన్ । ఒనర్పగల-చేయగల। లోహములలోనన్-లోహములయందు । దక్షుండు-సమర్థుడును । విజ్ఞానధనుడు । విజ్ఞాన-సుజ్ఞానము । ధనుడు-ధనముగాగలవాడును । శిల్పి-శిల్పిబ్రహ్మ । బ్రహ్మాదిమూర్తికల్పకుడై । బ్రహ్మాది-బ్రహ్మమొదలయినవారియొక్క । మూర్తి-ఆకారములను । కల్పకుడై-చేయువాడై । అనేకభూధరశిలావేదియై। అనేక-అసంఖ్యములైన । భూధర-కొండలయొక్క । శిల-రాళ్లను । వేదియై-ఎరిగినవాడై । పరగున్-ఒప్పును । దైవవేత్త-దైవజ్ఞబ్రహ్మ । విభూషణాదినిపుణుడై । విభూషణాది-సొమ్ములుమొదలైనవానిని చేయుటయందు । నిపుణుడై-నేర్పరియై । కాంచనము-సువర్ణమును । చేయనేర్చున్-ఒనరించగలవాడు। అనన్-అనగా । విని-ఆకర్ణించి । మదినుబ్బి । మదిన్-మనస్సుయందు । ఉబ్బి-ఉప్పొంగి । వేగన్-శీఘ్రముగా । అబ్జహితుడు-సూర్యుడు । కరపద్మములు-కేలుదమ్ములు । మోడ్చి-ముకుళించి । ఇట్టులనియెన్-ఈలాగనెను॥

తా॥ విశ్వకర్మ తనకుమాళ్లైన మన్విశాదులయొక్క సువర్ణాదినిర్మాణములను చెప్పగావిని సూర్యుండు విని వినయముతో నిట్లడిగెను॥ ౧౬

మరల సూర్యుండడుగుట.

వ॥ మరియు వీరల మహిమంబు లెరింగింపుము॥

టీ॥ మరియుఁ-ఇంకను । వీరలమహిమంబులు । వీరల - ఈపంచబ్రహ్మలయొక్క । మహిమంబులు-ప్రభావములను । ఎరింగింపుము-తెలియఁజెప్పుము॥

## విశ్వకర్మ చెప్పుట.

చ॥ అనవినివిశ్వకర్మ జలజాప్తునితోననిమొమ్మదంబుతో । ననుపమవేద
చోదితమ్మునైతగు నీకథనీకుఁజెప్పెదఁ । వినుమనియన్నిరూపముల వేల్పుల
లోపలబెద్దనాఁడగుం । ఘనుఁడుమహానుభావుఁడుజగద్గురుఁడై మునుత్వష్టయం
తయుఁ॥

టీ॥ అనఁ-చెప్పగా । విని-ఆకర్ణించి । విశ్వకర్మ - విశ్వకర్మ । జలజాప్తునితోఁ-సూర్యునితో। ముదంబుతోఁ-సంతోషముతో । అనుపమవేదచోదితమ్మునై । అనుపమ - సాటిలేని । వేద-వేదముల చేత । చోదితమునై-ప్రేరణజేయబడినదై । తగు-ఒప్పుచున్న । ఈకథఁ-ఈవృత్తాంతమును । ఈకు-నీకు । చెప్పెదఁ - పలికెదను । వినుము - ఆకర్ణింపుము । అని-అనియు । అన్నిరూపములఁ-సమస్త ఆకారములచేతను । త్వష్ట - త్వష్టబ్రహ్మ । వేల్పులలోపలఁ - దేవతలలోనను । పెద్దనాఁ - జ్యేష్ఠుఁడనాఁగ । తగుఁ-అర్హమగును । ఘనుఁడు-గొప్పవాఁడును । మహానుభావుఁడు-మహామహిముఁడును । జగద్గురుఁడై । జగత్-లోకములకు । గురుఁడై - తండ్రియై । మును-పూర్వకాలమందు । అనియెఁ-అనెను॥

తా॥ సూర్యుఁడడిగిన ప్రశ్నను విని వేదచోదితమైన యీకథను నీకుచెప్పెదను త్వష్టబ్రహ్మసమస్తదేవతాస్వరూపుఁడును ఘనుఁడును జగద్గురుఁడనియును విశ్వకర్మ సూర్యునితోఁజెప్పెను॥ ౧౭

క॥ ఖద్యోతవినుముమామక । సద్యోజాతాదివక్త్రజలజంబులచే । స
ద్యోజాతములైనఘ । నద్యుతులనుపంచసాధనంబులు మించెఁ॥

టీ॥ ఖద్యోత । ఖ-ఆకాశమును । ద్యోత-ప్రకాశింపజేసెడి ఓసూర్యుఁడా । మామకసద్యోజాతాదివక్త్రజలజంబులచేఁ । మామక-మా సంబంధములైన । సద్యోజాతాది-సద్యోజాతము మొదలైన । పంచ-అయిదగు । వక్త్రజలజంబులచేఁ - ముఖపద్మములచేతను । సద్యోజాతములైన । సద్యః-అప్పుడు । జాతములైన-పుట్టినట్టి । ఘనద్యుతులను । ఘన-గొప్పవియగు । ద్యుతులను-కాంతులచేత । పంచసాదనంబులు । పంచ-అయిదగు । సాదనంబులు-సాదాఖ్యతత్వములు । మించెఁ - ఘనతకెక్కెను । వినుము-ఆకర్ణింపుము॥

తా॥ ఓసూర్యుఁడా, నాయొక్క సద్యోజాతము మొదలైన అయిదుమోములవలన పంచసాదాది తత్వములు పుట్టెను॥ ౧౮

వ॥ అవి యవ్వియని యంటివేని॥

టీ॥ అవి-ఆసాదాదితత్వములు । ఎవ్వియని-ఏవని । అంటివేని-అడిగితివా॥

క॥ నవకమునుకారుబాడిశె । నవలోహంబుపలభేద నమునింకారుఁ ।
భువనరచనాధురంధరులౌ । మన్వాదులకునిచ్చితంభోజాప్తా॥

టీ॥ అంభోజాప్తా-ఓసూర్యుఁడా । నవకమును-నీరుకారును । కారు - పటకారును । బాడిశె-చెక్కుడియాయుధమును । నవలోహంబు-దాలిని । ఉపలభేదనమును - రాళ్లనుభేదించెడికాశపువులి । కారుఁ-పెద్దకారును । భువనరచనాధురంధరులౌ । భువన-లోకములయొక్క । రచన-చేయుటయందు । ధురంధరులౌ-సమర్థులైనట్టి । మన్వాదులకుఁ-మనువు మొదలైన యయిదుగురికి । ఇచ్చితిఁ-ఒసగితిని॥

తా॥ ఓసూర్యుడా, లోకనిర్మాణప్రవీణులగు మన్వాదులైన నా యయిదుగురు కొమరులకు నవకము మొదలైన యయిదుసాధనమ చ్చితిని॥ ౧౯

ఉ॥ ఇచ్చిననైదుసాధనము లింపుగనైదుగురుంధరించియు । ద్వ్యచ్చరిత ప్రశస్తయజనాదిగతుల్ శివతత్త్వబోధులై । యచ్చరువందజేసిరి సమస్తజగంబులు తత్క్షణంబునం । హెచ్చినయాత్మవర్తనుల నెంతయునాగసరోజబాంధవా॥

టీ॥ సరోజబాంధవా-ఓసూర్యుడ । ఇచ్చిననైదుసాధనములు । ఇచ్చిన-ఒసగిన । అయిదుసాధనములు-అయిదుపనిముట్లను । ఇంపుగన్-సొంపుగను । అయిదుగురున్-అయిదుగురుకొమరులును। ధరించి - పూని । ఉద్యచ్చరితప్రశస్తయజనాదిరతుల్ । ఉద్యత్-వృద్ధిపొందుచున్న । ప్రశస్త-ప్రసిద్ధములైన । చరిత-చరిత్రలుగల । యజనాది-యజనాదిషట్కర్మలయందు । రతుల్-ఆసక్తిగలవారలై । శివతత్త్వబోధులై । శివతత్త్వ-శైవతత్త్వములయొక్క । బోధులై-జ్ఞానముగలవారలై । అచ్చెరువొందన్-ఆశ్చర్యముపొందునట్లు । తత్క్షణంబునన్ - ఆక్షణమందె । హెచ్చినయాత్మవర్తనలన్ । హెచ్చిన-మించిన । ఆత్మ-తమయొక్క । వర్తనలన్ - నడతలచేతను । ఎంతయునాగ-ఎంతోఅనునట్లుగ । సమస్తజగంబులు-యావల్లోకములను । చేసిరి-ఒనరించిరి॥

తా॥ ఓసూర్యుడా, నేనిచ్చిన యీయయిదుపనిముట్లను పుచ్చుకొని సర్వలోకములను జేయుచు శివతత్త్వవేత్తలరై ప్రవర్తించిరి॥ ౨౦

సూర్యుడు వెళ్లుట.

క॥ అనివిశ్వకర్మయీక్రియ । వినిపించినపద్మహితుడు వినియాయన వీ। టూని సంతోషమునొందుచు । జనియెన్నిజధామమునకుసరభసలీలన్॥

టీ॥ అని-ఈలాగునని । విశ్వకర్మ-విశ్వకర్మ । ఈక్రియన్ - ఈరీతిచేత । వినుపించినన్-చెప్పగా । పద్మహితుడు - సూర్యుడు । విని - ఆకర్ణించి । ఆయనన్-ఆవిశ్వకర్మను । వీటూని-సెలవడిగి । సంతోషమునన్ - ఆనందమును । ఒందుచున్-పొందుచును । సరభసలీలన్ । సరభస-తొందరతోగూడిన । లీలన్-విలాసముచేత । నిజధామమునకున్ । నిజ-స్వకీయమైన । ధామమునకున్-స్థానమునకు । చనియెన్-వెళ్లెను॥

తా॥ సూర్యుడు, విశ్వకర్మవలన తానడిగిన వృత్తాంతమును తెలిసికొని త్వరితముగ తన తావునకు వెళ్లెను॥ ౨౧

సాంబమూర్తి కుమారునకు చెప్పుట.

క॥ శ్రీపార్వతీమనోహరు । డీపగిదింబుత్రునకునుహితమలరంగా । దీపించువిశ్వకర్మమ । హెూపాఖ్యానంబుదెలిపియుద్యన్మతియై॥

టీ॥ శ్రీపార్వతీమనోహరుడు । శ్రీ-శోభాయుక్తురాలైన । పార్వతీ-గిరిజకు । మనోహరుడైన-ప్రాణనాథుడైనసాంబమూర్తి । ఈపగిదిన్-ఈప్రకారముగ । పుత్రునకును-కుమారస్వామికి । హితము-యుక్తత । అలరంగ-ఒప్పునట్లుగ । దీపించు-ప్రకాశించుచున్న । విశ్వకర్మమహెూపాఖ్యానంబు । విశ్వ

కర్మ - విశ్వకర్మయొక్క । మహా-గొప్పదియగు । ఉపాఖ్యానంబు - చరిత్రను । తెలిపి-చెప్పి । ఉద్యన్మతినై । ఉద్యత్ -వృద్ధిపొందుచున్న । మతియై-మనస్సుగలవాడై ॥

తా॥ సాంబమూర్తి యీలాగున కుమారస్వామికి విశ్వకర్మోపాఖ్యానమును చెప్పెను॥ ౨౨

కుమారస్వామి ప్రశ్నచేయుట.

వ॥ తెలిపిన యకుమారుండు మారమణున కిట్లనియె॥

టీ॥ తెలిపినన్-చెప్పగా । అకుమారుండు-ఆకుమారస్వామి । ఉమారమణునకున్-తండ్రియగు సాంబమూర్తికి । ఇట్లనియెన్ - ఈలాగనెను॥

ఉ॥ కారణజన్ములై తగు జగద్గురువంశ్యులకేప్రకారమా । చారవిధంబు
దండములు జన్నిదముల్ తగనెవ్విముఖ్యమె । యేరుతువేళ జెన్నగుట నెన్నవ
యేటద్విజత్వసిద్ధిగా । రీరమణీశసర్వము నెరింగెద నానతియిమ్ముసత్కృపన్॥

టీ॥ గౌరీరమణీశ । గౌరీరమణీ-పార్వతీసతికి । ఈశ-పెనిమిటివైన ఓసాంబమూర్తి । కారణజన్ములై తగుజగద్గురువంశ్యులకున్ । కారణజన్ములై - ఒకనిమిత్తమువలన పుట్టినవారలై । తగు - అర్హులైన । జగద్గురు-లోకగురువైన విశ్వకర్మయొక్క । వంశ్యులకు-వంశమందుపుట్టినవారలకు । ఆచారవిధంబు । ఆచార-నడవడియొక్క । విధంబు-రీతి । ఏప్రకారము - ఎటువంటిది । తగన్-ఒప్పునట్లుగ । దండములు-ఉపనయనపుకర్రలును । జన్నిదముల్ - యజ్ఞోపవీతములును । ఎవ్వి-ఏవి । ఏయేరుతువేళ-ఎవేదిరుతుకాలము । ముఖ్యము-శ్రేష్ఠమైనది । చెన్నగుటన్ । చెన్ను-సొగసు । అగుటన్-అగుటవల్ల। ఎన్నవయేటన్-ఎన్నవసంవత్సరమందు । ద్విజత్వసిద్ధి । ద్విజత్వ-బ్రాహ్మణత్వముయొక్క । సిద్ధి-ప్రాప్తియో । సర్వమును-ఈసమస్తమును । ఎరింగెదన్-తెలిసికొనియెదను । సత్కృపన్ । సత్-మంచిదగు। కృపన్-దయచేతను । ఆనతియిమ్ము-సెలవివ్వుము॥

తా॥ ఓపార్వతీపతీ విశ్వకర్మవంశోత్పన్నులయొక్క ఆచారములను దండభేదములను యజ్ఞోపవీతములను ముఖ్యరుతుకాలములను ఏవయస్సుయందు బ్రాహ్మణత్వసిద్ధికలుగునో యిదంతయు దయచే చెప్పుము॥ ౨౩

సాంబమూర్తి చెప్పుట.

క॥ రజితోపవీతికింశుక । రుజుదండములన్ వసంతరుతువునమనుజుం ।
ద్విజుసేయుటకునుచితం । బుజగతిగర్భాష్టమాబ్దమునశిఖివాహా॥

టీ॥ రజితోపవీతికింశుకరుజుదండములన్ । రజితోపవీతి-వెండిజన్నిదములచేతను । కింశుకరుజుదండములన్ - మోదుగుకర్రలచేతను । వసంతరుతువునన్-వసంతరుతువునందు । మనుజుం-మనువంశమందుపుట్టినవానిని । గర్భాష్టమునన్ - గర్భసంవత్సరము మొదలగు యెనిమిదవయేటను । జగతిన్-భూమియందు । ద్విజుసేయుటకును-బ్రాహ్మణుని జేయుటకు । ఉచితంబు-తగును॥

తా॥ ఓకుమారా, మనువంశజులకు వెండిజన్నిదములు పాలాశదండములు వసంతరుతువు కడుపులోనున్న సంవత్సరముతో యెనిమిదిసంవత్సరములును ఉపనైనసంస్కారమున కర్హములు॥ ౨౪

సీ॥ పద్మసూత్రంబుపిప్పలబ్రహ్మదండ । మలరగ్రీష్మర్తువునను జేయంగవ

లయు । పదనొకండవయేట జేపట్టివడుగు । ఘనతరంబుగ మయ విశ్వకర్మసు
తుల॥

టీ॥ పద్మసూత్రంబు-తామరతూటినూలు । పిప్పలబ్రహ్మదండము । పిప్పల-రావిచెట్టుయొక్క । బ్రహ్మదండము-వడుగుకఱ్ఱయు । అలరన్-ఒప్పునట్లుగ । గ్రీష్మర్తువునను-వేసంగియందు । పదనొకండవయేటన్-పదకొండవసంవత్సరమందు । ఘనతరంబుగన్-గొప్పగను । మయవిశ్వకర్మసుతులన్ । మయ-మయబ్రహ్మసంబంధులైన । విశ్వకర్మసుతులన్-విశ్వకర్మపుత్రులను । చేపట్టి-గ్రహించి । వడుగు-ఉపనయనము । చేయంగవలయున్-చేయవలయును॥

తా॥ మయబ్రహ్మసంతతివారికి పద్మసూత్రము అశ్వత్థదండమును వేసంగిని ఉపనైనము కలదు॥ ౨౪

క॥ శరదృతువునందునౌదుం । బరదండముజన్నిదంబుపైడిదిగాత । త్ప
రతంబంద్రెడేడవ । తరినుపవీతుల నొనర్పదగుత్వాష్ట్రులనున్॥

టీ॥ ఔదుంబరదండము । ఔదుంబర - మేడిచెట్టుయొక్క । దండము-కఱ్ఱయును । పైడిదిగాన్ - బంగారపుదిగా । జన్నిదంబు - యజ్ఞోపవీతము । శరదృతువునందున్ - శరత్కాలమందు । పంద్రెండేడవతఱిన్ - పంద్రెండేళ్లకాలమందు । తత్పరతన్ । తత్ - ఆశరదృతువు మొదలైనవానియొక్క । పరతన్-ప్రధానత్వముచేత । త్వాష్ట్రులనున్-త్వష్టప్రజాపతి కొమరులనును । ఉపవీతులగాన్-ఉపనయనముగలవారలనుగా । ఒనర్పదగున్-చేయవలయును॥

తా॥ శరత్కాలమందు మేడికఱ్ఱబంగారపు యజ్ఞోపవీతములు కలుగునట్లుగ త్వష్టబ్రహ్మపుత్రులకు పుపనయనము చేయవలయును॥ ౨౫

క॥ వటదండముకార్పాస । స్ఫుటమగుసూత్రమునుశిల్పి సూనులనెల్లన్।
వటులను వర్షర్తునజే । యుటదగుదొమ్మిదవయేటనున్నతచరితా ॥

టీ॥ వటదండము । వట-మఱ్ఱిచెట్టుయొక్క । దండము-కఱ్ఱయు । కార్పాసస్ఫుటమగుసూత్రమున్ । కార్పాస-దూదియొక్క । స్ఫుటమగు-గట్టిదియైన । సూత్రమున్ - యజ్ఞోపవీతమునును । తొమ్మిదవయేటన్ - తొమ్మిదవసంవత్సరమందు । వర్షర్తునన్-వర్షాకాలమందు । శిల్పిసూనులనెల్లన్ । శిల్పి-శిల్పిబ్రహ్మయొక్క । సూనులనెల్లన్-కొమరులనందరిని । వటులన్-బ్రహ్మచారులనుగాను । చేయుట-ఒనరించుట । ఉన్నతచరితా । ఉన్నత-గొప్పవియగు । చరిత-చరిత్రలుగలఓకుమారా । తగున్-ఒప్పును॥

తా॥ ఓకుమారా, శిల్పిబ్రహ్మపుత్రులకు మఱ్ఱికఱ్ఱదండము నూలుజన్నిదములు తొమ్మిదవయేట వర్షాకాలము ఉపనయనమునకు తగుకాలము॥ ౨౬

క॥ పదియారవనేటశుభా । స్పదశిశిరర్తువున రాగిజన్నిదమమరున్।
ఖదిరజదండముకేలం । గదియగతక్షులవటుల గావింపదగున్ ॥

టీ॥ పదియారవయేటన్ - పదియారవసంవత్సరమందు । శుభాస్పదశిశిరర్తువునన్ । శుభ-మేళ్లకు । ఆస్పద-స్థానమైన । శిశిరర్తువునను-శిశిరర్తువునందు । రాగిజన్నిదము-తామ్రయజ్ఞోపవీతము। అమరన్-ఒప్పునట్లుగా । ఖదిరజదండము-చండ్రకఱ్ఱ । కేలన్-హస్తమందు । అమరగన్-ఒప్పియుండునట్లుగ । తక్షులన్-విశ్వజ్ఞబ్రహ్మపుత్రులను । వటులన్-ఉపనీతులనుగాను । కావింపతగున్-చేయతగును ॥

తా॥ విశ్వజ్ఞబ్రహ్మపుత్రులకు పదియారవసంవత్సరమందు శిశిరఋతువులో రాగిజన్నిదములు చండ్రకఱ్ఱయుగలుగునట్లుగను ఒడుగుచేయవలయును॥ ౨౭

వ॥ మరియు రవి ప్రధానంబులగు నవగ్రహంబులు, తత్తచ్ఛుభస్థానంబు
లనున్నిద్రంబులగు భద్రంబులొసంగు శుభనక్షత్రంబుల, శుభదివసంబుల,
శుభముహూర్తంబుల, నవతంతూపవీతులగు కుమారులనాందీముఖ సమ
ర్చానంతరంబుల, మంగళస్నానంబులు జేయించి, యుల్లంబులలర, తల్లుల
తోడంగూడ నాలుగేనుకబళంబులు భోజనంబులొనరింప నియోగించి, తద
వసరంబుల నభిషేచనంబులుగావించి, యాచార్యుండు వడుగుపెల్లి కొడు
కులంబరిగ్రహించి, ప్రాఙ్ముఖంబుగా వామభాగంబున కూర్చుండనియమించి,
సువర్ణతండుల సహితంబులగు నూతనవస్త్రంబులుగట్టనిచ్చి సువర్ణకర్ణాభర
ణాంగుళీయకంబులొసంగి,కృష్ణాజినంబులు తత్తద్దర్హంబులగు బ్రహ్మదండం
బులు కరంబులందిరంబుకొల్పి, మౌంజీబంధంబులుగావించి, పంచశిఖావి
రాజితులైన తనూజులకు నవార్యవాద్యధ్వనులుల్లసిల్ల, దక్షిణశృతిపుటంబుల
విస్ఫుటంబుగా గాయిత్రీమంత్రోపదేశంబులుజేసి, యాసమయంబున నగ్ని
కింద్రునకు, ఋషులకు, విష్ణువునకు, త్వష్టబ్రహ్మలకు, సూర్యునకు, గురుబు
ద్రక్రతువులకు, దిక్పాలురకు, సూర్యాది నవగ్రహంబులకు, వసువులకు, పితృ
దేవతలకును, చతుర్థ్యంతంబులైన స్వాహాతిశబ్దపూర్వకంబులలర తత్తద్దేవ
తాకంబులగు మత్రంబులుచ్చరించి, చంద్ర, రావి, మేడి, మోదుగు, మొద
లైనసమిధలచేత హవ్యపాకాన్నంబుచేత హోమంబులుగావించియనంత
రంబా॥

టీ॥ మరియున్ - ఇంకను । రవిప్రధానంబులగు - సూర్యుడు మొదలుగాగల । నవగ్రహంబులు । నవ-తొమ్మిదియగు । గ్రహంబులు-గ్రహములు । తత్తచ్ఛుభస్థానంబులన్ । తత్తత్-ఆయాయి । శుభ-మంగళకరములైన । స్థానంబులన్-చోటను । ఉన్నిద్రంబులగు-జాగరూకములైన । భద్రంబులు-శుభములను । ఒసంగు-ఇచ్చుచున్న । శుభనక్షత్రంబులన్ । శుభ - శుభకరములైన । నక్షత్రంబులన్ - అశ్విన్యాది నక్షత్రంబులయందును । శుభదినంబులన్ । శుభ-మంచివియగు । దినంబులన్- తిథులయందును । శుభముహూర్తంబులన్ । శుభ-మేలగు । ముహూర్తంబులన్ -ముహూర్తకాలములయందును । నవతంతూపవీతులగు । నవ-తొమ్మిదియగు । తంతు-పోగులుగల । ఉపవీతులగు-యజ్ఞోపవీతములుగల । కుమారులన్-తనయులను । నాందీముఖసమర్చానంతరంబులన్ । నాందీముఖ-నాందీముఖకర్మయొక్క । సమర్చ-పూజయొక్క । అనంతరంబునన్-తర్వాతను । మంగళస్నానంబులు - మంగళస్నానములను । కావించి-చేయించి । ఉల్లంబులలరన్ । ఉల్లంబులు-మనస్సులు । అలరన్-ప్రకాశించునట్లుగా । తల్లులతోడంగూడ-తల్లులతోకూడ । నాలుగేనుకబళంబులు-నాలుగైదుపిడచలను । భోజనంబులొనరింపన్-భోజనములుచేసుటకు । నియోగించి-ఆజ్ఞాపించి । తదవసరంబునన్-ఆసమయమందు । అభిషేచనంబు-మంగళస్నానమును । కావించి-చేయించి । ఆచార్యుండు-పురోహితుడు । వడుగుపెల్లికొడులన్-వడుకపెల్లికొడుకులను । పరిగ్రహించి-పట్టుకొని । ప్రాఙ్ముఖంబుగ-తూర్పుమోముగ । వామభాగంబునన్-తనయెడమవైపున । కూర్చుండన్-ఉండునట్లుగ । నియమించి-నెలవిచ్చి । సువర్ణతండుల సహితంబులగు।

సువర్ణ-కాంచనముతోటి । తండుల-బియ్యముతోటి । సహితంబులగు - కూడికొనిన । నూతనవస్త్రంబులు-కొత్తబట్టలను । కట్టన్-ధరియించుటకు । ఇచ్చి-ఒసగి । సువర్ణకర్ణాభరణాంగుళీయకములు । సువర్ణ-బంగారపువైన । కర్ణాభరణ - చెవులపోవులు । అంగుళీయకములు-ఉంగరములను । ఒసంగి - ఇచ్చి । కృష్ణాజినంబులు-ఇర్రిత్రోళ్లను । తత్తద్దర్హంబులగు । తత్తత్-వారివారికి । అర్హంబులగు-తగిన। బ్రహ్మదండంబులు-వడుగుకర్రలను । కరంబులం-చేతులయందు । తిరంబుకొల్పి-ఉనిచి । మౌంజీబంధంబులు - దర్భలమొలత్రాళ్లను । కావించి - చుట్టి । పంచశిఖావిరాజితులైన । పంచ - అయిదగు । శిఖ-జుట్లతో । విరాజితులైన - ప్రకాశించుచున్న । తనూజులకున్-తనయులకు । అవార్యవాద్యధ్వనులు । అవార్య-అడ్డములేని । వాద్య-తూర్యాదులయొక్క । ధ్వనులు - చప్పుళ్లు । ఉల్లసిల్లన్-మ్రోయుచుండగా । దక్షిణశృతిపుటంబులన్ । దక్షిణ-కుడివైన । శ్రుతిపుటంబులన్ । దొప్పలవంటిచెవులయందు । విస్ఫుటంబుగ-వినుపించునట్లు । గాయత్రీమంత్రోపదేశంబులు । గాయంత్రీమంత్ర-గాయత్రీమంత్రముయొక్క । ఉపదేశంబులు-బోధలను । చేసి-ఒనరించి । ఆసమయంబునన్-ఆకాలమందు । అగ్నికిన్-అగ్నిహోత్రునకును । ఇంద్రునకున్-దేవేంద్రునకును । ఋషులకున్-సప్తమహామునులకును । విష్ణువునకున్-విష్ణుమూర్తికిని । త్వష్టాదిబ్రహ్మలకున్ । త్వష్ట-త్వష్టబ్రహ్మ । ఆది-మొదలగు । బ్రహ్మలకున్-పంచబ్రహ్మలకును । సూర్యునకున్-భాస్కరునకును । గురురుద్రక్రతువులకున్ । గురు-గురువులకును । రుద్ర-ఏకాదశరుద్రులకును । క్రతువులకున్-యజ్ఞములకును । దిక్పాలురకున్ - అష్టదిక్పతులకును । సూర్యాదినవగ్రహంబులకున్ । సూర్య-సూర్యుడు । ఆది-మొదలగు । నవగ్రహంబులకున్-తొమ్మిదిగ్రహములకును । వసువులకున్-అష్టవసువులకును । పితృదేవతలకును - అగ్నిష్వాత్తాదులకును । చతుర్థ్యంతంబులైన । చతుర్థి-చతుర్థీవిభక్తి । అంతంబులైన-కొనయందుగల । స్వాహేతిశబ్దపూర్వకంబులు । స్వాహేతి-స్వాహాఅను । శబ్దపూర్వకంబులు । శబ్ద-పదము । పూర్వకంబులు - మొదటనున్నట్టియు । అలరు - ఒప్పుచున్న । తత్తద్దేవతాకంబులగు । తత్తత్ - అయాయి । దేవతాకంబులగు-దేవతలుగలట్టి । మంత్రంబులు-మంత్రములను । ఉచ్చరించి-పఠించి । చంద్రరావిమేడిమోదుగుమొదలైన సమిధలచేతన్ । చంద్రరావిమేడిమోదుగుమొదలైన - చంద్రరావిమేడిమోదుగుమొదలగు । సమిధలచేతన్-సమిత్తులచేత । ఆజ్యంబుచేతన్-నేతిచేతను । హవ్యపాకాన్నంబుచేతన్ । హవ్య - ఆజ్యాదిహవిస్సుచేతను । పాకాన్నంబుచేతన్-పక్వాన్నముచేతను । హోమంబుగావించి-వ్రేల్చి । అనంతరంబ-తర్వాతను॥

తా॥ పురోహితుడు యీవిశ్వకర్మసంతతివారికి వెనుకజెప్పబడిన కాలములయందు ఆయాయి దండాదికముల నొసంగి వేదోక్తప్రకారంబున హోమంబులుగావించి వుపనయనములు చేయుదురు॥

క॥ దినమునుప్రాతర్మధ్యం । దినసంధ్యావేళలుష్ణదీధితికినివం । దనమా
చరింపదగువి । శ్వనుతుండును విశ్వకర్మసంతతి వటువుల్ ॥

టీ॥ విశ్వనుతుండగు । విశ్వ-ప్రపంచమందు । నుతుండగు - స్తోత్రముచేయదగిన । విశ్వకర్మసంతతివటువుల్ । విశ్వకర్మ - విశ్వకర్మయొక్క । సంతతి-సంతానమైన । వటువుల్-బ్రహ్మచారులు । దినమును - ప్రతిదినమును । ప్రాతర్మధ్యందినసంధ్యావేళలన్ । ప్రాతః - ప్రాతఃకాలమందు । మధ్యందిన-మధ్యాహ్నమందు । సంధ్యావేళలన్-సాయంకాలమందును । ఉష్ణదీధితికిని-సూర్యునకు । వందనము-నమస్కారము । ఆచరింపతగున్-చేయతగును॥

తా॥ విశ్వకర్మసంతతివారలు ప్రతిదినము త్రికాలములయందును సూర్యునకు సార్ఘ్యవందనములొనరించవలయును॥

చ॥ ఒసగగమూడునాల్గునొక యెన్మిదితొమ్మిది నైదుకోణముల్ । పొస
గిన హోమగుండముల పొందుగ వ్రేల్వ క్రమంబుతోడని । వ్వసుధమనూద్భ
వుల్ మయుని వంశ్యులుత్వష్టృతనూజకోటిశి । ల్పిసుతులును తక్షువంశజులు
వింటివేవీరిశుభప్రవర్తనల్ ॥

టీ॥ ఒసగగన్-ఒప్పిదముగ । మూడు-మూడును । నాల్గు-నాల్గును । ఒకఎనిమిది-ఒక్కయెని మిదియు । తొమ్మిదియు-తొమ్మిదియు । అయిదు-అయిదు । కోణముల్-మూలలు । పొసగిన - కలిగిన । హోమకుండములన్-వ్రేల్చుగుంటలయందు । పొందుగన్-యుక్తముగ । క్రమంబుతోడన్-వరుసగ । వ్రేల్వన్ - హోమముచేయగ । ఇవ్వసుధన్ - ఈభూమియందు । మనూద్భవుల్ - మనువంశోత్పన్నులును । మయునివంశ్యులు । మయుని-మయబ్రహ్మయొక్క । వంశ్యులు - వంశమందుపుట్టినవారలును । త్వష్టృతనూజకోటి । త్వష్టృ-త్వష్టబ్రహ్మయొక్క । తనూజ - కుమాళ్లయొక్క । కోటి-సమూహమును। శిల్పిసుతులు । శిల్పి-శిల్పిబ్రహ్మయొక్క । సుతులు-కుమాళ్లును । తక్షువంశజులు । తక్షు-విశ్వజ్ఞబ్రహ్మయొక్క । వంశజులు - వంశమందుపుట్టినవారలును । వ్రేల్వన్ - హోమముచేయగా । వీరిశుభప్రవర్తనలు । వీరి- ఈచెప్పబడ్డవారియొక్క । శుభప్రవర్తనలు-క్షేమపుసంగతులు । వింటివే-ఆకర్ణించితివా॥

తా॥ ఈపంచబ్రహ్మసంతతివారలు క్రమముగ మూడు, నాలుగు యెనిమిది తొమ్మిదిఅయిదు కోణములుగలిగినట్టి హోమకుండములయందు వ్రేల్చెడివారలు చరితలు వింటివిగదా॥ ౩౧

సీ॥ మనువంశజులును సేమమున నెల్లప్పుడు, సరవిఋగ్వేదంబు జదువవ
లయు । మయవిశ్వకర్మకుమారవర్గంబునిచ్చలు, యజుర్వేదంబునుజదువవ
లయు । త్వష్టృసంభవులనవరతమత్యంతంబు, సామవేదంబునుజదువవలయు।
సతతంబుశిల్పివంశజులైనవారలు, సరవినథర్వణిజదువవలయు । నెంచతక్షు
లకునుపఠియించదగును । ప్రణవసంయుక్తిగాయత్రి బాహులేయ । వినుముగా
యత్రిదలపంగ వేదమాత । యఖిలవేదమయమ్ముగాయత్రిసుమ్ము॥

టీ॥ మనువంశజులును - మనువంశోత్పన్నులైన విశ్వబ్రాహ్మణులును । సేమమునన్ - క్షేమము చేత । ఎల్లపుడున్ - ఎప్పుడును । సరవిన్ - క్రమముగ । ఋగ్వేదంబున్ - ఋగ్వేదమును । చదువవలయున్ - చదువుకొనవలయును । మయవిశ్వకర్మకుమారవర్గంబు । మయవిశ్వకర్మ-విశ్వకర్మకుమారుడైన మయునియొక్క । కుమార-పుత్రులయొక్క । వర్గంబు-కాండము । నిచ్చలున్ - ఎల్లప్పుడును। యజుర్వేదంబున్-యజుర్వేదమును । చదువవలయున్-పఠించవలయును । త్వష్టృసంభవులు-త్వష్టపుత్రులు । అనవరతము-ఎల్లప్పుడును । అత్యంతంబు - మిక్కిలియు । సామవేదంబును-సామవేదమును। చదువవలయున్ - నేర్చుకొనవలయును । శిల్పివంశజులైనవారలు - శిల్పివంశమందుపుట్టినవారలు । సరవిన్-క్రమముగ । అథర్వణి-అథర్వణవేదమును । చదువవలయున్-నేరువవలయును । ఎంచన్ - ఎన్నగ । ప్రణవసంయుక్తిన్ । ప్రణవ-ఓంకారముతోటి । సంయుక్తిన్-కూడికొనుటచే । గాయత్రి - గాయత్రీమంత్రము । తక్షులకును-విశ్వజ్ఞవంశ్యులును । పఠించదగున్-ఉచ్చరించదగును । బాహులేయ-ఓకుమార । తలపంగన్ - ఆలోచించగ । గాయత్రి - గాయత్రీదేవత । వేదమాత । వేద-వేదము

లకు । మాత - తల్లి । గాయత్రి - గాయత్రీదేవత । అఖిలవేదమయమ్ము । అఖిల - సమస్తములైన । వేదమయమ్ము - వేదస్వరూపమైనది । సుమ్ము - సుమీ । వినుము - ఆకర్ణింపుము॥

తా॥ ఓకుమార పంచబ్రహ్మ సంతతికి క్రమముగ ఋగాదివేదములును ప్రణవయుక్తమైన గాయత్రీమంత్రమును అనుష్ఠించవలయును గాయత్రీదేవత వేదమాతయు వేదస్వరూపమనియు నెరుంగుము॥ 3౨

మ॥ అనఘబ్రాహ్మణ పాదభక్తియుశిఖాయజ్ఞోపవీతాదిపా । వనరుద్రాక్షవిభూతిధారణములుం స్వాధ్యాయపాఠైకలిం । గనమస్కారము ఖాగ్నిహోత్రములు సాంగప్రక్రియంనిష్ఠజే । యనగుంశంభు సమర్పణంబుగ సదా యవ్విశ్వకర్మాన్వయుల్॥

టీ॥ అనఘబ్రాహ్మణపాదభక్తియు । అనఘ - పాపములులేని । బ్రాహ్మణ - బ్రహ్మజ్ఞానులయొక్క । పాదభక్తియు । పాద - చరణములయందు । భక్తియు - ప్రేమయు । శిఖాయజ్ఞోపవీతాదిపావనరుద్రాక్షవిభూతిధారణములుం । శిఖ - జుట్లయొక్క । యజ్ఞోపవీత - జన్నిదములు । ఆది - మొదలగువానియొక్కయు । పావన - పవిత్రములైన । రుద్రాక్ష - రుద్రాక్షహారములయొక్కయు । విభూతి - భస్మత్రిపుండ్రములయొక్కయు । ధారణములుం - ధరించుటలును । స్వాధ్యాయపాఠైక లింగనమస్కారముఖాగ్నిహోత్రములు । స్వాధ్యాయపాఠ - వేదపఠనము । ఏక - ముఖ్యమైన । లింగనమస్కార - శివలింగనమస్కారములు । ముఖ - మొదలుగాగలవియు । అగ్నిహోత్రములు - ఔపాసనాగ్నులును । సాంగప్రక్రియన్ । సాంగ - అంగసహితమైన । ప్రక్రియన్ - ప్రకారముచేత । అవ్విశ్వకర్మాన్వయుల్ - ఆవిశ్వబ్రాహ్మణులు । శంభుసమర్పణంబుగన్ - శివార్పణముగ । సదా - ఎల్లప్పుడును । నిష్ఠన్ - శ్రద్ధచేత । చేయదగున్ - చేయవచ్చును॥

తా॥ విశ్వబ్రాహ్మణులు త్రికాలాగ్నిహోత్రములు మొదలైన షట్కర్మలను ఉపనైనాదికమును సమస్తస్మృత్యాచారములను చేయుదురు॥ 33

మ॥ అలరుద్రాక్షవిభూతిధారణ శిఖాయజ్ఞోపవీతంబులుం । లలితబ్రాహ్మణభక్తియధ్యయన శీలంబేకలింగార్చనో । జ్జ్వలనిష్ఠాగుణమాహితాగ్నియును తీవింగల్గివర్తించుకే । వలపుణ్యాత్మకు లీజగద్గురులు భాస్వద్విశ్వకర్మాన్వయుల్॥

టీ॥ కేవలపుణ్యాత్మకులు । కేవల - ముఖ్యముగా । పుణ్యాత్మకులు - పుణ్యస్వరూపులైనటువంటియు । ఈజగద్గురులు । ఈ - కనుపించెడి । జగత్ - లోకములకు । గురులు - గురువులైనట్టియు । భాస్వద్విశ్వకర్మాన్వయుల్ । భాస్వత్ - ప్రకాశించుచున్న । విశ్వకర్మాన్వయుల్ - విశ్వకర్మవంశోత్పన్నులు । ఆలరుద్రాక్షవిభూతిధారణశిఖా యజ్ఞోపవీతంబులుం । అల - ప్రసిద్ధములైన । రుద్రాక్ష - రుద్రాక్షపేరులును । విభూతిధారణ - భస్మధారణము । శిఖ - జుట్టు । యజ్ఞోపవీతంబులుం - జన్నిదములును । లలితబ్రాహ్మణభక్తియు । లలిత - సుందరమైన । బ్రాహ్మణభక్తియు । బ్రహ్మజ్ఞానులయందు ప్రేమయును । అధ్యయనశీలంబు । అధ్యయన - వేదపఠనమందు । శీలంబు - సద్వృత్తియును । ఏకలింగార్చనోజ్జ్వలనిష్ఠాగుణము । ఏక - ఒక్కటియగు । లింగ - లింగముయొక్క । అర్చన - పూజయందు । ఉజ్జ్వల - ప్రకాశించుచున్న । గుణము - గుణమును । ఆహితాగ్నియును । ఆహిత - ఉంచబడిన । అగ్నియును - అగ్నిహోత్రమును । తీవిన్ - తీవిగను । కలిగి - ఉండి । వర్తించున్ - ప్రవర్తించుదురు॥

తా॥ విశ్వకర్మసంతతివారు ఏకలింగార్చనమును అగ్నిహోత్రమును వేదాధ్యయనము మొదలైన వానిని జరిగించువారు॥ 3౪

గీ॥ ధర్మపారీణులగు విశ్వకర్మసుతుల । నిర్మలాచారమార్గంబునీకుదెలి
య । మరియు జెప్పెదవినుముకుమారవారి । చరితములువిన్న పుణ్యంబు
సంభవించు ॥

టీ॥ కుమార-ఓకుమారస్వామి । ధర్మపారీణులగు । ధర్మ-ధర్మములకు । పారీణులగు-పారంగతులైన । విశ్వకర్మసుతులు-విశ్వకర్మపుత్రులయొక్క । నిర్మలాచారమార్గంబు । నిర్మల-స్వచ్ఛమైన । ఆచారమార్గంబు-ఆచారపద్ధతిని । నీకు-ఈకు । తెలియన్-తెలియునటుల । మరియు-తిరిగి । చెప్పెదన్-వచించెదను । వినుము-ఆకర్ణింపుము । వారిచరితములు । వారి-ఆవిశ్వకర్మపుత్రులయొక్క । చరితములు-చరిత్రలను । విన్నన్-ఆకర్ణించిన । పుణ్యంబు-సుకృతము । సంభవించున్-కలుగును ॥

తా॥ విశ్వకర్మపుత్రచరిత్రను శ్రోత్రపాత్రము జేయువారలకు ఇహపరములుగలవు ॥ ౩౫

గీ॥ విశ్వకర్మాంశజనితుండు విశ్వచక్షు । వనగబ్రహ్మశిరోమణియగుచు
బ్రహ్మ । కర్మమయమైనయర్కుండుగలిగెనందు । క్రమముతోడతదాచార
కలనయెంతు ॥

టీ॥ విశ్వకర్మాంశజనితుండు । విశకర్మ-విశ్వకర్మయొక్క । అంశ-కళవల్ల । జనితుండు-పుట్టినట్టియు । విశ్వచక్షువనగ । విశ్వ-ప్రపంచమునకు । చక్షువనగ-కన్నుయనగ । బ్రహ్మశిరోమణియగుచు । బహ్మ-బ్రహ్మలలో । శిరోమణియగుచు - శిరోభూషణమైనవాడగుచు । బ్రహ్మకర్మమయమైన । బ్రహ్మ-వేదము । కర్మ-కర్మము । మయమైన-స్వరూపమైన । అర్కుండు - సూర్యుడు । కలిగెను-పుట్టెను । అందు-ఆవంశమందు । క్రమముతోడన్ - యథాక్రమముగ । తదాచారకలనన్ । తత్ - ఆవంశీయులయొక్క । ఆచారకలనన్-ఆచారప్రకారమును । ఎంతున్-ఎన్నుదును ॥

తా॥ విశ్వకర్మాంశసంభవుడును లోకచక్షువును కర్మసాక్షియును వేదస్వరూపుడునగు సూర్యుండు పుట్టెను ఆవిశ్వకర్మాన్వయుల యాచారములను చెప్పెదను॥ ౩౬

సీ॥ ఆరూఢయమనియమాచారవంతులు, స్వస్తికాద్యాసన సాధకులు
ను । సరవిప్రాణాయామసాధనాధికులుప్ర, త్యాహారనిరతులుధ్యానపరులు ।
మహితధారణులుసౌమ్యస్వభావులునుమ, హాదేవుభక్తిపరాయణులును ।
విప్రార్చనపరుల్ వేదమార్గప్రతి, ష్ఠితులుసర్వజ్ఞులు సిష్ఠితములు । తీర్థసే
వానుమోదులుదేవమాని । మాతృపితృభక్తియుక్తులుమాన్యులతిథి । పూజ
నాసక్తులత్యంతపుణ్యమతులు । విశ్వకర్మకులోద్భవుల్ విశ్వవినుత ॥

టీ॥ ఆరూఢయమనియమాచారవంతులు । ఆరూఢ-దృఢమైన । యమనియమ-యమనియమాద్యష్టాంగములయొక్క । ఆచారవంతులు-శీలముగలవారలు । స్వస్తికాద్యాసనసాధకులను । స్వస్తికాది-స్వస్తికము మొదలగు । ఆసన-ఆసనవిధానములను । సాధకులును-సాధించినవారలును । సరవిన్-క్రమముగ । ప్రాణాయామసాధనాధికులు । ప్రాణాయామ-వాయునిరోధమును । సాధన-సాధించుటచేత । అధికులును-గొప్పవారలును । ప్రత్యాహారనిరతులు । ప్రత్యాహార-ప్రత్యాహారయోగమందు । నిరతులు-ఆసక్తిగలవారలును । ధ్యానపరులు । ధ్యాన-ఈశ్వరధ్యానము । పరులు-ప్రధానముగాగలవారలును । మహితధారణులు । మహిత-ప్రసిద్ధమైన । ధారణులు-లింగధారణముగలవారలును (ధారణయోగముగలవారలును) । సౌమ్యస్వభావులును । సౌమ్య-అహంకారములేని । స్వభావులును-గుణముకలవారలును ।

మహాదేవభక్తిపరాయణులును । మహాదేవ-శివునియొక్క । భక్తి-భక్తియే । పరాయణులును-ప్రధానముగాగలవారలును । విప్రార్చనపరులు । విప్ర-విప్రులయొక్క । అర్చన-పూజయే । పరులు-ముఖ్యముగాగలవారలును । వేదమార్గప్రతిష్ఠితులు । వేదమార్గ-నిగమపద్ధతియందు । ప్రతిష్ఠితులు - ఉంచబడ్డవారలును । సర్వజ్ఞులు - అన్నియుతెలిసినవారలును । శిక్షితులును - గురువులచేతనేర్పబడ్డవారలును । తీర్థసేవానుమోదులు । తీర్థ-గంగాదిమహాతీర్థములయొక్క । సేవ-సేవించుటయందు । అనుమోదులు-సంతోషముగలవారలును । యానిమాతృపితృభక్తియుక్తులు । యాని-యతులయందును । మాతృ-తల్లులయందును । పితృ-తండ్రులయందును । భక్తి - భక్తితో । యుక్తులు - కూడినవారలును । మాన్యులు-పూజించఁదగినవారలును । అతిథిపూజనాసక్తులు । అతిథి-అభ్యాగతులయొక్క । పూజనా-పూజించుటయందు । ఆసక్తులు-ప్రేమగలవారలును । విశ్వవినుత । విశ్వ-లోకములచేత । వినుత-కొనియాడఁబడిన ఓకుమారా । విశ్వకర్మకులోద్భవుల్ । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । కుల-వంశమందు । ఉద్భవుల్-పుట్టినవారలు । పుణ్యమతులు । పుణ్య-పాపములేని । మతులు-మనస్సుగలవారలు ॥

తా॥ ఓకుమారా విశ్వకర్మ సంతతివారలు సమస్త సద్గుణ నికురుంబముగలవారలు॥ ३२

క॥ నిరుపమకామక్రోధా । ద్యరులనునిర్జించికుచ్ఛితాచారములన్ । నిర
సించిదుష్టమతుల । పరిహారమొనరించు ధర్మపరులెన్నంగన్॥

టీ॥ నిరుపమకామక్రోధాద్యరులను । నిరుపమ-సాటిలేని । కామక్రోధాది - కామక్రోధాదులనెడి । అరులను-శత్రువులను । నిర్జించి-జయించి । కుచ్ఛితాచారములన్ । కుచ్ఛిత - కపటములైన । ఆచారములన్-నడతలను । నిరసించి-నిరాకరించి । దుష్టమతులను-దుర్బుద్ధిగలవారలను । ఎన్నంగన్-లెక్కించఁగ । పరిహారమొనరించు-పరిత్యాగముచేయు । ధర్మపరులు-ధర్మప్రధానులును ॥

తా॥ ఇంకను వారలు కామక్రోధాదులులేనివారలును మంచియాచారాదికముగలవారలును॥ ३౮

వ॥ పరస్త్రీపరాఙ్ముఖులును, విముక్తపరాభివాదులును, నిద్రాలస్యభయరహితులును, దీనరక్షణవిచక్షణులును, గతకల్మషులును, యనేకవిశేషగుణగరిష్ఠులును, భూతిబుద్రాక్షమాలికాలంకారులును, శిఖాయజ్ఞోపవీతధారణులును, నిజాచార్యసపర్యాధుర్యులునగు విశ్వకర్మాంశసంభవులమన్వీశసంభవులనియన్నందగు, నింకసర్వదేవతలకు దేవుండును, సర్వదేవతామూర్ధంబగు మయునివంశంబువారల లక్షణంబులుజెప్పెద, లోకోత్తరచరిత్రులును, త్వష్టృసూనులు తత్వవేత్తలధ్యయనాది, షోడశకర్మనిరతులును, విశ్వకర్మవంశపారావార సముద్భవచింతామణులును, తక్షవంశజులట్టిమహానుభావులని యెఱుంగందగు నిట్టి విశ్వకర్మాంశజులచేత ననేకలోకంబులు బ్రహ్మాండంబునందుల చతుర్దశ భువనంబులు నిర్మింపఁదనరె॥

టీ॥ పరస్త్రీపరాఙ్ముఖులును । పరస్త్రీ-పరభామలకు । పరాఙ్ముఖులును - పెడమోముపెట్టువారును । విముక్తపరాభివాదులును । విముక్త - విడిచిపెట్టబడ్డ । పర - అన్యులయెడల । అభివాదులును - వందనముగలవారును । నిద్రాలస్యభయరహితులును । నిద్ర - నిద్ర । ఆలస్య - సోమరితనము । భయ - జడుపు । రహితులును - లేనివారలును । దీనరక్షణవిచక్షణులును । దీన - ఆర్తులయొక్క । రక్షణ-బ్రోచుటయందు । విచక్షణులును-విద్వాంసులైనవారలును । గతకల్మషులును । గత-పోయిన ।

కల్మషులును-పాపములుగలవారలును । అనేకవిశేషగుణగరిష్ఠులును । అనేక - బహువులైన । విశేష - శ్రేష్ఠములైన । గుణ-గాంభీర్యాదిగుణములచేత । గరిష్ఠులును-అతిశయులైనవారలును । భూతిరుద్రాక్షమాలికాలంకారులును । భూతి-విభూతియు । రుద్రాక్షమాలికా-రుద్రాక్షహారములును । అలంకారులును-భూషణములుగాకలవారలును । శిఖాయజ్ఞోపవీతధారణులును । శిఖా-చూడములను (జుట్లు) । యజ్ఞోపవీత-జన్నిదములను । ధారణులును-తాల్చువారలును । నిజాచార్యసపర్యాధుర్యులునగు । నిజ-స్వకీయులైన । ఆచార్య-గురువులయొక్క । సపర్య-పూజకు । ధుర్యులునగు-ధురంధరులైన । విశ్వకర్మాంశసంభవులు । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । అంశ-కళవల్ల । సంభవులు-పుట్టినవారలు । మన్వీశసంభవులని । మన్వీశ-మన్వీశునివలన । సంభవులని-జన్మించినవారలని । ఎన్నందగు-లెక్కింపదగు । ఇంకన్ - ఇకను । సర్వదేవతలకు । సమస్తమైనదేవతలకు - దేవుండును । ప్రభువైనవాడును-సర్వదేవతామూర్ధంబులగు । సర్వదేవతా - యావత్తుదేవతలకును । మూర్ధంబులగు - శిరఃప్రాయంబులైన । మయునివంశంబువారలలక్షణంబులు । మయుని - మయబ్రహ్మయొక్క । వంశంబువారల-వంశస్థులయొక్క । లక్షణంబులు - చిహ్నములను । చెప్పెదన్ - చెప్పెదను । లోకోత్తరచరిత్రులును । లోకోత్తర-లోకోత్కృష్టములైన । చరిత్రులు-చరితలుకలవారలు । త్వష్టృసూనులు-త్వష్టబ్రహ్మపుత్రులు । తత్త్వవేత్తలు - వేదాంతతత్త్వమును తెలిసినవారలు । అధ్యయనాదిషోడశకర్మనిరతులును । అధ్యయన - వేదపఠనము । ఆది-మొదలగు । షోడశకర్మ - పదియారుకర్మలయందు । నిరతులును । ఆసక్తిగలవారలును । విశ్వకర్మపారావారసముద్భవచింతామణులును । విశ్వకర్మ - విశ్వకర్మయనెడు । పారావార-సముద్రమందు । సముద్భవ-పుట్టిన । చింతామణులును-చింతారత్నమైనవారలును । తక్షవంశజులు-విశ్వజ్ఞబ్రహ్మవంశోత్పన్నులు । అట్టిమహానుభావులని । అటువంటిమహామహిములని-ఎరుంగందగు । తెలియదగును । ఇట్టివిశ్వకర్మాంశజులచేతన్ । ఇట్టి-ఇటువంటి । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । అంశజులచేతన్-అంశోత్పన్నులచేత । అనేకలోకంబులు-చాలనైనప్రపంచములును । బ్రహ్మాండంబునందలిచతుర్దశభువనంబులు । బ్రహ్మాండంబునందలి-బ్రహ్మాండమందున్న । చతుర్దశ-పదునాలుగైన । భువనంబులు - లోకములును । నిర్మింపబడియె-చేయబడెను ॥

తా॥ ఈవిశ్వకర్మాంశసంభవులైన పంచబ్రహ్మసంతతివారలు సమస్తకల్యాణగుణగణములుగల వారలనియు భువన నిర్మాతలనియు ॥ ౩౯

గీ॥ మనువుశివుడునుమయుడురమాధవుండు । త్వష్టృపరమేష్ఠిశిల్పివృద్ధ
శ్రవుండు । తక్షభానుండునగువీరుదైవగురులు । విశ్వకర్మాగ్రనందనుల్ విను
తపుణ్యా॥

టీ॥ మనువు-మనుబ్రహ్మ । శివుడును-సాంబమూర్తి । మయుడు - మయబ్రహ్మ । రమాధవుండు - విష్ణుమూర్తి । త్వష్ట-త్వష్టబ్రహ్మ । పరమేష్ఠి-బ్రహ్మదేవుడు । శిల్పి-శిల్పిబ్రహ్మ । వృద్ధశ్రవుండు - దేవేంద్రుడు । తక్ష-విశ్వజ్ఞబ్రహ్మ । భానుండు-సూర్యుడు । అగువీరు-అయినవీరలు । వినుతపుణ్యా । వినుత-స్తుతించతగిన । పుణ్య-పుణ్యముగల ఓకుమారుడ । విశ్వకర్మాగ్రనందనుల్ । విశ్వకర్మ-విశ్వకర్మకు । అగ్రనందనుల్-జ్యేష్ఠపుత్రులు । దైవగురులు-దేవతాగురువులు ॥

తా॥ విశ్వకర్మకు మొదటికొడుకులైన మన్వాదులు బ్రహ్మ విష్ణు మహేశ్వర సురేశ్వర దినేశ్వరులని॥ ౪౦

క॥ ద్విజవరుడగుమనువునకుం । సుజనుడ శుభుడగ్నిగర్భ సుశ్లోకుడుప ।
ద్మజనిభుడగు కశ్యపముని । నిజనందనుడై జనించె నిర్మలచరితా ॥

టీ॥ నిర్మలచరితా-సాధుచరిత్రలుగల ఓకుమారా । ద్విజవరుడు-బ్రాహ్మణశ్రేష్ఠుడు । అగుమనువునకున్ । అగు-అయినట్టి । మనువునకున్-మనుబ్రహ్మకు । సుజనుడు-యోగ్యుడైనట్టియు । శుభుడు-

శుభకరుడైనట్టియు । అగ్నిగర్భసుశ్లోకుడు । అగ్నిగర్భ-అగ్నిగర్భునివలె । సు-యోగ్యములైన । శ్లోకుడు-చరిత్రలుకలిగినట్టియు । పద్మజనిభుడు । పద్మజ-బ్రహ్మదేవునితో । నిభుడు-సమానుడు । అగుకశ్యపమునియును-అయినకశ్యపప్రజాపతియును । నిజనందనుడై-నిజకుమారుడై । జనించెన్-పుట్టెను ॥

తా॥ మనుబ్రహ్మకు బ్రహ్మదేవునివంటి కశ్యపప్రజాపతిజన్మించెను ॥ ౪౧

గీ॥ బ్రహ్మనిభుడైనమయునకు బ్రమదముగను । నవ్యసన్మాన్యగుణ ధన్యలైనకన్య । లుదయమందరి ప్రత్యక్షమదనరాజ్య । లక్ష్ములనభాగ్య సౌభాగ్యలక్షణముల ॥

టీ॥ బ్రహ్మనిభుడైన । బ్రహ్మ-బ్రహ్మదేవునితో । నిభుడైన-సమానుడైన । మయునకున్-మయబ్రహ్మకు । ప్రమదముగను-సంతోషముగ । ప్రత్యక్షమదనరాజ్యలక్ష్ములనన్ । ప్రత్యక్ష-కనుపించుచున్న । మదన-మన్మథుని యొక్క । రాజ్యలక్ష్ములనన్-రాజ్యలక్ష్ములనునటుల । భాగ్యసౌభాగ్యలక్షణములన్ । భాగ్య-అదృష్టముయొక్కయు । సౌభాగ్య-శుభములయొక్కయు । లక్షణములన్-చిహ్నలచేత । నవ్యసన్మాన్యగుణధన్యలైన । నవ్య-నూతనములైన । సన్మాన్య । సత్-సాధువులచే । మాన్య-మన్నించతగిన । గుణ-సుశీలత మొదలగు గుణములచేత । ధన్యలైన-యోగ్యలైనట్టి । కన్యలు-కుమారికలు । ఉదయమందిరి-పుట్టిరి ॥

తా॥ మయబ్రహ్మకు సౌందర్యవతులగు చిన్నికన్నెలుకలిగిరి ॥ ౪౨

చ॥ అలఘుతపోనిధి ప్రణతుడైతగు కశ్యపమౌనిలోకరా । ట్తిలకుడపారసంతతి ఘటించుటకై తమిబెల్లియాడెభా । ర్యలబదముప్వురన్ సురసభార్యనుతవ్రతలన్ బయోజగం । ధులసుచరిత్రలన్ సుమమనోరమచారిమ దివ్యగాత్రలన్ ॥

టీ॥ అలఘుతపోనిధి ప్రణతుడై । అలఘు-అతిశయులైన । తపోనిధి-ఋషులచేత । ప్రణతుడై-నమస్కరించబడినవాడై । తగు-ఒప్పుచున్న । లోకరాట్తిలకుడు । లోకరాట్-జగత్ప్రభువులలో । తిలకుడు-బొట్టైన । కశ్యపమౌని-కశ్యపప్రజాపతి । అపారసంతతిఘటించుటకై । అపార-అనంతమైన । సంతతి-సంతానమును । ఘటించుటకై-కూర్చుటకై । తమిన్-ప్రేమచేత । సురసభార్యనుతవ్రతలన్ । సురసభా-దేవసభయగుసుధర్మయందలి । ఆర్య-పెద్దలగు బృహస్పతి మొదలగువారలచేత । నుత-కొనియాడబడిన । వ్రతలన్-నియమములుగలిగినట్టియు । పయోజగంధులన్ । పయోజ-పద్మములయొక్క । గంధులన్-పరిమళముగలట్టి । సుచరిత్రలన్-మంచిచరితలుగలట్టియు । సుమమనోరమచారిమదివ్యగాత్రలన్ । సుమ-పుష్పములవలె । మనోరమ-మనోహరమైన । చారిమ-సుందరతగల । దివ్య-శ్రేష్ఠములైన । గాత్రలన్-ఒడలుగలిగినట్టియు । పదముప్వురన్-పదముగ్గురైన । భార్యలన్-గృహిణులను । పెండ్లియాడె-పెండిలిజేసుకొనెను ॥

తా॥ కశ్యపప్రజాపతి సౌందర్యాది గుణవిరాజితలైన పదుముగ్గురు స్త్రీలను వివాహము చేసికొనెను ॥ ౪౩

చ॥ ఉగుతరమైనలోకముల నుండుచరాచరజీవరాశికిం । గురుడుమహాతపస్వి మునికోటులకెల్లను పెద్దయుద్దియు । త్తరభవవిద్విషన్మద విదారుడు కశ్యపమౌనిమౌళితా । పరమతపోధనాన్వయము పారమునీ కెరిగింతు బుత్రకా ॥

టీ॥ ఉరుతరమైనలోకములనుండు చరాచరజీవరాశికిన్ । ఉరుతరమైన-మిక్కిలిగొప్పవియైన । లోకములన్- జగములయందు । ఉండు-ఉన్నట్టి । చరాచర-స్థావరజంగమములైన । జీవరాశికిన్-జీవసమూహమునకు । గురుడు-గురువైనట్టియు । తపస్వి-తపోవంతుడైనట్టియు । మునికోటులకెల్లను-మునిబృందములన్నిటికిని । పెద్దయుద్ది-పెద్దసరివాడైనట్టియు । ఉత్తరభవవిద్విషన్మదవిదారుడు । ఉత్తర-ఉత్కృష్టమైన । భవవిద్విషత్ - అంతశ్శత్రువులయొక్క । మద-గర్వమును । విదారుడు - భేదించువాడునగు । కశ్యపమౌనిమౌళి - కశ్యపుడను ఋషిశిఖామణికలడు । పుత్రక - ఓకుమారుడ । ఆపరమతపోధనాన్వయముపారము । ఆపరమతపోధన-ఆకశ్యపప్రజాపతియొక్క । అన్వయము-వంశముయొక్క । పారము-అంతమును । నీకున్-ఈకు । ఎరిగింతు-తెలిపెదను॥

తా॥ ఓకుమారా చరాచరగురువైన కశ్యపప్రజాపతి వంశమును యావత్తును తెలిపెదను॥ ౨౨

వ॥ అమ్మానిచంద్రుని భార్యలు బ్రాహ్మణియు, దితియు, నదితియు, కద్రువయు, వినతయు, ప్రభాదేవియు, కౌముదియు, స్వర్ణకప్రభయు, మేఘదండియు, ధాతుప్రభావతియు, భాతియు, ధర్మమూర్తియు, మొదలైనదేవతాకన్యలం, మయునియనుగ్రహంబున దక్షబ్రహ్మపుత్రికల బెండ్లియాడె, మరి విశ్వలోకపితామహుండును, విచిత్రవీర్యుండును, లోకోత్పత్తికారణుండును నగు నతనిసంతానాభివృద్ధియు వేరువేర వినుపించెదవినుము॥

టీ॥ అమ్మానిచంద్రునిభార్యలు । అమ్మానిచంద్రుని-ఆకశ్యపమునిశ్రేష్ఠునియొక్క । భార్యలు-పత్నులు । బ్రాహ్మణియు, దితియు, అదితియు, కద్రువయు, వినతయు, ప్రభాదేవియు, కౌముదియు, స్వర్ణకప్రభయు, మేఘదండియు, ధాతుప్రభావతియు, భాతియు, ధర్మమూర్తియు, మొదలైన-మొదలుగాగల । దేవతాకన్యలన్-దేవకుమారికలను । మయునియనుగ్రహంబునన్-మయబ్రహ్మయొక్క దయవలన । దక్షబ్రహ్మపుత్రికలన్-దక్షప్రజాపతియొక్క కుమారికలను । పెండ్లియాడె-వివాహముచేసికొనెను। మరియు-ఇంకను । విశ్వలోకపితామహుండును । విశ్వ-సమస్తమైన । లోక-భువనములకు । పితామహుండును-తాతయును । విచిత్రవీర్యుండును-అబ్బురమైన శౌర్యముగలవాడును । లోకోత్పత్తికారణుండును । లోక-జనులయొక్క । ఉత్పత్తి-పుట్టుకకు । కారణుండును-హేతువైనవాడును । అగు-అయిన । అతనిసంతానాభివృద్ధియు । అతని-ఆకశ్యపప్రజాపతియొక్క । సంతాన-సంతతియొక్క । అభివృద్ధియు-విస్తరించుటను । వేరువేరన్-ప్రత్యేకముగ । వినుపించెదన్-చెప్పెదను । వినుము-ఆకర్ణింపుము.

తా॥ ఆకశ్యపప్రజాపతియొక్క యీచెప్పబడిన భార్యలవల్ల కలిగిన సంతానసంతతిని చెప్పెద వినుము॥ ౨౩

సీ॥ దితికిజన్మించిరుద్ధతచిత్తులేబది, యారుకోటులసంఖ్యలసురవర్యు। ల
దితిదేవికి బుట్టిరతులితస్ఫూర్తిము, ప్పదిమూడుకోటులత్రిశకవరులు। కద్రూ
సతమణిగర్భంబునందుద, యించిరివిశ్రుతాహిప్రకరము। వినతాతనూజులై
వెలసిరనూరుండు, తార్క్ష్యుండనంగప్రతాపవరులు। మానినీరత్నమగుమృగ
మందకెలమి । గలిగెనుమృగంబులష్టదిగ్వారణములు । వారిరుహనేత్రియగు
ప్రభావతికిధన్యు। లనగగలిగిరి సకలదిశాధిపతులు॥

టీ॥ దితికిన్-దితికి । ఉద్ధతచిత్తులు । ఉద్ధత-ఉద్రిక్తములైన । చిత్తులు-చిత్తములు గలట్టియు । ఏబదియారు కోటులసంఖ్యలు-పంచాశత్కోటిగణనగలిగినట్టియు । అసురవర్యులు-రాక్షసశ్రేష్ఠులును । అదితిదేవికిన్-అదితిదేవికిని । అతులితస్ఫూర్తిన్ ।. అతులిత-సాటులేని । స్ఫూర్తిన్-ప్రకాశచే

త । ముప్పదిమూడుకోటులు-త్రయస్త్రింశత్కోటులైన । త్రిదశవరులు । త్రి-మూడగు । దశ - బాల్య యౌవన కౌమారావస్థలుకల దేవతలలో । వరులు-శ్రేష్ఠులైనవారలును । పుట్టిరి-కలిగిరి । కద్రూసతమ ణి గర్భంబునందు । కద్రూ-కద్రువ నెడి । సతమణి-స్త్రీరత్నముయొక్క । గర్భంబునందు-కుక్షియందు । విశ్రుతాహిప్రకరము । విశ్రుత-ప్రసిద్ధులైన । అహి-వాసుకి మొదలగు సర్పములయొక్క । ప్రకరము-సమూహము । ఉదయించెను-పుట్టెను । వినతాతనూజులై । వినత-వినతకు । తనూజులై-కొమరులై । అనూరుండు-తొడలులేనివాడును । (సూర్యునిసారథి) తార్క్ష్యుండు - గరుత్మంతుడు । అనం గన్-అనగను । ప్రతాపవరులు । ప్రతాప-ప్రతాపముచేత । వరులు-శ్రేష్ఠులు । వెలసిరి-ప్రకాశించిరి । మానినీ రత్నమగు-స్త్రీలలో శ్రేష్ఠమైన । మృగమందకు-మృగమందయను భార్యకు । ఎలమిన్-ప్రేమచేత । మృగంబులు-లేళ్లుమొదలైనవియు । అష్టదిగ్వారణములు । అష్ట-ఎనిమిదగు । దిగ్వారణములు-దిగ్గజములును । కలిగెను-పుట్టెను । వారిరుహనేత్రియగు । వారిరుహ-పద్మములవంటి । నేత్రి యగు-కన్నులుగలిగినదైన । ప్రభావతికి-ప్రభావతీదేవికి । ధన్యులనగన్-యోగ్యులనునట్లు । సకలదిశాధిపతులు । సకల-సమస్తమైన । దిశాధిపతులు-దిక్పాలురు । కలిగిరి-పుట్టిరి ॥

తా॥ కశ్యపప్రజాపతికి అదితిమొదలైన భార్యలయందు దేవరాక్షసాది సంతానము కలిగెను.

గీ॥ మేఘదండికిబుట్టెన మోఘమహిమ । సరవిసప్తర్షిగంధర్వసముద
యంబు । బుట్టెధాతుప్రభకును పూర్వమైన । కర్కటక కూర్మనక్రాదికం
చరములు ॥

టీ॥ మేఘదండికిన్-మేఘదండికి । అమోఘమహిమన్ । అమోఘ-వ్యర్థముకాని । మహిమన్-మహత్తుచే । సరవిన్-క్రమముగ । సప్తర్షిగంధర్వసముదయంబు । సప్తర్షి-సప్తమహర్షులయొక్కయు । గంధర్వ-గంధర్వులయొక్కయు । సముదయంబు-సమూహము । పుట్టెను-కలిగెను । ధాతుప్రభకును-ధాతుప్రభకును । అపూర్వమైన-నూతనమైన । కర్కటక కూర్మనక్రాది కంచరములు । కర్కటక-ఎండ్రకాయలు । కూర్మ-తాబేళ్లు । నక్ర-మొసళ్లు । ఆది-మొదలగు । కంచరములు-జలచరములు । పుట్టెను-జన్మించెను ॥

తా॥ కశ్యపునకు మేఘదండియందు సప్తర్షులును ధాతుప్రభయందు ఎండ్రకాయలు మొదలగు నవియును పుట్టెను ॥

క॥ జనియించెను కుసుమావతి । యనుకాంతకు కామధేను వమరద్రు
మముల్ । వినుముశరజన్మపర్వత । యనుకన్యకుబుట్టె పర్వతాఢ్యములెల్లన్ ॥

టీ॥ శరజన్మ-రెల్లుయందుపుట్టిన ఓకుమార । కుసుమావతియను కాంతకు-కుసుమావతియను స్త్రీకి । కామధేనువు-కామధేనువనెడు యావును । అమరద్రుమముల్-దేవవృక్షములును । జనియించెను-పుట్టెను । పర్వతయనుకన్యకు-పర్వతయను స్త్రీకి । పర్వతాఢ్యములెల్లన్-మంచిపర్వతములన్నియు పుట్టెన్-కలిగెను ॥

తా॥ కుసుమావతికి కామధేనువు కల్పవృక్షాదులును పర్వతకు కొండలును పుట్టెను ॥

సీ॥ వారిజాక్షికి మేఘవతియనుభామకు, మలయద్రుమములు సమ
స్తకీట । కక్షుద్రజంతువుల్ గలిగెసంకీర్ణమై, మరియుసద్వృక్షాఖ్యమానవ
తికి । దుష్టనిశాచరస్తోమంబు రాక్షస, గ్రహభూతబేతాళగణముసిద్ధ । య
క్షదైత్యబ్రహ్మరాక్షసకూశ్మాండ, శాకినీడాకినీ సముదయంబు । దృష్టసృష్టి

ధిదేవతాదుష్టదైత్యు । లాదిగాశతకోట్యర్బుదంబులైన । సంఖ్యలునుదుర్వి
కార ప్రచారకారు । లగుచుజనియించి రెంతయు నద్భుతముగ ॥

టీ॥ వారిజాక్షికి । వారిజ-పద్మములవంటి । అక్షికి-కన్నులుగల । మేఘవతియను-మేఘవతియనెడు । భామకు-స్త్రీకి । మలయద్రుమములు-మంచిగంధపుచెట్లును । సమస్తకీటకక్షుద్రజంతువుల్ । సమస్త-అనేకమైన । కీటక-పురుగులును । క్షుద్రజంతువుల్-నీచజంతువులును । కలిగెన్-పుట్టెను । మరియు-ఇంకను । సంకీర్ణమై-సంకరమై । సదృక్షాఖ్యమానవతికి । సదృక్షాఖ్య-సదృక్షయను పేరుగల । మానవతికిన్-స్త్రీకి । దుష్టనిశాచరస్తోమంబు । దుష్ట-దుర్మార్గులగు । నిశాచర-రాక్షసులయొక్క । స్తోమంబు-సమూహమును । రాక్షసగ్రహభూతబేతాళగణము । రాక్షస-దైత్యులయొక్కయు । గ్రహ-శాకిన్యాదిగ్రహములయొక్కయు । భూత-పిశాచములయొక్కయు । బేతాళ-బేతాళాదులయొక్కయు । గణము-సమూహమును । సిద్ధయక్షదైత్య బ్రహ్మరాక్షస కూశ్మాండ శాకినీ డాకినీ సముదయంబు । సిద్ధ-సిద్ధులయొక్కయు । యక్ష-యక్షులయొక్కయు । దైత్య-రాక్షసులయొక్కయు । బ్రహ్మరాక్షస-బ్రహ్మరాక్షసులయొక్కయు । కూశ్మాండ-కూశ్మాండగ్రహములయొక్కయు । శాకిని డాకినీ - శాకినీ డాకిన్యాదులయొక్కయు । సముదయంబు-సమూహమును । దృష్టసృష్ట్యధిదేవతాదుష్టదైత్యులు । దృష్ట-చూడబడిన । సృష్టి-సృజించుటకు । అధిదేవతా-ముఖ్యదేవతలు । దుష్ట-దుర్మార్గులైన । దైత్యులు-రాక్షసులు । ఆదిగా-మొదలుగా । శతకోట్యర్బుదంబులైన । శతకోటి-నూరుకోట్లయొక్క । అర్బుదంబులైన-అర్బుదనామముగలవైన । సంఖ్యలును-లెక్కలుగలవారలును । దుర్వికారప్రచారకారులగుచు । దుర్వికార-దుష్టములైన । ప్రచార-నడతలను । కారులగుచు-చేయువారలగుచు । ఎంతయు-మిక్కిలి । అద్భుతముగ-ఆశ్చర్యముగ । జనియించిరి-పుట్టిరి॥

తా॥ మేఘవతికిని సదృక్షకును శతకోట్యర్బుదసంఖ్యలుగల జీవరాసులాదవెను ॥ ౮౯

క॥ ఈకరణికశ్యపునినా । ళీకాక్షులవలనగలిగె లేఖాసురులుం । కాకో
దరసిద్ధోద్భవ । శాకిన్యాదులునుమనిరి జగములయందున్ ॥

టీ॥ ఈ కరణిన్ - ఈ రీతిచేత । కశ్యపుని-కశ్యపప్రజాపతియొక్క । నాళీకాక్షులవలనన్-భార్యలవల్ల । లేఖాసురులున్ । లేఖ-దేవతలును । అసురులుం-రాక్షసులును । కాకోదరసిద్ధోద్భవశాకిన్యాదులును । కాకోదర-సర్పములును । సిద్ధోద్భవ । సిద్ధ-సిద్ధులవల్ల । ఉద్భవ-పుట్టినవారును । శాకిన్యాదులును-శాకిని మొదలైనవారును । జగములయందున్-లోకములలోనను । మనిరి-జీవించిరి॥

తా॥ కశ్యపప్రజాపతిభార్యలవల్ల యీ పుట్టినదేవాదిసంతతులు భువనములయందు వృద్ధిపొందెను ॥ ౯౦

ఉ॥ కావునసర్వసంయమిని కాయములోగులదీపకుండువి । ద్యావనజా
తసంభవుడు స్రష్టజగంబులకెల్లనెంతయుం । బావనుడంబుజప్రభు నిభప్రభు
డుగ్రతపోధనుండునా । నావిధజీవహేతుజననస్థితికశ్యపమౌనియొప్పె తాన్ ॥

టీ॥ కావునన్-గనుక । సర్వసంయమిని కాయములోన్ । సర్వ-సమస్తమైన । సంయమి-ఋషులయొక్క । నికాయములోన్-సమూహములో । కులదీపకుండు-వంశప్రకాశకుడైనట్టియు । విద్యావనజాతసంభవుడు । విద్యా-చదువులకు । వనజాతసంభవుడు-బ్రహ్మదేవుడైనట్టియు । జగంబులకెల్లన్-లోకములన్నిటికి । ఎంతయున్-మిక్కిలి । స్రష్ట-సృష్టికర్తయైనట్టియు । పావనుడు-పవిత్రుడైనట్టియు ।

అంబుజప్రభునిభప్రభుఁడు । అంబుజప్రభు-పద్మవల్లభుఁడైన సూర్యునితో । నిభ-సమానమైన । ప్రభుఁడు-కాంతిగలిగినట్టి । ఉగ్రతపోధనుండు । ఉగ్ర-తీవ్రమైన । తపః-తపస్సు । ధనుండు-సొమ్ముగాఁగలిగినట్టియు । నానావిధ జీవహేతుజననస్థితి । నానావిధ-అనేకవిధములైన । జీవ-ప్రాణులయొక్క । జనన-పుట్టుకకు । స్థితి-ఆధారమైనట్టియు । కశ్యపమౌని-కశ్యపప్రజాపతి । తాన్-తాను । ఒప్పెన్-ప్రకాశించెను ॥

తా॥ కశ్యపప్రజాపతి సమస్తలోక నిర్మాణకారియును సమస్తజంతుజీవనాధారుఁడును పావిత్ర్యాదిగుణశీలుఁడై దీపించెను॥ ౫౧

ఉ॥ ఆమునివంశమౌళిమణియై తగ రెండవవిశ్వకర్మనా । నామునిచం
ద్రుఁ డొప్పెను సమస్తజగత్పరిరక్షణార్థమై । శ్రీమహనీయమూర్తియన రేలుబగ
ల్లు నెఱుంగ కెంతయుం । బ్రేమను గాంచు విశ్వము గభీరతతోఁ డనారతంబునన్ ॥

టీ॥ ఆమునివంశమౌళిమణియై । ఆముని - ఆకశ్యపప్రజాపతియొక్క । వంశ-అన్వయమునకు । మౌళిమణియై-శిరోరత్నమై । తగన్-ఒప్పునట్లుగ । రెండవవిశ్వకర్మనాన్-రెండవవిశ్వకర్మ యనునట్లు । ఆమునిచంద్రుఁడు । ఆముని-ఆమునులలో । చంద్రుఁడు-ప్రకాశకుఁడైనమనువు । ఒప్పెను-ప్రకాశించెను । సమస్తజగత్పరిరక్షణార్థమై । సమస్త-సర్వమైన । జగత్-లోకములయొక్క । పరిరక్షణార్థమై-రక్షించుటకొఱకై । శ్రీమహనీయమూర్తియన । శ్రీ-శోభచేత ! మహనీయ-శ్రేష్ఠమైన । మూర్తియన-శరీరముగలవాఁడన । రేలుబగళ్లు-రాత్రింబగళ్లను । ఎఱుంగకన్-తెలియకను । ఎంతయున్-మిక్కిలి । ప్రేమను-దయచేత । అనారతంబును-ఎల్లప్పుడును । గభీరతతోడన్-గాంభీర్యముచేత । విశ్వము-ప్రపంచమును । కాంచు-చూచును ॥

తా॥ ఆకశ్యపప్రజాపతి రెండవ విశ్వకర్మవలె లోకరక్షణార్థమై రాత్రిబగళ్లనక యెప్పుడును లోకములను కాచుచుండును ॥ ౫౨

కుమారస్వామి తిరిగి ప్రశ్నచేయుట, శివుండది చెప్పుడు.

క॥ పురహరవినవలయు జగ । ద్గురుఁడనదగు విశ్వకర్మకొడుకులువారే ।
తరుణుల పరిణయమైరా । తెరఁ గెఱిగింపుమన దేవదేవుఁడు బలికెన్ ॥

టీ॥ పురహర-ఓసాంబశివుఁడా । జగద్గురుఁడనదగు । జగత్-లోకములకు । గురుఁడనదగు-గురువనిచెప్పదగిన । విశ్వకర్మకొడుకులు-విశ్వకర్మయొక్కపుత్రులు । తారు-వారు । ఏతరుణులన్-ఏ స్త్రీలను । పరిణయమైరో-వివాహమైరో । ఆతెరగు-ఆమార్గమును । వినవలయున్-ఆకర్ణించవలయును । ఎఱిగింపుము-తెలియజేయుము । అనన్-అనగా । దేవదేవుఁడు-సాంబమూర్తి । పల్కెన్-చెప్పెను॥

తా॥ జగద్గురువైన విశ్వకర్మయొక్క పుత్రులు యెవరిని వివాహము చేసికొనిరో ఆసంగతి దయచేసి చెప్పుమనగ శివుఁడు చెప్పనారంభించెను ॥ ౫౩

సీ॥ ఆంగీరపుత్రి కురంగాక్షి కాంచనా, హ్వాయసతి మ్మనువు వివాహమ
య్యె । సౌమ్యనాదగు పరాశరమునితనయను, మయుఁడు వేడుకబరిణయము
గాంచె । త్రిజయంతియనుసతీ తిలకంబు త్రిజయంతి, త్వష్టశాస్త్రిమున వివా
హమయ్యె । జైమినీఋషితనూజను చంద్రికాఖ్యను, రమణతక్షుఁడు వివాహ
మును జెందె ! ఇంపుతో భృగువనుసంయమీశ్వరుసుత । నంగనామణి కారు

ణ్యయనెడుదాని । శిల్పిలోకైకవిఖ్యాత శిల్పిమిగుల । బ్రేమదలిర్పఁ గ్రమ
మున బెల్లియాడె ॥

టీ॥ మనువు-మనుబ్రహ్మ । ఆంగీరపుత్రి । ఆంగీర-ఆంగీరసఋషికి । పుత్రి-కుమార్తెయైనట్టియు। కురంగాక్షి । కురంగ-లేడియొక్క । అక్షి-కన్నులవంటి కన్నులుగలట్టియు । కాంచనాహ్వయసతిన్ । కాంచనాహ్వయ-కాంచనయనుపేరుగల్గిన । సతిన్-స్త్రీని । వివాహమయ్యెన్-పెండిలిజేసికొనెను । మయుడు-మయబ్రహ్మ । సౌమ్యనాదగు-సౌమ్య అనుపేరుచేత తగిన । పరాశరమునితనయను । పరాశరముని-పరాశరమునీశ్వరునియొక్క । తనయను-కూతురిని । వేడుకన్-సంతోషముచేత । పరిణయముగాంచెన్-వివాహముజేసికొనెను । త్వష్ట-త్వష్టబ్రహ్మ । త్రిజయంతియను-త్రిజయంతియనునామముగల । సతీతిలకంబు । సతీ-స్త్రీలలో । తిలకంబు-బొట్టైన । త్రిజయంతి-త్రిజయంతిని । శాస్త్రమునన్-గార్హ్యసూత్రప్రకారముచే । వివాహమయ్యెన్-పాణిగ్రహణముచేసికొనెను । తక్షుండు-విశ్వజ్ఞబ్రహ్మ । చంద్రాఖ్యను-చంద్రయనుపేరుగల । జైమినిఋషితనూజను । జైమినిఋషి-జైమినిఋషీశ్వరునియొక్క । తనూజను-కుమారికను । రమణన్-ప్రేమచేత । వివాహమునుజెందెన్-ఉద్వాహమాయెను । లోకైకవిఖ్యాతశిల్పి । లోక-భువనములయందు । ఏక-ముఖ్యమగునట్లుగ । విఖ్యాత-ప్రసిద్ధములైన । శిల్పి-చిత్రమైనపనులుగల । శిల్పి-శిల్పిబ్రహ్మ । ఇంపుతోన్-సొంపుతో । భృగువను-భృగువనుపేరుగల । సంయమీశ్వరు-మునిశ్రేష్ఠునియొక్క । సుతను-కొమార్తెయైనట్టియు । కారుణ్యయనెడుదానిన్-కారుణ్యయనుకాంతను । ప్రేమతలిర్పఁ । ప్రేమ-ప్రీతి । తలిర్ప-ప్రకాశించగ । క్రమమునన్-శాస్త్రరీతిచే । పెండ్లియాడెన్-పరిణయమాయెను॥

తా॥ విశ్వకర్మయొక్క మన్వాదులగు నైదుగురు తనయులును కాంచనాహ్వయ మొదలగు నైదురగు ఆంగీరసాది ఋషిపుత్రికలను యథాక్రమముగ బెండ్లియాడిరి ॥ ౫౪

క॥ వీరికి వైదికధర్మా । చారమువిహితంబుసుమ్మీ పాణ్మాతురయి । ద్ధారు
ణివదనీయాన్వయ । పారంపర్యంబు చాలప్రబలెడునింకన్ ॥

టీ॥ వీరికిన్-ఈమన్వాదులకు । వైదికధర్మాచారము । వైదిక-వేదసంబంధములైన । ధర్మ-ధర్మములుగల । ఆచారంబు-నడువడి । విహితంబుసుమ్మీ-యుక్తముసుమీ । పాణ్మాతుర-ఓకుమారా । ఇద్ధారుణిన్-ఈభూమియందు । వరణీయాన్వయ పారంపర్యంబు । వరణీయ-కోరతగిన । అన్వయ-వంశముయొక్క । పారంపర్యంబు-పరంపర । ఇంకన్-ఇంకను । చాల-మిక్కిలిగ । ప్రబలెడు-వృద్ధిపొందును ॥

తా॥ వీరలకు వేదోక్తకర్మలు నియతములు వీరివంశాను క్రమణిక అక్కడక్కడికి విస్తరించెను॥ ౫౫

క॥ మునుసృష్టిపరంపరమై । దనరెదదన్వయము పంచతత్వంబులు నె।
న్ననగు వానిభేదము । లనుబ్రహ్మాండముల నిర్ణయము వినుపింతున్॥

టీ॥ తదన్వయము । తత్-వారలయొక్క । అన్వయము-వంశము । మును-మునుపు । సృష్టిపరంపరమై । సృష్టి-సృష్టియందు । పరంపరమై-చాలై । తనరెన్-ఒప్పెను । పంచతత్వంబులును-సాదాఖ్యపంచతత్వములును । ఎన్ననగు-ఎన్నికచేయతగును । వానిభేదములు-ఆతత్వవిభాగములను । అనువుగన్-ఒప్పుగ । బ్రహ్మాండముల నిర్ణయము । బ్రహ్మాండముల-బ్రహ్మాండకటాహములయొక్క । నిర్ణయము-పరిమాణమును । వినుపింతున్-తెలియచేయుదును ॥

తా॥ వారలవంశము సృష్టితోపాటు విస్తరించెను. ఇకను పంచతత్వములను వానిభేదములను బ్రహ్మాండముల పరిమాణమును తెలియచెప్పెదను ॥ ౫౬

క॥ ఆధేయము శక్త్యాకృతి। ఆధారంబా సదాశివాకృతియుభయ । ప్రా
ధాన్యముగ ప్రపంచము । బోధఘనుడు విశ్వకర్మ పుట్టించెసుమీ ॥

టీ॥ బోధఘనుడు । బోధ-జ్ఞానముచేత । ఘనుడు-గొప్పవాడగు । విశ్వకర్మ-విశ్వకర్మయు । శక్త్యాకృతి । శక్తి-ప్రకృతియొక్క । ఆకృతి-ఆకారమైన । ఆధేయము-నివసించుటకు యోగ్యమైనలోకమును । సదాశివాకృతి । సదాశివ-సదాశివునియొక్క । ఆకృతి-ఆకారమైన । ఆధారంబు-ప్రపంచాధరమును । ఉభయప్రాధాన్యముగ । ఉభయ - ఆధారాధేయములకు । ప్రాధాన్యముగఁ-ముఖ్యముగ । ప్రపంచము-లోకమును । పుట్టించెసుమీ-చేసెనుసుమీ॥

తా॥ విశ్వకర్మ సదాశివుడును ప్రకృతియు ఆధారాధేయములై యొప్పునట్లుగ యీలోకమును సృజించెను॥ ౫౬

చ॥ సతతము జీవరాసులకు జన్మవిశేషనివాసమౌ జగ । త్త్రితయము
బ్రహ్మ విష్ణుముఖ దేవతలున్ వరమంత్రవర్గముం । జతురతబుట్టినట్టి శివశక్తి సు
ఖాస్పదలీలనిండుని । త్యతనుడు రాజరూపము సదాశివుడై విలసిల్లె నెంతయుఁ॥

టీ॥ సతతము - ఎల్లప్పుడును । జీవరాసులకుఁ-జీవసమూహములకు । జన్మవిశేషనివాసమౌ । జన్మవిశేష-జననభేదములకు । నివాసమౌ-స్థానమైన । జగత్త్రితయము । జగత్ -లోకములయొక్క । త్రితయము-మూటిని । బ్రహ్మవిష్ణుముఖదేవతలఁ । బ్రహ్మ-చతుర్ముఖుడు । విష్ణు-విష్ణుమూర్తియు । ముఖ-మొదలగు । దేవతలఁ-దేవతలను । వరమంత్రవర్గముఁ । వర-శ్రేష్ఠములైన । మంత్ర-పంచాక్షర్యాదిమంత్రములయొక్క । వర్గముఁ-సమూహమును । చతురతఁ-చాతుర్యమువల్ల । పుట్టెను-కలిగెను। అట్టిశివశక్తిసుఖాస్పదలీలఁ । అట్టి-అటువంటి । శివశక్తి-శివప్రకృతులకు । సుఖాస్పద-సుఖస్థానమైన । లీలఁ-విలాసముచే । నిండు-పూర్ణమైన । నిత్యతనుడు । నిత్య-స్థిరమైన । తనుడు-శరీరముగల విశ్వకర్మ । రాజరూపమునఁ-ప్రభుస్వరూపముచేత । సదాశివుడై-సదాశివస్వరూపుడై । ఎంతయుఁ-మిక్కిలి । విలసిల్లెఁ-ప్రకాశించెను॥

తా॥ విశ్వకర్మ సృష్టిస్థితిసంహారకారిణియైన మాయాశక్తితో కూడినవాడై ప్రకాశించెను॥ ౫౭

గీ॥ హరిహరబ్రహ్మలంతయథార్థకలన । తమతమ నియోగమహిమలు
తప్పకుండ । రాజ్యమొనరింపగా జీవరాసులెల్ల । శాంభవానాది మాయా
వశంబులయ్యె॥

టీ॥ హరిహర । హరి-విష్ణుమూర్తి । హర - సాంబవమూర్తియు । బ్రహ్మలు - చతుర్ముఖుడును । అంత-యావత్తు । యథార్థకలనఁ-నిజస్థితిచేత । తమతమనియోగమహిమలు । తమతమ - వారివారియొక్క । నియోగమహిమలు-ఆజ్ఞాతిశయములు । తప్పకుండఁ-తొలగకుండను । రాజ్యము - లోకాధిపత్యమును । ఒనరింపగాఁ-చేయగా । జీవరాసులెల్లఁ-జీవకోట్లన్నియు । శాంభవానాదిమాయావశంబులు । శాంభవ-శివసంబంధమైన । అనాది-అద్యంతశూన్యమైన । మాయ-చిచ్ఛక్తికి । వశంబులు -స్వాధీనములైనవి । అయ్యెఁ-ఆయెను॥

తా॥ త్రిమూర్తులు తమతమ ఆజ్ఞలు నెరవేర్చుచు లోకపాలనము జేయుచుండగా జీవరాసులన్నియు మాయకు లోబడియుండెను॥ ౫౮

## విశ్వనిర్ణయంబు.

చ॥ శివుడువసించె విశ్వమున జేకొనివిశ్వముగానుపించుద । చ్ఛివుని
మహోదరాంతరము జెన్నగువిశ్వమునాశివుండనా । వివిధమునామబీజ

మున వృక్షమువృక్షమునందుబీజముం । గవయగురీతివిశ్వము ప్రకాశమునొం
దెమహేశసంగతిన్॥

టీ॥ శివుడు-సాంబమూర్తి । విశ్వమునన్-ప్రపంచమందు । వసించెన్-ఉండెను । చేకొని-గ్రహించి । విశ్వము-ప్రపంచము । కానఁబించున్-కనుపించును । తచ్ఛివునిమహోదరాంతరము । తత్-ఆప్రసిద్ధమైన । శివుని-సాంబమూర్తియొక్క । మహోదరాంతరము । మహా-గొప్పదియగు । ఉదరాంతరము-కుక్షిమధ్యము । విశ్వమన-ప్రపంచమనగను । శివుండన-శివుడనగను । చెన్నగు-ఒప్పును । వివిధము-నానావిధమైన । నామబీజమునన్ । నామ-పేళ్లుగల । బీజమునన్-విత్తనముచేత । వృక్షము-చెట్టును । వృక్షమునందు-చెట్టుయందు । బీజమున్-విత్తనమును । కవయగురీతిన్-జోడగులాగున । మహేశసంగతిన్ । మహేశ-మహాదేవునియొక్క । సంగతిన్-సంబంధముచేత । విశ్వము-ప్రపంచము । ప్రకాశమునొందెన్-ప్రకాశించెను॥

తా॥ విత్తనమందు చెట్టును చెట్టుయందు విత్తనముండులాగున విశ్వకర్మయందు జగత్తును జగత్తుయందు విశ్వకర్మయు ప్రకాశించెను॥ ౬౦

సీ॥ అట్టిజాగ్రత్స్ఫూర్తి యందుత్రైగుణ్యవి, స్ఫూర్తిచేతను పంచమూ
ర్తులొదవె । వానికిదొలుతపావనతరంబైనట్టి, ప్రణవాక్షరముసముద్భవము
గాంచె । తదనంతరముననుద్యల్లీలతోపంచ, సాదాఖ్యతత్త్వముల్ సంభవించె।
నుదయించిమించెసద్యోజాతముఖ్యపం, చబ్రహ్మరుద్రరాజములుమున్న । పర
గనిదిపంచవదనుగర్భములనంగ । నాదిసాదాఖ్యమహిమ రెండవదిమనుమ ।
హేశ్వరోత్పత్తిమూడవదింకవినుము । పుత్రతద్భేదమహిమయద్భుతముగాగ॥

టీ॥ అట్టిజాగ్రత్స్ఫూర్తియందు । అట్టి-అటువంటి । జాగ్రత్స్ఫూర్తియందు-జాగ్రదవస్థయందు । త్రైగుణ్యవిస్ఫూర్తిచే । త్రైగుణ్య-త్రిగుణాత్మకమైన మాయయొక్క । విస్ఫూర్తిచే-తళుకుచేత । పంచమూర్తులు-పంచబ్రహ్మస్వరూపులు । ఒదవెన్-పుట్టెను । వానికితొలుతన్-ఆమూర్తులకుముందు । పావనతరంబైనట్టి-మిక్కిలిపవిత్రమైన । ప్రణవాక్షరము-ఓంకారము । సముద్భవముగాంచెన్-పుట్టెను । తదనంతరమునన్-తర్వాతను । ఉద్యల్లీలతోన్ । ఉద్యత్-ఉదయించుచున్న । లీలతోన్-విలాసముతో । పంచసాదాఖ్యతత్త్వముల్ । పంచ-అయిదగు । సాదాఖ్యతత్త్వముల్-సాదములనెడు తత్త్వములు । సంభవించెన్-పుట్టెను । సద్యోజాతముఖ్యపంచబ్రహ్మరుద్రరాజములుమున్న । సద్యోజాత-సద్యోజాతము । ముఖ్య-మొదలగు ఆననములును । పంచబ్రహ్మ-అయిదుగురుబ్రహ్మలును । రుద్రరాజములు-రుద్రశ్రేష్ఠములు । మున్న-మొదలైనవి । ఉదయించి-పుట్టి । మించెన్-అతిశయించెను । పరగన్-ఒప్పగ । ఇది-ఇది । పంచవదనుగర్భములనంగ । పంచవదను-శివునియొక్క । గర్భములనంగ-గర్భములనునటుల । పరగున్-ఒప్పును । ఆదిసాదాఖ్యమహిమ । ఆది-మొదటిదియైన । సాదాఖ్య-సాదమనుదానియొక్క । మహిమ-మహిమ । ఒప్పెన్-ప్రకాశించెను । రెండవది-రెండవది । మనుమహేశ్వరోత్పత్తి । మనుమహేశ్వర-మనుబ్రహ్మయొక్క । ఉత్పత్తి-పుట్టుక । మూడవది-మూడవమహిమ । ఇంకన్-ఇకను । పుత్ర-ఓకుమార । తద్భేదమహిమ । తత్-వానియొక్క । భేద-భేదములయొక్క । మహిమ-ప్రభావము । అద్భుతము-ఆశ్చర్యకరము । కాగన్-గనుక । వినుము-ఆకర్ణించుము॥

తా॥ సాదాఖ్య పంచతత్త్వములలో రెంటినిచెప్పితిని మూడవది వినుము॥ ౬౧

సీ॥ ప్రాగాననంబునస్ఫటికపురాచాయ, నొనరిమన్వాచార్యుడుద్భవిం
చె । యామ్యవక్త్రంబునహరినీలమణికాంతు, లలరమయుండుదయంబు

గాంచె । పశ్చిమాననమునపద్మరాగద్యుతి, విలసిల్లుత్వష్టయావిర్భవించె । ను
త్తరముఖమున పుత్తడివన్నెచే, గలిగెనుతక్షులోకప్రసిద్ధి । నూర్ధ్వమగు
మోమునందునవొనరరక్త । రుచిగలిగిశిల్పిజనియించెరూఢిమెరసి । గలిగిరీ
యేవురునువిశ్వకర్మవలన । విశ్వకర్మాగ్ర్యనందనుల్వినుతపుణ్య॥

టీ॥ ప్రాగాననంబునన్-తూర్పుమోమునందు । స్ఫటికపురాచాయన్ - స్వేతకాంతిచేత । ఒనరి-ఒప్పి । మన్వాచార్యుడు-మన్వాచారి । ఉద్భవించెన్-పుట్టెను । యామ్యవక్త్రంబునన్-దక్షిణపుముఖమునందు । హరినీలమణికాంతులు । హరినీలమణి-ఇంద్రనీలమణియొక్క । కాంతులు-దీప్తులు । అలరన్-ప్రకాశించునట్లు । మయుండు-మయాచార్యుడు । ఉదయంబుగాంచెన్ - కలిగెను । పశ్చిమాననమున్-పడమటివదనమువలన । పద్మరాగద్యుతివిలసిల్లన్ । పద్మరాగ-పద్మరాగమణియొక్క । ద్యుతి-వెలుగుచే । విలసిల్లు-ప్రకాశించుచున్న । త్వష్ట-త్వష్టబ్రహ్మ । ఆవిర్భవించెన్ - అవతరించెను । ఉత్తరముఖమునన్-ఉత్తరపుటపనమువలన । పుత్తడివన్నెచే-ఇత్తడిమెరుపుచేత । తక్ష-తక్షప్రజాపతి । లోకప్రసిద్ధిన్ । లోక-జగత్తుయందు । ప్రసిద్ధిన్-ప్రసిద్ధిచేత । కలిగెను-జన్మించెను । ఊర్ధ్వమగుమోమునన్ । ఊర్ధ్వమగు-మీదిదగు । మోమునన్-వక్త్రమువలన । ఒనరన్-ఒప్పునటుల । రక్తరుచిగలిగి-ఎరుపురంగుగలిగి । రూఢిమెరసి । రూఢి-స్థిరముగ । మెరసి - ప్రకాశించి । శిల్పి - శిల్పినాథుడు । జనియించెన్-పొడమెను । ఈయేవురును - ఈ యయిదుగురును । వినుతపుణ్య । వినుత - స్తుతించబడిన । పుణ్య-శుభములుగల ఓకుమార । విశ్వకర్మవలనన్-విశ్వకర్మవల్లను । విశ్వకర్మాగ్ర్యనందనుల్ । విశ్వ-సమస్తమైన । కర్మ-కర్మలచేత । అగ్ర్య-శ్రేష్ఠులైన । నందనుల్-తనయులు । కలిగిరి-ఆవిర్భవించిరి॥

తా॥ విశ్వకర్మయొక్క పంచముఖములవల్లను మన్వాదులైన యైదుగురు కొమాళ్లుకలిగిరి॥ ౬౨

క॥ జననియుజనకుడుననగా । ఘనుడగుపరశివుడువిశ్వకర్మయుసుమ్మీ ।
జనియించిరమరులతనికి । ఘనదీపమువలనదీపకళికలువోలెన్॥

టీ॥ జననియు-తల్లియును । జనకుడు-తండ్రియును । అనగాన్-అనునటుల । ఘనుడగు-గొప్పవాడైన । విశ్వకర్మయు-విశ్వకర్తే । పరశివుడుసుమ్మీ-పరశివుడేను । అతనికిన్-ఆశ్వకర్మకు । ఘనదీపమువలనన్-గొప్పదీపమువల్లను । దీపకళికలువోలెన్-దీపపుమొగ్గలవలె । అమరులు - దేవతులు । జనియించిరి-పుట్టిరి॥

తా॥ జరామరణములులేని సురలు విశ్వకర్మవలన దీపమువలన దీపములవలె పుట్టిరి. విశ్వకర్మయే తల్లియును తండ్రియును పరశివుడును॥ ౬౩

చ॥ ప్రణవమునంజనించెను నభంబునభంబునబుట్టెదత్సమీ । రణుడుస
మీరణంబున దిరంబుగబుట్టెనువహ్నివహ్నిను । ల్బణమయియొప్పుచుండెను
జలంబుజలంబుననుద్భవించెధా । రుణియిదిభూతపంచక నిరూఢభవక్రమ
మద్రిజాసుతా॥

టీ॥ నభంబు-ఆకాశము । ప్రణవమునన్-ఓంకారమువలన । జనించెను-పుట్టెను । నభంబునన్-ఆకాశమువలన । తత్సమీరణుండు-ఆవాయువు । పుట్టెన్-కలిగెను । సమీరణంబునన్-వాయువువలన । తిరంబుగన్-స్థిరముగ । వహ్ని-అగ్ని । పుట్టెను -కలిగెను । వహ్ని - అగ్నివలన । జలంబు-ఉదకము । ఉల్బణమై-అతిశయమై । ఒప్పుచుండెను-ప్రకాశించుచుండెను । జలంబునన్-నీరమువలన। ధారుణి-నేల । ఉద్భవించెన్-అంకురించెను । అద్రిజాసుత । అద్రిజ-పార్వతికి । సుత-కొడక । ఇది-

ఈ చెప్పబడ్డది । భూతపంచకనిరూఢభవక్రమము । భూతపంచక-పృధివ్యాది పంచభూతములయొక్క। నిరూఢ-దృఢమైన । సంభవ-పుటకయొక్క । క్రమము-వరుస॥

తా॥ పుడమి మొదలగు అయిదుభూతములు తలక్రిందుగ ఆకాశము ఓంకారమువలన పుట్టెను తర్వాత ఆకాశమువద్దనుంచి క్రమముగ కలిగెను॥ ౬౪

క॥ ఇల మొదలుపంచభూతం । బులకధిదేవతలవర్ణములనుతదంశం । బులగుణనిర్ణయలక్షణ । ములనీకెరుగింతువిను సముజ్జ్వలతేజా॥

టీ॥ సముజ్జ్వలతేజ । సముజ్జ్వల-బాగుగ ప్రకాశించుచున్న । తేజ-ప్రతాపముగలవాడ । ఇల మొదలు పంచభూతంబులకు । ఇల-పుడమి । మొదలగు-ప్రధానముగాగల । పంచభూతంబులకు-అయిదుభూతకములకు । అధిదేవతలన్-అధిపతులను । వర్ణములన్-రంగులను । తదంశంబులన్ । తత్-వానియొక్క । అంశంబులన్-భాగములను। గుణనిర్ణయలక్షణములన్ । గుణ-గుణములయొక్క । నిర్ణయ-ఏర్పాటుయొక్క । లక్షణంబులన్-చిన్నెలను । నీకెరిగింతు-నీకు చెప్పెదను । విను-ఆలింపుము॥

తా॥ ఈభూతములకు అధిదేవతలుమొదలైనవానిని చెప్పెదను॥ ౬౫

క॥ ఆరయనధిదైవతములు । ధారుణికజుడంబువులకు దైవముహరియా । వారిజకాంతుడుదివికిన్ । మారుతమిత్రునకు నేరమణుడగుమార॥

టీ॥ కుమార-ఓచిన్నవాడా । ఆరయన్-విచారించగా । అధిదైవతములు-అధిదేవతలు । ధారుణికి-పుడమికి । అజుడు-బ్రహ్మ । అంబువులకు-జలములకు । హరియు-విష్ణువు । దైవము-దేవుడు । దివికిన్-ఆకసమునకు । అంబుజమిత్రుడు-సూర్యుడు । మారుతమిత్రునకున్-అగ్నికిని । ఏను-నేను । రమణుడన్-ప్రభువను॥

తా॥ పంచభూతములకు బ్రహ్మమొదలగు వారలధిదైవతములు॥ ౬౬

గీ॥ పుడమిపచ్చనికాంతియంబువులుదెలుపు । కీలియెర్రననీలంబుగాలిద లప । నంబరముధూమవర్ణమైయతిశయిల్లు । వరుసనెరిగించితినివానివర్ణమహిమ॥

టీ॥ పుడమి-భూమి । పచ్చనికాంతి-పచ్చనికాంతిగలది । అంబువులు-జలములు । తెలుపు-తెల్లనివి । కీలి-అగ్ని । ఎర్రన-ఎర్రనిది । గాలి-వాయువు । తలపన్-విచారించగ । నీలంబు-నల్లనిది । అంబరము-ఆకసము । ధూమవర్ణమై-పొగవన్నెగలదియై । అతిశయిల్లున్-మించును । వానివర్ణమహిమ । వాని-ఆభూతములయొక్క । వర్ణమహిమ-కాంతివైభవమును । వరుసన్-క్రమముగను । ఎరిగించితిన్-తెలియచెప్పితిని॥

తా॥ ఈపంచభూతములు క్రమముగ నెరింగించితిని॥ ౬౭

క॥ పుట్టించుబ్రహ్మయైచే । పట్టునుహరియగుచుజీవపఙ్క్తులకెల్లన్ । గిట్టించురుద్రుడనగా । గట్టిగముపురవుచువిశ్వకర్మమహాత్మా॥

టీ॥ మహాత్మా-ఓమహానుభావుడా । విశ్వకర్మ-విశ్వర్మ । ముపురవుచు-త్రిమూర్తిస్వరూపకుడై । బ్రహ్మయై-చతుర్ముఖుడై । పుట్టించున్-సృజించును । హరియగుచు-విష్ణువై । చేపట్టున్-పాలించును । రుద్రుడనగా-శివుడనగను । గట్టిగన్-దృఢముగను । గిట్టించును-సంహరించును॥

తా॥ విశ్వకర్మ త్రిమూర్త్యాత్మకుడై సృష్ట్యాదులను చేయును॥ ౬౮

గీ॥ ధరణిచక్రమెల్ల ధరియించిహరికూర్మ । రాజునందు నిలుపరమ్యలీల ।
సర్వరాజుభరముచాలించియేవేళ । నఖిలభోగలీలనందజేయు॥

టీ॥ హరి-విష్ణువు । ధరణిచక్రమెల్లన్-భూమండలమంతను । ధరియించి - మోచి । కూర్మరాజునందు-ఆదికూర్మమందు । నిలుపన్-ఉంచగా । రమ్యలీలన్-సుందరలీలచే । సర్వరాజు - ఆదిశేషుడు। ఏవేళన్-ఏకాలమందు । భరము-బరువును । చాలించు-వదిలించునోపుడు । అఖిలభోగలీలన్ । అఖిల-సమస్తమైన । భోగలీలన్-వైభవవిలాసమును । అందజేయన్-పొందచేయును॥

తా॥ విష్ణువు యెప్పుడు భూభారమును ఆదికూర్మమునందు నిలుపునో అప్పుడు శేషుడుసుఖించును॥

సీ॥ భుజగేంద్రునకుభారమువదల్చి యొకకొంత, భరముదిక్కరికూర్మఫణులయందు । నునిచిమహానందమునజెన్నుమీరుచు, నఖిలంబునకుదానయగుచుమరియు । మజ్జనవస్త్రాదిమహితాష్టభోగముల్, జపతర్పణాదిలక్షణములమరు । బ్రహ్మకర్మవిధంబుపరగంగసర్వక, ర్మసుదీక్షితంబాగమప్రధాన । శాస్త్రపరిచర్యవిజ్ఞానసరణిమొదలు । కలితభోగప్రభోగమార్గములజెంది । సర్వలక్షణసంపూర్ణశక్తిగలిగి । శాశ్వతసుఖంబుజెందెనవిశ్వకర్మ ॥

టీ॥ భుజగేంద్రునకున్-ఆదిశేషువునకు । భారమువదల్చి - బరువుదింపి । ఒకకొంతభరము-ఒక్కింతబరువును । దిక్కరికూర్మఫణులయందు । దిక్కరి-దిగ్గజములయందును । కూర్మ-ఆదికూర్మమందును । ఫణులయందు-ఆదిశేషువందును । ఉనిచి-ఉంచి । మహానందమునన్-గొప్పసంతోషముచేత । జెన్నుమీరుచున్-సొగసుచేఅతిశయించుచును । అఖిలంబునకున్-అంతకును । తానయగుచు - తానొక్కడేయగుచు । మరియున్ - మరిన్ని । మజ్జనవస్త్రాదిమహితాష్టభోగముల్ । మజ్జన - స్నానము । వస్త్ర-వస్త్రములు । ఆది-మొదలగు । అష్టభోగముల్-అష్టభోగములను । జపతర్పణాదిలక్షణములన్ । జప-ధ్యానము । తర్పణ-పితృతాదితర్పణము । ఆది-మొదలుగాగల । లక్షణములన్-చిహ్నచేతను । అలరు-ఒప్పుచున్న । బ్రహ్మకర్మవిధంబు । బ్రహ్మకర్మ - బ్రాహ్మణకర్మయొక్క । విధంబు - రీతి । పరగంగ-ప్రవర్తించుచుండగ । సర్వకర్మసుదీక్షితంబు । సర్వ-సమస్తమైన । కర్మ - కర్మలయందు । సుదీక్షితంబు-మంచిదీక్షయును । ఆగమప్రధానశాస్త్రపరిచర్య । ఆగమ-శైవాద్యాగమములు । ప్రధాన - మొదలగు । శాస్త్ర-శిక్షాస్మృతిసంబంధమైన । పరిచర్య-శుశ్రూషయు । విజ్ఞానసరణి-జ్ఞానమార్గమును । మొదలు- మొదలుగాగల । కలితభోగప్రభోగమార్గములన్ । కలిత-ఒప్పుచున్న । భోగ - భోగములయొక్కయు । ప్రభోగ-అతిశయభోగములయొక్కయు । మార్గములన్-త్రోవలను । చెంది-పొంది । సర్వలక్షణసంపూర్ణశక్తికలిగి । సర్వ-సమస్తమైన । లక్షణ-శుభలక్షణములచేత । సంపూర్ణ - నిండిన । శక్తికలిగి-సమర్థతకలిగి । అవ్విశ్వకర్మ-ఆవిశ్వకర్మ । శాశ్వతసుఖంబు । శాశ్వత-స్థిరమైన । సుఖంబు-సౌఖ్యమును । చెందెన్-పొందెను॥

తా॥ ఆవిశ్వకర్మ భూభారమును ఆదిశేషాదులయందునిచి నిర్భరుడై సంపూర్ణ శక్తికలిగి శాశ్వతసుఖముగనుండెను॥

గీ॥ స్వర్గమర్త్యరసాతలస్థలములందు । సంచరించుచువర్తిల్లుజగతియంద ు। శంఖచక్రంబులాదిగాసరవితాల్చి । నిట్టిశివలీలచేనతడింపుజెంది॥

టీ॥ అతడు-ఆవిశ్వకర్మ । స్వర్గమర్త్యరసాతలస్థలములందున్ । స్వర్గ - స్వర్గలోకమందును । మర్త్య-మనుష్యలోకమందును । రసాతలస్థలములందున్-పాతాళలోకమందును । సంచరించుచు-తిరుగుచును । జగతియందు-భూమియందు । వర్తిల్లుచు-ప్రవర్తించుచు । శంఖచక్రాదులు । శంఖ-శంఖము । చక్ర-చక్రము । ఆదులు-మొదలుగాగలపంచాయుధములను । సరవిన్-క్రమముగ । తాల్చి-ధరించి । ఇట్టిశివలీలచేన్ । ఇట్టి-ఇటువంటి । శివలీలచేన్-శుభవిలాసముచేత । ఇంపున్-సొంపును । చెంది - పొంది॥

తా॥ విశ్వకర్మ శంఖచక్రాద్యాయుధములను ధరించి సుఖలీలచేత మూడులోకములయందు సంచరించుచుండెను॥ ౭౧

వ॥ మఱియు సదానందస్వరూపకుండైన విశ్వకర్మ త్రిలోకధర్మమార్గంబులునిర్మించి, యాదికర్మంబైన భూమిసంస్థాపించి, మూలాగ్రమధ్యత్రిస్థానంబులు తానెయొనర్చి, సకలలోకంబులలోపల నిజతేజంబు ప్రకాశింపజేసి, జగంబులునిర్మించె, మఱియును తద్భేదంబులు వివరించెద, సింధువు యిరువైకోట్లలోతును, కోటియోజనములు విస్తారంబును, మరియు నేకాదశకోటి యోజనపరిమాణంబును, ఇరువైనాలుగుకోట్ల యోజనంబులపొడవునై, యివ్విధంబున బ్రవర్తించు. మఱియును జలమధ్యంబుననున్న భూమికాధారంబు వివరించెద, భూమిని శేషుండు ధరియించు, శేషరాజును కూర్మంబుధరియించు । కూర్మరాజు శేషభూముల నాధారశక్తిధరియించు । నిన్నిటింగూడ తిమిశిరంబునందాల్చు, వీనినన్నిటింగూడ తిమింగిలంబు పుచ్ఛంబున ధరియించు, మఱియు నైరావత పుండరీక వామన కుముదాంజనపుష్పదంత సార్వభౌమ సుప్రతీకాఖ్యదిగ్గజంబు లష్టదిక్కులుధరియించి, యనంతతక్షక వాసుకి శంఖపాల పద్మకర్కోటక మహాశేష భుజంగంబులు దిక్కులుధరియించి, దిక్కరులాహారంబుగొనువేళ యురగంబులీభూమిధరియించు, భుజంగంబులు భోజనంబుగొను సమయంబున విశ్వకర్మసంస్మరించి, తద్భారంబునందలంకక సౌఖ్యంబునందు తృప్తివహింతురు, మనీషిసుండగు విశ్వకర్మ చరణపీఠంబున మూలంబును దేహంబున మధ్యంబును బ్రహ్మకంటె దశాంగుళ పరిమాణంబున శిరంబున జెన్నుమీరిన బ్రహ్మాండంబతనిదేహంబై ప్రవర్తిల్లు నింక నడిమిలోకంబుల నిర్ణయంబు వివరించెద॥

టీ॥ మఱియు-ఇంకను । సదానందస్వరూపకుండైన । సదా-ఎల్లప్పుడు । ఆనందస్వరూపకుండైన - ఆనందవిగ్రహుడైన । విశ్వకర్మ - విశ్వకర్మ । త్రిలోకధర్మమార్గంబులు । త్రి-మూడగు । లోక-

ప్రపంచములయందు । ధర్మమార్గంబులు-ధర్మపద్ధతులను । నిర్మించి-చేసి । ఆదికర్మంబైన-మొదటిపని యైన । భూమిని-పుడమిని । సంస్థాపించి-నిలిపి । మూలాగ్రమధ్యత్రిస్థానంబులు । మూల-మొదలు । అగ్ర-చివర । మధ్య-మధ్యములను । త్రిస్థానంబులు-మూడుస్థలములు । తానె-తనంతటతాను । సకల లోకంబులలోపలన్ । సకల-అన్ని । లోకంబులలోపలన్-భువనములయందు । నిజతేజంబు । నిజ-స్వకీయమైన । తేజంబు-తేజస్సును । ప్రకాశింపజేసి-తేజరిల్లజేసి । జగంబులు-లోకములను । నిర్మించెన్-చేసెను । మఱియు-ఇంకను । తద్భేదంబులు । తత్-ఆలోకములయొక్క । భేదంబులు-భేదములను । వివరించెద-స్పష్టీకరించెదను । సింధువు-సముద్రము । ఇరువదికోట్లలోతును-ఇరువదికోట్లయోజనముల అగాధముకలదియు । కోటియోజనముల విస్తారమును । కోటియోజనముల-కోటియామడల । విస్తారంబును-వెడల్పును । మఱియును-ఇంకను । ఏకాదశకోటియోజన పరిమాణంబును । ఏకాదశకోటి-పదకొండుకోట్ల । యోజన । ఆమడలయొక్క । పరిమాణంబును-ప్రమాణమున్ను । ఇరువదినాల్గుకోట్లయోజనంబులపొడవున్నై-ఇరువదినాలుగుకోట్లయోజనములు పొడుగుగలదియై । ఇవ్విధంబునన్-ఈలాగున । ప్రవర్తించుచున్-ఉండును।మఱియును-ఇంకను।జలమధ్యంబుననున్న భూమికి । జలమధ్యంబుననున్న-నీళ్లనడుమనున్న । భూమికి-పుడమికి । ఆధారంబు-ఆధరవున్ను । వివరించెద-ప్రకటించెదను । భూమిని-పుడమిని । శేషుండు-ఆదిశేషువు । ధరించున్-మోయును । శేషరాజును-ఆదిశేషువును । కూర్మంబు-ఆదికూర్మము । ధరియించున్-మోచును । కూర్మరాజశేషభూములన్ । కూర్మరాజ-ఆదికూర్మమును । శేష-శేషువును । భూములన్-మేదినిని । ఆధారశక్తి-ఆధారశక్తియు । ధరియించున్-తాల్చును । ఇన్నిటిన్-వీనినన్నిటిని । కూడ-కూడా । తిమి-తిమియనుచేప । శిరంబునన్-తలయందు । తాల్చు-మోయును । వీనినన్నిటినింగూడ-ఈకూర్మాదులన్నిటిని । తిమింగిలంబు - తిమింగిలమనుచేప । పుచ్ఛంబునన్-తోకచేత । ధరియించున్-వహించును । మఱియును-ఇంకను । అయిరావతపుండరీకవామనకుముదాంజన పుష్పదంతసార్వభౌమసుప్రతీకాఖ్యదిగ్గజంబులు । అయిరావత-అయిరావతము। పుండరీక-పుండరీకము । వామన-వామనము । కుముద-కుముదము । అంజన-అంజనము । పుష్పదంత-పుష్పదంతము । సార్వభౌమ-సార్వభౌమము । సుప్రతీక-సుప్రతీకమనెడు । ఆఖ్య-పేరుగల । దిగ్గజంబులు-దిక్కరులు । అష్టదిక్కులు-ఎనిమిదిదెసలను। ధరియించి-భరించి । అనంతతక్షకవాసుకిశంఖపాలపద్మకర్కోటక మహాశేషభుజంగంబులు । అనంత-అనంతుడు। తక్షక-తక్షకుడు। వాసుకి-వాసుకియు। శంఖపాల-శంఖపాలుడు । పద్మ-పద్ముడు । కర్కోటక-కర్కోటకుడు । మహాశేష-మహాశేషుడనెడు। భుజంగంబులు-సర్పములు । దిక్కులు-మూలలను । ధరించి-తాల్చి । దిక్కరులు-దిగ్గజములు । ఆహారంబుగొనువేళన్-భుజించుకాలమందు । ఉరగంబులు-పాపలు । ఈ భూమిన్ - ఈనేలను । ధరియించున్-మోచును । భుజంగంబులు-చక్షుశ్శ్రవములు । (సర్పములు) భోజనంబుగొను సమయంబునన్-తిండివేళయందు । విశ్వకర్మను-విశ్వకర్మను । సంస్మరించి-తలంచి । తద్భారంబునన్ । తత్-ఆభూమియొక్క । భారంబునన్-బరువుచేత । తలంకక-భయపడక । సౌఖ్యంబును-సుఖమును । అంది-పొంది। తృప్తివహింతురు-తుష్టిపొందుదురు । మన్వీశుండగు-మన్వీశుండైన । విశ్వకర్మచరణపీఠంబునన్ । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । చరణపీఠంబునన్ - పాదపీఠమందు । మూలంబును - మొదలును । దేహంబునన్-శరీరమందు । మధ్యంబును-నడుమును । బ్రహ్మకంటెన్ - బ్రహ్మకన్నను । దశాంగుళపరిమాణంబునన్ । దశ-పదియగు । అంగుళ - వ్రేళ్లయొక్క । పరిమాణంబునన్-కొలతచేత । శిరంబునన్-తలచేత । చెన్నుమీరిన-సొగసుచేతమించిన । బ్రహ్మాండంబు-బ్రహ్మాండము । అతనిదేహంబై । అతని-ఆవిశ్వకర్మయొక్క । దేహంబై-శరీరమై । ప్రవర్తిల్లును-జరుగును । ఇంకన్-ఇకమీదట । నడిమిలోకంబులనిర్ణయంబు । నడిమిలోకంబుల-మధ్యలోకంబులయొక్క । నిర్ణయంబు-ఏర్పాటును । వివరించెదన్-స్పష్టీకరించెదను॥

తా॥ విశ్వకర్మ పదునాలుగుజగంబులలో కొన్ని నిలుచునట్లు ఒనరించినరీతిని జెప్పి మధ్యమలోకముల నిలకడను జెప్పెదను॥ ౭౨

చ॥ అతలముని ల్చెనంఘ్రుల తదగ్రమునంవితలంబుజంఘలన్ । సుతలము జానుదేశముల శోభిలుచుండు తలాతలంబునూ । రుతలములన్ మహాతలము రూఢిగగుహ్యపదమ్మునందు సుస్థిరముర । సాతలంబుకటి శేషజగంబులు విశ్వకర్మకున్॥

టీ॥ విశ్వకర్మకున్-విశ్వకర్మకు । అంఘ్రులన్-పాదములయందు । అతలము - అతలలోకము । నిల్చెన్-ఉండెను । తదగ్రమునన్ । తత్-ఆపాదములయొక్క । అగ్రమునన్-కొనయందు । వితలంబు-వితలలోకము । జంఘలన్-పిక్కలయందు । సుతలము-సుతలలోకము । జానుదేశములన్-మోకాళ్లయందు । తలాతలంబు-తలాతలలోకము । శోభిలుచుండు-ప్రకాశించుచుండు। ఊరుతలములన్-తొడలయందు । మహాతలము-మహాతలలోకము । రూఢిగన్-రూఢిగను । గుహ్యపదమ్మునందు - గోప్యస్థానమునందు । సుస్థిరము-మిక్కిలినిలకడమైన । రసాతలంబు - రసాతలలోకమును । కటిన్ - మొలయందు । శేషజగంబులు । శేష-మిగిలిన । జగంబులు-లోకములును । శోభిలుచుండున్ - ప్రకాశించుచుండును॥

తా॥ విశ్వకర్మయొక్క పాదాదికటిపర్యంతము మిగిలిన లోకములుండెను॥ ౭౩

వ॥ మఱియు భూలోకంబునాభిని, భువర్లోకంబాత్మను, సువర్లోకంబు హృదయంబునం, మహర్లోకంబు కంఠంబునం, జనర్లోకంబు భుజయుగంబునం, తపోలోకంబు ఫాలంబునం, సత్యలోకంబు శిరంబునందాల్చి యొప్పుచుండు మఱియును మేరునిర్మాణంబు వివరించెద॥

టీ॥ మఱియున్-ఇంకను । నాభియందు-బొడ్డుయందు । భూలోకంబును-మధ్యమలోకమును । ఆత్మను - ఆత్మయందు । భువర్లోకంబు - భువర్లోకమును । హృదయంబునన్ - హృదయప్రదేశమందు । సువర్లోకంబు-సువర్లోకమును । కంఠంబునన్-అట్టుయందు । మహర్లోకంబు-మహర్లోకమును । భుజయుగంబునన్ । భుజ-భుజములయొక్క । యుగంబునన్-దోయియందు । జనర్లోకంబు-జనర్లోకమును । ఫాలంబునన్-నుదిటియందు । తపోలోకంబు - తపోలోకమును । శిరంబునన్ - శిరస్సుయందు । సత్యలోకంబు-సత్యలోకమును । తాల్చి-ధరించి । ఒప్పుచుండున్-వెలయుచుండును । మఱియును - ఇంకను । మేరునిర్మాణంబు । మేరు-మహామేరువుయొక్క । నిర్మాణంబు - చేయుటను । వివరించెదన్-తేటపరచెదను॥

తా॥ విశ్వకర్మయొక్క బొడ్డుమొదలగు యవయవములయందు భూలోకముమొదలైనవి నిల్చెను ఇంక మహామేరువు స్థితినిచెప్పెదను॥ ౭౪

ఉ॥ సారతరౌషధీనిచయచంద్రమణీజననైకభూమియై । మేరువువిశ్వమధ్యమునమించిప్రతిష్ఠవహించియుండును । మ్మేరువునంటియున్నయవి మీదటిక్రిందటిలోకపఙ్క్తి । న్మేరుధరాధరాధిపతి మేరయు నీకెఱుగంగజెప్పెదన్॥

టీ॥ మేరువు-మహామేరువు । సారతరౌషధీనిచయ చంద్రమణీజన నైకభూమియై । సారతర-మిక్కిలి మంచిదియైన । ఓషధీ-తృణగుల్మలతాదులయొక్క । నిచయ-రాశికిని । చంద్రమణి-చంద్రకాంతమణులకును । జననైకభూమియై-పుట్టుచోటయై । విశ్వమధ్యమునన్-ప్రపంచమధ్యమందు । మించి-అతిశయించి । ప్రతిష్ఠవహించి-కీర్తిపొంది । ఉండున్-నిలిచెను । అమ్మేరువును-ఆమహామేరువును । మీదటి క్రిందటిలోకపఙ్క్తి-మీదు క్రిందులోకములచాలు । అంటియున్నయది-తగిలియున్నది । తన్మేరుధరాధరాధిపతిమేరయు । తత్-ఆ । మేరు-మేరువనెడు । ధర-భూమిని । ధర-తాల్చినకొండలలో । అధిపతి-యకిమీడైన మహామేరువుయొక్క । మేరయు-పరిమితిని । నీకు-ఈకు । ఎరుగంగజెప్పెదన్-తెలియపలికెదను ॥

తా॥ మేరుపర్వతము సమస్తతరులతాదులకు తావును పదునాలుగు లోకముల కాధారమును భూమికి నాభివంటిదియును ఇంక తద్గిరి వైశాల్యము నీకు తెలియజెప్పెదను వినుము॥ ౭౫

సీ॥ భూమిమధ్యంబున తామరవలెనుండు, మేరువుజగతికి మేరయగుచు।
మీదిభాగంబెని మిదికోటులగుయోజ, నంబులు తద్ద్విగుణంబు మొదల।
తన్మధ్యమస్థలి దగుయోజనంబులి, రువదికోటులుదాని రూఢిగాను । దాని
శృంగాగ్రంబు దానెన్ననిరువది, నాల్గులక్షలయోజనంబులగుచు । నరుణ
మునుభ్రమదమును శీతమనగవనత । మనగనగములు నలుదిక్కులందులక్ష ।
యోజనంబులపొడవున నొప్పుచుండ । మేరునగరీతి నీరీతిమించెధరణి॥

టీ॥ భూమిమధ్యంబునన్ । భూమి-పుడమియొక్క । మధ్యంబునన్-నడుమను । మేరువు-మేరుపర్వతము । జగతికిన్-భూమికి । మేరయగుచున్-హద్దగుచు । తామరవలెన్-తామరమొగ్గవలె। ఉండున్-వసించును । మీదిభాగంబు-పైచోటు। ఎనిమిదికోటులగు-ఎనిమిదికోట్లైన । యోజనంబులు-యోజనములుకలదియు । మొదలు-క్రిందు । తద్ద్విగుణంబు । తత్-దానికంటె । ద్విగుణంబు-రెండుపాళ్లయెక్కువగపదియారవయామడలుగలది । తన్మధ్యమస్థలి । తత్-ఆమేరువుయొక్క । మధ్యమస్థలి-నడిమిచోటు । ఇరువదికోటులు-ఇరువైకోట్లైన । యోజనంబులు-ఆమడలంగలది। నిరూఢిగాను-రూఢిగాను।దాని శృంగాగ్రంబు।దాని-ఆగిరియొక్క।శృంగ-కొమ్ముయొక్క।అగ్రంబు-కొన । తానెన్నన్-తానులెక్కించగా। ఇరువదినాలుగులక్షలయోజనంబులు-ఇరువదినాలుగులక్షలయామడలుకలది । అగుచున్-అగుచును । అరుణమును-అరుణమును । భ్రమదమును-భ్రమదమును । వనతము-వనతమును । అనగన్ - అనగా । నగములు-కొండలు । నలుదిక్కులందున్-నలుదెసలయందును । లక్షయోజనంబులపొడవునన్ - లక్షయామలడపొడవుచేత । ఒప్పుచుండన్-వెలయుచుండగ । మేరునగరీతి । మేరునగ-హేమాద్రియొక్క । రీతి-విధము । ఈరీతిన్-ఈవిధముగా । ధరణి-భూమియందు । మించెన్-అతిశయించెను ॥

తా॥ ఈమేరువు పుడమినడుమ పద్మముకుళమువలెనున్నదనియు దీనిమీది క్రిందిమధ్యభాగములు వెనుకజెప్పిన యోజనములు గలదనియు చతుర్దిశలను నాలుగుకొండలుగలదనియు మూడుశిఖరములు కలదియునై యుండెను॥ ౭౬

చ॥ హరిదిశమందరాచలము యామ్యదిశౌతటుగంధమాదనా । ద్రిరుచి
మైజలేశ్వరుని దిక్కునవిపులాపనీధ్రము । త్తరపుదిశస్సుపార్శ్వ వసుధా

ధరముఁ గా విలసిల్లు మేరుభూ । ధరమునకాస్పదంబగుచు తద్దయు మించె మ
హోన్నతంబులై॥

టీ॥ హరిదిశన్ । హరి-ఇంద్రునియొక్క-స్థానమైన । దిశన్-తూర్పుదెసయందు । మందరాచలము-మందరపర్వతమును । యామ్యదిశాతటిన్ । యామ్య-యమసంబంధమైన । దిశాతటిన్-దక్షిణపుదిక్కునందున । గంధమాదనాద్రి-గంధమాదనపర్వతమును । రుచిరమై-సుందరమైనదై । జలేశ్వరుదిక్కునన్ । జలేశ్వరుని-వరుణునియొక్క । దిక్కునన్-దెసయందు । ఆవిపులావనీధ్రము-ఆవిపులమను కొండయు । ఉత్తరపుదిశన్-ఉత్తరపుదిక్కుయందు । సుపార్శ్వవసుధాధరముఁన్ - సుపార్శ్వమను కొండయును । విలసిల్లు మేరుభూధరమునకు । విలసిల్లు-ప్రకాశించుచున్న । మేరుభూధరమునకు-మేరుగిరికి । ఆస్పదంబగుచు-స్థానమగుచును । మహోన్నతంబులై-మిక్కిలిగొప్పవియై । తద్దయు-మిక్కిలి। మించెన్-వెలసెను॥

తా॥ నాలుగుదిక్కులయందు మందరము మొదలగు నాలుగు కొండలుండెను॥ ౭౭

సీ॥ పూర్వదిశాభాగమునబుట్టె దేవతా, నందనంబైన నందనవనంబు ।
దక్షిణదిగ్ధరాస్థలిజనించెనజస్ర, ఫలితపుష్పితమునై భ్రాజివనము । ప్రత్య
గ్దిశాగిరి ప్రభవించెమౌనిమో, దకమైనగంధమాదనవనంబు । నుత్తరహరిద
ద్రి నుదయించెసుమకాంతి, చిత్రితస్థలమైన చైత్రవనము । నగ్రశిఖరాయమా
నమానచలసీమ । లీలఁబ్రవహించెహంసకాందోళికాప్ర । కారరంగత్తరంగ
యాకాశగంగ । యీసువర్ణక్షమాధరాగ్రేసరమున॥

టీ॥ ఈసువర్ణక్షమాధరాగ్రేసరమునన్ । ఈసువర్ణక్షమాధర - ఈబంగరుకొండయను । అగ్రేసరమునన్ - కొండఱాయనియందు । దేవతానందనంబైన । దేవత-దేవతలకు । నందనంబైన-ఆనందజనకమైన । నందనవనంబు - నందనవనము । పూర్వదిశాభాగమునన్ । పూర్వదిశ-తూర్పుదిక్కుయొక్క । భాగమునన్ । చోటున । పుట్టెన్-మొలచెను । దక్షిణదిగ్ధరాస్థలిన్ । దక్షిణదిక్-దక్షిణపుదిశయొక్క । ధరాస్థలిన్-నేలను । భ్రాజివనము-భ్రాజిమనుతోట । అజస్రఫలితపుష్పితమునై । అజస్ర-ఎల్లప్పుడు । ఫలితపుష్పితమునై - పూచికాచెడిదియై । జనించెన్ - పొడమెను । మౌనిమోదకమైన । మౌని-మునులకు । మోదకమైన । సంతోషకరమైన । గంధమాదనవనంబు - గంధమాదనమనుతోపు । ప్రత్యగ్దిశాగిరిన్ । ప్రత్యగ్దిశ-పడమటివైపుయందలి । గిరిన్ - కొండమీద । ప్రభవించెన్-కలిగెను । సుమకాంతిచిత్రితస్థలమైన । సుమకాంతి । సుమ-పువ్వులయొక్క । కాంతి-రంగుచేత । చిత్రిత - రంగువేయబడిన । స్థలమైన-చోటుగల । చైత్రవనము-చైత్రమనుయుద్యానము । ఉదయించెను-పుట్టెను । ఈసువర్ణక్షమాధరాగ్రేసరమునన్-ఈహేమాద్రియందు । అగ్రశిఖరాయమానమానచలసీమన్ । అగ్రశిఖరాయమానమా-మొదటిశిఖరమువలెనున్నట్టి । అచలసీమన్ - పర్వతప్రదేశమందు । హంసకాందోళికాప్రకారరంగత్తరంగ । హంసక । రాయంచకొదమలకు । ఆందోళికాప్రకార - ఉయ్యాలలలాగున । రంగత్-ప్రకాశించుచున్న । తరంగ-కెరటములుగల । ఆకాశగంగ-మిన్నేరు । ప్రవహించెన్ - జాలువారెను॥

తా॥ ఈకొండకు నాలుగువైపుల నందనాదులగు విహారవనములు గలవనియు దీనినెత్తముపై యాకాశగంగ ప్రవహించెను॥ ౭౮

గీ॥ అలరు దేదీప్యమానంబు లగుచుఁ బైడి । కొండ కైలాసమన గ్రత్రికూటమ
నగ । మేరుమందరములు నాగ మేటిశిఖర । ములురజితతామ్రహాటకమూ
ర్తులొనరు॥

టీ॥ దేదీప్యమానంబులగుచుఁ-ప్రకాశించుచున్నవగుచును ।రజితతామ్రహాటకమూర్తులు । రజిత-వెండి । తామ్ర-రాగి । హాటక-బంగారపువైన । మూర్తులు-స్వరూపములుగల ।మేటిశిఖరములు । మేటి-శ్రేష్ఠములైన । శిఖరములు-బొడ్డనకొండ తలలు । పైడికొండ-బంగరుకొండ । కైలాసమనఁగ-వెండికొండనాఁగ । త్రికూటమనఁగ-త్రికూటాచలమునాఁగ । మేరుమందరములునాఁగ - మేరుమందరగిరులన । ఒనరఁ-ఒప్పఁగ । అలరుఁ-ప్రకాశించెను॥

తా॥ ఆమేరుగిరియొక్క కొనలు కైలాసాదులవలె వెండి మొదలైనవి॥ ౭౯

మేరు చతుర్దిశావృక్షములు.

గీ॥ పూర్వదిశపిప్పలంబు జంబూనదంబు । దక్షిణంబునపడమటఁదనరుక
డిమి । ధనదుదిక్కునమఱియును జనన మొందె । పైడికొండకుఁజుట్టున బా
గుమీరి॥

టీ॥ పైడికొండకుఁ-మేరువునకు । చుట్టునఁ-అంతటను । బాగుమీరి - సొగసుగ । పూర్వదిశఁ-తూర్పున।పిప్పలంబు-రావిచెట్టు।దక్షిణంబునఁ-దక్షిణమందు । జంబూనదంబు-నేరేడుమడుగును । పడమటఁ - పడమటను । తనరుకడిమి । తనరు - ఒప్పుచున్న । కడిమి - కడిమిచెట్టును । ధనదుదిక్కునఁ । ధనదు-కుబేరునియొక్క । దిక్కునఁ - దెసయందు । మఱ్ఱియు - మఱ్ఱిచెట్టును । జనన మొందెఁ-పుట్టెను॥

తా॥ ఈకొండకు నలుదెసలను రావిమొదలైన నాలుగు చెట్లుండెను॥ ౮౦

ఉ॥ భూనుతమేరుయామ్యదిశ బుట్టిననేరెడు జెట్టుకొమ్మలం । దేనుగ
లంతలేసి యుదయించిఫలంబులు బడ్డతద్రసం । బానగరాజుపైఁదొరగి ప్రా
దినియై ప్రవహించభూమెజాం । బూనదమయ్యెనానదిని బుట్టినపంకము దేవ
తార్హమా॥

టీ॥ భూనుతమేరుయామ్యదిశబుట్టిననేరెడుజెట్టుకొమ్మలందు । భూనుత । భూ-భూమియందు। నుత-స్తుతించఁతగిన । మేరు-మహామేరువుయొక్క । యామ్యదిశఁ-దక్షిణపుదిక్కుయందు । పుట్టిన-కలిగిన । నేరెడుజెట్టు-జంబూవృక్షముయొక్క । కొమ్మలందు-శాఖలయందు । ఏనుగలంతలేసి - ఏనుగులంత । ఫలంబులు-పండ్లు । ఉదయించెఁ-పుట్టెను । పడ్డతద్రసంబు । పడ్డ-పడిన । తత్-ఆ పండ్లయొక్క । రసంబు-ద్రవము । ఆనగరాజుపైఁ-ఆమేరువుమీద । తొరగి-జారి । ప్రాదినియై- ఏరై । ప్రవహించుభూమిఁ । ప్రవహించు-పారిన । భూమిఁ-నేలయందు । జాంబూనదము - బంగారము । అయ్యెఁ-ఆయెను । ఆనదినిబుట్టినపంకము । ఆనదిని-ఆయేటియందు । పుట్టినపంకము-కలిగినబురద । దేవతార్హమా-దేవతాయోగ్యమగును॥

తా॥ మేరువుమీద దక్షిణపుదిక్కునసుండిన నేరెడుచెట్టు పండ్లరసమువలన నొకనదియైనది దాని లోనియిసుక బంగారమాయెను॥ ౮౧

క॥ ఆమధురరసముపంకం । బామరసందోహభుజగ యక్షాదులకున్ ।
ప్రేమాస్పదభోజ్యమునగు । నామహితవిభూషణంబు లగుప్రమదలకున్॥

టీ॥ ఆమధురరసము-ఆతీయనిరసమును । పంకంబు-బురదయు । అమరసందోహభుజగయక్షాదులకున్ । అమర-దేవసంబంధమైన । సందోహ-గుంపులకును । భుజగ - భుజగులకును । యక్షాదులకున్-యక్షులు మొదలైనవారలకును । ప్రేమాస్పదభోజ్యము । ప్రేమాస్పద - ప్రేమస్థానమైన । భోజ్యము-తినతగినదియు । నానామహితవిభూషణంబులు । నానా-అనేకములైన । మహిత - గొప్పవైన విభూషణంబులు-సొమ్ములు । ప్రమదలకున్-స్త్రీలకు । అగున్-అగును॥

తా॥ ఆనేరెడుపండ్ల రసమును దానిబురదయు దేవతాకోటికి తిండియు స్త్రీలకు సొమ్ములు ఆయెను॥ ౮౨

క॥ ధనదునిదిశవటవృక్షము । దనరుంగంధర్వయక్షదానవరక్షో । ముని
విద్యాధరముఖులకు । ననుపమసౌఖ్యప్రదాయి యౌనెల్లపుడున్॥

టీ॥ ధనదునిదిశవటవృక్షము । ధనదునిదిశన్ । ధనదుని - కుబేరునియొక్క । దిశన్ - దిక్కునందలి । వటవృక్షము - మఱ్ఱిచెట్టు । గంధర్వయక్షదానవరక్షోముని విద్యాధరముఖులకున్ । గంధర్వ-గంధర్వులయొక్కయు । యక్ష-యక్షులయొక్కయు । దానవ-దనుపుత్రులయొక్కయు । రక్షః - రాక్షసులకును । ముని-యతులకును । విద్యాధరముఖులకున్ - విద్యాధరులు మొదలగువారలకును - ఎల్లపుడున్-ఎప్పుడును । అనుపమసౌఖ్యప్రదాయియౌ । అనుపమ - సాటిలేని । సౌఖ్యప్రదాయియౌ । సుఖమునిచ్చెడిదాను॥

తా॥ కుబేరుని దిక్కునసుండు మఱ్ఱిచెట్టు యక్షాదులకు మంచినీడ నిచ్చెడెడి॥ ౮౩

ఉ॥ పూర్వదిగంతరస్థలిని బుట్టినరావియొనర్చు నెప్పుడున్ । సర్వముదేవ
తామయము సారసగర్భుడు మూలమగ్రమా । శర్వుడు మధ్యమచ్యుతుడు
చాలగదత్తరుతల్లజంబులో । బర్విసభక్తియుక్తిదలపం మఱిపాపములుండ నే
ర్చునే॥

టీ॥ పూర్వదిగంతరస్థలినిబుట్టినరావి । పూర్వదిగంతర-తూర్పుదెసనడిమి । స్థలిని-చోటున । పుట్టినరావి-మొలచినరావిచెట్టు । సర్వము-యావత్తును । దేవతామయము - దేవతాస్వరూపము । సారసగర్భుడు-బ్రహ్మదేవుడు । మూలము-మొదలు । ఆశర్వుడు-ఆసాంబమూర్తి । అగ్రము-చివర । అచ్యుతుడు-విష్ణువు । మధ్యము-నడుము । చాలగన్ - మిక్కిలి । తత్తరుతల్లజంబున్ - ఆవృక్షరాజమును । లోన్-హృదయములో । పర్విసభక్తియుక్తిన్ । పర్విన-ప్రసరించిన । భక్తి-భక్తియొక్క । యుక్తిన్-సంబంధముచేత । తలపన్ - తలచగా । మఱి-ఇంకను । పాపములు - దోషములు । ఉండనేర్చునే - ఉండునా॥

తా॥ తూర్పుదిక్కునసున్న రావిచెట్టు త్రిమూర్త్యాత్మకమైనదిగాన స్మరించువారలకు పాపము లుండవు॥ ౮౪

క॥ పుడమికిభూషణమైతను । నొడివినవారలకుఁదాను మనోహరఫలమె ।
ప్పుడు నొసఁగుచుండునగ్గిరి । పడమటిదెసకడిమిచెట్టు బంధురలీలన్॥

టీ॥ అగ్గిరిపడమటిదెసన్ । అగ్గిరి-ఆమహామేరువుయొక్క । పడమటిదెసన్ - పశ్చిమభాగమం దున్న । కడిమిచెట్టు-కదంబవృక్షము । బంధురలీలన్ । బంధుర-దట్టమగు । లీలన్-విలసితము చేత । పుడమికిన్-ధరణీదేవికి । భూషణమై - అలంకృతియై । తనునొడివినవారలకున్ । తను-తనను । నొడివినవారలకున్-తలఁచువారలకు । తాన్-తాను । మనోహరఫలము-ఇష్టఫలములను । ఎప్పుడు - ఎల్లప్పుడు । ఒసఁగుచుండున్-ఇచ్చుచుండును॥

తా॥ పశ్చిమపుదిక్కుయందలి కడిమిచెట్టు తననడిగినవారలకు కామితార్థములొసఁగును॥ ౮౪

క॥ ఈ నాలుగువృక్షములును । ధ్యానించితలంచిరేని తత్త్వజ్ఞతయుం ।
నానాభీష్టముఁగలుగును । మానవులకు దత్క్షణంబమహిమదలిర్పన్॥

టీ॥ ఈనాలుగువృక్షములు-ఈనాలుగుచెట్లను । ధ్యానించి-ఆలోచించి । తలంచిరేని-తలఁచినట్లైనను । తత్త్వజ్ఞతయున్-యదార్థము తెలియుటయును । నానాభీష్టము । నానా-అనేకమైన । అభీష్టము-కోరికను । తత్క్షణంబ-అప్పుడె । మహిమదలిర్పన్ । మహిమ-మహత్తు । తలిర్పన్-అంకురించఁగ। మానవులకున్-మనుష్యులకు । కలుగును-సంభవించును॥

తా॥ ఈనాలుగుచెట్లను ధ్యానించినవారలకు సర్వాభీష్టసిద్ధి శీఘ్రముఁగ కలుగును॥ ౮౫

మరల కుమారప్రశ్న.

వ॥ ఇట్టిప్రచారంబులతో సమేతంబగు మేరుపర్వత మహిమానువినుపించితి నిన్నియు విశ్వకర్మమూలంబుగా నెఱుంగుమనిన కుమారస్వామి యిట్లనియె॥

టీ॥ ఇట్టి ప్రచారంబులతోన్-ఇటువంటి సంగతులతో । సమేతంబగు-కూడికొనిన । మేరుపర్వతమహిమన్ । మేరుపర్వత - మహామేరువుయొక్క । మహిమన్ - మహత్తును । వినుపించితి-చెప్పితిని । ఇన్నియు-ఇవన్నియు । విశ్వకర్మమూలంబుగాన్ । విశ్వకర్మ-విశ్వకర్మయే । మూలంబుగాన్ - ముఖ్యకారణముగా । ఎఱుంగుము-తెలియుము । అనినన్-అనఁగ । కుమారస్వామి - కుమారదేవుఁడు । ఇట్లనియె-ఈలాగనెను॥

తా॥ ఈచెప్పినవానికన్నిటికిని విశ్వకర్మ మూలకారణమని చెప్పఁగా విని కుమారస్వామి యింకొక ప్రశ్నయడిగెను॥ ౮౬

గీ॥ అభవనావిన్నపమువిననవధరింపు । గంగయందుజనించెనేకరణినుం
డె। నిన్నినదులేలధరబ్రవహించెనిపుడు।యిన్నిదెలియంగనానతియిమ్మునాకు॥

టీ॥ అభవ-ఓసాంబమూర్తి । నావిన్నపము-నామనవిని । వినన్-వినుటకు । అవధరింపు- చిత్తగింపుము । గంగ-భాగీరథి । ఎందుజనించె-ఎక్కడపుట్టెను । ఏకరణినుండె - ఏరీతినుండెను । ఇన్నినదులు-ఇన్నియేఱ్ఱు । ఏల-ఎందుకు । ధరన్-భూమియందు । ప్రవహించెన్-పాఱెను । ఇపుడు-ఇప్పుడు । ఇన్ని-వీనినన్నిటిని । తెలియంగన్-తెలియునట్లుగ । నాకున్-నాకు । ఆనతియిమ్ము-సెలవిమ్ము ॥

తా॥ గంగ యెచటబొడమెను యిన్నిపాయలై యెందుకుప్రవహించెను యిదంతయు కుమార స్వామి తండ్రిని అడిగెను॥ ౨౭

సాంబమూర్తి చెప్పుట.

గీ॥ అలకనందనయనగను నమరగంగ । యనగమఱియునుయసితయనంగ బేళ్ల । జెలగు మేరువు శృంగాగ్రసీమబుట్టి । గంగగలసెనుజలనిధి కౌతుకమున॥

టీ॥ గంగ-గంగాదేవి । మేరుపుశృంగాగ్రసీమబుట్టి । మేరువు-మహామేరువుయొక్క । శృంగాగ్రసీమన్-శిఖరాగ్రప్రదేశమందు । పుట్టి-జన్మించి । అలకనందనయనఁగన్-అలకనందనయనియు । గంగయనఁగన్-గంగయనియు । మఱియును-ఇంకను । అసితయనఁగన్-అసితయనియు । పేళ్లన్-నామములచేత । చెలఁగుచు-ఒప్పుచు । కౌతుకమునన్-వేడుకచేత । జలనిధిన్-సముద్రమును । కలసెన్-పొందెను ॥

తా॥ గంగ మేరు శిఖరమందుపుట్టి అలకనందన మొదలైన పేళ్లచేత మూడుపాయలై సాగరగామినియాయెను॥ ౨౮

గీ॥ అందునత్యంతరమణీయమైనయట్టి । మేరుమందరమధ్యమోదార సౌధ । రమ్యసింహాసనమున నిరంతరంబు । ప్రీతినొడ్డోలగంబొనరింతు నేను॥

టీ॥ అందు-ఆగంగయందు । అత్యంతరమణీయమైనయట్టి।అత్యంత-మిక్కిలి।రమణీయమైనయట్టి-సుందరమైనటువంటి। మేరుమందరమధ్యమోదారసౌధసింహాసనమునన్। మేరుమందర-మేరు మందరపర్వతముయొక్క । మధ్యమ-మధ్యప్రదేశమందు । ఉదార-ఉజ్వలమైన । సౌధ-మేడయందు । రత్నసింహాసనమునన్ । రత్న-మణిఖచితమైన । సింహాసనమునన్-రాజపీఠమందు । నిరంతరంబు-ఎల్లప్పుడును। ప్రీతిన్-వేడ్కచే । నేను-ఏను । ఒడ్డోలగంబు-సభను । ఒనరింతున్-చేతును॥

తా॥ నేను మేరు మందరముల నడుమనున్న మేడపైగద్దెమీద కూర్చుండి లోకములు పాలించెదను॥ ౨౯

సప్తసముద్రముల, ద్వీపముల రీతి.

సీ॥ కాంచనభూధరకన్యక యెప్రొద్దు, ధరణిపద్మమురీతిదనరుచుండు । నాధరిత్రికిలవణాబ్ధిచుట్టుననుండు, లక్షయోజనవిశాలతవహించి । దానికైక్షువసముద్రమురించనిరులక్ష, యోజనపరిమాణయుక్తమగుచు । నావార్ధిచుట్టుసురాంబుధిచెన్నొందు, నాల్గులక్షలయోజనపరిమితమ్ము । నట్టితోయధిజుట్టుఘృతాంబురాశి । గల్గియోజనలక్షాష్టకప్రమాణ । మగుచుతద్వార్ధిమీదట నలరుదధిప । యోధిలక్షాష్టకద్వయయోజనములు॥

టీ॥ ధరణి-భూమి । కాంచనభూధరకన్యకకు । కాంచనభూధర-మహామేరువుయొక్క । కన్యకకు-కన్యకయైనగంగకు । ఏప్రొద్దు-ఎప్పుడు । పద్మమురీతి-తామరపువ్వువలె । తనరుచుండున్ - ఒప్పుచుండును । ఆధరిత్రికిన్-ఆపుడమికి । లవణాబ్ధి-ఉప్పుసముద్రము । చుట్టునన్-అంతటను । లక్షయోజనవిశాలతన్ । లక్షయోజన-లక్షయామడయైన । విశాలతన్-వెడల్పును । వహించి-తాల్చి । ఉండున్-

ఉండును । దానికిఁ-ఆయుప్పసముద్రమునకు । ఇక్షురసముద్రము-చెరుకురసపుసముద్రము । ఇరులక్షయోజనపరిమాణయుక్తము । ఇరులక్షయోజన-రెండులక్షలయామడైన । పరిమాణ-మితముతో । యుక్తమగు-కూడికొనినది । అగుచు-అవుచును । మించుఁ-ఒప్పును । ఆవార్థిచుట్టుఁ-ఆసముద్రమునకుచుట్టును । సురాంబుధి-కల్లుసముద్రము । నాల్గులక్షలయోజనపరిమితమ్ము । నాల్గులక్షలయోజన-నాలుగులక్షల ఆమడయైన । పరిమితమ్ము-పరిమాణముగలదై । చెన్నొందుఁ-ప్రకాశించును । అట్టితోయధిచుట్టుఁ-ఆకల్లుసముద్రముచుట్టును । ఘృతాంబురాశి-నేతికడలి । యోజనలక్షాష్టకప్రమాణమగుచు । యోజనలక్షాష్టక-ఎనిమిదిలక్షల ఆమడల । ప్రమాణమగుచు-మేరగలదై । కలిగెఁ-ఉండెను । తద్వార్థిమీదటఁ-ఆనేతిమున్నీటిమీది । దధిపయోధి-పెరుగుసముద్రము । లక్షాష్టకద్వయయోజనములఁ - పదియారులక్షలఆమడలచేత । అలరుఁ-ఒప్పును॥

తా॥ గంగనదుమనుండు పుడమికి యేడుసముద్రములు చుట్టునసుండును॥ ౯౦

మత్తకోకిల॥ అందమైతగుతత్పయోనిధికవలచుట్టుననుండిచె । న్నొందు
ముప్పదిరెండులక్షలయోజనంబులదీర్ఘమై । ఇందిరాధవధామమైభువికింపు
బుట్టగజేయుమి । న్నందియూర్ములక్షీరవారిధియుండుబర్హిణవాహన॥

టీ॥ అందమైతగుతత్పయోనిధికిఁ । అందమైతగు-సొగసైయున్న । తత్పయోనిధికిఁ-ఆ పెరుసమున్నీటికి । అవలచుట్టునఁ-ఆవలయంతటను । క్షీరవారిధి-పాలకడలి । ఉండి-నిలిచి । ముప్పదిరెండులక్షలయోజనంబులదీర్ఘమై - ముప్పదిరెండులక్షల యామడల పొడవుగలదియై । ఇందిరాధవధామమై । ఇందిరాధవ-విష్ణుమూర్తికి । ధామమై-ఇల్లై । భువికిఁ-పుడమికి । ఇంపుపుట్టగఁ-సొంపుపుట్టేటట్టు । చేయుఁ-ఒనర్చును । ఊర్ములఁ - కెరటములచేత । మిన్నంది - ఆకసముముట్టి । బర్హిణవాహన-ఓకుమార । ఉండి-వసించి । చెన్నొందుఁ-ప్రకాశించును॥

తా॥ పాలమున్నీరు విష్ణుమూర్తికి యిల్లై ముప్పదిరెండులక్షల పొడవుగలదైయుండెను॥ ౯౧

క॥ లలినరువదినాలుగుల । క్షలయోజనసంఖ్యపాలకడలికిఁ కడుభా ।
సిలుశుద్ధోదధిభూమీ । లలనామణిమేఘలాకలాపముభంగిఁ॥

టీ॥ శుద్ధోదధి-మంచినీటిసముద్రము । లలిఁ-సొగసుగ । అరువదినాల్గులక్షలయోజనసంఖ్యఁ-అరువదినాలుగులక్షల ఆమడలలెక్కచేత । భూమీలలనామణిమేఘలాకలాపముభంగిఁ । భూమీలలనామణి-పుడమిచేడియకు । మేఘలాకలాపముభంగిఁ-ఒడ్డాణమువలె । పాలకడలికిఁ-క్షీరసాగరమునకు । కడుభాసిలుఁ-మిక్కిలిప్రకాశించెను॥

తా॥ శుద్ధోదకసముద్రము పుడమికి మొలనూలువలె పాలసముద్రముదాపున ప్రకాశించెను॥ ౯౨

క॥ లవణాంబుధిమొదలుగన । ర్ణవములపరిమాణములక్షణముజెప్పితిగౌ ।
రవముగనిటమీదటనే । వివిధద్వీపములమహిమవివరింతుదగఁ॥

టీ॥ గౌరవముగఁ - గొప్పగను । లవణాంబుధిమొదలుగ నర్ణవముల పరిమాణలక్షణము । లవణాంబుధి-ఉప్పుసముద్రము । మొదలుగఁ-ఆదిగ । అర్ణవముల-సముద్రములయొక్క । పరిమాణ-మితియొక్క । లక్షణమ్ము-స్వరూపమును । చెప్పితి-నుడివితిని । ఇటుమీదటఁ-ఇకమీదటను । వివిధద్వీప

ములమహిమఁ । వివిధ-నానావిధములైన । ద్వీపముల-దీవులయొక్క । మహిమఁ-మహత్త్వను । తగఁ-ఒప్పునట్లు । ఏ-నేను । వివరింతు-స్పష్టీకరించెదను॥

తా॥ సప్తసముద్రములయొక్క పరిమాణమును చెప్పితిని యిఁకమీఁదట యేడుదీవులపరిమాణమును చెప్పెదను॥ ౯౩

సీ॥ పరగజంబూద్వీప పరిమాణ మొకలక్ష, యవలప్లక్షద్వీప మగును
రెండు । లక్షలసంఖ్యలై లలిత కుశద్వీప, మగు నాల్గులక్షలై యతిశయిల్లు ।
నెనిమిదిలక్షలై యెసగు క్రౌంచద్వీప, తలముశాకద్వీప ధామమమరు । పది
యారులక్షల పరిమాణ మునపుష్క, రద్వీప మొప్పునుతద్ద్విగుణము । నిన్నిదీ
వులకవ్వల నెసగుచుండు । మును చతుష్షష్టిలక్షయోజనవిశాల । మగుచునని
శంబు వైకుంఠనగరవరము । దివ్యధామాభిరామమై తేజరిల్లు దీవి॥

టీ॥ జంబూద్వీపపరిమాణము । జంబూద్వీప-నేరేడుదీవియొక్క । పరిమాణము-పరిమితి । ఒకలక్షఁ-ఒకలక్షచేత । పరగుఁ-ఒప్పును । అవల-అవతల । ప్లక్షద్వీపము-జువ్విదీవి । రెండులక్షలసంఖ్యమై-రెండులక్షలయామడలెక్కగలదై । అగును-అవును । లలిత కుశద్వీపము । లలిత-సుందరమైన। కుశద్వీపము-దర్భలంక । నాల్గులక్షలై-నాలుగులక్షలుగలదై । అతిశయిల్లుఁ-అతిశయించును । క్రౌంచద్వీపతలము-క్రౌంచపులంకచోటు । ఎనిమిదిలక్షలఁ - ఎనిమిదిలక్షలచేత । ఎసగుఁ - ప్రకాశించును । శాకద్వీపధామము-శాకపుదీవిచోటు । పదియారులక్షల పరిమాణమునఁ-పదియారులక్షలకొలతచేత । అమరుఁ-ఒప్పును । పుష్కరద్వీపము-పుష్కరపుదీవి । తద్ద్విగుణము । తత్ - ఆశాకద్వీపముకంటె । ద్విగుణము-రెండుపాళ్లు యెక్కువగలదై । ఒప్పును-తగును । ఇన్నిదీవులకుఁ-ఈ అన్నిలంకలకంటె । మును-ముందు । వైకుంఠనగరవరము-వైకుంఠపట్టణశ్రేష్ఠము । చతుష్షష్టిలక్షయోజన విశాలమగుచు । చతుష్షష్టి-అరువదినాలుగైన । లక్షలయోజన - లక్షలయామడలయొక్క । విశాలమగుచు-వెడల్పుగలదగుచును । దివ్యధామాభిరామమై । దివ్య-శ్రేష్ఠమైన । ధామ-కాంతిచేత । అభిరామమై-మనోహరమైనదై । అనిశంబు-ఎల్లప్పుడును । తేజరిల్లుఁ-ప్రకాశించును॥

తా॥ ఈప్రకారముగ యేడుదీవులున్న యిట్టి పరిమాణముగలవై వానినడుమ దివ్యప్రకాశగల లక్ష్మీపతి నివాసమైన వెలిదీవియుండెను॥ ౯౪

క॥ అరువదివేలామడయై । పరుగునుతన్మానసాద్రిపై వెడలుపున । గ్గిరిబ
హిరంతరశీమల । పరికించినచాలకోటిపరిమాణమగుఁ॥

టీ॥ తన్మానసాద్రిపైవెడల్పు । తత్ -ఆ । మానసాద్రి-మానససరస్సుతోఁగూడిన । అద్రి-కైలాసపర్వతముయొక్క । పై వెడల్పు । మీఁదివెడలుపు । అరువదివేలామడనై - అరువదివేలామడగలదై । పరగుఁ-ఒప్పును । అగ్గిరిబహిరంతరశీమలఁ । అగ్గిరి - ఆకైలాసముయొక్క । బహిరంతరశీమలఁ - లోఁబయలను । పరికించినఁ-ఆలోచించఁగా । చాలకోటిపరిమాణము । చాల - అనేకములైన । కోటి-కోట్లయొక్క । పరిమాణము-పరిమితిగలది । అగుఁ-అగును॥

తా॥ కైలాసపర్వతము చాలాపొడవు వెడల్పుగలది॥ ౯౫

## చక్రవాళపర్వత లక్షణము.

క॥ ఆలోకాలోకాద్రివి । శాలతవింశతిసహస్రసంఖ్యఁదనరుచుం । మూ
లపరిమాణమేబది । వేలగుయోజనములనఁగ వెలయుఁగుమార॥

టీ॥ ఆలోకాలోకాద్రివిశాలత । ఆలోకాలోకాద్రి-ఆ చక్రవాళపర్వతముయొక్క । విశాల
త-వెడల్పు । వింశతిసహస్రసంఖ్యఁ । వింశతిసహస్ర-ఇరువదివేలగు । సంఖ్యఁ-లెక్కచేత । తనరు
చుఁ-ఒప్పుచు । మూలపరిమాణము-మొదటికొలత । కుమార-ఓచిన్నవాఁడ । ఏబదివేలగుయోజనములన
గఁ-ఏబదివేలయామడలు అనునటుల । వెలయుఁ-ప్రకాశించును॥

తా॥ చుట్టుకొండయిరువదివేల యామడవెడల్పు ఏబదివేలయామడ మొదలుగలదియై ప్రకా
శించును. ౯౬

## సూర్యాదుల లక్షణము.

క॥ వినుమొకనిమిషార్ధంబున । ఇనుహయములు రెండువేలనేనూరగు
యో । జనములుజనుతద్రవియుం । ఘనతఁదిరుగులక్షయోజనంబులమీఁదఁ॥

టీ॥ వినుము-ఆలించుము । ఇనుహయములు । ఇను-సూర్యునియొక్క । హయములు-గుఱ్ఱము
లు । ఒకనిమిషార్ధమునఁ - ఒక అరనిమిషముచేత । రెండువేలనేనూరగు యోజనములు-రెండువేల
యేనూరామడలు । చనుఁ-వెళ్లును । తద్రవియుఁ-ఆసూర్యుడును । మీఁదఁ-అంతరిక్షమందు । లక్ష
లయోజనంబులఁ-లక్షయామడలను । ఘనతఁ-గొప్పచేత । తిరుగుఁ-సంచరించును.

తా॥ సూర్యుఁడు ఆకసముమీఁద లక్షామడలతిరుగును ఆయనగుఱ్ఱములు రెండువేలైదువందల
యామడలు దిరుగును॥ ౯౭

సీ॥ జగతికి రెండులక్షలయోజనంబుల, పొడవుననుండునబ్జుడుకుమార ।
లక్షత్రయంబుననక్షత్రములునిల్చు, నైదులక్షలబుధుండమరియుండు । సప్త
లక్షలబుణ్యజనగురుండుండునే, కాదశలక్షసంఖ్యనుకుజుండు । తపనపుత్రు
డుత్రయోదశలక్షలనుజతు, ర్దశలక్షలనుజేసితపనులుండు । ధృవుఁడుపదియే
నులక్షలకవలనుండు । భువికిపదియారులక్షలపొడవునుండు । మేరుశిఖరాగ్ర
తలమునమెలగుచుండు । రమ్యముగుశింశుమారచక్రంబుదనరు॥

టీ॥ కుమార-ఓ కుమారుడా । అబ్జుడు-చంద్రుడు । జగతికిఁ-పుడమికిని । రెండులక్షలయోజ
నంబులపొడవునఁ-రెండులక్షల ఆమడలదూరమందు । ఉండుఁ-వసించును । నక్షత్రములు-చుక్క
లు । లక్షత్రయంబునఁ-మూడులక్షలదూరమందు । నిల్చుఁ-ఉండును । బుధుండు-బుధుడు । అయిదు
లక్షలఁ-అయిదులక్షలదూరమందు । అమరియుండుఁ-నిలచియుండును । పుణ్యజనగురుండు । పుణ్యజ
న-రాక్షసులకు । గురుండు-గురువైనశుక్రుడు । సప్తలక్షలఁ - ఏడులక్షలదూరమందుండును । కుజుం
డు-అంగారకుడు । ఏకాదశలక్షసంఖ్యను । ఏకాదశ-పదునొకండగు । లక్షల-లక్షలయొక్క । సంఖ్య
ను-లెక్కగలదూరమందుండును । తపనపుత్రుడు । తపన-సూర్యునకు । పుత్రుడు-కొమరుడగు శని । త్ర
యోదశలక్షలను-పదమూడులక్షలదూరమందుండును । తపనుడు-సూర్యుడు । చతుర్దశలక్షలను-పదు

నాలుగు లక్షలదూరమును । చెంది-పొంది । ఉండు-నిలచును । ధృవుడు-ధృవమండలము । పదియేనులక్షలకున్-పదియేనులక్షలకు । అవలన్-ఆవలను । ఉండున్-వాసముచేయును । రమ్యమగు-సుందరమైన । శింశుమారచక్రంబు-నక్షత్రచక్రము । భువికిన్-నేలకు । పదియారులక్షల పొడవునందు-పదియారులక్షల దూరమునందు । తనరున్-ఒప్పును । మేరుశిఖరాగ్రతలమునన్ । మేరు-మహామేరు పర్వతముయొక్క । శిఖర-శృంగముయొక్క । అగ్రతలమునన్-కొనయందు । మెలగుచుండున్-ప్రకాశించుచుండును.

తా॥ సూర్యాదినవగ్రహములను ధృవమండలమును శింశుమారచక్రంబును యీచెప్పిన లక్షల దూరమందు వసించియున్నవి॥ ౯౭

క॥ పవనాధారములై శశి । సవితృభగణశింశుమారచక్రంబులువ । జ్రవి
లేనాకృతిఁదగు । నవిరళముగవారిరుహభవాండమునందున్॥

టీ॥ శశిసవితృభగణశింశుమారచక్రంబులు । శశి-చంద్రుండు । సవిత-సూర్యుడు । భగణ । భ-నక్షత్రములయొక్క । గణ-సమూహము । శింశుమారచక్రంబులు - నక్షత్రచక్రములు । పవనాధారములై । పవన-వాయువు । ఆధారములై-ఆదరువుగలదై । వజ్రవిలేపనాకృతిన్-వజ్రఖచితమువలె । అవిరళముగన్ - దట్టముగ । వారిరుహభవాండమునందున్ । వారిరుహభవ-బ్రహ్మయొక్క । అండమునందున్-అండమైన ఆకసమునందు । తగున్-ఒప్పును॥

తా॥ సూర్యచంద్రాదులు ఆకాశమునందు గాలి ఆధారముగలవై నిలచియున్నవి॥ ౯౮

## రాసుల లక్షణము.

చ॥ హరిహయవహ్నిమధ్యమమునందు వసించును మేషరాశిభా । స్కర
సుతదైత్యమధ్యమున దావలమావృషరాశి యెప్పుడున్ । వరుణసమీరమధ్య
ము నివాసముయుగ్మమురాజరాజశం । కరఘనమధ్యభాగమున కర్కటరా
శియునుండుపుత్రకా॥

టీ॥ మేషరాశి-మేషమనురాశి । హరిహయవహ్నిమధ్యమమునందున్ । హరిహయ-దేవేంద్రునియొక్కయు । వహ్ని-అగ్నిదేవునియొక్కయు । మధ్యమమునందున్ - నడిమిదిక్కుయందును । వసించును-ఉండును । వృషభరాశి-వృషభరాశి । ఎప్పుడున్ - ఎల్లపుడును । భాస్కరసుతదైత్యమధ్యమునన్ । భాస్కరసుత-సూర్యపుత్రుడైన యమునియొక్కయు । దైత్య-నైఋతియొక్కయు । మధ్యమునన్-నడిమిభాగమందు । తావలమా-ఉండును । యుగ్మము-మిధునరాశి । వరుణసమీరమధ్యమునన్ । వరుణ-వరుణునియొక్కయు । సమీర - వాయువుయొక్కయు । మధ్యమునన్-మధ్యప్రదేశమందు । వాసము-కాపురముండును । కర్కటరాశియున్-ఎండ్రకాయరాశియును । రాజరాజశంకరఘనమధ్యభాగమునన్ । రాజరాజ-కుబేరునియొక్కయు । శంకర-సాంబశివునియొక్కయు । ఘన-గొప్పదియగు । మధ్యభాగమునన్-నడుమను । పుత్రకా-ఓ కొమరుడా । ఉండు-నివసించు॥

తా॥ మేషము మొదలుకొని కర్కటపర్యంతమైన రాసులు తూర్పుదిక్కు మొదలైన దిక్కుల యొక్క నడిమిభాగములయందుండును॥ ౧౦౦

చ॥ హరిదిశసింహరాశిరవిజాశనుకన్యక పశ్చిమస్థలాం । తరమునవృశ్చి
కంబుప్రమథప్రభుజిష్ణులమధ్యభూమివి । ల్దిరమగువహ్నిబానుసుతదిక్తటమధ్య
మునందునక్రమా । శురశరధీశమధ్యముననిమ్ముగనుం వసియించుకుంభమున్॥

టీ॥ సింహరాశి-సింహపురాశి । అరిదిశన్-తూర్పుదిక్కుయందును । కన్యక-కన్యారాశి । రవిజాశను । రవిజ - సూర్యపుత్రుడైనయమునియొక్క । ఆశను-దిక్కుయందును । వృశ్చికంబు-వృశ్చిక

రాశి । పశ్చిమస్థలాంతరమునన్ - పశ్చిమదిగ్భాగమునందును । విల్-ధనూరాశి । ప్రమథ ప్రభుజిష్ణుల మధ్యభూమిన్ । ప్రమథప్రభు-ప్రమథనాథుడైన యీశానునియొక్కయు । జిష్ణుల-దేవేంద్రునియొక్కయు । మధ్యభూమిన్-మధ్యప్రదేశమందును । తిరమగున్-స్థిరముగనుండును । నక్రము - మకరరాశి । వహ్నిభానుసుతదిక్తటమధ్యమునందున్ । వహ్ని-అగ్నిహోత్రునియొక్కయు । భానుసుత - యమునియొక్కయు । దిక్తటమధ్యమునందున్-దిక్కులనడుమను । కుంభమున్-కుంభరాశియును । అసురశరధీశమధ్యమునన్ । అసుర-రాక్షసులకును । శరధి-సముద్రములకును । ఈశ-ప్రభువులైన। నైఋతి-వరుణులయొక్క । మధ్యమునన్-నడిమిభాగమందు । ఇమ్ముగ-చక్కగ । వసియించున్-ఉండును॥

తా॥ సింహరాశి మొదలుకొని కుంభముమట్టుకునుండు పన్నెండు రాసులు తూర్పు మొదలైన దిక్కులయందుండును॥ ౧౦౧

## నక్షత్రరీతి.

సీ॥ అశ్వనిభరణియు నాకృత్తికయు రోహి, ణియు మృగశీర్షమార్ద్రియుబు
నర్వసు పుష్యమాశ్లేషయు విలసన్మఖయును, పుబ్బయుత్తరహస్తపొసగు చిత్ర।
స్వాతివిశాఖయు సరసానురాధయు, జ్యేష్ఠమూలలు మరి చెలగు పూర్వ। ముత్త
రాషాఢలు నొగి శ్రవణధనిష్ఠ, శతభిష రేవతి శాశ్వతముగ। నిరువదేడగు నక్ష
త్రసరణి నీకు। తేటతెల్లంబుగా దెల్పితిని కుమార। వీని నన్నిటి బాగుగ విని గ్ర
హించి। యుండుమని చెప్పె విశ్వవిభుండు దయను॥

టీ॥ అశ్వినియు, భరణియు, ఆకృత్తికయు, రోహిణియు, మృగశీర్షయు, ఆర్ద్రియు, పునర్వసువు, పుష్యమియు, ఆశ్లేషయు । విలసన్మఖయును । విలసత్-ప్రకాశించుచున్న । మఖయు, పుబ్బయు, ఉత్తరయు, హస్తయు । పొసగుచిత్ర । పొసగు-ఒప్పుచున్న । చిత్రయు, స్వాతియు, విశాఖయు । సరసానురాధయు । సరస-యోగ్యమైన । అనూరాధయు, జ్యేష్ఠయు, మూలయు । మఱి-ఇంక । చెలగు-ప్రకాశించుచున్న । పూర్వయు, పూర్వాషాఢయు, ఉత్తరాషాఢయు । ఒగి - మఱియు । ధనిష్ఠయు, శతభిషయు, రేవతియు । శాశ్వతముగన్-స్థిరముగా । ఇరువదేడు - ఇరువదియేడగు । నక్షత్రసరణి । నక్షత్ర - అశ్విన్యాదులయొక్క । సరణిన్ - మార్గమును । కుమారా-ఓ కుమారుడా । నీకున్-ఈకు । తేట తెల్లంబుగాన్-స్పష్టముగా । తెల్పితిని-తెలియచేసితిని । వీనినన్నిటినిన్-ఈచెప్పినయన్నింటిని । బాగుగన్-లెస్సగా । విని-ఆకర్ణించి । గ్రహించి-తెలిసికొని । ఉండుము-నివసించుము । అని-ఈలాగని । దయను-దయచేత । విశ్వవిభుండు-ఈశ్వరుడు । చెప్పెన్-సెలవిచ్చెను॥

తా॥ అశ్విన్యాదిసప్తవింశతి నక్షత్రప్రణాళికను నీకు సవిస్తరంబుగా జెప్పితినిగాన గ్రహించి యుండుమని కుమారస్వామితో తండ్రియగు సాంబమూర్తి చెప్పెను॥ ౧౦౨

గీ॥ సప్తవింశతిమైననక్షత్రములకు । నూటయెనిమిదిపాదముల్ పాట
వమగు । తొడరి యొక్కొక్కరాశికి తొమ్మిదేసి । పాదములు లెక్క చుక్క
లు పరిఢవిల్లు॥

టీ॥ సప్తవింశతిమైన-ఇరువదియేడైన । నక్షత్రములకు-చుక్కలకు । నూటయెనిమిదిపాదముల్-నూటయెనిమిదియడుగులు । పాటవమగున్-పటుత్వముచేతనొప్పును । తొడరి-ప్రయత్నపడి । ఒక్కొక్కరాశికిన్-యొక్కొకరాశికి। తొమ్మిదేసిపాదములు-తొమ్మిదితొమ్మిది పాదములయొక్క । లెక్కన్-సంఖ్యచేత । చుక్కలు-ఇరువదియేడు నక్షత్రములు । పరిఢవిల్లున్-ప్రకాశించును॥

తా॥ ఈ యిరువదియేడు నక్షత్రములకు నక్షత్రమొక్కటికి తొమ్మిదేసిపాదములచొప్పున యీ యన్నినక్షత్రములకు నూటయెనిమిదిపాదములు॥ ౧౦౩

## రాసుల సంఖ్య.

గీ॥ మీనమేషవృషభమిథునకర్కటకపం । చాస్యకన్యకాతులాళిచాప ।
మకరకుంభములునుమహనీయవిఖ్యాతి । బ్రబలిబదియు రెండురాసులలరు॥

టీ॥ మీనమేషవృషభమిథునకర్కటక పంచాస్యకన్యకాతులాళిచాప మకరకుంభములును । మీనము-చేప । మేష-మేక । వృషభము-ఎద్దు । మిథున-జంట । కర్కటక-ఎండ్రకాయ । పంచాస్య సింహము । కన్యకా-కన్య । తులా-తక్కెడ । అళి-వృశ్చికము । చాప-ధనుస్సు । మకర-మొసలి । కుంభములును-కడవలును । మహనీయవిఖ్యాతిన్ । మహనీయ-గొప్పదియగు । విఖ్యాతిన్-ఖ్యాతిచేత । ప్రబలి-వృద్ధిపొంది । పదియు రెండురాసులు-పన్నెండురాసులై । అలరున్-ప్రకాశించును॥

తా॥ ఈమేషాదిరాసులు పన్నెండై ప్రకాశించెను॥ ౧౦౪

## రాశ్యధిపతులు.

చ॥ దినపతిసింహనేతహిమదీధితికర్కటనాయకుండిలా । జనియజవృశ్చి
కాధిపతిసౌమ్యుడుయుగ్మసతీశుడాగురుం । డనిమిషచాపనాధుడసురాహి
తమంత్రితులోక్షనాయకుం । డిన తనయుండుకుంభమకరేశ్వరుడాగమ వి
శ్రుతంబుగన్॥

టీ॥ దినపతి । దిన-పగటికి । పతి-ప్రభువైన సూర్యుడు । సింహనేత । సింహ-సింహరాశికి । నేత-ప్రభువు । హిమదీధితి । హిమ-మంచువగు । దీధితి-కిరణములుగలచంద్రుడు । కర్కటనాయకుండు । కర్కట-ఎండ్రకాయ రాశికి । నాయకుండు-ప్రభువు । ఇలాజని । ఇలా-భూమివలన । జని-జన్మము గల అంగారకుడు । అజవృశ్చికాధిపతి । అజ-మేషరాశికిని । వృశ్చిక-వృశ్చికరాశికిని । అధిపతి-ఏలిక । సౌమ్యుడు-బుధుడు । యుగ్మసతీశుడు । యుగ్మ-మిథునమునకును । సతి-కన్యకును । అధీశుడు-అధిపతి । ఆగురుండు-ఆ బృహస్పతి । అనిమిషచాపనాధుడు । అనిమిష-రెప్పపాటులేని మకరమునకును । ధన్వ-ధనుస్సుకును । నాధుడు-ప్రభువు । సురాహితమంత్రి । సుర-దేవతలకును । అహిత-శత్రువులగు రాక్షసులకు । మంత్రి-ప్రధానియైనశుక్రుడు । తులోక్షనాయకుండు । తుల-తులారాశికిని । ఉక్ష-వృషభలగ్నమునకును । నాయకుండు-అధిపతి । ఇనతనయుండు । ఇన-సూర్యునకు । తనయుండు-కొమారుడగుశని । ఆగమవిశ్రుతంబుగన్ । ఆగమ-వేదములయందు । విశ్రుతంబుగన్-ప్రసిద్ధముగ । కుంభమకరేశ్వరుడు । కుంభ-కుంభలగ్నమునకు । మకర-మకరలగ్నమునకు । ఈశ్వరుడు-అధీశ్వరుడు॥

తా॥ సూర్యాదినవగ్రహములు మేషాదిద్వాదశభావములకు అధినాదులు॥ ౧౦౫

## బరివేషాదికలక్షణము.

సీ॥ ద్వాదశరాశిభేదంబులు తద్గ్రహ, ద్వాదశభేదముల్తగవచింతు ।
నాదిత్యసోమభౌమాబ్జజజీవభా, ర్గవసూర్యనందనరాహుకేతు । ధూమ
కేతుఖరాంశుతుహినధామాదిక, పరివేషములునాదిబరగుచుండు । నుప

సూర్యములుపాత లుర్విలోద్వాదశ, గ్రహనిర్ణయంబదిఘనతనింక । గ్ర
హణసంధానభేద సూక్ష్మప్రభేద । ములునుశత మైత్రిభేదము ల్పొసగునట్టి ।
పరిమితంబులునాదిగా బలుకవలయు । దివిజసేనానివినుమిన్ని దేటపడగా॥

టీ॥ ద్వాదశరాశిభేదంబులు । ద్వాదశ-పన్నెండగు । రాశి-మేషాదిరాసులయొక్క । భేదంబులు-వ్యావృత్తులును । తద్గ్రహద్వాదశభేదముల్ । తత్-ఆ । గ్రహ-సూర్యాది గ్రహములయొక్క । ద్వాదశభేదముల్-పన్నెండుభేదములున్ను । తగన్-అనుకూలముగ । వచింతున్-చెప్పెదను । ఆదిత్య-సూర్యుడు । సోమ-చంద్రుడు । భౌమ-అంగారకుడు । అబ్జజ-బుధుడు । జీవ-బృహస్పతి । భార్గవ-శుక్రుడు । సూర్యనందన-శని । రాహు-రాహువు । కేతు-కేతువు । ధూమకేతు-ధూమకేతువు । ఖరాంశు-సూర్యుడు । తుహినధామ-చంద్రుడు - ఆదిక-మొదలుగాగలవారియొక్క । పరివేషములు-మండలములు । ఆది - మొదలుగా । ఉపసూర్యములు-మరియొకసూర్యులును । పాతలు-గ్రహణములున్ను । ఉర్విలోన్ - పుడమిలో । ద్వాదశగ్రహనిర్ణయంబు । ద్వాదశ-పన్నెండగు । గ్రహ-గ్రహములయొక్క । నిర్ణయంబు-నిశ్చయము । ఇది-ఈనిశ్చయమును । ఇంకన్-ఇంకను । గ్రహణసంధానభేద సూక్ష్మ ప్రభేదములును । గ్రహణ-ఉపరాగములయొక్క । సంధాన-పుట్టుటయొక్క । భేద-భేదములును । సూక్ష్మప్రభేదములును-మిక్కిలిసూక్ష్మభేదములను । శతమైత్రిభేదముల్ । శత-నూరగు । మైత్రి-మిత్రత్వముయొక్క । భేదముల్-విశేషములు । పొసగునట్టి పరిమితంబులు । పొసగునట్టి-లగించినట్టి । పరిమితంబులు-మితములను । ఆదిగాబలుకవలయున్ । ఆదిగాన్-మొదలగునట్లుగ । పలుకవలయున్-చెప్పవలయును । దివిజసేనాని-ఓదేవసేనాపతి । ఇన్నియున్-ఇవన్నియును । తేటపడగన్-స్పష్టమగునట్లు । వినుము-ఆకర్ణింపుము ॥

తా॥ ఓకుమార ద్వాదశ రాశిభేదములు ఉపసూర్యులు గ్రహణసంధులు పాతలు మొదలైనవి చెప్పెదను వినుము ॥ ౧౦౬

## సూర్యాదులుండుకాలము.

సీ॥ రవిచంద్రతనయభార్గవులువసింతురొ, కొకమాసమునకుజుండుండు
నేక ।మాసమాసార్ధంబుమరియొక్కయేడును, స్థిరముగానుండునిర్జరగురుం
డు । సవితృనందనుడు త్రింశన్మాసములునిల్చు, పదియుతొమ్మిదియుస్వర్భాను
డుండు । చందురుండొకనాడు సరవితోనుండును, కేతువు రాహువు క్రి
యవసించు । నట్టిగ్రహసంఘు మితరేతరాహితత్వ । యోగసౌహార్ధవశతయ
థోచితేష్ట । ఫలమొసంగుచు రక్షించుప్రాణకోటి । గరిమనివియెల్లతద్విశ్వ
కర్మసృష్టి ॥

టీ॥ రవిచంద్రతనయభార్గవులు । రవి-సూర్యుడు । చంద్రతనయ । చంద్ర-చంద్రునకు । తనయ-కొమరుడగు బుధుడును । భార్గవులు-శుక్రుడును । ఒక్కొకమాసమునన్ - ఒక్కొకనెలయందు । వసింతురు-ఉందురు । కుజుండును - అంగారకుడును । ఏకమాసమాసార్ధంబు । ఏక - ఒకటియగు । మాస-నెలయు । మాసార్ధంబు-అరనెలయుయుండును । నిర్జరగురుండు । నిర్జర - దేవతలకు । గురుండు-గురువైన బృహస్పతియును । మఱియు-ఇంకను । ఒక్కయేడును-ఒకసంవత్సరము । స్థిరముగాన్-నిలకడగ । ఉండున్-నిలుచును । సవితృనందనుడు । సవితృ-సూర్యునకు । నందనుడ-తనయుడగు శని । త్రింశన్మాసములు-ముప్పదినెలలు । నిల్చున్-ఉండును । స్వర్భానుడు-రాహువు । పదుగుతొమ్మిదియు-

పంద్రొమ్మిదిమాసములు । ఉండుఁ-నివాసముచేయును । చంద్రుఁగుండు-చంద్రుడు । ఒకనాఁడు-ఒకదినము । సరవితోఁ-క్రమమున । ఉండును-నిలుచును । కేతువు-కేతువును । రాహువుక్రియ-రాహువుకలె పంద్రొమ్మిదిమాసములు । వసించుఁ-ఉండును । అట్టిగ్రహసంఘము । అట్టి-అటువంటి । గ్రహ-నవగ్రహములయొక్క । సంఘము - గుంపు । ఇతరేతరాహితత్వయోగసౌహార్దవశతఁ । ఇతరేతర అన్యోన్యముయొక్క । యోగ-సంబంధముచేతను । సౌహార్దవశతఁ-మిత్రత్వవశముచేతను । యథోచితేష్టఫలము । యథోచిత-అనుకూలమైన । ఇష్ట-కోరినట్టియు । ఫలము-కార్యమును । ఒసంగుచు-ఇచ్చుచు । ప్రాణికోటిఁ-జీవకోటిని । రక్షించుఁ-బ్రోచును । ఇవియెల్లఁ-ఇవన్నియు । తద్విశ్వకర్మసృష్టి । తత్-ఆ । విశ్వకర్మ-విశ్వకర్మయొక్క । సృష్టి-నిర్మాణము ॥

తా॥ ఆవిశ్వకర్మ యీసమస్త చరాచర జంతుజాలములను భూమ్యాకాశములను ఆకసమందుండు గ్రహములు మొదలైనవానియొక్క గమనాదులను యొనర్చెను॥ ౧౦౭

విశ్వకర్మవంశజులు క్రతులక్షణము.

క॥ అనిపరమేశుఁడునీవడి । గినప్రశ్నముపుత్రసకల కిల్బిషహరమా । ఘ
నయజ్ఞకర్మలక్షణ । మొనరఁగవినుపింతుపురుష సూక్తవిధమునఁ॥

టీ॥ అని-ఈలాచెప్పి । పరమేశుఁడు-సాంబమూర్తి । పుత్రక-ఓకుమార । నీవడిగినప్రశ్నము । నీవు-ఈవు । అడిగినప్రశ్నము । అడిగిన-పృచ్ఛచేసిన । ప్రశ్నము-ప్రశ్న । సకలకిల్బిషహరము । సకల-సమస్తమైన । కిల్బిష-పాపములను । హరము-పోఁగొట్టెడిది ।ఆఘనకర్మయజ్ఞలక్షణము । ఆఘన-ఆగొప్పదియగు । కర్మ-కర్మగల । యజ్ఞ-యాగములయొక్క । లక్షణము-స్వరూపమును । పురుషసూక్తవిధమునఁ । పురుషసూక్త-పురుషసూక్తముయొక్క । విధమునఁ-రీతిచేత । ఒనరఁగఁ-ఒప్పునట్లు । వినుపింతుఁ-తెలియజేతును॥

తా॥ ఓకుమారా నీవడిగిన ప్రశ్నము పాపహరముగాన పురుషసూక్తప్రకారముచేత యజ్ఞకర్మవిధిని యిక తెలియజేసెద వినుము॥ ౧౦౮

కుమారస్వామి తండ్రికి నమస్కరించుట.

క॥ అనిశివుఁడానతియిచ్చిన । వినయంబునసకలకథలు వినిహర్షమునె ।
మ్మనమునఁబెనఁగొనఁశిఖివా । హనుఁడునమస్కృతియొనర్చెనభవునకెలమిఁ॥

టీ॥ అని-ఈలాగని । శివుఁడు-సాంబశివుఁడు । ఆనతియిచ్చినఁ-సెలవివ్వగా । శిఖివాహనుఁడు-కుమారస్వామి । వినయంబుగఁ-వినయముతో । సకలకథలు-అన్నికథలను । విని-ఆకర్ణించి। హర్షము-సంతసము । నెమ్మనమునఁ-మంచిమనస్సుయందు । పెనఁగొనఁ-పెనఁగొనఁగా । అభవునకుఁ-సాంబశివునకు । ఎలమిఁ-ప్రేమచేత । నమస్కృతి-దండమును । ఒనర్చెఁ-చేసెను॥

తా॥ కుమారస్వామి తండ్రిచెప్పిన కథలన్నియు విని సంతోషించి నమస్కరించెను॥ ౧౦౯

శౌనకాదులు సూతునియడుగుట.

వ॥ అని శివకుమార సంవాదము బెరింగించిన విని శౌనకాదులు హను
మద్ధ్వజప్రకారంబడిగిన॥

టీ॥ అని-ఈలాగని । శివకుమారసంవాదంబు-శివసేనాపతులచర్చను । విని-ఆలించి । శౌనకాదిమహామునులు- శౌనకాదిమహర్షులు । హనుమద్ధ్వజ ప్రకారంబు- కపికేతనవిధమును । అడిగినఁ-అడుగగా॥

తా॥ శౌనకాదులు యీచెప్పినకథలను విని హనుమంత పడగనడిగిరి॥ ౧౧౦

## కృతినాయక స్తవము.

మ॥ వివిధప్రాభవసద్గుణోదయఖనీవిశ్వజ్ఞవిశ్వజ్ఞసం । స్తవపాత్రాఖిల
సంతతోదయవిలాసత్రాససత్రాసదో । త్సవనిత్యప్రథితాన్నదానకలనాసం
కల్పసంకల్పకృ । త్యవిశేషోచితభోగభాగ్యకలితేదంభావదంభావనా ॥

టీ॥ వివిధప్రాభవ । వివిధ-నానావిధమైన । ప్రాభవ-ప్రభుత్వముగలవాడ । సద్గుణోదయఖనీ । సత్-యోగ్యములైన । గుణ-దాతృత్వాదిగుణములకు । ఖని-గనియైనవాడ । విశ్వజ్ఞ - విశ్వ-సమస్తమును । జ్ఞ-తెలిసినవాడ । విశ్వజ్ఞసంస్తవపాత్రాఖిలసంతతోదయవిలాస । విశ్వజ్ఞ-విశ్వకర్మయొక్క । సంస్తవ-స్తుతులకు । పాత్ర-ఆధారమైన । అఖిల-సమస్తమైన । సంతత-నిరంతరమైన । ఉదయ-అభ్యుదయములయొక్క । విలాస - సొగసులయందు । త్రాస-భయముగలవాడ । సత్రాసదోత్సవనిత్యప్రథితాన్నదానకలనాసంకల్ప । సత్రా-సత్రములయందు । ఆ-అంతట । సదా-ఎల్లప్పుడును । ఉత్సవ-ఉత్సవములయందు । నిత్య-స్థిరమైన । అన్నదాన-అన్నప్రదానముయొక్క । కలనా-చేయుటయందు । సంకల్ప-ఇచ్ఛగలవాడ । సంకల్పకృత్యవిశేషోచిత భోగభాగ్యకలితేదంభావ । సంకల్పకృత్యవిశేష-తలచిన కార్యవిశేషములకు । ఉచిత-తగిన । భోగభాగ్య । భోగ-అనుభవముతోటి । భాగ్య - అదృష్టముతోటి । కలిత-కూడికొనిన । ఇదంభావ-ఇటువంటిభావముగలవాడ । అదంభావన । అదంభ-సాధువులను । అవన-రక్షించువాడ॥

తా॥ మంచిగుణములు కలవాడు సత్రములు వేసినవాడు భోగభాగ్య సంపన్నుడు॥ ౧౧౧

మాలిని॥ సత్యభాషణాసాధుపోషణా । నిత్యపావనానీతిభావనా । స్తుత్య
సద్గుణాతుష్టసద్గుణా । ధృత్యగేశ్వరాధీపణీశ్వరా॥

టీ॥ సత్యభాషణా । సత్య - వాస్తవములైన । భాషణ-సల్లాపములుకలవాడ । సాధుపోషణ । సాధు - సజ్జనులను । పోషణ-రక్షించెడివాడ । నిత్యపావన । నిత్య-ఎల్లప్పుడు । పావన-పవిత్రమైనవాడ । నీతిభావన । నీతి-న్యాయమును । భావన-ఆలోచించెడివాడ । స్తుత్యసద్గుణ । స్తుత్య-స్తోత్రముచేయతగిన । సద్గుణ-మంచిగుణములుకలవాడ । తుష్టసద్గుణ । తుష్ట-తృప్తిపొందిన । సద్గుణ-వ్యాకరణపండితులుగలవాడా। ధృత్యగేశ్వర । ధృతి-ధైర్యమునకు । అగేశ్వర-మహామేరువువంటివాడ । ధీపణీశ్వర । ధీ-బుద్ధికి । ఫణీశ్వర-ఆదిశేషువువంటివాడా॥

తా॥ మార్కండేయప్రభువు సమస్త కల్యాణగుణములు కలవాడును మహామేరుసమానాధీరుడును॥ ౧౧౨

గద్య॥ ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తి వరప్రసాదభరితతురాక రాజకవివరాయ్యంకి బాలసరస్వతీ నామధేయ ప్రణీతంబైన నాగరఖండంబునందు సూర్యుండు విశ్వకర్మ గృహంబునకువచ్చి నుతించి విశ్వకర్మ పుత్రుల ధర్మంబులెట్లనియడుగుటయు విశ్వకర్మ మను మయ త్వష్ట శిల్పివిశ్వజ్ఞులనైదుగురు పుత్రులవ్యాపారంబు లేర్పరించుటయు సూర్యుండు మరలి చనుటయు కుమారస్వామి మన్వాదివంశజుల యాచారప్రకారంబు లెట్లని యడుగుటయు శివుండవియన్నియుం జెప్పుటయు విశ్వకర్మ వంశ్యులంబ్రశంసించుటయు మయవంశావళి వర్ణనంబును మనుమయాది పంచపుత్రుల భార్యాపరిగ్రహప్రకారంబును బ్రహ్మాండ నిర్ణయంబును గంగానదీప్రచార భేదవర్ణంబును సింధుద్వీపపరిమాణంబును గ్రహనక్షత్రాదిలోకప్రకారంబునను కథలంగల తృతీయాశ్వాసము.

సంపూర్ణము.